రచన:

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

*

షష్టిపూర్తిసంఘంవారిచే
ప్రచురింపబడినది

మూడవ ముద్రణ:
31-డిశంబరు 58

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి
సన్మాన సందర్భమున ప్రచురింప బడినది.

దేశీ ప్రెస్,
విజయవాడ-2.

*
* *

## అంకితము

తమ పవిత్ర పత్రిక చేతను
విమలవర్తన వల్లను
గురుపాదులయిన
కళాతపస్వులగు
శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి
దివ్యస్మృతికి

* *
*

# వినతి

ఈముద్రణ ఈ నాటి వరకు రచింపబడినది.
ఈ తృతీయ ముద్రణ షష్టిపూర్తి సన్మాన
సంఘము వారు ప్రచురింట ముదావహాము.
పరిచయ కర్తలు శ్రీ అల్లూరి సత్య
నారాయణ రాజు గారికి నమో వాకములు.

—గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

# పరిచయం

రచయితతో నాకు వ్యక్తిగత పరిచయం తక్కువే కాని, శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి రచనలతో పరిచయం నాకు బాగా వుంది. వీరి రచనా ప్రశంసకులలో నేనొకణ్ణి. ఇంపైన చక్కని శబ్దాలతో, నిండైన భావాలతో, పటుత్వంగల వాక్యాలతో కూడిన వీరి రచనలు ఆంధ్రుల నెంతగానో ఆకర్షించినవి. నా దృష్టిలో "మన రైతుపెద్ద" వీరి యితరరచన లన్నిటికన్న తలమానికము. కథావస్తువు నెన్నుకొనుటలోనే వీరు ప్రాశస్త్యాన్నీ ప్రత్యేకతనీ కూడా ప్రదర్శించారు. అసలు చరిత్ర వ్రాయడం, అందులో సమకాలిక చరిత్ర వ్రాయడం చాలా కష్టమైన విషయం. చరిత్ర ఆకర్షవంతంగా చిత్రించడం మరింత కష్టతరమైన సంగతి. ఇది గొట్టిపాటి బ్రహ్మయ్యగారి జీవిత చరిత్ర. ఒక మహారాజు చరిత్రయో లేక నవాబుగారి ఇతిహాసమో ఒక కవీశ్వరుడు విశేషణములతో విశ్లేషములతో అలంకారములతో పొగడ్తలతో నింపివేయుట మన మెరుగుదుము. ప్రతిఫలాపేక్షతో చేయబడు ఆ రచనలలో అతిశయోక్తులు, ప్రశంసలు మాత్రమే చూడగలము గాని ప్రాణముండదు. శ్రీ వెంకటసుబ్బయ్యగారు తన స్వగ్రామవాసి బాల్య స్నేహితుడు అగు ఒక నిష్కళంక దేశభక్తుని కథా నాయకుడుగా తీసుకొన్నారు. సహచరులు సహాధ్యాయులు అగు వారిని గూర్చి తనకు తెలిసిన సంగతులన్నీ చక్కగా పక్షపాత రహితంగా, నిరాడంబరంగా చిత్రించగల్గడం గొప్ప విశేషం అంటాను. కథానాయకుడెంత నిరాడంబర ప్రజాసేవకుడో కృతికర్తకూడా, నిరాడంబరత్వంలో దేశభక్తిలో, ఉదారత్వంలో అంతవారు కనుకనే యింతటి ఉన్నతాశయాలతో కూడిన జీవితచరిత్ర వ్రాయగలిగారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో నాయకత్వం వహించిన జాతీయ కాంగ్రెస్ స్వభావ స్వరూపాలను తెలుసుకొనగోరు ముందుతరాల వారికి, ముఖ్యంగా తెలుగు బిడ్డలకు "మన రైతుపెద్ద" ఎంతో ఉపయోగపడు

తుంది. శ్రీ బ్రహ్మయ్యగారి జీవిత విశేషాలతోపాటు, ఆంధ్ర కాంగ్రెసు, ముఖ్యంగా కృష్ణామండలములోని కాంగ్రెస్ చరిత్రలోని ప్రధాన రాజకీయ ఘట్టాలనన్నింటినీ రచయిత కళ్ళకు కట్టినట్లు చూపగల్గారు. శ్రీ బ్రహ్మయ్య గారి రాజకీయ జీవితకాలంలోని సమకాలికు లెందరి సంగతులో యీ గ్రంథంలో మనం చూస్తాం. వీరి గురుపాదులను గురించి చదువుకుంటాం. వారినుంచి శ్రీ బ్రహ్మయ్యగారు పొందిన సంస్కారం తెలుసుకుంటాం. పుస్తకం ఆ సాంతం చదివివేస్తేగాని తోచదు. అంత ఆకర్షవంతంగా రచన సాగించారు శ్రీ వెంకటసుబ్బయ్యగారు. శ్రీ పింగళి లక్ష్మీకాంతకవి అన్నట్లు శ్రీ వెంకటసుబ్బయ్యగారు సమగ్ర ఆంధ్రజాతి చరిత్ర వ్రాసిన ఎట్లుండునో అనిపిస్తుంది.

— అల్లూరి సత్యనారాయణరాజు.

# విషయ సూచిక



మన రైతుపెద్ద
శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు



మనరైతుపెద్ద రచయిత
శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

# ద్వితీయ ముద్రణకు

# పీఠిక



చరిత్రకారులలో శిల్పులు కొందరును, కర్మకారులు కొందరును (Artists and Artisans) ఉందురు. కర్మకారుడు వ్రాసిన చరిత్ర, పేర్చిన ఇటుకలవలె, భూతార్థముల పట్టిక. శిల్పి రచించినది, గోపుర నిర్మాణమువలె, సముచిత – అంగ – ప్రత్యంగ – సౌష్ఠవము గల సుందరకళామూర్తి. ఈ నిర్మాణంలో, శిల్పి యవలంబించు ముఖ్య సూత్ర మిది—వికీర్ణములైయున్న భూతార్థములను సమీకరించుట, సమీకరించినవానిని వ్యాకరించుట, వ్యాకరించినవానిని సమన్వయించుట. ఈ ధర్మము పరిపాలింపబడినప్పుడు చారిత్రక విషయము కావ్య వస్తువుగా రూపొందును. ఆ రూపమును, రమణీయమైన శైలిలో చిత్రించిన నాడు చరిత్ర కావ్యమే యగును. శ్రీ గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు రచించిన యీ "మన రైతుపెద్ద" చాలవరకు యిట్టి శిల్పమర్యాదలతో రచింపబడిన జీవితచరిత్ర.

ఈ జీవితచరిత్రకు కథానాయకుడైన శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య గారు, మహాత్ముడు ఉపక్రమించిన యసహాయోద్యమ మాదిగా నేటి దనుక, దేశసేవకే జీవితము సంకేతమొనర్చుకొని నానావిధముల ప్రజా హితైకపరాయణుడైయున్న వ్యక్తి గావున ఈ జీవితచరిత్ర ఆంధ్రదేశ కాంగ్రెసు చరిత్రగా పరిణమించి నదనియు చెప్పవచ్చును. ఇందులో బ్రహ్మయ్యగారి ఆత్మీయ చరిత్రాంశకు ఎంతపా లుండవలెనో, కాంగ్రెసు చరిత్రాంశకు ఎంతపా లుండవలెనో సముచిత నిర్ణయము చేసి ఉభయప్రాధాన్యము చెడకుండ పచరించుటలో గ్రంథకర్త చూపిన వస్తువిన్యాసనైపుణి ప్రశంసార్హముగా నున్నది. మరియు, ఈ

కథకు ప్రధమరంగమైన ఘంటసాల గ్రామమును, కథానాయకుని ఆత్మీయతావికాసమునకు కారణభూతులైన గురువులను, మిత్రులను, బంధువులను యథావస్థముగా చిత్రించుటలో వెంకటసుబ్బయ్యగారు చూపిన నేర్పు ఈ రచనకు ఇంకొక వన్నె పెట్టినది.

మహాత్ముడు బ్రిటిషు పరిపాలనతో సలిపిన ధర్మసంగ్రామములో శత్రుదుర్భేద్యముగా నిల్చిన దుర్గములలో ఘంటసాల యొకటి. అటుంటి కార్యదీక్షతో ఆ దుర్గమును సంరక్షించిన యోధుడే యీ కథానాయకుడు. ఈ దుర్గాధిపతికి ఎప్పటికప్పుడు ఆదేశ సందేశములిచ్చును వ్యూహరచనా కుశలుడై కృష్ణామండలముయొక్క యెల్లలలో శత్రుసేనలకు కాలు నిల్వకుండ పటాపంచలుచేసిన మహామంత్రి శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు. ఆ మంత్రియే ఈ దుర్గపాలకునకు మొదటి గురువు. ఆయనయొద్ద ఈయన నేర్చిన విద్య సచివత్వము, యుద్ధతంత్రము. రెండవ గురువైన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు చేసినది ధర్మోపదేశము. ఈ గురుద్వయము యొక్క యుపదేశములను, తన యాచరణ ప్రచారములద్వారా శిష్యునిచే చింతన చేయించిన గురుతుల్యుడు శ్రీ చెరుకువాడ నరసింహంపంతులు గారు. బ్రహ్మయ్యగారి గురుసాంప్రదాయ మిది. ఈ గురుత్రయమునకు నివాసమగుటచేతనే, బందరు పట్టణము కాంగ్రెసు రాజ్యములో ఆంధ్రరాజధాని యైనది. ఆ బందరు పట్టణమున విద్యాభ్యాసము చేయుటయు, ఆ మువ్వురి సాన్నిధ్యమున మెలగుటయు బ్రహ్మయ్యగారి ఆత్మవికాసమునకు హేతువులు.

వెంకటసుబ్బయ్యగారి మానసిక వికాసమునకును ఆ బందరే, ఆ గురుత్వమే హేతువు. బ్రహ్మయ్యగారికి లభించిన రాజకీయప్రాముఖ్యమును, వెంకటసుబ్బయ్యగారికి ప్రాప్తించిన సారస్వతప్రసిద్ధియు ఆ వికాసముయొక్క ఫలరూపములు.

వీరిరువురును, చినతనమాదిగా సహవాస, సహచర్య, సహాధ్యయనములు చేసిన ధర్మసోదరులు. ఏక గ్రామవాస్తవ్యులు. కథాపురుషున

కింత సన్నిహితుడు గనుకనే కథకుడు ఈ కథనమునకు ఉత్తమాధికారి యయ్యెను. జీవితచరిత్ర వ్రాయువారందరకును యిట్టి యదృష్టము కల్గదు. ఒకవేళ కల్గినను మైత్రీప్రేరితమైన మమతాదోషదూషితము కాకుండ, రచనను తటస్థభావముతో సాగించుట అతిక్లేశము. ఈ రచనకు అట్టి కళంకము రాలేదు. ఎచ్చటను అతిశయోక్తులుగాని, మెరిమెచ్చులుగాని, అనుచిత తిరస్కారములుగాని, అనావశ్యక పురస్కారములుగాని ఈ గ్రంధమున కానరావు. ఆద్యంతము, అంతశ్శుద్ధితో నొనర్చిన మితహిత వాక్యబంధురమైన సత్యకథనము. ఈ ఫణితిలో, వెంకటసుబ్బయ్యగారు సమగ్ర - ఆంధ్రజాతి చరిత్ర వ్రాసిన ఎట్లుండునో ?

బ్రహ్మయ్యగారి వ్యక్తి నిరూపణలో గ్రంధకర్త గైకొన్న మూలసూత్రము, ఆయన రైతుతనము, ఆంధ్ర రాజకీయములలో కార్యఖడ్గములకు చాలిన మంత్రియు యోధుడును నైనను బ్రహ్మయ్యగారు ఘంటసాల రైతే. పెద్దరైతు కాకపోయినను రైతుపెద్ద. రైతులోకములో ఈయన కీర్తి వచ్చుటకు కారణము తన రైతుతనమును మరచిపోకుండుట, మరచిపోకుండుటే కాదు, విడనాడకుండుట. ఆంధ్రకాంగ్రెసు కమిటీకి కార్యదర్శియై గ్రామైక రాత్రముగా సంచారములు చేయుచుండినప్పుడును, బ్రిటిషువారి రాక్షసాగ్రహమునకు పాత్రుడై కారాగారములో బంధితుడై యుండినప్పుడును, ఈయన యాత్మ పొలముగట్టుల, పసులకొట్టముల, పల్లెరచ్చపట్టుల సంచరించుచునే యుండెను. తానెట్టిపదవిలో నున్నను రైతుననెడి అభిమానమును గోలుపోలేదు. గనుకనే, భారతపునరుద్ధరణమునకు మహాత్ముడుపదేశించిన, గ్రామము-రైతు, అనుశబ్దద్వయ మంత్రమును జపించి సిద్ధిపొందిన వాడయ్యెను.

రైతులు, అందును, మెట్టపరగణాయైన(ఇప్పుడుచాలవరకు పల్లమే) మా దేవరకోట సీమలోని రైతులు శాంతవీరులు. నిష్కాపట్యము,

కార్యదీక్ష, ఆదరము, సాధుత్వము, సమయజ్ఞత, ఆత్మగౌరవము వారికి పెట్టని నగలు. బ్రహ్మయ్యగారి ప్రకృతి నలంకరించినవియు ఆ నగలే. ఆయనను చూడగనే, పై లక్షణములుగల అచ్చపు రేవరకోట సీమ రైతుగా గుర్తుపట్టవచ్చును. స్వభావమునుబట్టి, నడవడినిబట్టి, ఆకారమునుబట్టి, మూర్తీభవించిన రైతుతనము గావుననే ఈయన రైతుపెద్ద. ఈ గ్రంధము సమర్థించినది ఈ రహస్యమే.

ఎందరో, ఇట్టి సుగుణఖనులు, కార్యచతురులుగల మన యాంధ్ర జాతికి ఈ దుస్థితి యేల ? సమాధాన మీ గ్రంధాంతమున గలదు. దానిని చదివి ఇతెరులను కినియక, ఎవరికివారే ఆత్మపరీక్ష చేసి కొందురు గాక. ఈ గ్రంధమునకు ఆ పంక్తులే ఫలశ్రుతి.

వాల్తేరు
26-2-'49

—పింగళి లక్ష్మీకాంతం

# ప్రథమ ముద్రణకు

# పీఠిక



"ఏమండీ ? అన్నగారూ !"

"ఎప్పుడొచ్చావ్, బాబాయ్ ?

"బొత్తిగా శీతకన్ను వేశారు; బావగారు !"

"ఎప్పుడో ఊళ్ళోకి దిగారే, వియ్యంకుడుగారు !"

"పిల్లా మేకా క్షేమమా; తమ్ముడూ ?"

ఈ విధంగా శ్రీ బ్రహ్మయ్యగారు ఎందరెందరినో పలకరించగా విన్నాను. ఆయనకు నేను జాబులు వ్రాయడం "శ్రీ బ్రహ్మయ్య గారికి" అంటూ, ఆయన జవాబులు రాయడం "తమ్ముడూ!" అంటూ. ఏదో ఒక వరస కలుపుకోనకపోతే, ఎవ్వరితోను ఆయన వ్యవహరించనే లేడు. ఇతర వరసలు కలుపుకోననిచోట "తాత, మనుమడు" వరస తప్పదేమో కూడా !

ఈనాడు త్వరితగతిని గతించిపోతున్న మన గ్రామీణ సంస్కృతి విశిష్టత–వాస్తవానికి అదే భారతీయ సంస్కృతికి సముచితం కాదా ?–ఆ సంస్కృతి విశిష్టతను బ్రహ్మయ్యగారిలో చూడవచ్చు. ఆదరణ, ఆప్యాయం, నిష్కాపట్యం, నిరాడంబరత్వం, శాంతం, సహనం, ఔదార్యం, ఉదాత్తత ఈ గుణగణాలే ఆ సంస్కృతికి ఆయువుపట్టులు. ఈ గుణగణాలన్నీ శ్రీ బ్రహ్మయ్యగారిలో కలవనడం అత్యుక్తి కాదు.

ఇతరుల విషయం చెప్పలేనుగాని, నాకుమాత్రం శ్రీ బ్రహ్మయ్య గారిని కలుసుకున్నప్పుడు–ఆయన కలుపుగోలుతనాన్ని చూచినప్పుడు

మేళంతో కూడిన ఆయన మాటలు వింటున్నప్పుడు—మన గ్రామీణ సంస్కృతిపట్ల ప్రేమ పెరుగుతుంది. అది నశించిపోతున్నందుకు విచారం హెచ్చుతుంది. ఇంతేకాదు; "నేను" "నాది" "నీది" అనేవి పునాదులుగా, "ఎంత గడించాడు? ఎన్ని మేడలు మిద్దెలు కట్టాడు?" అనేవి కొలతబద్దలుగా అంతకంతకు బలపడుతున్న నూతన సంస్కృతి పట్ల కోపం పెరుగుతుంది; అసహ్యం ప్రబలుతుంది.

అన్య సంస్కృతులలోని—ముఖ్యంగా ఆధునిక పాశ్చాత్యసంస్కృతి లోని—విశిష్టవిషయాలను మనం స్వీకరించరాదని నా తాత్పర్యంకాదు. నూతన సంస్కృతులతో సంపర్కం పెట్టుకొనని జాతికి, అట్టి సంపర్కం ద్వారా స్వీయ సంస్కృతిని పరిపుష్టం చేసుకొననిజాతికి, భవితవ్యమే లేదు. కాని, అన్యసంస్కృతుల వ్యామోహంలోపడి స్వీయ సంస్కృతిని నాశనం చేసుకొనే జాతి తన వ్యక్తిత్వాన్నే చంపుకొంటుంది; తన ఆత్మనే అమ్ముకొంటుంది.

శ్రీ బ్రహ్మయ్యగారు ఎంతగా గ్రామీణులైనా, మరెంతగా గ్రామీణ సంస్కృతి విశిష్టత ఆయనలో కానవచ్చినా, ప్రస్తుతం మన దేశంపై బలీయంగా పడుతున్న పాశ్చాత్య సంస్కృతి ప్రభావంకూడా; ఆయనలో కానవస్తుంది. ఆయన నాగలినిపట్ట నేర్చినవాడే కాదు; మోటారుకార్లను ఉపయోగించ నేర్చినవాడుకూడా. వీధి అరుగుపై కూర్చుని, పల్లెటూరి తగవులు తీర్చనేర్చినవాడే కాదు; లిమిటెడ్ కంపెనీలను మేనేజింగ్ డైరెక్టరుగా నిర్వహించ నేర్చినవాడుకూడా. గిత్తలను నాట్యంచేయ నేర్చినవాడే కాదు; గవర్నమెంటుకు సలహాలివ్వ నేర్చినవాడుకూడా. పల్లెలోవలె పట్టణంలోకూడా, ఆయన తన ప్రత్యేకతను నిలుపుకోగలడు; గ్రామీణులలోవలె నగరవాసులలో కూడా, ఆయన తన విశిష్టతను నిరూపించుకోగలడు.

అయితే నేను శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి గ్రంథానికి పీఠికను ప్రారంభించి, శ్రీ బ్రహ్మయ్యగారి జీవితచరిత్రకే ఉద్యమిస్తున్న

ట్టున్నాను. ఇది సాహసం. దీన్ని దుస్సాహసమన్నా తప్పులేదు. శ్రీ వెంకటసుబ్బయ్యగారిని మించి శ్రీ బ్రహ్మయ్యగారి జీవితచరిత్ర రచనకు అధికారం గలవారు లేరు. వారిద్దరిది ఒకే గ్రామం; దాదాపు ఒకే వయస్సు; ఆ బాల్యం వారిద్దరు స్నేహితులు, సన్నిహితులు. వీటి నన్నిటినిమించి, శ్రీ వెంకటసుబ్బయ్యగారి నిష్పాక్షిక దృష్టి ఎందరికి గలదు ? ఆయన లేఖిని నిశితమైనా సామాన్యమైనదా ? శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు గురుపాదు లైనందుకు ఆయన రచనా ప్రౌఢిమ ఛాయలు శ్రీ వెంకటసుబ్బయ్యగారి గ్రంథంలో కానవస్తున్నాయి. ఎత్తుగడలలో అదే జోరు, వాక్యాలలో అదే పరుగు; వివరణలో అదే ప్రాగల్భ్యం. ఈ గ్రంథముద్రణ పూర్తికాకముందే శ్రీ వెంకటసుబ్బయ్యగారి కొత్త గ్రంథానికి నేను ఎదురుచూస్తున్నాను. ఏ రచన ప్రాశస్త్యానికైనా దీన్ని మించిన తార్కాణం కలదా ?

మద్రాసు
3-11-'48 — నార్ల వెంకటేశ్వరరావు.

# అభిప్రాయములు

౧

"మిత్రుడు, చిరంజీవి గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారిని నేను చాల చిన్నతనమునుండి బాగా యెరుగుదును. అతని స్వగ్రామమగు ఘంటసాల నాకు మాతామహస్థానమును జన్మస్థానము నగుటచేతను, మా జ్యేష్ఠసోదరుడు కూడా ఆ గ్రామవాసినిగా నుండుటచేతను నా కా గ్రామములోని పిన్న పెద్దలందరితోను మిక్కిలి సన్నిహిత పరిచయము కలదు.

ఇతను వ్రాసిన 'ఘంటసాల చరిత్ర' 'ఆచార్య రంగా' 'మన రైతు పెద్ద' అనే గ్రంథముల నటీవలనే చూచి చాల సంతోషించినాను.

ఈ ఘంటసాల గ్రామచరిత్రను నన్ను వ్రాయమని నా మిత్రుడు కీ॥ శే॥ కాశా శ్రీరామశాస్త్రిగారు 25 సంవత్సరముల క్రిందట యెంతో ప్రోత్సహించెను. నేటి కా పని మిత్రుడు వెంకటసుబ్బయ్యగారు సమగ్రముగా నిర్వర్తించుట మిక్కిలి ముదావహము. ఇతని రచనాకౌశలము చాల ప్రశంసనీయముగా నున్నది.

సన్నిహిత సమకాల సమవయస్కుల ఔద్ధత్యమున కానందించుటయే గాక, వారి గుణగణ పరిశీలనా ప్రావీణ్యముచే నితని ఉదారత, రసజ్ఞత ప్రకటిత మగుచున్నది.

ఇతను వ్రాసినవి సామాన్యవ్యక్తుల జీవితచరిత్రలైనప్పటికిని, నిజానికవి వారి కేదో ప్రయోజనాపేక్షతో ఉత్ప్రేక్షాతిశయోక్త్యలంకారములతో ప్రశంసించే వందిమాగధస్తోత్రములు కావు.

వారి సమకాలస్థుల సందర్భ చరిత్రలన్నీ అందు చక్కగా ప్రతిబింబిత మగుచున్నవి.

ఇదియే చరిత్రలు వ్రాయవలసిన సరియైన పద్ధతి యని ఒకప్పుడు శ్రీ ముట్నూరి కృష్ణరాయ గురుపాదులు సెలవిచ్చినట్లు జ్ఞాపకము.

ఇతని భాషాశైలి జిగురూ రుచి లేని పొడి మరబియ్యపుపిండి వచనశైలిగాక, మనోహరమైన 'నవల' కావ్యంగా నడచింది.

ఇట్టి సద్గ్రంథము లింక నెన్నియో వ్రాసి ధన్యజీవిగా యీ మిత్రుడు చిరకాలము వర్ధిల్లుగాక!

ఇట్లు,

మిత్రుడు శ్రేయోభిలాషి,

తణుకు
8-11-'48

చెరుకువాడ వెంకటనరసింహము.

"మన రైతుపెద్ద" అను పేరున శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య గారు రచియించిన యీ గ్రంథము నిజముగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య గారి జీవితచరిత్రమని చెప్పవచ్చును. బ్రహ్మయ్యగారేమి గొప్పవాడా? ఆయన జీవిత చరిత్రము వ్రాయుట యెందుకు? అని కొందరనవచ్చును. గొప్పతనమనగా నేమిటి? ఈ గొప్పతనమన్నది యీ ఆకాశమువంటిది. భూమికి అంగుళము పైనుండి యంతయు నాకాశమే. ఈ ఆకాశములో నెంతయైనను నాకాశమే యైనట్లు ఆ గొప్పతనములో - నెంతయైనను గొప్పతనమే. బ్రహ్మయ్యగారు జవహర్లాలువంటివాడనటకు లేదు. తెనుగు జిల్లాలన్నియు కలిపియే యీయన గొప్పవాడని మేమనుటలేదు. మా జిల్లాలో నాయన గొప్పవాడు కాడని యెవ్వరూ ననలేరు. ఇది యొక గొప్పయా యందురేమో? ఇదియే నిజమైన గొప్పతనము. ఇట్టి బ్రహ్మయ్యగార్లు కొన్ని లక్షలమంది యీ దేశమందుండుటవలననే, నేటి భారతజాతి స్వతంత్రమైనది. ఒక జవహర్లాలు మంత్రియైనాడు. జవహర్లాలును మంత్రియైనది బ్రహ్మయ్యగారివలన. బ్రహ్మయ్యగారొక్క వ్యక్తి కాదు. ఆయన యొక చిహ్నము. మహాత్ముడు స్వాతంత్ర్య శంఖారావమును పూరించినప్పుడు మేల్కొన్న భారత స్వాతంత్ర్యాభిలాషకు నాయన యొక చిహ్నము.

రాజ్యములు పోవుట వచ్చుట, యుద్ధములు జరుగుట, గెలుచుట వీరిని గురించి వ్రాయబడినది చరిత్ర కానేకాదు. ప్రపంచక మంతయు నొక పెద్దమహావిషయముగా కనిపించినను మానవస్వభావమంతయు నొకటియేగనుక నేకదేశగతమైనది. సర్వధాత్రీగతమైన దానికంటె భిన్నము కాదు. ఈ కృష్ణా జిల్లాలో గడచిన ముప్పదియైదేండ్లనుండియు మరి రాజకీయ వాతావరణ మెట్లు జరిగినదో సర్వభారతదేశమందును కించిద్భేదములతో నట్లే జరిగినది. నిజమైన కాంగ్రెసుచరిత్ర యిదిగాని సురేంద్రనాథ్ బెనర్జీలయొక్కయు, కాంగ్రెస్ మహాసభలయొక్కయు చరిత్ర కాదు. ఆ చరిత్ర రాజకీయములయొక్క పరిణామకథ. ఇది కాంగ్రెసుజీవితము ప్రాణకథ.

ఈ గ్రంథము వట్టి బ్రహ్మయ్యగారి జీవితముకాదు. ఒక పురుషుని జీవితమనగా నేమి? వేయిమందితో కలిసి వ్యవహరించుట అనేక కార్యములలో తాను పనిచేయుట. ఆవ్యక్తి జీవితము వ్రాయుమన్నప్పుడు ఆ వేయిమంది జీవితము దీనియం దుండును. ఆ యనేక కార్యముల ప్రసక్తియు దీనియందుండును. అందుచేత నా వ్యక్తియొక్క జీవితచరిత్ర తత్ప్రాంతీయమైన

తత్కాలసంబంధమైన యథార్థమైన సూక్ష్మవిషయములనుగూడ వివరించు నట్టి చరిత్ర యన్నమాట. ఇట్టి గ్రంథములు వందనేలు వెలసినప్పుడుగాని మనజాతి నిజమైన యౌన్నత్యము పొందదు.

నేను చిన్నప్పటినుండి బందరుగ్రామవాసిని. ఘంటసాలకు నాకును కొంత హృదయసంబంధమైన బంధుత్వము గలదు. బ్రహ్మయ్యగారు నాకంటె కొన్నియేండ్లు చిన్నవారు. అందుచేత నీ గ్రంథములో నాయననుగురించి చెప్పిన విషయములు నా కనుభవములో నున్నవి. ఈ గ్రంథము చదువు చున్నప్పుడు నాకు నిజముగా గడచిన యీ నలుబదియేండ్లు మరల బ్రతికి నట్లే యున్నది.

ఈ గ్రంథము వాడుకభాషలో వ్రాయబడినది. గ్రంథకర్త పట్టి పత్రికలలోని తెలుగుమాత్రమే వచ్చినవారు కారు. ప్రతి శీర్షికయొక్క యాద్యంతముల మహాకవుల గ్రంథములనుండి పద్యముల నుదహరించెను. భారతము, కృష్ణకర్ణామృతము, వసుచరిత్రము, మొదలైన పూర్వగ్రంథములే గాక దువ్వూరి రామిరెడ్డిగారు, చిరుమామిళ్ళ పార్థసారధిగారు, బుచ్చి సుందరరామశాస్త్రిగారు, రాయప్రోలువారు మొదలైన యాధునిక కవులతో గూడ వారికి చక్కని పరిచయముగలదు. ఉదాహరించిన పద్యభాగముల యొక్క యౌచిత్యము వారి పాండిత్యమును మేధాసంపత్తిని తెలుపుచున్నది. వీరిది ఘంటసాల. ఘంటసాల పూర్వౌన్నత్యమును గురించి వారు వేరేయొక గ్రంథమును వ్రాసిరి. ఆ గ్రామము పూర్వమెంత గొప్పదో నేడు నంతగొప్పది. కల్తీలేని ఖద్దరు యావద్భారతములో నెక్కడ దొరకును? ఘంటసాలలోనే దొరకును. మన్నికకల ఖద్దరు రెండుచోట్లనే దొరకును. మొదటిది ఘంట సాల; రెండవది పెద్దాపురము. పెద్దాపురము ఖద్దరు ముతుకు. ఘంటసాల ఖద్దరు సుకుమారమైనది. ఘంటసాల కీ ప్రతిష్ఠ దేనికివచ్చినది? ఒకటి ఘంట సాలలో పూర్వసంప్రదాయములు చావలేదు. రెండవది బ్రహ్మయ్యగారును, వారి గురువులును శిష్యులును ఆ గ్రామమున నడిపిన రాజపద్ధతి. ఆ పద్ధతి గ్రంథమంతయు చదివినచో తెలియును. ఘోటుకి భూముల విషయములలో కాని గుండేరు గండికాలువలకు చప్టాలు వేయించుటలో కాని కాంగ్రెసుకు ఓటు వేయించవద్దనగా సున్నా ఓట్లతో వెళ్ళిన పెట్టెలలోగాని బ్రహ్మయ్యగారి ప్రతిభయే గోచరించుచున్నది. తాలూకా బోర్డు ప్రసిడెం టుగా నుండి యాంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గమునుండి బ్రహ్మయ్యగారు

చూపించిన నిజాయితీతనము వారు చూపించిన కార్యదీక్షత నేడు పాను గుపడ్డదిగాని నాడు దేదీప్యమానముగా నుండుట నే నెరుగుదును. ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శిగా నున్నప్పుడు నేను బరంపురంలో నే పనంతపురంలో నీరీతిగా నాయన యుండి యెన్నియో చక్కని తీర్పులు చేసెనని నేను విన్నదే సాక్ష్యము. గ్రంథములో వ్రాయనవసరము వచ్చియే. ఈ గ్రంథములో నీ జిల్లాలోని సజ్జనులకు ప్రియులైనవారు, గౌరవనీయులైనవారు పట్టాభి, కృష్ణారావు, చెరుకువాడ, సాంబయ్యగారు, చలపతయ్యగారు, కొండాలివారు, అందరును కనులకు కట్టినట్లు కనిపించుచున్నారు. ఒక్కొక్క ఘట్టము చదువుచుండగా నా మనసు చూచినట్లే యున్నది. చూచుచున్నట్లే యున్నది.

ఇంత చక్కటి గ్రంథము శ్రీ నెల్లూరి(?) గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు వ్రాసి దేశమునకు ప్రసాదించినందుకు వారికి కృతజ్ఞులమయి యుండవలెను. దేశములో ప్రతిగ్రామము ఘంటసాలవలె నుండవలదా? ప్రతివ్యక్తియు వెంకటసుబ్బయ్యగారివలె తమ గ్రామము తమగ్రామ పెద్దలనుగూర్చి వ్రాయవలదా?

ఈ దేశమున నదియేమి దౌర్భాగ్యమో! తెలుగువాడు తనకు తెలుగు భాష రాదనుకొనును. తెలుగువానికి తెలుగు రాకపోవుటయేమి? నాకు తెలుగువచ్చునను కొనకపోవుటయే దోషము.

ఈ గ్రంథ మింకొకరీతిగా గూడ గుణవంతమయి యున్నది. శ్రీ కృష్ణారావు పంతులుగారి సంపాదకీయము లానాడు భారత రామాయణములకంటె దేశమున కధిక ప్రియమయినవి. ఆ కృష్ణారావుగారు మహాప్రతిభాశాలియని జగద్విదితము. ఆయనయే మెచ్చుకొన్నాడు బ్రహ్మయ్యగారిని.

ఆ సందర్భములైన సంపాదకీయము లిందు సందర్భానుసారముగా పొందుపరుపబడినవి. దానివలన రెండు గొప్పవిషయములు జరిగినవి. బ్రహ్మయ్యగారి ప్రతిభ తెలియుచున్నది. కృష్ణారావు పంతులుగారి సంపాదకీయ రచనా మహాగుణముకూడ పాఠకులకు నిలిచియున్నది. ఇట్లనేకములైన గుణము లీ గ్రంథమునందు పొందుపరుపబడినవి. ఇట్లెంత వ్రాసినను వ్రాయవచ్చును. గాని ప్రధానమయిన యొకటి రెండు విషయములు మాత్రమే చెప్పి విడిచెదను. ఈ గ్రంథకర్తయొక్క మేధాసంపత్తి యూహాశాలిత్వమునకు రెండుదాహరణములుచెప్పెదను. బ్రహ్మయ్యగారు విద్యాధికుడుగాదు. ఆయన

ఇంగ్లీషులో పెద్ద పరీక్షల నిచ్చినచో నే నౌకరియో చేసెడివాడు. చదువ లేదు గనుక దేశనాయకుడైనాడు అని గ్రంథకర్త వ్రాసెను. ఈ యింగ్లీషు చదువు బ్రిటిషువారియొక్క నౌకరులను తయారుచేసినది అన్న యథార్థమును వీరు వ్రాయుటయేగాక నిజమయిన ప్రతిభ చదువులో లేవోయి యనికూడ చెప్పుచున్నారు.

మరియొకచోట 'జాతీయత యున్నప్పుడే యంతర్జాతీయత గలదు. జాతీయతలేకుండ యంతర్జాతీయత లేదు' అని వ్రాసినారు. ఈ సందర్భంలో చాల పండితుల మనుకొనువారే పొరపడుచుందురు. నే నున్నచో నీ లోక మున్నది. నేను లేనిచో లేదు. ఈ విషయమునే యది చెప్పుచున్నది. ఈ రీతిగా నీ గ్రంథకర్త గొప్ప వివేకి. విషయములయొక్క యథార్థస్వరూపము తెలిసినవాడు. ఇట్టి మేధాశాలి, దేశాభిమాని, గ్రామాభిమాని, బంధువు బ్రహ్మయ్యగారి జీవితచరిత్ర వ్రాయుట వారి యదృష్టము. దేశముయొక్క యదృష్టము. ఇట్టి గ్రంథము లనంతములు బయలు వెడలునుగాక. పరుల కపకారము కాని యాత్మాభిమానము వృద్ధిపొందుగాక.

విజయవాడ,
15–11–'43.

విశ్వనాథ సత్యనారాయణ.

# విన్నపం

" Princes and lords may flourish or may fade
A breath can make them, as a breath has made
But bold peasantry, their country's pride
When once destroyed, can never be supplied"

— Goldsmith.

"రాజులు, ప్రభువులు—నశించవచ్చును, వర్ధిల్లవచ్చును. ఒక క్షణంలో మళ్ళీ వుద్భవిస్తారు. కాని ప్రతిదేశము తన రైతాంగమును చూచుకొని గర్విస్తుంది. ఆ రైతాంగము నశించిన, అది పరిహారములేని నష్టము."

—గోల్డుస్మిత్

నేడు నాయకులనుగురించి అనేకులు చరిత్రలు వ్రాస్తున్నారు గాని అవి చెప్పుకోదగిన చరిత్రలుగా లేవు.

చరిత్ర రచయితలు ప్రశ్నించి కృషిచేయు కుతూహలము గలవారు లేకపోవుటే కారణము. అందుచేతనే "ఉత్తమ జీవితచరిత్ర రచన, ఉత్తమ జీవితమువలె అరుదు" అన్నాడు కార్లైలు.

ఇంతకు తా నెవరిచరిత్ర వ్రాయదలచినాడో ఆయనకు రచయితకు అధిక సంబంధ ముండాలి. * గ్రంథరచనకు ఉత్సాహం, అభిరుచి వుండాలి. అప్పుడా గ్రంధము అధికంగా రాణించగలదు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారి చరిత్ర, నేను వ్రాయదలచాను. నేను ఆయనకు సన్నిహితుడను, సహచరుడను, స్నేహితుడను, ఆబాల్యమిత్రుడను.

ఎరుగనివారినిగురించి ఇతరులమీద ఆధారపడి వ్రాయుటకంటె ఎరిగిన వారినిగురించి యథార్థము వ్రాయుట ఉచితముకదా !

ఇక బ్రహ్మయ్యగారి విషయమై—నాకు సహజంగా ఆయనయందు అభిమానమే. కాని ఆయనయందున్న రైతు బ్రహ్మయ్య ఎడలనే నాకు మక్కువ యెక్కువ. నేను. నాచే రచింపబడిన 'ఆచార్య రంగా'కు ఆయనను పరిచయం వ్రాయమని కోరుటలో ఒక ప్రత్యేకకారణం లేకపోలేదు.

---

* "Those only who live with a man can write his life, with genuine exactness and discrimination." —Johnson,

# II

ఆయన లోకజ్ఞుడనీ, సరసుడనీ, కాంగ్రెసు భక్తుడేగాక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘములో వున్నతశిఖరా లందుకున్న ప్రముఖుడనీ, నాకు మిత్రుడనీ కాదు.

జమీందారీ రైతువుద్యమంలోను, రైతుఉద్యమంలోను ఆయన అనుభవంగల రైతునాయకుడు. ఆచార్య రంగాగారితో రైతువుద్యమంలో కలసి పనిచేసి ఆయన ఆశీస్సులు అభినందనలు పొందిన ప్రముఖుడు. ఆయన రైతుబిడ్డేగాక, రైతు. నేను పరిచయం ప్రారంభమటలో కారణము లివి.

బ్రహ్మయ్యగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వాదులలో ఒక ప్రత్యేకత గాంచిన ప్రముఖుడు. ఆయన పెద్దలలో చిన్న, పిన్నలలో పెద్ద. ఇంతే కాదు. పెద్దల నెమ్మది, పిన్నల భావోద్వేగము, ఆయనలో సమ్మేళనమొంది ఆయనను పెద్దగా చేసినవి.

కాంగ్రెసువారిలో ఆయన వాదిగా వుండి, కాంగ్రెసు పెంపుకై, పెక్కువిధాల గత ముప్ఫదిసంవత్సరాలనుండి శక్తివంచనలేకుండా కృషిచేసిన కృషీవలుడు.

ఆయన చేసిన ప్రతికార్యము తాను కర్షకుడననే భావంతోనే చేశాడు. ఇంతేగాదు. ఆయన పొందిన ప్రతిగౌరవము కర్షకలోక ప్రతినిధిగానే భావించాడు. యితరులచేతకూడ ఆయ కర్షకలోక ప్రతినిధిగానే పరిగణింప బడ్డాడు. ఆయనది కర్షకదృష్టి.

ఈనాడు మనకరుదుగా కానవచ్చే గ్రామపెద్దల మర్యాద, మన్నన, నిజాయితీ, మాటలనేర్పు, పరిహాసకుశలత, కార్యదీక్ష, కష్టనిష్ఠురత, నిరాడంబరత, లోకానుభవం, పరశ్రేయోభిలాష మన బ్రహ్మయ్యగారిలో బహుగా వున్నవి.

మన పల్లెలలో కుల మత విచక్షణలేక, వావివరుసలతో పిలుచుకొనే పూర్వ సంప్రదాయాన్నే ఆయన పాటిస్తాడు. పాటించుటేకాదు, దానిని ఇతరులుకూడ పాటించేటట్లు చెప్పకుండా చేయగల చతురుడు. అందుచేతనే కాంగ్రెసు గోత్రులైన కళా వెంకట్రావు, నీలం సంజీవరెడ్డి, మూల్పూరి రంగయ్య, మరుపిళ్ళ అప్పలస్వామిపాత్రుడు (చిట్టి) గార్లు మొదలగు ప్రముఖులు అన్నగారని ఆయనను ఆప్యాయంగా పిలుస్తారు. ఈ సాంప్రదాయాన్ననుసరించే బెజవాడ గోపాలరెడ్డిగారు ఆయనను స్వంత సోదరుడుగా భావిస్తాడు.

నేడు నవనాగరికత ప్రభావంచేత బంధుప్రేమ, హృదయైక్యత నశించి పోతున్నదని ఆయన అధికంగా విచారిస్తాడు.

కర్షకుని కలుపుకోలుతనం, హృదయం, ఆధునిక సభ్యతయెడల అయిష్టం, ప్రకృతికి సమీప్యంగా వుండాలనే గాఢాభిలాష ఆయనలో అధికంగా వున్నవి.

ఈ కారణాలన్నింటినీ పురస్కరించుకొని, ఆయనను మనము మన రైతుపెద్దగా భావింపవచ్చును.

అట్టి మన రైతుపెద్ద చరిత్ర వ్రాయుట రైతులోకమునందు నాకుగల ఆదరాభిమానములే.

మనలను మనం గౌరవించుకొనకపోయినయెడల, మనం యితరులచే గౌరవింపబడగలమా? ఇంతేకాదు. మన కర్షకోద్యమవిధాత ఆచార్య రంగా గారి బోధయేమో తెలియునా?

"మిమ్ములను మీరు గౌరవించుకొనుట మొట్టమొదట మీరు నేర్చుకొంటే, యితరులను మీరు గౌరవించగలరు"

కనుక మన రైతుపెద్ద చరిత్ర అవసరము కాదా?

"ప్రతిభావంతుల ప్రతిభ, వారి ప్రత్యేకగుణాలు — వారి లోపములు మాత్రమే మనకు వారిక సామాన్యములు" అని శ్రీ వివేకానందుల నిర్వచనము — అనగా ప్రతిభాశాలుర లోపములనెన్ని అవి మనకు వున్నవని నీచ సంతోషాన్ని అనుభవింపచేసేవారిని మందలిస్తూ, వారి దుర్గుణాలనుగాక వారి ప్రతిభను పూజింపవలసిన ఆవశ్యకతను చూపిస్తూ ఆయన ప్రబోధించాడు. అది గమనించుట అవసరం.

కనుక పాఠకులు సుహృద్భావం ప్రకటించకపోతే నాశ్రమ నిరర్థకం. బ్రహ్మయ్యగారికి స్నేహితుడను, సహచరుడను అయినంత మాత్రాన ఆయనను నిరూపించగలిగానని చెప్పలేను.

నేనే కాదు, యెవరూకూడా ఒక వ్యక్తినిగురించి యిదమిత్థమని నిరూపించుట సాధ్యము కానిపని. ఇతరులేగాదు. ఎవరికివారే తమ స్వరూపమునంతనూ సరిగ విమర్శానుభవము చేసుకొనజాలరు. ఇక యిది యితరులకు సాధ్యమని యెవరనగలరు?

అయినను వారికి తెలిసినంతవరకు, తెలుపగోరువారు చరిత్రకారులు. వారిచే లిఖింపబడిన చిత్తరువు వారి బింబమును సమగ్రముగ ప్రతిఫలింపలేక పోయినా, వారిచరిత్ర పరిచయమునకు కొంతసాధన కాగలదనుట నిశ్చయము.

అట్టిదే నాకృషి; అంతకంటె అధికంగా భావించవద్దనే నా మనవి.

నా చరిత్రరచనకు నా శక్తిసామర్థ్యాలు గాదు, నా వీరారాధన తత్పరతయే కారణము.

వీరులంటే కత్తిపట్టి కదనరంగమున కరిగినవారేగాదు. దేశకళ్యాణానికై కృషియొనర్చినవారంతా వీరులే.

స్వార్థభూయిష్టమైన లోకాన్ని పున్నతపథములో నుంచుటకు విరామములేక వీరులు కృషిసల్పెదరు. వారి కార్యకలాపాలు పరశ్రేయోముఖములై యుండును. అందుచేతనే వారు మనకు మార్గదర్శకులు.

ప్రతి వ్యక్తిలోను మంచిచెడ్డ లుండును. వారిలో మంచి అధికంగా నుండుటచేతనే అనుకరణీయు లగుచున్నారు.

అందుచేత వారి చరిత్రల ఆవశ్యకత మనకు అధికంగా కలదు.

ఇంతేకాదు. వీరపూజ దేశౌన్నత్యానికి, జాతీయ గౌరవానికి అవశ్యకమైన పవిత్రానుష్ఠానము. అందుచేతనే జాతి తనవీరుల ఆరాధనవలననే జీవించ గలదని! నానుడి పుట్టినది.

అట్టి వీరారాధకుడు వారిచరిత్ర రచనకంటే అధికమైనదేది కలదు? అట్టి కార్యాన్ని శక్తివంచనలేకుండా క్రమబద్ధంగా చేయటానికే నేను కంకణం కట్టుకున్నానని వినీతుడనై విన్నవించుకొనుచున్నాను.

ఈ గ్రంథరచనలో కృష్ణాపత్రిక అధికంగా ఉపకరించింది. అందుకు అధిక కృతజ్ఞుడను. కృష్ణాపత్రికా సంపాదకీయాలు ఇందులో చాలా ఉపయోగించాను. కృష్ణారావుగారికి బ్రాహ్మయ్యగారిపైగల ప్రేమకు ఈ సంపాదకీయాలు సాక్ష్యాలని అనుకొనుచున్నను.

అంతకంటె సత్యమునందు పంతులుగారికిగల గాఢాభిమానమనుకొనుట సముచితము కాదా ?

పీఠిక వ్రాసి ఈ కృతికి శోభ తెచ్చిన ఆంధ్రప్రభ సంపాదకులగు నార్ల వెంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతంగార్లకు, తమ అభిప్రాయములు పంపిన గురుతుల్యులగు శ్రీయుత చెరుకువాడవారికి, ఆంధ్రసాహిత్య క్షేత్రములలో పలుపంటలు పండించి ప్రఖ్యాతులైన పెద్దరైతులగు శ్రీ విశ్వనాథవారికి కృతజ్ఞతాపూర్వకవందనములు.

ఘంటసాల
8—11—48

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య.

# పరిచయం

"మన మింతవరకు, పల్లీయుల సంగతి పరికించనే లేదు. భోజనానికై మనము వారిపై ఆధారపడియుండి కూడ ఇంత వరకు, మనమే, వారికి ఆశ్రయదాతలమని, వారు ఆశ్రితులని అనుకున్నాము! వారి అవసరాలను మనము ఆలోచించనే లేదు".

— బాపూ.

ఒక వ్యక్తి జన్మవల్ల ఒక గ్రామానికి ఖ్యాతిరావడం కద్దు. అట్లాగే ఒక గ్రామంలో జన్మించుట చేత ఆ వ్యక్తికి, జన్మస్థాన విశేషంవల్ల కీర్తి, ప్రతిష్ఠలు త్వరగా రావడానికి దోహదం కావచ్చు.

ఒక ప్రసిద్ధ స్థలములో ఒక ప్రఖ్యాతపురుషుడు పుట్టాడంటే, పరస్పర సంబంధాలవల్ల, వ్యక్తి, స్థలాలకు మరింత గౌరవ ప్రపత్తులు కల్గడంలో ఆశ్చర్యమేమున్నది?

అట్లాగే ఒక ప్రఖ్యాత వంశాన జన్మించిన కారణాన జనానురాగం కలగటం కద్దు. ఆ పూర్వపురుషుల కీర్తి ప్రతిష్ఠలు ఆ వ్యక్తిలో ఆవరించి అభివృద్ధికి తీసుకునిరావడం కూడా సహజమే.

అట్టి అనుకూల వాతావరణమే, మన బ్రహ్మయ్యగారికి తోడ్పడింది.

అనేక శతాబ్దాలక్రితం, బౌద్ధులకు పుణ్యప్రదమైన కేంద్రస్థలమై, బుద్ధభగవానుని దివ్యబోధలను, దేశదేశాంతరములకు తీసుకొనిపోయి జ్ఞానజ్యోతులు వెలిగించిన నిలయమై, వాణిజ్య కేంద్రమై, రోము మొదలగు విదేశాలనుండి స్వర్ణ

రాసులను మాతృభూమికి చేర్చిన నౌకాశ్రయమై, బ్రతికి చెడ్డ ఆంధ్రుల ప్రాక్తన వైభవ సాహసజీవితమునకు కేంద్రమై శిలలకు ప్రాణప్రతిష్ఠ ఒనర్చిన ఆంధ్ర శిల్పకళానిలయమై, విలసిల్లిన చరిత్ర ప్రసిద్ధమైన ఘంటశాల గ్రామ మాయన జన్మస్థానము.

ఆయన గ్రామమువలె వంశమును పూర్వప్రతిష్ఠగలది. ఆయన తాత సైనికుడై స్వీయశక్తి సామర్థ్యాలవల్ల సుబేదారు పదవి పొందిన, ఆత్మగౌరవము, అభిమానముగల శక్తి పూజా ధురంధరుడగు సత్యవాది.

ఆయనతండ్రి విద్యావినయ సంపన్నుడై గ్రామాభివృద్ధికై కృషి చేసి, ప్రజాసేవలో ప్రస్తుతి గాంచిన కార్యవాది.

ఆయన పినతండ్రి పట్టభద్రుడై, పీడిత ప్రజలకై పోరాడిన న్యాయవాది.

ఇక మన బ్రహ్మయ్యగారో జగమెరిగినవాడు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసులో ఉన్నతపదవుల ద్వారా సేవ జేసిన ప్రఖ్యాత కాంగ్రెసువాది.

చూడగానే ఆకర్షింపబడును. ఆజానుబాహువు. ఆరడుగుల నిడివేకాదు. నిండైన విగ్రహం. ప్రసన్నవదనం స్ఫురద్రూపి. ఆ ఆకారానికి తగినట్లు బిళ్ళంచు † గల తెల్లని ధోవతి జారుగోచి – బారు లాల్చి, దానిపైన గోరంచుగల ఉత్తరీయమును కప్పును. ఆ ఉన్నత ఆకారమునకు ఉజ్వ

---

† ఒక తాటాకు పెడల్పుగల ఎర్రంచు 'దీనికి బ్రహ్మయ్యగారంచు' అని ప్రతీతి.

లము కల్గించే, వస్త్రాలంకారము పుస్తకలోనే పెద్దవాడై పుట్టినట్లు చూపరులకు తోచును.

ఒక్క ఆకారమువల్లనే కాదు, ఆయన పెద్ద; గుణగణాలు, శక్తి సామర్థ్యాలు కూడా, ఆయనను పెద్దగా జేసినవి.

ఆయన యెంత ఉన్నతాకారుడో, హృదయమంతే విశాలమైనది. మేధ అంత నిశితమైనది. వర్తన అంతే విమలమైనది.

ఒక వ్యక్తిని గుర్తించాలంటే, ఆయన గురువులను ముందు గుర్తించాలి. ఆంధ్రదేశములో అధిక ప్రఖ్యాతి గాంచిన, త్రిమూర్తులగు, కృష్ణారావు, పట్టాభి, నరసింహం గార్లాయన గురువులు. గురువుల గుణగణాలాయనలో గుమిగూడినవి. కృష్ణారావుగారి విమలవర్తనము, పట్టాభిగారి ప్రతిభ, నరసింహంగారి సేవానురక్తి ఆయనలో చేన్నారినవని చెప్పనక్కరలేదు పరిచయులకు.

ఆయన ఒక విశిష్ట వ్యక్తి. పురోగామి గానటంతో పాటు ఆయనలో కొంచెం పూర్వాచార వాసన లేకపోలేదు. సంస్కరణాభిలాషి కానడంతో బాటు, సంప్రదాయ బద్ధుడు. ఉత్సాహపరులతో పరుగెత్తడు. లాభనష్టాల గణించే వారితో చతికిలబడడు.

ఆయన పండితుడు కాడు. విద్యాపంతుడును కాడు. గ్రంథపఠనాభిలాషియు కాడు. అధిక లోకజ్ఞానం, పరేంగిత బుద్ధి ఉన్నందున, ఆ సంస్కారలోపం యెంతమాత్రం కన్పించదు.

ఆయన అధిక సంచారం చేయకపోయినా, పెద్దల సాహచర్యం, సంపన్నమైన భావశబలత వున్నందున, ఆ లోపంకూడా ఆయనను బాధించదు.

గ్రంథాలేమీ ఆయన వ్రాయలేదుగాని; వ్రాసినట్టైతే కాస్తా చక్కగా వ్రాయగలడు. శైలి సరళమై, భాష సహజమై తెనుగు నుడికారము గలిగి వుంటుంది.

వక్తగా ఆయన పరిగణింపబడలేదుగాని, ఉపన్యాసాలలో హృదయధార వుంటుంది. వాక్యాలు చిన్న చిన్నవిగా వుండి సామెతలు, ఆమెతలు, కథలు, గాథలు స్వానుభవములు గలిగి తెలుగు నుడికారములో, అచ్చమైన రైతు మాటలతో రాణించగలదు. విషయాన్ని విడచి శాఖాసంక్రమణ చేయడు. శబ్దాడంబరము లేక, రైతుల కర్తవ్యాలట్లు గాక, చెప్పినదాన్ని చెవియొగ్గి వినేట్లు చెప్పగలడు.

వాదనలో చతురుడు. ప్రతివాదిష్టుడు గాక. ప్రతివాదము మీదనే స్వీయ ప్రాగల్భ్యమును ప్రదర్శించుటలో దిట్ట

సంభాషణలో సరసుడు. వస్తుతః ఆయన మంచి మాటకారి. చమత్కారి. సంభాషణలోనే ఆయన అసలు హృదయం వెల్లడవుతుంది. ఆయనదే కాదు; యెవ్వరిదైనా అంతే. సంభాషణలో ఆయన విశాలహృదయం, ఆప్యాయత, అనురాగం, మర్యాద, మన్నన, లోకానుభవం, పరిహాసశీలత వెల్లడికాగలదు. ఆయన ప్రసంగించే ప్రదేశం ఒక చిన్న సమావేశమౌతుంది.

గొప్ప సాహసవంతుడనలేముగాని తన వ్యూహం తాను వేసుకొని సాధించుటలో సమధిక ప్రతిభావంతుడే.

ఏ సమావేశంలో నైనా ఆయనను అందరు అనుగమించకపోయినా, గమనించక తప్పదు.

ఆయన ప్రచారకుడు కాడు. ప్రబోధకుడు కాడు. నిర్మాణ నిపుణుడు, కార్యదక్షుడు.

ఆయన కెట్టి సహజశక్తి కలదో అట్టి జ్ఞానశక్తి కలదు. పట్టుదల, చురుకు, ధారణ, సద్యస్ఫురణ, సూక్ష్మదృష్టి, శీఘ్ర నిర్ణయం, కార్యవ్యగత, కార్యదక్షత, ఆత్మ విశ్వాసము, ఆత్మగౌరవము ఆయనలో అధికం. విచక్షణ జ్ఞానములో అధికుడు, నిష్కపటి, నిష్కర్షి, అభిమాని అయినా నిగర్వి, నిరాడంబరుడు.

ఆయనలో ఆవేశంకంటె ఆలోచన అధికం. అందువేత, ఆయన అంతరిక్షాన సంచరించే ఆదర్శవాదికాడు, నేలమీద నడిచే లోకజ్ఞుడు. వాస్తవికవాది. ఆచరించ గలిగినదే ఆయన ఆకాంక్షించును. అందుచేత ఆయన లక్ష్యాలు పరిమితమైనా, వాటిసాధనలో ఆయన చూపే ప్రజ్ఞావిశేషాలు అధికం.

లోకాన్ని నడపగలిగిన సంస్కర్త. ఒక పని చేయదలచుకుంటే కార్యం పూర్తిగా విడనాడడు, నీతి నతిక్రమించడు. ఎవరి మనస్సు నొప్పించడు, తనపట్టును విడువడు. నవ్వుతూనే తన కార్యాన్ని నెగ్గించుకుంటాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన కార్యదక్షుడు.

"ఏ వ్యక్తి విలువనైనా, అతడు చాటే సిద్ధాంతాలను బట్టి గాక, అతని కార్యదక్షతను బట్టే నిర్ణయించాలి" అంటాడు, మన ప్రధాని పండిత నెహ్రూ.

కొందరికి ఉన్నత భావాలుండవచ్చు, ఉత్తమ లక్ష్యాలుండవచ్చు కాని అలా వున్నవారికి వజ్ర సంకల్పం, కార్యదక్షత వుండదు టకుదు. కాని కావలసింది వజ్ర సంకల్పమే కార్యదక్షతే. ఇవి మన బ్రహ్మయ్యగారిలో సమధికంగా ఉన్నవి.

ఆయన ప్రత్యర్థులు కూడా, ఆయన దక్షతను ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా అంగీకరించగలరు.

1920 లో కాంగ్రెసు వోట్లు ఇవ్వవద్దని ఆజ్ఞాపించింది. ఆ విధంగా అధిక ప్రచార ప్రబోధాలు జరిగినవి. కాని కాళీ పెట్టెలు యెన్ని పోలింగు స్టేషనులనుంచి వచ్చినవి? ఒక్క బ్రహ్మయ్యగారి పోలింగు స్టేషనుండే వచ్చినవి. మద్రాసు రాజధానిలో మరొక చోటునుండి రాలేదను సంగతి గ్రహిస్తే ఆయన కార్యదక్షత కరతలామలక మగును.

ఇంతేకాదు కొంతమంది నాయకులు, స్వస్థలాల్లో పరాయివారుగ పరిగణింప బడతారు. ఆయన అట్లా కాదు. ఆయనపలుకుబడి ఇంటా బయటా సమానమే. స్వగ్రామాన్ని కాంగ్రెసుకు పెట్టని కోటగా చేసి ఆంధ్ర నాయకుల చేతనే గాక మహాత్మునిచేత కూడ మన్ననపొందిన మాననీయుడు. ఇంటగెల్చి రచ్చగెల్చిన విఖ్యాతుడు.

మీర్జాపురం రాజాగారు 1926 లో అసెంబ్లీ అభ్యర్థిగా నుండి అన్యాయంగా వోట్లు సంపాదించినందుకు, యెన్నికదావాలో ఒక పిటీషనరుగా వుండి ఎందరో అనుకూలురు, ప్రతికూలురైనా, రాజాగారెన్ని ప్రలోభములు కల్గించినా, తుదివరకు పోరాడి, నీతికి నిలబడి, ఖ్యాతిగాంచిన నిర్మల చరితుడు.

స్త్రీదర్గకు పీఠమైన బందరు తాలూకాబోర్డుకు 1927లో అధ్యక్షస్థానము వహించిన రైతు.

ఆయనచేత వారూ వీరూ ఆవని ఈవని, దారిదప్పి చేయించకలిగారా? నడతలో నూటిమార్గంగల మన రైతు పెద్ద, నూటిపనులనే చేయగలడు.

ఇంతేగాదు. జస్టిసుపార్టీ తనకు ప్రతిపక్షంగా వున్నా సామరస్యంగా నడిపిన దక్షుడు.

వ్యవహారమంతా తెలుగున నడిపించిన మాతృభాషాభిమాని.

పాఠశాలల్లో నైతికబోధ యేర్పాటుచేసిన నీతివంతుడు.

హరిజనోపాధ్యాయులను ప్రథమంగా పల్లెల్లో చేసి, అస్పృశ్యతా నివారణకు దోహదమిచ్చిన సంస్కర్త.

ఉద్యోగులచేతను, ఉపాధ్యాయులచేతను ఖద్దరు వస్త్రధారణ చేయించి, కాంగ్రెసుబోర్డుగా జేసిన దేశాభిమాని.

సైమన్ సప్తకము మన సరిహద్దులలో సంచరించుటకు వచ్చినప్పుడు, బహిష్కారసూచకముగా బడులను మూసి, ఆఫీసుపై నల్లజెండా ప్రతిష్ఠించిన ధీరుడు.

ఉద్యోగులను, ఉపాధ్యాయులను సోదరులుగా చూచిన ఉదారుడు. అందుచేతనే నేటికిని వారు ఆయనను మా ప్రెసిడెంటుగారని ఆప్యాయంగా పిలుచుకుంటారు.

పరిపాలనను దక్షతతో నడిపి, ఆదర్శవంతమైన బోర్డుగా చేసిన ప్రతిభాశాలి.

1930 లో బందరుకు గవర్నరు వచ్చినప్పుడు మీ పరిపాలన ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా ఉన్నదని నల్ల

జెండాలు జూపిన తూర్పుకృష్ణా కాంగ్రెసు అధ్యక్షుడు. ఆనాటి వారి కార్యక్రమమువలె ఆంధ్రదేశములో ఎక్కడా అంత దిగ్విజయముగా జరగలేదు. ఈ ప్రదర్శనాన్ని పెద్దలు పెక్కు విధాల ప్రశంసించారు.

రైతు ఉద్యమములో ఆయన ఆచార్యరంగాకు సహచరు డుగా ఉండి, తన రైతు లోకానికి సేవజేసి ప్రస్తుతిగాంచాడు. రీసెటిల్‌మెంటు ఉద్యమములో కారాగారవాసము కలిగెను.

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ అధ్యక్షుడుగా నుండుటేగాక, తదుద్యమ విజయ సారథులలో ఒకడు.

జమీందారీ రైతు ఉద్యమ ప్రారంభకులలో ఒక ప్రముఖుడుగా పరిగణింపబడుటే గాక, ప్రజాకంటకుడగు చల్లపల్లి యెస్టేటుదివానును సాగనంపిన రైతు బాంధవుడు.

జమీందారీ రైతు ఉద్యమములో, మునగాల సంఘటన లోక ప్రసిద్ధము. మునగాల జమీందారునకు రైతులకు కల్గిన వివాదాన్ని పరిష్కార మొనర్చి ఉభయుల మన్ననల గాంచిన మనీషి.

ఆంధ్రరాష్ట్రీయ మహాసభ అధ్యక్షపీఠ మెక్కిన, మొదటి రైతుబిడ్డ. ఆ సభను అతి చాకచక్యంగా నడిపి, ప్రముఖుల ప్రశంస లందిన ప్రతిభావంతుడు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా నుండి నాటి ప్రధాని రాజాజీచే ప్రశంసాపాత్రుడైన కార్యచతురుడు.

వేయేల? ఆచార్యరంగాగారు అన్న మాట నాలకించుడు.

"కృష్ణరావు, చెరుకువాడ, పట్టాభి, కోడాలి, గొట్టిపాటి వారికలయిక, పంచభూతాలు – ఆంధ్రులకు మొత్తము మీద, వన్నె వెలుగు కల్పించినవనే బహుళ జనాభిప్రాయము. వారి విశ్యతవలన ఆంధ్ర తేజము పెరిగింది. విజృంభణ సాధ్యమైనది."♦

ఆయన యెన్ని కార్యాలు సాధించినా, ఏపని చేస్తున్నా, తాను రైతుననే స్వస్వరూపజ్ఞానం విడనాడక, సదా ఆ భావంతోనే సంచరించును.

అందుచేతనే ప్రజాసేవతో పాటు, మన జీవనాధారము లగు, నందులవంటి వృషభరాజములను, కామధేనువుల వంటి ధేనువులను పోషిస్తూ, ఆ యెడ్ల రంకెలను, కోడెల ఆర్భాటములను, ఆవుల అంభారవములను, లేగల గంతులను గాంచి, ఆనందిస్తూ, భూదేవిని భజిస్తూ, పంటపొలాలను ప్రేమిస్తూ, పాలేళ్ళ పొందుతో, కూలిల సహవాసంతో, తోటి రైతుల ఆదరముతో, రైతులలో రైతై, గ్రామస్థులలో గ్రామస్థుడుగా ఉంటాడు.

"సైరికా, నీవు భారతాత్మోత్రిలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధానశ్రీపతి పాలవదండ మెప్పుడు
నీ హాలంబు కన్నను ప్రార్థనీయమగునె?"

— కృషీవలుడు.

---

♦ చిత్రగుప్త 1939-10-15

# వంశవృత్తాంతం

"సమర సమయములందు పితరుల
క్షాత్రతేజము నిలువబెట్టుము
శాంతిదినముల సేద్యమున దే
శమును కాపాడు." — పల్లెపట్టు.

బ్రహ్మయ్యగారి వంశంలో మనకు తెలిసేది వారి ముత్తాత, గంగయ్యగారి సంగతే. ఆయనది ఘంటశాలకు 4 మైళ్ళ పడమరలో వున్న చినకళ్ళేపల్లి గ్రామం. గంగయ్యగారికి బ్రహ్మయ్య యేకైక సంతానం. కుమారుని యెనిమిదో యేట తండ్రి మరణించాడు. భర్తవియోగాన్ని, సహించలేక ఆయన భార్య వీరమ్మ తన తనయుని బాధ్యత భగవంతునిపై వుంచి, నూతిలో బడి మరణించింది.

దిక్కులేని పక్షివలె వున్న బ్రహ్మయ్య భాగవతుల కూచిపూడికి సమీపములో వున్న పెదపూడి గ్రామంలోని మేనత్తగారింటికి చేరాడు. మూడు సంవత్సరములా మేనత్త పోషించింది. ఆమె పేదరాలగుటచేత తన బంధువును, ఘంటశాల కాపురస్థుడు అయిన, అయినపూడి రామన్నగారు వచ్చినప్పుడు, తన అన్నకుమారుని తీసుకొనివెళ్ళి పనిపాటలు చేయించుకుంటూ వృద్ధిలోనికి తీసుకురావలసిందని అప్పగించింది.

ఈ రామన్నగారు, భూవసతిగల ఉత్తమ గృహస్థు. ఆకాలంలో వర్షాలు అధికం కావడంచేత పంటలుపండేవికావు. అందుచేత ఆనాడు వచ్చికరువేగాని మొదుకనువుండేదిగాదు.

భూమి యెంతవున్నా శిస్తుయివ్వలేని స్థితిలో వుండేవాం డ్రైతు. నాణెములు అధికంగా చెలామణిలేని ఆరోజుల్లో వస్తు మార్పిడే అధికం గావడంవల్ల, పంటలు పండినా, కొనే వాళ్ళుండేవారుకారు.

రైల్వే రాస్తాలు లేనందున వ్యాపారం హెచ్చుగా వుండేదిగాదు. ఉన్నకొద్ది వ్యాపారం బళ్ల మీదా గంతావుల మీదా సాగుతూవుండేది ఆ కాలంలో భూమికి విలువే లేదు. యకరం రెండు మూడు రూపాయలుండేది. పశువులే ధనం. పంట తక్కువైనా పాడీ పుష్కలంగా వుండేది. శిస్తు చెల్లని ఆరోజుల్లో రైతులు ఒక ప్రాంతాన్నుంచి మరొక ప్రాంతానికి కిరాయి తోలుకుని శిస్తు డబ్బులు సంపాదించుకుంటూవుండేవారు. ఈ కిరాయిబళ్ళను తోలడానికే ఆరోజుల్లో "కమాన్ తోలుడు" అనేవారు. ఇట్లా కమాను తోలేబండ్లు ముఠాలుగా వుండేవి. ముఠాకు 20 లేక 30 బళ్ళు వుండేవి.

ముఠానాయకులలో అయినపూడి రామన్నగారొకరు. ఘంటశాలనుండి జగ్గయ్యపేట, హైదరాబాదు, నాగపూరు, ప్రాంతాలకు కిరాయి తోలుతూవుండేవారు. ముఠా నాయకులగు రామన్నగారు బ్రహ్మయ్యను తీసుకొని జగ్గయ్యపేట ప్రాంతాలకు కమాను వెళ్ళారు. చిన్న చిన్న, పనులన్నీ చిన్నవాడగుటవల్ల ఈ కుర్రవాడిచేత చేయించేవాడు. వయస్సున చిన్నవాడైనా, కట్టగుడ్డ, తిన తిండి లేని పేదవాడైనా, ఆత్మాభిమానంగల బ్రహ్మయ్య ఈ పనులు చేయ నిరాకరించాడు. అంతట ముఠా మేస్త్రి తనను ధిక్కరించినందుకు

ఎప్పుపై నాల్గు విసిరాడు. ఈ అవమానం సహించలేక, భారం భగవంతునిపై ఉంచి బండ్లముఠాను విడచి బయలుదేరాడు.

కొంతదూరం వెళ్ళి అలసిపోయి దారిప్రక్క నొక చెట్టుక్రింద కూర్చుండెను. ఆ దారే వెళ్ళుతున్న ఒక సైన్యాధికారి ఈ కుర్రవాడిని చూచుట తటస్థించింది. అప్పటికి బ్రహ్మయ్య 17, 18 యేండ్లవాడు. మంచి అందగాడు. ఆజానుబాహువు. వీరత్వము మూర్తీభవించిన ఆ కుర్రవానిపై ఆ అధికారి దృష్టిపడింది. ఇంతేగాక, పాపము! కొద్దిరోజుల క్రితమే, ఇటువంటి కుమారుడు పోవుట, ఆయనకు తటస్థించింది. అందుచేత ఆ కుర్రవానిని వెంటబెట్టుకొని, విద్యాబుద్ధులు కలిగించి మిలిటరీ ఉద్యోగంలో చేర్చాడు. ఆయన ఆంగ్లదేశం వెళ్ళవలసి వచ్చినప్పుడు తనస్థానే వచ్చిన ఉద్యోగికి అప్పజెప్పి వెళ్ళాడు.

తర్వాత, ఆనూతనోద్యోగి అభిమానమునకు పాత్రుడై ఏడురూపాయలనుండి, ఇరవై అయిదురూపాయిల జీతముగల జమాదారయ్యాడు. ఆ సమయంలోనే ఘంటసాల వచ్చి, అయినపూడి రామన్నగారి సలహా సంప్రదింపులతో వివాహం చేసుకొని, కొలువుకు వెళ్ళాడు. భార్య అచ్చమ్మ వచ్చింతరువాత ఆయన అదృష్టమధికమైంది. వెంటనే యాభైరూపాయిల జీతంగల హవల్దారైయ్యాడు. మరికొంతకాలానికి నూరురూపాయిల వేతనంగల సుబేదారైనాడు. అప్పటికాయనకు వీరరాఘవయ్య, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అని ఇద్దరుకుమార్లు.

వీరరాఘవయ్య తండ్రివలె నుంచి భారీమనిషి, దృఢకాయుడు. ఆటపాటలం దధికప్రీతి గలవాడు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి స్ఫురద్రూపి, సుకుమారి. చదువుసంధ్యలందు అధికాభిలాషి. వీరి బాల్యావస్థలోనే తల్లి అనారోగ్యంగా కాలంచేసింది.

అంతట సుబేదారు ఘంటశాల వచ్చి ఇల్లు వాకిలి ఏర్పాటుచేసుకొని, అత్తగారి సంప్రదింపుతో, కాంతమ్మ అనే ఆమెను వివాహమాడి, వారినితీసుకొని తిరిగి పటాలం లోకి వెళ్ళాడు. ఆయన అనేక యుద్ధాలలో వీరోచితంగా పోరాడిన పరాక్రమశాలి.

మన హిందూదేశాన్నుంచి పటాలపు ఉద్యోగులను ఏరి, విక్టోరియా రాణీగారి దర్శనానికి పంపిన సందర్భములో మద్రాసు రాజధానినుండి పంపబడిన పదిమందిగురిలో ఆయనొకడు. ఆ సందర్భంలో ఆయనకొక పతకంకూడా బహుమతి చేయబడింది. ఆయన ఆరడుగుల పొడవుగల ఆజానుబాహుడు. పొడవుకు తగిన లావుగల్గిన గంభీరమూర్తి.

ఆయన పెన్షను పుచ్చుకునేరోజులు వచ్చినవి. కాని ఇంకా దారుఢ్యం ఉండటంవల్ల, కమేండర్ ప్రాపకంవల్ల ఉద్యోగంలో ఉండేవాడు. ఆయనపై అధికారి మేజరుసుబేదారు కొద్దిరోజుల్లో పెన్షను పుచ్చుకోవడానికి సిద్ధంగా వున్నాడు. ఆయన పెన్షను పుచ్చుకోగానే ఆ స్థానంలో తాను ప్రవేశించిన నెలకు 200-0-0 వస్తుందని తర్వాత మానుకుంటే నూరు రూపాయిల పెన్షను వస్తుందనే అపేక్షతో ఇంకా వుద్యోగంలోనే ఉన్నాడు.

ఈయన ఇట్లా అపేక్షలో వున్నట్లే ఈయన క్రింద ఉద్యోగి హవల్దారుకూడా ఈయన స్థానంలోనికివచ్చి పెన్షను తీసుకుందామనే వుద్దేశంలో వుండెను. ఈ హవల్దారు అన్న ఈసుబేదారుకు విషప్రయోగం చేయించిన అతను మరణించుననీ తన తమ్ముడు సుబేదారై పెన్షను తీసుకుంటాడని దురుద్దేశం కలవాడై ఆ విధంగా విషప్రయోగంచేయ ప్రయత్నించాడు. సుబేదారీ సంగతి గ్రహించాడు ఇదివరకు అకస్మాత్తుగా చనిపోయిన తన ప్రథమ భార్యకుకూడా ఈ విధంగానే విష ప్రయోగం జరిగివుంటుందని భావించాడు. అందుచేత ఇక్కడ వుండుట తనకు, తన బిడ్డలకు క్షేమంగాదని యోచించి యాభై రూపాయల పెన్షనుతోనే ఘంటశాల వచ్చాడు.

వచ్చిన వెంటనే భూమిబుట్ట సంపాదించుకొని స్వంత సేద్యం సాగించాడు. గ్రామంలో ఏ వ్యవహారం పట్టించుకొనేవాడు కాడు. తన వ్యవహారంలో ఎవరు కల్పించుకున్నా సహించేవాడు కాడు. ఆయన నిత్యం దేవీపూజ చేస్తూండే వాడు. సత్యదృష్టి కల్గి సంచరించేవాడు. అర్థులకు నాస్తి అన కుండా శక్తి కొద్దీ యిచ్చి పంపుతూ వుండేవాడు.

మితభాషి. అనవసర సంభాషణ చేసేవారిని చీవాట్లు పెట్టి పంపేవాడు.

ఆయన రెండవ భార్యకు కల్గురూ ఆడపిల్లలే. ప్రథమ భార్య సంతానముగు వీరరాఘవయ్య ఇంగ్లీషు చదువు బాగా చదువక తెలుగు బాగా చదువుకున్నాడు. కాస్త కవిత్వ ధోరణికూడా కలిగింది. హిందూస్థానీకూడా బాగా

మాట్లాడేవాడు వ్యవసాయమునందే అధిక ఇష్టం. కాయకష్టమందు గౌరవంగల మనిషి. ఈయన తమ్ముడు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి బి. ఏ. వరకు చదివాడు. బహుశా ఈ జిల్లాలో ఆయనే కమ్మవారిలో కల్లా ప్రథమ పట్టభద్రుడు కావచ్చు. ప్లీడరీ కూడా చేశాడు.* ఇట్లా కుమాళ్ళకు విద్యాబుద్ధులు గరపించి వివాహాలు చేసి 63 వ ఏట కాలధర్మం నొందాడు సుబేదారు.

వీరరాఘవయ్యగారు రాజసము గలవాడు. మంచి ముసద్దీయేగాక, వ్యవహారత కూడాను. బలం గలవాడు. ధైర్యసాహసలు కూడా అధికమే. ఆయన ఈ గ్రామం చుట్టూ వున్న గుండేరుకు, చప్టాలు వేయించ అనాడే అర్జీలు పెట్టించి ఆందోళనచేసిన ప్రజా సేవాభిలాషి. ఇంతేగాక ఘోటకం అనే పశుగ్రాస భూమిని వల్లపల్లి జమీందారుగారు ఘంటశాల గ్రామ పెద్దలచేత కౌలు వ్రాయించుకొని అక్రమ ప్రవేశం చేయ తలపెట్టినపుడు, ఆయనా ఆయన మిత్రులు కలసి దాని సరికట్టి ఆ పశుగ్రాసపు భూమిని యధారీతిగా గ్రామస్తుల వుపయోగానికి నిలిపిరి.

వీరరాఘవయ్యగారికి 1898–12–3 తేదీన బ్రహ్మయ్యగారు జన్మించారు.

* ఈ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగారి సహాధ్యాయులే కీ. శే. లగు కోపల్లి హనుమంతరావు M. A., B. L., వేమూరి రామచంద్రరావు B. A., B. L., కట్టమంచి కొళందైరెడ్డి B. A., ప్లీడరు. పెద్దిబొట్ల వీరయ్య B. A., B. L. ప్రభృతులు.

ఈయన జన్మించిన కొద్ది నెలలకు పైచెప్పిన ఘోలకం కేసుల్లో న్యాయవాదిగా ప్రజల పక్షాన పనిచేస్తున్న ఆయన పినతండ్రి సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగారు నిస్సంతుగా చని పోయారు.

ఆ మనిషి పోయిన కొద్దికాలానికే వీరరాఘవయ్యగారికి, బ్రహ్మయ్యగారికీ, వీరరాఘవయ్యగారి మారుటితల్లి, వీరు చని పోతే తన కుమారులకే ఆస్తి సంక్రమించగలదనే సంకల్పంతో విషప్రయోగం చేసింది. వీరరాఘవయ్యగారు వెంటనే మరణించారు. స్తన్యపానం చేస్తున్న శిశువు అగుటవల్ల బ్రహ్మయ్యగారికి ఆ విషము ప్రాణహాని చేయలేదు. అంతటితో పూరు కున్నదా? ఆ దుర్మార్గురాలు వీరరాఘవయ్యగారి మరణానికి భార్యా బంధువులు తల్లడిల్లుతున్న సమయంలో ఈ పసి కందును పట్టుకొని గొంతు నొక్కి చేయనున్న సమయాన ఆయన చిన్న మేనమామగారు చూచి మేనల్లుని భద్రమైన స్థానానికిచేర్చాడు

ప్రజాసేవ చేసి, రాష్ట్రఖ్యాతిపొంద ఈశ్వరసంకల్పమైతే స్వార్థపరుల విష ప్రయోగాలు, దురంతాలు, ఆయన యెడల విఫలమగుటలో ఆశ్చర్యంలేదు.

క॥ కాననమున రణమున సలి
లానల రిపుమధ్యమున మహాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తు నిద్రితు
బూనికతోఁ బూర్వపుణ్యములు రక్షించున్.

— భర్తృహరి.

——

(2)

# విద్యాభ్యాసం

"ఉ॥ విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్యయశస్సు భోగకరి విద్యగురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము విద్యకుసాటి ధనంబు లేదిలన్
విద్యనృపాలపూజితము విద్యనెఱుంగనివాడు మర్త్యుడే॥"

— భర్తృహరి.

బ్రహ్మయ్యగారి మేనమామల ఊరు కూడా ఘంటశాలే. తమ బావమరిది ఈవిధంగా బలవన్మరణం పొందగానే తమ తోబుట్టువును, మేనల్లుని, వారి యింటికి తీసుకువెళ్ళారు. ఆయనకు ఏడవయేట అక్షరాభ్యాసం పూర్వ సాంప్రదాయానుగుణ్యంగా జరిగింది. బాల్యమునుండి కూడా ఆయన చదువు సంధ్యల్లో సూక్ష్మబుద్ధిగలవాడు. ప్రతి తరగతిలోను ఆయనే పెద్ద. ప్రైమరీవరకు చదివాడు. ఉపాధ్యాయులందరి మన్ననలకు పాత్రుడైనాడు. ప్రైమరీ చదువుచున్న రోజుల్లో బడిపెద్ద ఆయనే.

ఆయన నాల్గోతరగతి చదువుచున్న రోజులలో బిపిన్ చంద్రపాలును శిక్షించిన సందర్భములో ఆ గ్రామంలో ఒక పెద్ద వూరేగింపు జరిగింది. పాఠశాల విద్యార్థులందరితోపాటు ఆయనకూడా అందులో పాల్గొన్నాడు. కాని అప్పుడు బిపిన్ చంద్రపాలువలె తానుకూడా దేశంకొరకు పాటుపడి, జైలుకు వెళ్ళాలని ఆయన అనుకోలేదు. కాని అట్టి గౌరవం ఆయనకు దక్కుట అదృష్టముగదా!

ప్రైమరీ ప్యాసైన తరువాత, గ్రామంలోనే వారణాసి చినఅచ్చన్నగారివద్ద, ఇంగ్లీషు విద్యాభ్యాసం ఆరంభించాడు; ఆ అచ్చన్నగారు ఆ కాలంలోనే పిల్లలకొరకు ఒక గ్రంథాలయం స్థాపించి పత్రికలు కూడా తెప్పించి, విద్యార్థులచేత చదివిస్తూ, భాషాభిమానం, దేశాభిమానం కల్గించాడు.

1913 వ సంవత్సరంలో బ్రహ్మయ్యగారు బందరు నోబుల్ కళాశాలలో ప్రవేశించాడు. 1906 లో ప్రథమంగా వితంతు వివాహం చేసుకున్న చోడవరపు జగన్నాథరావుగారు ఆయన క్లాసు టీచరు. ఆ మాస్టరుగారు ఈ శిష్యుని గుణగణాలకు ముగ్ధుడై, పితృవాత్సల్యంతో చూస్తూ, పండుగ పర్వాలకు తమ గృహమున కాహ్వానిస్తూండేవాడు. ఆయన బ్రహ్మయ్య నా శిష్యుడని, గర్వంగా చెప్పుకునేవాడు. ఆయన వల్ల కూడా కొంత దేశాభిమానం, సంస్కరణాభిలాష ఈయనలో మొలకెత్తినాయి.

ఘంటశాల గ్రామస్థుడు, ఆయనకంటె పెద్దవాడును అగు గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు బ్రహ్మసమాజ మందిరంలో ఉండుటచేత ఆయనకూడా అక్కడనే వుంటూండేవాడు. ఆ రోజుల్లో ప్రతి ఆదివారం బ్రహ్మ మందిరంలో ప్రార్థనలు జరుగుతూండేవి అక్కడకు అక్కడ వుంటూన్న విద్యార్థులు బందరులోని బ్రహ్మసమాజాభిమానులు వస్తూండేవారు. తరచుగా ముట్నూరి కృష్ణారావుగారే ప్రార్థనలు చేస్తూండేవారు. తద్వారా సంస్కరణాభిలాష, దేశాభిమానము వృద్ధిగాంచినవి.

స్కూలు ఫైనల్ వరకు ప్రతి సంవత్సరం తప్పకుండా గెలుస్తూండేవాడు. ఆయన పాఠాలు యొక్క వకాలం చదవక వార్తాపత్రికలు తెలుగుపుస్తకాలు చదువుతూ వుండేవాడు. అయినప్పటికి ప్రతి తరగతిలోను తెలివిగల విద్యార్థులందు దొకడుగా వుంటూవుండేవాడు. 1916 సం॥ లో స్కూలు ఫైనలు నందు కృతార్థుడు కాలేదు. మరు సంవత్సరం చదువుచుండగా విషజ్వరంవచ్చి 6 మాసాలు వ్యాధిగ్రస్తుడగుట సంభవించింది. అందుచేత ఆసంవత్సరము చదివే అవకాశం లేకపోయింది.

మరు సంవత్సరము చదువమని మామగారు చెప్పారు. కాని, ముట్నూరి కృష్ణారావుగారి బ్రహ్మసమాజపు ఆచార ప్రసంగాలు, కానూరి వెంకటాచలపతయ్యగారి కృష్ణా పత్రికలో ఆంగ్లవిద్యాభ్యాస విముఖత్వమునుగూర్చి వ్రాసిన వ్యాసాలు ఆయనను విద్యావిముఖునిగా జేసినవి. అందుచేత ఇక భాషాపరిచయం చాలనుకున్నాడు. అనంతరం ఉన్నత విద్యాభ్యాసం చేయనందుకు అప్పుడప్పుడు విచారించిన సమయాలుకూడా లేకపోలేదు.

ఆయన ముత్తవతల్లికి తన మనుమడు ఉద్యోగం చేయాలని అభిలాష వుండేది. మేనమామకు బ్రహ్మయ్యగారు పినతండ్రిమాదిరి న్యాయవాది కావాలనే అభిలాష వుండేది. ఆయన స్కూలుఫైనలుతోనే విద్యకు స్వస్తి చెప్పుటచేత బంధువుల ఆశలన్నీ నిరాశలైనవి.

విద్యావంతుడు కానందుకు ఆయన బంధువులు; ఆయన అప్పుడప్పుడు పరితపించినట్లుగా మనం విచారించ నక్కర

లేదు. ఉన్నత విద్యావంతుడైతే ఆ కాలస్థితిని బట్టి ఏదో ఉద్యోగం చేయడమో, లాయరుగా ఉండడమో సంభవించేది. అటువంటి ప్రయత్నాలు విఫలమైనందుననే ఈనాడు దేశ సేవకు అవకాశం కల్గినది. ఈవిధంగా ఆయన విద్యా వైముఖ్యము దేశోపకారమే అయ్యింది.

ఆయన చదువుకునే రోజుల్లో బందర్లో (కృష్ణా) విద్యార్థి సంఘం ఉండేది. స్కూలునుండి రాగానే ప్రతిదినం ఆసంఘ భవనంకు వెళ్ళుతూ పుస్తకాలు, పత్రికలు చదువుతూ, ప్రతి ఆదివారం జరుగు చర్చా సంఘంలో పాల్గొంటూ వుండేవాడు. ఆకాలంలో ఆయన స్వదేశీ వస్త్రాలు ధరిస్తూ పచ్చని పెద్ద తలపాగాతో బడికిపోతూ, తోటి విద్యార్థులతో రాజకీయ, సాంఘికవిషయాలు, బ్రహ్మసమాజపు సిద్ధాంతాలు ప్రసంగిస్తూ వుంటే ఆయన వేష భాషలనుచూచి మిత్రులు ఆయనను దేశాభిమానిగా గౌరవించేవారు. ఆకాలంలో విద్యార్థులు నేటివలె పత్రికలు చదివేవారుకారు. ఆయన నిత్యం పత్రికలు చదవటం తెలుగులోగల రాజకీయగ్రంథాలు చదవడంవల్ల విద్యార్థి దశలోనే ఆయనకు రాజకీయ పరిజ్ఞానం కల్గింది.

ఇల్లా పత్రికలు చదవటమేగాక, పలుసభలకు వాలంటీరుగాకూడా వెళ్ళేవాడు. 1916-4-21 లో గుడివాడలో జరిగిన కృష్ణామండల సభకు స్వచ్ఛంద సేవకుడుగా వెళ్ళాడు. మండలసభ అంటే కేవలం మండలసభేకాదు. దానిని పురస్కరించుకొని, పత్రికాధిపతులసభ, ఆస్తిక కమహాసభ సంఘ సంస్కరణసభ, విమ్నజాత్యుద్ధరణసభ, బ్రహ్మ హాజనసభ

# కమ్మ విద్యార్థి వసతి గృహ సభ్యులు

కుడినుండి కుర్చీలలో కూర్చున్నవారిలో ౨. కొల్లిపర సూరయ్య గారు ౩. కానూరి వెంకటచలపతయ్యగారు వారి వెనుక నిలబడిన వారిలో రెండవ వరుసలో 5. గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు (చేతులు కట్టుకున్న సౌమ్యమూర్తి( ౩వ వరుసలో 2. గ్రంథకర్త (టోపి)

చివరి వరుసలో రెండవవారు తలగుడ్డతో మన రైతు పెద్ద

మొదలగు సభలు కోలాహలంగా ఆరు రోజులు జరిగాయి. ఆ సభా సందర్భంలో పెద్దల నందరిని దర్శించడమే గాక, వారి వాగామృతమును గ్రోలి ఉత్సాహోత్తేజముల పొందుట గూడా జరిగింది. బందరులో జరిగిన ఆంధ్రవిద్యార్థి సభలో కూడా స్వచ్ఛంద సేవకుడుగా పనిజేసి ప్రశంసా పాత్రుడయ్యాడు.

ఈ విధంగా విద్యార్థి దశలోనుంచి, సూక్ష్మగ్రాహ్యత, ధారణ చురుకుగల్గి సేవా తత్పరతతో ప్రజా ఉద్యమాల్లో పాల్గొంటూ పెద్దల ప్రశంసలకు పాత్రుడయ్యారు. పువ్వు పుట్టగానే పరిమళం అబ్బుతుగదా !

"అరుణ రేఖలు ఉషోదయమును సూచించునట్లు
బాల్యము జీవిత భవితవ్యమును చూపును"

---

# ఇంట గెల్చి రచ్చ గెల్చుట

"ఆరయ నేడు, నీమహిత యత్నము చేతనే ఘంటశాలకున్
పేరు ప్రతిష్ఠ లబ్బెనుసుమీ సకలాంధ్ర జగత్తులోపలన్
వేరుగ పృచ్ఛసేయుదురు నిన్ను వడిమంచి నెల్లచోట్ల నీ
పేరున చెప్పుకుందు మతి ప్రేముడి, మేమును గౌరవాప్తికై."

—అ. గుర్నాధరావు.

ఘంటశాల చరిత్ర ప్రసిద్ధిగల గ్రామం. ప్రాచీన చరిత్రేగాక ఆధునిక చరిత్రకూడ ఉన్నది. ప్రాచీన ప్రఖ్యాతి గాంచిన కొన్ని గ్రామాలు నామరూపాలు లేక నశించినవి. కొన్ని నామ మాత్రావశిష్టముగ వున్నవి. ఘంటశాల అట్లాగాక, నాటినుంచి నేటికి ప్రసిద్ధి గాంచి యుండటం సలమహాత్మ్యమా ? స్వగ్రామాన్ని బ్రహ్మయ్యగారు తాంగ్రెసుకు పెట్టని కోటగా చేసిన సంగతి వివరించే ముందు, ఆ గ్రామ పరిచయం అవసరం.

ఘంటశాల 'కంటకసేల'గా బౌద్ధయుగమున ఖ్యాతి గాంచిన సంగతి చరిత్ర పరిచయమున్న వారందరికీ తెలిసిన విషయమే. చాళుక్య యుగాన చోళ పాండ్యపురమనే నామాంతరంతో చెన్నారింది.

జమీందారీ యుగంలోకూడా ఈ గ్రామం ఖ్యాతి గాంచింది. గొర్రెపాటి బాలక్రిష్ణమ్మగారు (1884-1906) జమీందారీ రైతు పోరాటాలలో నాయకత్వం వహించి రైతుల కష్ట నష్టాలను తీర్చాడు. ఈ యెస్టేటులో, వెట్టి చాకిరీ మాన్పించిన దాయనే. వర్చస్సుచేతను, వర్తనచేతనూ, విద్యచేతను ఆయన విఖ్యాతుడు. ఆయన పేరుతో ఈ గ్రామ ప్రతిష్ఠ పెరిగింది. ఆనాటినుండి ఈ గ్రామం నాయకత్వం వహించి పెక్కు రంగాలలో ప్రసిద్ధి గాంచింది.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క గ్రామానికి ప్రసిద్ధి కల్గడం ఆ గ్రామాన్ని ఆదర్శంగా పెట్టుకొని తదితర

---

• దేశకవితా మండలిచే ప్రచురింపబడిన ఘంటశాల చరిత్ర చూడనగును.

గ్రామాలు నడవడం పెద్దలకు పరిచయ విషయమే. ఘంటశాల అట్టి ఆదర్శ గ్రామాల్లో ఒకటి.

బాలకృష్ణమ్మగారి అనంతరంకూడా అప్పటప్పటికి ఈ గ్రామంలో ప్రముఖులు పుట్టి ఈ గ్రామ పేరు ప్రతిష్ఠలు నిలుపుతూ వచ్చారు.

బ్రహ్మయ్యగారు ఆయనతోపాటు చదువుకొన్న మరి కొందరు యువకులు ఈ గ్రామంలో ఆయనవలెనే విద్య మాని, గ్రామంలోవుంటూ గ్రామసేవతోపాటు దేశ హితైక కార్యాలుకూడా చేస్తూవుండిరి. 1917 లో ఈ ప్రాంతంలో కాంగ్రెసు-లీగు స్కీము, సంతకాలు అధికంగా చేయించుటతో వారి రాజకీయ జీవితం ఆరంభమయ్యింది.

గ్రామ వ్యవహారాల్లో పాల్గొంటూ, దేవసేవచేయ జొచ్చారు. గ్రామంలోవుండే పార్టీలు అప్పటికే అంతరించినవి. ఈ యువకులు వృద్ధిలోకి రాగలరని, గ్రామానికి ప్రతిష్ఠ, ప్రయోజనము కలిగించగలరని, పెద్దలు వీరియందు ఆదరము, అభిమానము, వాత్సల్యము చూపుతూ, వీరిమాటలను,

---

♦ పట్టాభి సీతారామయ్యగారు, ఈ గ్రామం కాంగ్రెసు చందాకై వచ్చినప్పుడు, యిక్కడ జరిగిన సభలో సంగతి సందర్భాలన్ని గమనించి, "ఘంటశాలవారి మాటలోను మర్యాదలోను ఒక ప్రత్యేకత వున్నది. వారు వ్యక్తిగతంగా గాక సమిష్టిగా చందాలు యిస్తారు. ఇక్కడ ప్రాచీన పద్ధతిని, అరకలవెంట, మగ్గములవెంట బాడిశల వెంట చందాలు వసూలుచేస్తారు. మిగతా వారివద్ద, ఇలువరస వసూలుచేస్తారు. ఇట్టి పద్ధతి ఇతరత్రా అరుదు. ఇటిసిటి ఐకమత్యం వచ్చిన గాని మనకు స్వరాజ్యంరాదు". ఈ విధంగా ప్రశంసిస్తూ తమ జన్మభూమి పత్రికలో ఘంటశాలను గూర్చి పెద్ద వ్యాసం ప్రకటించారు.

మన్నించుచుండెడివారు. అందుచేత గ్రామస్థులందరికి ఈ బృందం మీద అభిమానం అధికంగా వుండేది. ఈ బృందంలోని వారందరు సమవయస్కులు, సమానవిద్యావంతులైనా, బ్రహ్మయ్యగారి శక్తి సామర్థ్యాలు ఈ యువజన బృందానికి నాయకునిగా చేసినవి.

గాంధిమహాత్ముడు అసహాయోద్యమం ఆరంభించాడు. దేశమంతటా నూతనచైతన్యం వెల్లివిరిసింది. కాని ప్రజలు ఎవరి కార్యాలు వారు చేసుకుంటూవుంటారు. ఆదర్శవంతమైన నాయకత్వముంటేగాని, ఉద్యమం జయప్రదం కాదు. ఈ సంగతినిగురించి పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఇట్లా ప్రవచించాడు. "సంఘంలో విప్లవాలు మార్పులూ నిరంతరమైన ప్రజా ఉద్యమాలవల్ల రావు. ప్రజల ఉద్రేకశక్తి కెరటాలవలె లేస్తూ, పడుతూవుంటుందని, జ్ఞప్తిలోవుంచుకోవాలి. సంఘంలో ఎక్కువమందికి తమదైనందిన వ్యక్తిజీవితపు అవసరాలను తీర్చుకోవడమే పరమార్థమౌతుంది. కొద్దిమంది ఆదర్శజీవులు పట్టుదలతో నిల్చి మార్గదర్శకులుగా పనిచేయడం ద్వారానే సంఘంలో పరివర్తనం కలుగుతుంది."

అట్టి ఆదర్శనాయకత్వం వహించి బ్రహ్మయ్యగారు ఈ గ్రామంలో కృషిచేసినందుననే, ఈ గ్రామంలోను పరిసర గ్రామాలలోను, కాంగ్రెసు ఉద్యమం వృద్ధిగాంచింది.

## ఎన్నికలు

1920 లో శాసనసభా ఎన్నికలు వచ్చినవి. కాంగ్రెస్ శాసనసభా బహిష్కారం ప్రకటించింది. అందు

వల్లనే కాళేశ్వరరావు, కానూరి వెంకటచలపతయ్య గార్ల వంటి కాంగ్రెసువాదులు తమ అభ్యర్థిత్వాలనువదులుకున్నారు. జస్టిసుపార్టీవారు కాంగ్రెసుపై కత్తిగట్టి ప్రభుత్వానికండగా నిలిచారు.

కాంగ్రెసు ఉద్యమ ప్రచారానికి దివి తాలూకా కాంగ్రెసుసభ 1920-10-10 న కానూరి కోదండరామయ్య గారి అధ్యక్షతక్రింద ఘంటశాలలో బ్రహ్మయ్యగారి కృషి ఫలితంగా జరిగింది.

తాలూకా అంతటినుండి వేలాదిజనం వచ్చారు. కొడాలి శివరామకృష్ణారావు, కానూరి వెంకటచలపతయ్య, చెరుకువాడ వేంకట నరసింహం మొదలైన ప్రముఖులు ఉపన్యాసాలిచ్చారు. ఈ సభతో ఈ తాలూకాలలో చైతన్యం అధికంగా కలిగింది. ఈ సభకు తాలూకా కాంగ్రెసు సభ అని పేరుపెట్టినా ఈ తాలూకాలోనే గాక, ఈ జిల్లా అంతట్లోను జరిగిన మొట్టమొదటి రాజకీయసభ. ఈ సభ దిగ్విజయంగా జరుగుటచేత ఆయన రాజకీయ జీవితానికి ఇది అధికంగా తోడ్పడింది.

ఈ సభతోనే తన కర్తవ్యం నేరవేరిందని తలచలేదు. తన యువజన మిత్రబృందంతో ఆనాడు తాలూకా అంతా సంచారం చేసి ప్రబోధించాడు.

చెరుకువాడ నరసింహం, ముట్నూరి కృష్ణారావు, భోగి నారాయణరావుగార్లు మొదలైన పెద్దలతో కలిసి కూడా ప్రచారం చేశాడు.

తాలూకా ప్రచారం పూర్తయింది. యెన్నికలు సమీపించాయి. ఇక ఘంటశాల పోలింగులో ఒక ఓటుకూడా పడకుండా చూడాలని ఏకదీక్షతో పని ప్రారంభించారు. అందు చేత పోలింగు ప్రదేశములోని ప్రతి గ్రామంలోను విరివిగా ప్రచారం ప్రారంభించారు. ఘంటశాలలో వీధివీధికి సభలు జేసి, విరివిగా ప్రబోధం కల్గించాడు.

రేపు ఉదయం యెన్నికలనగా ఆ రాత్రి, ఆ రోజులలో అధికంగా వుండే రామభజన సమాజముల నన్నిటిని సమావేశవర్చి, కోలాహలంగా వారిచే భజనలు చేయించి, అక్కడ పెద్దసభ ఒకటి యేర్పాటు చేయించి, మర్నాడు ఉదయం గ్రామస్థులందరు పనులుమాని, ఘంటశాల పోలింగులోని గ్రామాదులకు వెళ్ళి ఓటర్లు యెవరూ నోటుచేయకుండా చూడాలని ఈ గ్రామంలో పోలింగుదగ్గర, సుశిక్షితులవలె మెలిగే కొందరు వుండాలని ఇలా కాంగ్రెసు ఆదేశానుసారంగా పని చేసి గ్రామానికి, దేశానికి ప్రతిష్ఠ తేవలసిందని హెచ్చరించాడు. తదనుసారంగా కార్య విభజనకూడ జరిగింది.

ఆయన ఆదేశాన్ననుసరించి తెల్లవారేసరికి, ఘంటశాల పోలింగు ప్రదేశంలోని వివిధగ్రామాలకు, వుత్సాహవంతులైన యువజనులంతా వెళ్ళారు. ఓటర్లెవ్వరు పోలింగు స్టేషనుకు వెళ్ళకుండా అమిత ఉత్సాహ దీక్షలతో పనిచేశారు.

పోలింగు స్టేషనువద్ద బ్రహ్మయ్యగారు గ్రామంలోని కొందరు యువకులను, ప్రముఖులనుచేర్చుకొని వివిధగ్రామాల నుండి వచ్చిన గ్రామోద్యోగులను కాంగ్రెసు ఆజ్ఞలను మన్నించవలసినదిగా హెచ్చరించారు.

సాయంకాల మైనప్పటికి ఒక్క ఓటుకూడా రాలేదు. పోలింగు ఆఫీసర్లు ఆశ్చర్యచకితులై కూర్చున్నారు. గ్రామోద్యోగుల్లో కొందరికి ప్రభుత్వంవారి వల్ల తమ కేదైనా మాట వస్తుందేమో అని సందేహం కలిగింది. ఘంటశాల మున్సబుగారు గొర్రెపాటి వెంకటనరసింహంగారు తాను చెప్పిన విధంగా తదితరులుకూడా ప్రభుత్వంవారికి సంజాయిషీ చెప్ప వచ్చునవనీ, భయపడవలసిన అవసరం లేదని ధైర్యము చెప్పి వారి సంశయాలను బాపారు. దానిని కొడాలి మునసబుగారు తుమ్మల శీతారామయ్యగారు బలపర్చారు. అందువల్ల గ్రామోద్యోగులుకూడా ఒక్కమాటమీద నిలబడి నోటు చేయ నిరాకరించారు.

అన్ని పోలింగుల్లోను ఓట్లు ఇవ్వటం, ఘంటశాల పోలింగునుంచి ఖాళీపెట్టెలు పంపటం వల్ల, ఘంటశాల పేరు ఆంధ్రదేశ మందంతటా వ్యాప్తిగాంచింది.

1923 లో జరిగిన యెన్నికల సందర్భంలో వోట్లు యివ్వదలచినవారు యివ్వవచ్చునని కాంగ్రెసు తీర్మానించింది. కోవెలమూడి గోపాలకృష్ణయ్య, మూగంటి సీతయ్య, కాను మిల్లి సర్వారాయుడు, బొల్లిన నారాయణస్వామి నాయుడు,

---

* అట్లు ఖాళీపెట్టెలు పంపిన తర్వాత ఈ గ్రామ ప్రముఖులలో ఒకరగు దోనేపూడి వెంకట్రామయ్యగారు జిల్లాకోర్టునకు అసెసరుగా వెళ్ళగా, అయనవల్ల జిల్లాజడ్జిగారు గ్రామ సంగతి సందర్భాలు విని ఆశ్చర్యపడ్డారు. పబ్లికు ప్రాసిక్యూటరుగా వున్న కొడింబి హనుమంతరావు గారు ఆ గ్రామ సంగతి సందర్భము లన్నీ తమకు తెలుసునన, యీ ప్రాంతంలోకల్ల చైతన్యవంతమై ఐక్యమత్యముగా మెలంగు గ్రామమని ప్రశంసించారు.

పెనుమత్స పెద్దిరాజు, కోళందరెడ్డి, ప్రభృతులు అభ్యర్థులుగా నిలబడ్డారు. కమ్మవారిలో కొందరు పైన పేర్కొన్న నలుగురికి కమ్మవారికే వోట్లు ఇవ్వాలని ప్రచారం సాగించారు. బ్రహ్మయ్యగారు కులతత్వాలు పనికిరావని చెప్పుతూ కాంగ్రెసుకు సుముఖులైన జాతీయ వాదులగు పెనుమత్స పెద్దిరాజు, మాగంటి సీతయ్యగార్లకు విధిగా యివ్వాలని ప్రబోధిస్తూ, కమ్మసంఘీయుడై జస్టిసుపార్టీ సభ్యుడై లోగడ శాసనసభా సభ్యుడై కాంగ్రెసు సిద్ధాంతాలను ఖండించిన కోవెలమూడి వారికి ఓట్లు ఇవ్వరాదని హెచ్చరించారు.

1926 లో యెన్నికలు వచ్చినవి. కాంగ్రెసు తరఫున కాళేశ్వరరావు నూరయ్యగార్లు నిల్చారు. జస్టిసుపార్టీ తరఫున మీర్జాపురం రాజాగారు, అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య గారు నిల్చారు. కోళందరెడ్డిగారు స్వతంత్రంగా నిలబడ్డారు. మీర్జాపురం రాజాగారు తమ యేజంట్లద్వారా ఈ ప్రాంతంలో కొందరి ప్రముఖుల పేర్లు తమ మ్యానిఫెస్టోలో ఉదహరించారు. అట్లాగే కోళందరెడ్డిగారూ చేశారు. ఈ మ్యానిఫెస్టోలో ప్రకటించిన ప్రముఖుల పేర్లద్వారా తమ అభ్యర్థిత్వాన్ని బలపరచుకొని ఓట్లు సంపాదింప సమకట్టిరి. నిజానికి దానిలో ప్రకటింపబడిన ప్రముఖులలో కొంతమందికి దాని సంగతియే తెలియదు. అందులో కొంతమంది కాంగ్రెసుకు అనుకూలురు కొంతమంది ప్రముఖులకు ఆ అభ్యర్థులకూ యేమీ సంబంధము లేదు. ఇట్టి స్థితిలో ఇందులోని మోసాన్ని బ్రహ్మయ్యగారు గ్రహించి ఆయా ప్రముఖులను సందర్శించి విచారించగా

అందులో చాలమంది తమ కసలా సంగతే తెలియదని, తాము కాంగ్రెసుకు అనుకూలమని తెల్పారు. అంతట బ్రహ్మయ్యగారు జిల్లా అంతటా సంచారము చేసి ఆ మ్యాని ఫెస్టోలోని ప్రముఖుల నిజమైన ఉద్దేశాలనుగురించి దాని లోని బూటకాన్నిగూర్చి ఆయా ప్రముఖులవద్ద స్టేటుమెంట్లు తీసుకొని పత్రికల్లో ప్రకటించారు. ఇంకా ఆయా అభ్యర్థులకు రిజస్టరీ నోటీసులనుకూడా పెట్టించారు. జిల్లా అంతటా సంచారం గావించి కాంగ్రెసుఅభ్యర్థులైన నూరయ్య కాశీశ్వరరావుగార్ల అభ్యర్థిత్వాలను బలపరుస్తూ ప్రచారము గావించి ఘంటశాల పోలింగులో ఓట్లన్ని కాంగ్రెసు అభ్యర్థు లకే ఇప్పించారు.

ఘంటశాలలో తనకు ఒక ఓటుకూడ పడకపోవటమేగాక ఈ గ్రామ పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగు వేమూరి వెంకయ్య గారిచే తన సంతకాన్ని ఉపయోగించుకో వద్దని మిర్జాపురం రాజాగారికి నోటీసు ఇప్పించుటచేత ఈగ్రామంలో గ్రామత్యా కంట్రాక్టు తీసుకొని త్రవ్వించిన చెరువు పని మొత్తం రు 2700 లు ఇవ్వకుండా చేశారు. బ్రహ్మయ్యగారు 1927 లో తాలూకాబోర్డు అధ్యక్షత వహించిన తర్వాత ఆ సొమ్మును యిప్పించారు.

## పంచాయతీసభ

కాంగ్రెసు సందేశానుసారం ఓట్లు సంపాదించడంతోనే తన కర్తవ్యం తీరిందని తలచలేదు బ్రహ్మయగారు. కాంగ్రెసు కోర్టులనుకూడా బహిష్కరించింది. గనుక గ్రామం నుండి యే వ్యవహారం కోర్టుకు పోగూడదని తలచారు. అంతట

గ్రామంలో వున్న పెద్దలను ముందు కలుసుకొని వారితో సంప్రదించి ఒక పంచాయితీ సభను యేర్పాటు చేశారు. ఈ సభలో హరిజనులలోను అన్ని వర్గాలలోను పంచాయితీ చెప్పటకు అర్హులగు నూరుగురు వ్యక్తుల పేర్లుగల పట్టీ ఒకటి తయారు చేశారు.

గ్రామంలో యేదైనా తగాదావస్తే ఇరుపక్షాల వారు చెరొక మధ్యవర్తిని, ఆ మధ్యవర్తు లిద్దరూ కలసి మరొక పెద్దమనిషిని, ఎన్నుకోనడం ద్వారా వ్యవహారాలన్నీ పరిష్కారం జరుగుతూండేవి.

ఈ పంచాయితీ సభ 12-12-1921 లో యేర్పాటు గాబడి చాలాకాలం వరకు గ్రామంలోని సివిల్ క్రిమినల్ వ్యవహారాలు పరిష్కరిస్తూ ప్రఖ్యాతి గాంచింది.*

## మద్యపాన నిషేధం

మద్యపాన నిషేధం విషయంలోకూడ చాలా కృషి చేశాడు. 1921 లో తాటిగెలల నన్నింటిని నరికించి

* ఈ పంచాయితీ సభ బాగా పనిచేస్తువ్నందున పోలీసు సర్కిల్ యిన్స్పెక్టరు వెంకటప్పయ్య నాయుడుగారు 1923 లో చల్లపల్లి క్యాంపు నకు దీని కధ్యక్షుడైన గొర్రెపాటి వెంకయ్యగారిని ఈ సభాస్థాపకులయిన బ్రహ్మయ్యగారిని పిలిపించారు. అంతట ఆయనగారు క్రిమినల్ కేసులు రాకుండా చేస్తున్నారు. "మీ పంచాయితీకోర్టు యెక్కడ" అని ప్రశ్నించాడు. దానికి బదులుగా బ్రహ్మయ్యగారు "మా వ్యవహారాలన్నీ చెట్ల క్రిందనే పరిష్కారం చేసుకుంటున్నాము. సివిలో, క్రిమినలో, మా వ్యవహారాలు మేము పరిష్కారం చేసుకోవడం తప్పా" అన్నాడు. సర్కిల్ యిన్స్పెక్టరుగారి బెదిరింపులకు బ్రహ్మయ్యగారు లొంగనందున ఆయన పైవారి సమాధానంకోసం యేదో రిపోర్టువ్రాసి పంపారట.

తాళ్ళు గీతకు వీలులేకుండా చేశారు. 1922 లో ఈయన కృషి ఫలితంగా అబ్కారీ దుకాణం పాడినవారే లేకపోయారు. తర్వాతకూడా ఈ గ్రామస్థులు చెట్లు గీత కివ్వనందునను, పాటదార్లు పాడనందునను, ప్రభుత్వం పరాయి గ్రామస్థులను ప్రోత్సహించి పాడించింది.

ఆ పాటదార్లకు గ్రామంలో గీతకు చెట్లు దొరకలేదు. చుట్టుపట్ల గ్రామాలలో గీతగీసుకొని యిక్కడ దుకాణం పెట్టగా కాంగ్రెసు వాలంటీర్లను ప్రోత్సహించి పికెటింగు చేయించారు. పికెటింగు చేస్తున్న వాలంటీర్లను ప్రథమంలో లాటీఛార్జి చేశారు. లాటీఛార్జి అనంతరంకూడా పికెటింగు మాననందున వారిని అరెస్టుచేయడం జరిగింది. అనంతరం ఈ గ్రామంలో ఈ విషయమై పట్టుదల ఉద్రేకం పెరిగి, ఉన్నత కుటుంబాలకు చెంది, యేనాడను ఇల్లు బయలు వెడలని మహిళామణులుకూడా దుకాణం ఎదురుగా నిలబడి పట్టుదలతో నెలరోజులు పికెటింగు జరిపారు. దుకాణము కట్టివేయవలసిన స్థితి యేర్పడింది. అంతట పోలీసువారు స్త్రీలనుకూడా అరెస్టు గావించి జైలుకంపారు.

## పన్నుల ఆపుదల

1921లో కాంగ్రెసు పన్నులను ఇవ్వవద్దని ఆదేశించింది. ఆ ఆదేశానుసారం, ఈ గ్రామస్థులెవ్వరు పన్ను నుచెల్లించ లేదు. ఉద్యోగులు, మాగాణికి నీరు యివ్వమని, భూములను జప్తుచేస్తామని బెదిరించారు.

అయినా రైతులు పట్టువిడువలేదు. కాంగ్రెసు ఆజ్ఞాపించిన తర్వాతనే పన్నుల నిచ్చారు.

## ఖద్దరు

ఖద్దరు వృత్తిలోను ఘంటశాల ఉన్నతస్థానాన్ని వహించింది. 1924 ఆగస్టు 10 వ తారీఖున బ్రహ్మయ్యగారు తమ మిత్రుల సాయంతో పదివేల రూపాయల పెట్టుబడితో దేశోద్ధారక నాగేశ్వరరావు ఖద్దరు సంఘం స్థాపించి, ఖద్దరు పరిశ్రమకు తోడ్పడ్డారు. ఈ గ్రామంలో ఇంటింటా రెండు మూడు రాట్నాలుండేవి. ఈ సంఘం అఖిలభారత చరఖా సంఘం వారిక్కడ శాఖను స్థాపించేవరకు సక్రమంగా పని చేసింది. ఘంటశాల ఖద్దరు, మన్నికలో మంచి నాణ్యమైనదని ప్రసిద్ధిగాంచింది. బొంబాయి, గుజరాతు, ప్రముఖులు ఘంటశాల ఖద్దరు కొని తెప్పించుకొనేవారు.

## మహాత్ముని మన్నన

1929 లో గాంధిమహాత్ముడు ఖద్దరు నిధికై ఆంధ్రదేశం సంచారం చేయుచున్నారు. కృష్ణాజిల్లా వచ్చినప్పుడు బ్రహ్మయ్యగారు, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య గార్లతో కలసి మహాత్ముని సంచార కార్యక్రమంలో పాల్గొన్నారు

20-4-1929 న గాంధిమహాత్ముడు ఖద్దరు నిధికై ఘంటశాల వచ్చినప్పుడు ఘోటకంలో ఒక గొప్ప సభ జరిగింది. ఆ సభలో ప్రథమశ్రేణిలో స్త్రీలు కూర్చుండి రాట్నాలు వడకుతున్నారు. మహాత్ముడు వచ్చినను అలజడిలేక నిశ్శబ్దముగ

యెక్కడి వారక్కడ సుశిక్షితులవలె ఉండుట చూచి, ముఖ్యంగా ఆయన తన పావుగంట కార్యక్రమమును ఒక గంటవరకు పొడిగించి ఇక్కడ క్రమశిక్షణను, కార్యక్రమములను మెచ్చుకొన్నారు.

మహాత్ముడు వచ్చేసరికి చుట్టూ వీధులుతీర్చి వాసాలు పాతి, క్రమశిక్షణపొందిన అనేకమంది వాలంటీర్లు నిలబడి ప్రజలను అదుపులో వుంచుతున్నారు. మహాత్ముడు కాంగ్రెసు యూనిఫారంగల ఈ వాలంటీర్లలను చూస్తూనే 'Is this your national army' 'ఇది మీ జాతీయ సైన్యమా' అని ఉగ్గడించాడు.

మహాత్ముడు ఈ సభలో హిందూధర్మమూ బ్రాహ్మణులు అనే శీర్షికతో ఒక గంట ఉపన్యసించాడు. టైము అయిపోయిందని బ్రహ్మయ్యగారు డాక్టరు పట్టాభిగారితో చెప్పగా వారు, మహాత్మునికి మనవిచేశారు. నాదగ్గరా గడియారమున్నదని చమత్కారంగా అంటూ గడియారాన్ని చూపించి, మరికొంతకాలం ఉపన్యసించారు.

---

• బ్రహ్మయ్యగారు మహాత్ముని కారులోవుండి కార్యక్రమం నడుపుచుండెను. మహాత్ముడు ఘంటసాలకు రాగానే యిక్కడ నాకు కొన్ని నిమిషములు వుండవలసినదని మనవిచేసెను. "ఇది నీగ్రామమా" అని మహాత్ముడనెను. "నా గ్రామమనిగాదు. ఈ గ్రామం ఈ జిల్లా కాంగ్రెసు కార్యక్రమంలో అన్నివిధముల ప్రఖ్యాతిమైన పెద్ద గ్రామం. ఇది సెంటరు. వివిధ గ్రామాలనుండి విశేషజనం వస్తారు. కనుక కోరుచున్నానని" ఆయన అనెను. అంతట "నీవు చెప్పిన చొప్పున వున్నచో అప్పటి పరిస్థితినిబట్టి ఆలోచించెద"నని మహాత్ముడు బ్రహ్మయ్యగారితో అనెను.

చుట్టుపట్లనుండి విశేషజనం రావటమేగాక వివిధ గ్రామాలవారు ఇక్కడ మహాత్ముని కానుకలిచ్చారు. స్త్రీలు అనేకులు తమ ఆభరణాలను అర్పించారు.

## హరిజన దేవాలయ ప్రవేశం

అస్పృశ్యతా నివారణోద్యమంలో కూడా ఆయన అత్యధిక కృషి చేశాడు. ఈ గ్రామంలో మార్గశిరశుద్ధ షష్ఠికి సుబ్రహ్మణ్యస్వామికి గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఆ వుత్సవ సమయమున హరిజనులతోబాటు సన్నులుగూడా ఈగ్రామంలో గుడి బయటనే పూజచేశారు.

ఈ విధంగా ఆంధ్రదేశంలో అందరూ చేసిన హరిజన దేవాలయప్రవేశం అనతికాలంలో జరుగగలదని ఘంటశాల వారిని ఆదర్శప్రాయంగా యోచుకొని కృషిచేయవలసిందని 1932 డిశంబరులో ఆంధ్రపత్రిక సంపాదకీయం వ్రాసి ప్రశంసించింది

1933 లో బ్రహ్మయ్యగారు కారాగృహంనుండి విడుదలైన తర్వాత గ్రామంలో (ప్లెబిసైట్) ప్రజాభిప్రాయాన్ని తీసుకొన్నారు. ప్రజలలో నూటికి 90 మంది దీనికి సుముఖులుగా ఉన్నారు. అందుచేత ఆ సంవత్సరము షష్ఠి ఉత్సవానికి హరిజన దేవాలయ ప్రవేశం అతి వైభవంగా జరిగింది. నాటి నుండి ఈ గ్రామంలో అస్పృశ్యతాదోషం అడుగంటింది.

## దీ పా వ ళి

మనం బానిసలంగా వుండుటేగాక విదేశ దీపావళి బాణసంచాను మానవలసిందని మహాత్ముడు ప్రబోధించాడు. ఆ సందేశానుసారం బ్రహ్మయ్యగారు అధికకృషి చేసి, తదాది చాల సంవత్సరముల వరకు బాణసంచాను కాల్చుటను మాన్పించారు.

## సం క్రాం తి కా ర్య క్ర మం

ఆంధ్రదేశములో సంక్రాంతికి ప్రతి గ్రామంలోను కోడి పందాలు వేయడం, జూదాలు ఆడటం అనే ఆచారాలు అనుశ్రుతంగా వస్తూన్నవి. ఈ గ్రామంలో విశాలమైన ఘోటకంలోనికి వివిధ గ్రామాలనుండి విశేష జనం వచ్చి ఆ పండుగ నాలుగురోజులు కోడిపందాలు వేయడం, జూదాలు ఆడటం జరిగేవి. అసహాయోద్యమం ఉధృతంగావున్న ఆ కాలంలో ప్రచార ప్రబోధాల ద్వారా బ్రహ్మయ్యగారు దానిని రూపు మాపారు.

ఇట్లా అనేకవిధాల కృషిచేసి, ఘంటశాలను ఒక ఆదర్శవంతమైన గ్రామంగాచేసి తననాటి యువకులకు మార్గదర్శకులైరి. *

అందువల్లనే ఆయనయెడల గ్రామవాసులకు విశేష ఆదరాభిమానాలు. ఆయన 1942 లో డిటెన్యూగా తీసు

* గ్రామస్థులను ప్రజ్వలింపచేయగల స్వాతంత్ర్యభావాల ఆయనలో మూర్తీభవించుట చేతను టీమ్ స్పిరిట్‌తో పనిచేయు సహచరబృంద ముండుటచేతను ఆనాడు ఆ కార్యములు చేయగలిగాడు.

కొని పోబడి 1944 డిశంబరు 9న విడుదలైనప్పుడు గ్రామంలోని ఆబాల గోపాలం ఆయనను వైభవంగా ఊరేగించి గొప్ప సభ గావించి సన్మానించారు.

"ఎన్నడువచ్చునో మదినెన్నడు సంతసముప్ప ఘటించునో
యెన్నడు కన్నులున్న ఫల మింపొంద నింగనుజూడనేర్తుమో
సన్నుతశీల నిన్నని విచారభరమ్మున గ్రుంగియు [illegible]గా
కన్నగరాని మార్గము లభించెను తావక దర్శనమ్ముచే".

ఆయనయెడల గ్రామస్థులకుగల అభిమాన గౌరవాలు అయినపూడి గురునాథరావుగారు ఆయన జైలునుండి విడుదలయినప్పుడు చెప్పిన పై పద్యం సూచించును.

---

## గ్రామ సేవ

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

"Breaths there the man with Soul so dead
Who never himself hath said
This is my own my Native Land."

— Sir Walter Scot.

మనకు జన్మస్థలాభిమాన మున్నమాట వాస్తవం. మనకేకాదు. అనాగరికులైన ఆటవికుని మొదలు అత్యున్నత నాగరికుల వరకు ఇది స్వాభావ సిద్ధమైన గుణం. కాని స్థలాభిమానం సంకుచితం కాగూడదు. అది దేశాభిమానాన్ని మించరాదు.

అలాగే జాతీయాభిమానం, అంతర్జాతీయాభిమానా నికి అడ్డురారాదు. అంతర్జాతీయత అంటూ జాతీయతను విడువరాదు.

అట్లాగే దేశసేవ చేస్తున్నామని తలంచి, స్వగ్రామ సేవను విస్మరించరాదు.

ఇవన్నీ పరస్పర ద్రోహద కారణము లైనప్పుడే మానవాభివృద్ధికి, ప్రపంచ శాంతికిని కారణ భూతములు కాగలవు.

బ్రహ్మయ్యగారు ఈ సంగతి సందర్భాలన్నీ గమనించిం వాడగుటచేతనే దేశసేవతో బాటు గ్రామసేవకూడా చేశాడు.

ఆయన చదువు పూర్తిచేసి గ్రామంలో ప్రవేశించిన తర్వాత ఐకమత్యం కొరకు కృషిచేస్తూ, గ్రామంలో జరిగే ప్రతి సాముదాయక కార్యంలోనూ పాల్గొంటూ ప్రముఖ పాత్ర వహించాడు.

సమిష్టి సత్కార్యాలకు చందాలు వసూలుచేయటం, ఖర్చుచేయటం, మొట్టమొదటగా మొదలిడిన దాయనే.

ప్రతి గ్రామంలోను రైతు లన్ని వస్తువులు కొలు స్తూంటారు. ఆ కొలిచే మనిషి గ్రామ సమష్టికి పుట్టి కింత యని కొంత మొత్తం ఇస్తూంటాడు. దీనినే కొలగార మంటారు.

ఈ కొలగారానికి ప్రజాస్వామ్య పద్ధతుల ప్రకారం ఒక కమిటీని యెన్నుకొనే పద్ధతి యేర్పాటుచేసి, దాని ద్వారా గ్రామానికి సంబంధించిన దానధర్మాలు, రోడ్డు మరమ్మత్తులు,

ఇతర ఉపయోగాలు, సక్రమంగా జరగేట్లు యేర్పాటు చేశాడు.

ఘంటశాలకు మూడు వైపులా, గంజి కాలువ, గుండేరు, అనే మురుగు కాలవ లున్నవి. తెల్లవారి లేస్తే ప్రతిరోజూ పశువులు, మనుష్యులు ఆ కాలవలు దాటి వెళ్ళాలి. అవి బురద బాడితో నిండి వుంటవి. అందుచేత రైతులు, పశువులు, యమయాతన పడాలి నిత్యం.

ఈ భాధ నివారణకు బ్రహ్మయ్యగారి తండ్రిగారు, అరువదేండ్ల క్రిందనే ఆందోళన సాగించిన సంగతి పాఠకులకు పరిచయమే. ఆ అర్జీలవలన ప్రయోజనం కలుగలేదు. బ్రహ్మయ్యగారి కృషి ఫలితంగా రెండు చప్టా లేర్పడ్డవి. తండ్రి తల పెట్టిన పనులు తనయుడు సాధించాడు. ఈ చప్టాల మరమ్మతులను కూడా తర్వాత చేయించాడు.

ఈ గ్రామంలో పంచాయితీ బోర్డు 19-4-19˘8 లో యేర్పడింది. దీనికి వేమూరి వెంకయ్యగారు వరుసగా 16 సం॥లు ప్రెసిడెంటుగా ఉండుటచేత 'చయిర్మన్' అని ఖ్యాతి గాంచాడు.

బ్రహ్మయ్యగారి పంచాయితీ బోర్డులో 192˙-1926 వరకు సభ్యుడుగా వున్నాడు. ఆయన సభ్యత్వం వహించిన తర్వాత గుమాస్తాను తీసివేయించాడు. ఆఫీసు ఆయన ఇంట్లో వుండటంవల్ల ఆఫీసుకు సంబంధించిన పనంతా ఆయనే చూచే వాడు. ఇంటిపన్ను యువకు లగు ఇతర సభ్యులు వసూలు చేసే టట్లు ఏర్పాటు చేశాడు.

ఈ విధంగా బోర్డు ఖర్చును తగ్గించుటేగాక ప్రతి పైసా ప్రజలకు ఉపయోగపడుటకు అధికంగా తోడ్పడ్డాడు.

ఘంటశాల, ఘంటశాలపాలెం, ఈ పంచాయితీలో కలసివుండేవి. 1934 వరకు ప్రశాంతంగా వున్న బోర్డు కలహాలకు ఆకరమైంది. అవి చివరకు ఘంటశాల – పాలెం తగాదాలుగా పెరిగిపోయినవి పాలెంవారికి ప్రథమంనుంచి పంచాయతీబోర్డు నందు అయిష్టమే. ఈసంగతి సందర్భములన్నీ గ్రహించి పంచాయితీబోర్డు ప్రశాంతంగా వుండగలందులకు పాలాన్ని ఇందులోనుండి తొలగింప చేయించారు.

గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు ఈ గ్రామంలో 19 ;3 లో "శ్రీరామమోహన పుస్తకభాండాగార"మను పేరుతో ఒక భాండాగారాన్ని యేర్పరచాడు.

ఆయన కీర్తిశేషుడైన తరువాత ఇది అంతరించకుండా చూచుటేగాక అధ్యక్షుడుగా, కార్యదర్శిగా వుండి దీని అభివృద్ధికై యెంతో కృషిజేశాడు. నాడు మూడు పుస్తకాలతో స్థాపింపబడిన గ్రంథాలయం నేడు మూడువేల గ్రంథాలతో రాజిల్లుతూ ప్రతి సంవత్సరం ప్రభుత్వంవారి గ్రాంటు పొందుతూ వృద్ధిచెందుట ఆయన చలవే.

---

♦ ఈ భాండాగారమునకు ప్రథమదశలో, ఈ గ్రామ ఉపాధ్యాయులు అధికంగా అన్నివిధాలా సహాయపడ్డారు. ఆయనకు వారితోగల సాహచర్యంవల్ల వారి కష్టసుఖాలు అనుభవమైనవి. ఆ ఉపాధ్యాయుల యెడల ప్రేమే ఉపాధ్యాయ వర్గం యెడల ప్రేమగా పరిణమించినది. అందువల్లనే అవకాశం చిక్కినప్పుడల్లా ఉపాధ్యాయుల కష్టనివారణకు కృషిచేయుట ఆయనకు పరిపాటి.

గ్రామప్రజల, ఆరోగ్య, నైతిక, విద్యాభివృద్ధులకు గాను, ది 2-12-1925 న గ్రామసంఘం బ్రహ్మయ్యగారిచే స్థాపించబడింది. గ్రామానికి సంబంధించిన సమస్త వ్యవహారాలు దీని ద్వారానే జరుపుట ఆచారము. దీనికి కార్యదర్శిగాను అధ్యక్షుడుగాను వుండి గ్రామాభివృద్ధికై పాటుబడ్డాడు.

ఈ గ్రామ ప్రముఖులగు వేమూరి రత్నయ్యగారి కృషి ఫలితంగా 19-12-1919 న పరపతి సంఘం స్థాపించబడింది. ఆయన పెద్దవాడగుటచేత బహు కార్యనిమగ్నుడగుటచేత, గ్రామశ్రేయోభిలాషులగు బ్రహ్మయ్యగారికి ఆయన దీనిని అప్పగించారు. ఈ సంఘాన్ని వృద్ధిజేసి, బీదరైతులకు అప్పుల నిచ్చుటద్వారా తోడ్పడ్డారు. దీనివల్ల కలిగే ఆర్థికప్రయోజ నాన్ని భాండాగారానికి వినియోగం చేశారు.

పూర్వం ప్రతిగ్రామానికి పశుగ్రాసభూమి వుండేది. దానిని ఘోటకం అని పిల్చేవారు. కాని దానిపేరు గోటకం గో=గోవులు, అటకం=సంచరించేభూమి, అని దాని అర్థం. ఇతర సాముదాయక భూములన్నీ జమీందారులు హరించేనట్లే ఈఘోటకాలనుకూడా ప్రతిగ్రామంలోనూ హరించారు.

ఘంటశాల గోటకం 270 యకరాలభూమి. దీనిని బ్రహ్మయ్యగారి తండ్రిగారి కాలంలో జమీందారు స్వాధీనం చేసుకోవాలని, ప్రయత్నించడం, ఆయన అడ్డుతగలడం, — ఆ విధంగా నిలిచిపోవడం పాఠకులకు తెలిసినదే.

ఘంటశాల ఏకమత్యంగా ఉన్నంతవరకు ఈ ఘోటకం సంగతి యెత్తలేదు జమీందారు. 1934 సం॥ లో గ్రామములో కల్లలు యేర్పడ్డవి. ఆ సందుజూచి జవాల వెంకటేశంగారనే దివాను "అనాది బంజరై, యెస్టేటువారికి సంపూర్ణ హక్కు భుక్తములు కలిగి వారి కావలాలో వున్న భూమిలో యెస్టేటు వారి పర్మిషన్ లేకుండా పశువులను తోలినందుకు 200-0-0 లు నష్టపరిహారం ఇవ్వాలని యెడల కోర్టుద్వారా రాబట్టుకొందుము"ని 1934-12-4 వ తారీఖున ఘంటశాల పాలెంలోని 45 మంది పెద్దలకు లాయరు నోటీసులు యిప్పించారు.

బహ్మయ్యగారి కృషి ఫలితంగా, గ్రామ ప్రముఖు లంతా ఈ విషయంలో ఏకీభవించారు. లోగడ ఈ ఘోటకం కేసుల్లో ధర్మచింతతో పనిచేయుటమేగాక, దీని సంరక్షణకై 1921 లో ఘోటకసంఘం స్థాపించిన వకీలు వల్లూరి సూర్య నారాయణరావుగారి ద్వారా యీ 45 గురు సభ్యుల ఆమోదంతో ఒక్క గ్రామసంఘ అధ్యక్షుని చేతనే ఘోటకం గ్రామ స్థులదిగాని జమీందారు కెట్టి సంబంధం లేదని నోటీసు ఇప్పించాడు. ఈ సమాధానంవల్ల గ్రామస్థులు ఏకమత్యంగా ఉన్నారని గ్రహించి కోర్టు వ్యవహారాలనుండి విరమించారు జమీందారు.

అట్లా జమీందారు ఆక్రమించకుండా కాపాడమేకాక, అక్కడక్కడా రైతు లాక్రమించుకొన్న దానిని కూడా, ఆయన గ్రామసంఘ అధ్యక్షత వహించిన తర్వాత ఆక్రమణ తీసివేయించి, చుట్టూ సరిహద్దు దిమ్మలను 1945 లో కట్టించారు.

ఆయన అధ్యక్ష కాలంలోనే ఈఘోటకం నుంచి పది యకరాల భూమి హైస్కూలుకు, మరొక 13½ యకరాలు రోడ్డుకు యిప్పించి గ్రామ సౌభాగ్యానికి సాయపడ్డారు.

ఘంటశాల చాలా పెద్ద గ్రామం. 19 వేల వ్రాళ్ళలో సాయకారీ భూములున్నా రైతు వత్తిడి అధికం. చిలకలపూడి అనే గ్రామం ఘంటశాలకు ఒక మైలు. ఆ భూమిలో అధికభాగం ఘంటశాల రైతులదే. అది వల్లపు ప్రదేశ మగుటచేత మెరక పైర్లకు అంతగా ఉపయోగించనందున వల్లపు సాగు చేయుటకు చాలాకాలంగా కృషిచేస్తున్నారు. కాని ఫలించ లేదు. ఈ విషయంలో దోనేపూడి వెంకట్రామయ్యగారు ఆయన కుమారుడు సీతారామయ్యగారు పడినపాట్లు భగవంతునికే యెరుక. మిత్రుడు సీతారామయ్యగారి కోర్కెపై బ్రహ్మయ్యగారి వ్యవహారంలో ప్రవేశించి తగు కృషిచేసి వల్లపు సాగుకు పర్మిషను సంపాదించి రైతాంగానికి తోడ్పడుట తోపాటు అధికోత్పత్తికి కూడా తోడ్పడ్డారు.

దివి తాలూకా విద్యావంతమైన తాలూకా కాదు. ఇదివరకు ఈ తాలూకాలో రెండే హైస్కూళ్ళు. ఇటీవల మరికొన్ని హైస్కూళ్ళు నెలకొల్పబడ్డవి.

బ్రహ్మయ్యగారి కృషి ఫలితంగా గ్రామస్థులు 10 యకరముల భూమి 10 వేల రూపాయలు యిచ్చే పద్ధతిని 1946-8-21 న ఘంటశాలలో మాధ్యమిక పాఠశాల యేర్పడింది. అది మరు సంవత్సరం హైస్కూలుగా అంగీకరింపబడుటేగాక, ఆయన కృషిఫలితంగా, ఘోటకంలో లక్ష రూపాయిలతో గొప్ప బిల్డింగు జిల్లాబోర్డువారు కట్ట ఏర్పాటు



బ్రహ్మయ్యగారు: కొందరు సహచరులతో

కూర్చున్నవారు ఎడమునుండి:— రచయిత, మన రైతుపెద్ద, దోనేపూడి సీతారామయ్య, వైస్‌చైర్మన్ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య.

నిలుచున్నది:— బ్రహ్మయ్యగారి కుమారుడు వీర రాఘవేంద్రరావు, మనుమడు రామకృష్ణ ప్రసాద్.

గావించారు. ఉత్తరోత్తరా దీన్ని వ్యవసాయ కళాశాలగా మార్పించాలని మన రైతుపెద్ద సంకల్పం.

ఈ బిల్డింగుకు గ్రాంటు నిచ్చుటలో చంద్రమౌళిగారు స్మరణీయులు.

ఘంటశాల పెద్దగ్రామమైనా, కాంగ్రెసు గ్రామసంఘాల చేత, స్థానిక సంస్థలకు అధ్యక్షులుగా వున్న జస్టిసుపార్టీ వారు దీని కెట్టి సౌకర్యమూ కలిగించ లేదు.

ఈ గ్రామం మూడు వైపులా కాలువలు వుండి యెట్టి రహదారి సౌకర్యమూ లేకపోవుటచేత, ఒక దీవివలెనుండి యితర ప్రపంచంతో సంబంధంలేకుండా వున్నది. బ్రహ్మయ్యగారి కృషిఫలితంగా కొడాలినుండి ఘంటశాలకు మూడుమైళ్ళగల కంకరరోడ్డు వేయించారు. ◆

కంకరరోడ్డుకు 3½ లక్షలు అయినది. దీనికీ చంద్రమౌళి గారి సహాయమే.

ఈస్టుబ్యాంకి కెనాలు యేర్పడిన తర్వాత దివితాలూకా యావత్తు యిటీవల పల్లపుసాగు క్రిందికి వచ్చింది. కొడాలి, కొత్తపల్లి, తాడేపల్లి, ఘంటశాల గ్రామాదులు మాత్రమే మెరక గ్రామాలుగా వున్నవి. ఈ గ్రామాలచుట్టూ గుండేరు వుండుటచేత, గుండేరుముంపువల్ల, మెరకపైరులు అధికంగా నష్టపడుచున్నవి. అందుచేత రైతులకోరిక ననుసరించి యీ

◆ బోర్డుకు సంబంధించిన పనులన్ని ఆ నాటి చట్టాలు ఈ నాటి బిల్డింగు రోడ్డు పనులన్నికూడా, సక్రమంగా జరుగగలందులకు గాను గ్రామసమిష్టిచే కంట్రాక్టులు తీసుకొని పనిచేయుట ఆయన ప్రోత్సాహం వలననూ, పలుకుబడి వలననూ జరిగినవి.

భూములుకూడా యీస్టుబ్యాంకు కెనాలు క్రింద వల్ల వుపాయుకు తెచ్చాడు.

ఈ కాలవద్వారా 3400 యకరాలు సుక్షేత్రమైన మాగాణి అయింది. దీనికి శ్రీ లక్ష్మణ్ సంత్రి భక్తవత్సలం గారి సహాయము కొనియాడతగినది. 1951 లో పటకాల్వ లపై చిట్టూరు పోళ్ళపాడు ఘంటసాలపాడు వంతెనలు కట్టుటకు చిలకల పూడి పంటకాలువను సహాయము పట్టాడు.

దేశసేవతోపాటు యిట్లు గ్రామ శ్రేయాభివృద్ధికై కృషి చేయుటతో ఆయన పేరు ప్రతిష్టలతోపాటు గ్రామ ప్రతిష్ఠకూడా పెరిగింది.

ఇది కాంగ్రెసు గ్రామమని ప్రఖ్యాతి చెందుటచేత ఆయన ప్రభావం పలుకుబడివల్ల యుద్ధఫండుకై ఆఫీసర్లు పెట్టే బాధలు ఇతర ఆఫీసర్ల వల్ల కలిగే ఇబ్బందులు లేకుండా పోయినవి.

ఈవిధంగా గ్రామసేవ చేసి తన జన్మభూమి ఋణం విముక్తుడైనాడు బ్రహ్మయ్యగారు.

## ఎన్నికదావా

1923–26 మధ్యకాలంలో శాసనసభా ప్రవేశాన్ని గూర్చి కాంగ్రెసులో అనేక వాదోపవాదాలు జరిగినవి. 1925 లో జరిగిన కాన్పూరు కాంగ్రెసులో శాసనసభా ప్రవేశము అంగీకరింపబడినది. అందుచేత కృష్ణాజిల్లాకు కాంగ్రెసు

అధ్యక్షులుగా అయ్యదేవర కాళేశ్వరరావు, కొల్లిపర సూరయ్యగార్లు నిలిచారు.

కాంగ్రెసుకు సాయం చేస్తానని మొట్టమొదట వాగ్దానం చేసిన అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు తానే పెండ్లికొడుకయ్యాడు. మీర్జాపురం రాజాగారు జస్టిసుపార్టీ తరఫున నిల్చారు. కట్టమంచి కోదండరెడ్డిగారు స్వతంత్ర పక్షాన నిలిచారు.

సూరయ్యగారు "నీచేతను నాచేతను... అరయంగా నారుస్వరచేత కర్తుండీలైన్" అన్నట్లు మాటనలభై ఓట్ల తేడాతో ఓడారు.

కాళేశ్వరరావు, మీర్జాపురం రాజాగార్లు గెలిచారు.

ఆనాడు జమీందారులు ఆడినది ఆట పాడినది పాట. వారు రైతుల రక్తమాంసాలను హరించి, చట్టంద్వారా చట్టం చాటునా సంపాయించిన ధనంతో, మాంటుఫర్డు సంస్కరణల నాటినుండి రాజకీయ రంగాన్ని కలుషితం మొనర్చి ఓట్లను డబ్బుపెట్టి కొని ప్రజల జన్మహక్కులను సక్రమంగా చెలాయించుకోనీయక, ప్రజలను అవినీతుల జేసి ప్రజాస్థానాల నాక్రమించి తమ స్థానాలను బలపరచుకొని తమ స్వార్థంకై దేశ ప్రయోజనాన్ని బలిపెట్టుకొచ్చారు.

ఆవిధంగానే మీర్జాపురం రాజాగారు జిల్లాబోర్డు ప్రెసిడెంటుతో తృప్తినొందక, జమీందార్లకై ప్రత్యేకింపబడిన స్థానానికి నిలవక, ప్రజాస్థానానికై పోటీజేసి తన అధికారాన్ని దుర్వినియోగం చేయటమే గాక ధనం వెదజల్లి జయం

గాంచారు. రాజాగారికి 9,000 సింగిల్ ఓట్లు వచ్చుట దీనికి ప్రబల ప్రమాణం.

అక్రమంగా ప్రవర్తించినవారు జయం పొందటం, నీతి వర్తనుడగు సూరయ్యగారు అపజయం గాంచటం, ఆయన మిత్రులగు బ్రహ్మయ్య, కొండాలి ఆంజనేయులు, వేములపల్లి గోపాలరావుగార్లకు అమిత విచారం కలిగించింది.

సూరయ్యగారి అపజయం ఆశ్చర్యం కలిగించింది అందరకూ. ఈయెన్నికల్లో బ్రహ్మయ్యగారినే నిలవమన్నారు సూరయ్యగారితో సహా అందరూ. కాని బ్రహ్మయ్యగారు సూరయ్యగారు వుండుటే మంచిదని నచ్చజెప్పి, తన ప్రాణమిత్రుడగు సూరయ్య జయంతోపాటు కాశేశ్వరరావు జయాన్నికూడా అభిలషించి తన మాతృదేవత అవసానకాలంలో వున్న సమయంలో కూడా ఆమెకు సపర్యచేయటంకంటె మాతృదేశారాధనమే అధికంగా భావించి కృషిచేసినందున సూరయ్యగారి అపజయాని కాయన చాలా కృంగిపోయాడు.

ఇట్టి స్థితిలో కాంగ్రెసు ప్రముఖులగు పట్టాభి సీతారామయ్య, కృష్ణారావు, చెరుకువాడ నరసింహం, బ్రహ్మయ్యగార్లు ముందుసంగతి యేమిటని ఆలోచించసాగారు. అడుసుమిల్లివారి పార్టీకి చెందిన కొందరు ప్రముఖులుకూడా ఈ విషయంలో నేబందరు వచ్చారు.

ఆ సందర్భంలో జిల్లా కాంగ్రెసు ప్రముఖులంతా సంప్రదించుకొని మీర్జాపురం రాజాగారిని పడగొట్టడం మీ కర్తవ్యమని యెన్నికల సందర్భంలో ప్రకటించారు గదా! లంచాలతో ఆయన గెలిచినట్లు కావలసినంత సాక్ష్యముంది

అందుచేత ఆయనమీద మీరు వ్యవహారము జరిపితే మేము సహకారం చేస్తామని అనుసుమిల్లి వారితో బ్రహ్మయ్య గారన్నారు. మీరే వ్యవహరించండి. కొన్ని కారణాలవల్ల మేము వ్యవహరించ వీలులేదు. మేము తగిన సాయం చేస్తామని వారు వాగ్దానం చేశారు. అందుకు సమ్మతించి సరే నన్నారు బ్రహ్మయ్యగారు. 1927-1-5 మీర్జాపురం రాజా గారిపై పిటీషన్ పెట్టబడింది.

అప్పట్లో మీర్జాపూరు రాజాగారికి బద్ధవిరోధిగా వున్న చల్లపల్లి రాజాగారను అంకినీడుగారు పట్టాభి సీతారామయ్య గారిని రప్పించుకుని కావలసిన సహాయం చేస్తాము, వ్యవహరించ వలసిందని చెప్పారు.

రాజాగారు ఆర్థిక సహాయం చేయడానికి అండగా ఉన్నారు. పట్టాభిగారు పట్టుదలతో బాధ్యత వహించ పూను కొన్నారు. బ్రహ్మయ్యగారు, ఆయన మిత్రులు స్వర్గీయ బొబ్బా వెంకట శేషయ్యగారు పిటీషనర్లుగా నిలబడి వ్యవహ రించసాగారు. స్పెషల్ జడ్జి లక్ష్మణరావుగారు, బందరు వచ్చి విచారణ ఆరంభించారు. కాంగ్రెసు తరఫున పూనూరు తిరిగి అఫిడవిట్లు తెచ్చి దాఖలుచేశారు.

ఆదిలో సాయం చేస్తామని చెప్పిన అనుసుమిల్లి వారు సాయం చేయకపోగా మీర్జాపురం వారికి అండగా నిలబడి, పిటీషనర్ల తరఫున వచ్చిన సాక్షులను మొత్తక [illegible] తిరగ దీయడంకూడా సాగించారు. బ్రహ్మయ్యగారు ఆయన మిత్రులు కాంగ్రెసువారు [illegible] పడ్డారీ సందర్భంలో.

అప్పట్లో వార్తాపత్రికలన్నీ ఈ కేసు సంగతులతోనే నిండేవి. ఈ జిల్లాలోనేగాక ఆంధ్ర దేశమంతటా అలజడి కలిగించిం దీ దావా.

విచారణ పూర్తయింది. ఈ దావాలో వందలాది జనులు సాక్షులుగా విచారింపబడ్డారు. కేసు రుజువైనదను కున్నారందరు. మద్రాసుపోయి స్పెషల్ జడ్జిగారు రాజాగారి కనుకూలంగా తీర్పు చెప్పటంచూచి ప్రజలు విస్మితులైనారు.

జస్టిసుపార్టీ నాయకులగు పానుగల్లు రాజాగారి కోరికపై గవర్నరుగారు జోక్యం కలుగ జేసుకొన్నందున ఇట్లా జరిగిందని వదంతి వ్యాపించింది.

మీర్జాపురంవారికి యెన్నికల్లో అయిన అరవై వేలు గాక ఈ వ్యవహారంలో మరొక అరవై వేలయినవి. పిటీషనర్ల తరఫున అయిన 20 వేలు, అన్నమాట ప్రకారం అంకి నీడుగా రిచ్చారు.

ఈ తీర్పునకు ముందు మీర్జాపురంవారు అనేక యెత్తులు వేశారు. పిటీషనర్లను లోబరచుకొనుటకు సామ దాన భేద దండోపాయాలన్నీ వుపయోగించారు. బొబ్బా వెంకటశేషయ్య గారికి 15 వేల రూపాయలిస్తామని సంచులు పుచ్చుకొని తిరి గారు. ఆయన చేతులో చిల్లిగవ్వ లేకపోయినా ధనాన్ని కాలదన్ని "దేశాభిమాని" అని చెనుకువాడవారు పెట్టిన పేరును సార్థకం చేసుకున్నాడు. బ్రహ్మయ్యగారికికూడా 15 వేలు యిస్తామని రాయబారాలు జరిపారు. వచ్చినవారికి బుద్ధి జెప్పి పంపారు. పిటీషనర్ల తరఫున పనిజేస్తున్న ప్లీడరు భట్రాజు వెంకట్రాయుడుగారు, ధనలోభంతో మీర్జాపురం రాజాగారి

వైపు తిరిగిపోయాడు. ఈ రైతు బిడ్డలుకూడా అట్టివారేనని భ్రమించివుంటాడు జమిందారు.

పిటీషనర్లపై వేసిన పాచికలు పారనందున పట్టాభిగారిపై వారి దృష్టి పడింది. పట్టాభిగారి సహపాటి మీర్జాపురం రాజాగారి వకీలు ఒకాయన ఈ పిటీషన్ ఎత్తివేయిస్తే రాజాగారిచేత ఆంధ్రజాతీయ కళాశాలకు 60 వేలు సాయం చేయిస్తానంటూ తిరిగాడు. ఈ నీచమైన డబ్బు కళాశాలకు అక్కరలేదు. అవసరమైతే ముష్టియెత్తి సంపాదించగలనన్నారు దేశసేవాధురంధరులైన పట్టాభిగారు.

జమీందారులు అక్రమంగా రైతులవద్ద ధనాన్ని గుంజుతారు. వారికి వారి చుట్టూవుండే ధనాపేక్షాపరులు, స్వార్థపరులు వందిమాగధ బృందమువారిని పెంచి పెద్దవారిని జేసే, శాసా దాసీజనం మన సత్యం మాత్రమే వారికి తెలుసు. ఇతర ప్రపంచాన్నికూడా వారు ఈ కొలత బద్దలోనే కొలుస్తారు. ఇక త్యాగులైన దేశ సేవానిరతుల మన సత్వం వారి బుద్ధికి అగోచరం.

"అధమా ధన మిచ్ఛంతి, ధనమానేచ మధ్యమాః,

ఉత్తమా మాన మిచ్ఛంతి. మానో హి మహతాం ధనం"

—o—

# తాలూకాబోర్డు అధ్యక్షత

"క॥ తనవారి నెదుట వారిని దనవారిఁ
గనజూడ నేర్చు ధన్యులుచాలన్
ఘనకీర్తుల చే మించుదు సనకాది
మునిప్రసన్న సంపగిమన్నా."

1927 లో తాలూకాబోర్డు ఎన్నికలు వచ్చినపుడు బ్రహ్మయ్యగారు పోటీలేకుండా నే సభ్యుడుగా వచ్చాడు. బందరు తాలూకాబోర్డు పేరుకేగాని బందరు దివి తాలూకాలు కలసి వుండేవి. ఆబోర్డులో సభ్యులసంఖ్య24. అందులో ఎన్నికసభ్యులు 18 మంది. నియమితసభ్యులు ఆరుగురు. ఈసభ్యులలో కాంగ్రెసు వారి సంఖ్య 10. ఈపార్టీకి నాయకుడు బ్రహ్మయ్యగారే. కీ॥ శే॥ శేషించి హనుమంతరావుగారు మధ్యస్తుడు. మిగతా యెన్నిక సభ్యులు 7 గురు. నామినేటెడ్ సభ్యులు. జస్టిసుపార్టీకి చెందిన వారు. జస్టిసుపార్టీలో ప్రముఖులు బారిష్టర్ శీలం జగన్నాథ రావు, కొల్లిపర వెంకటరమణయ్య నాయుడుగార్లు.

తాలూకాబోర్డు అధ్యక్షతను ఏకగ్రీవంగా జస్టిసుపార్టీ సభ్యుడు ఎన్నుకొనబడుట మంచిదికాదని యెంచి సిద్ధాంతం కొరకు బ్రహ్మయ్యగారు పోటీచేశారు. ఎన్నికసభ్యులు ఓట్లు అధికంగా బ్రహ్మయ్యగారికే వచ్చినా నియమిత సభ్యుల బలం చేత రమణయ్య నాయుడుగారే ఫిబ్రవరిలో ప్రెసిడెంటు

అయ్యాడు. బ్రహ్మయ్యగారు వ్యతిరేకపక్షపు నాయకుడుగా వున్నాడు. ఇట్లా నాలుగు అయిదు నెలలు మాత్రమే జరిగింది.

అనంతరం, కృష్ణాజిల్లా విభజింపబడినందున బోర్డులన్నీ తిరిగి నామినేట్ చేయబడుట తటస్థించింది. ఎన్నికసభ్యులను మాత్రం వుంచి నియమిత సభ్యులను కాంగ్రెసుపార్టీకి అనుకూలంగా ఈ సారి వేయుట తటస్థించింది, తిరిగి ఎన్నిక జరిగింది. మళ్ళీ రమణయ్యనాయుడు బ్రహ్మయ్యగార్లకే పోటీ. నియమిత సభ్యులను తిరగ తీయుటకు జస్టిసుపార్టీవారు విశ్వప్రయత్నాలు చేశారు. కాని ప్రయోజనం లేక పోయింది. కాంగ్రెసుపార్టీలో వున్న కాపులగు రేపల్లె వెంకటక్రిష్ణయ్యగారిని తిరగ తీయుటకు వ్యతిరేక పక్షంవారు విశేష కృషిచేశారు. ఆయన కులతత్వాల నతిక్రమించిన కాంగ్రెసు వాది. ఆ నాడు కాపుల్లోకి ఈ తాలూకాలో ఆయన కాంగ్రెసు ప్రముఖుడు. ఆయన కాంగ్రెసులో చేరినందుకు కాపులూ ఇతరులూ పెట్టిన కష్టాలన్నీ అనుభవించి కాంగ్రెసు ధర్మాన్ని విడువని దేశభక్తుడు. ఆయన బ్రహ్మయ్యగారంటే ఆఖరువరకుఅమిత ప్రేమభావం కలవాడు. అందుచేత ఆయనపై వేసినఎత్తులు యేమీ పారలేదు. జయం బ్రహ్మయ్యగారికే లభించింది.

తాలూకాబోర్డు సభ్యులందరిలోను బ్రహ్మయ్యగారే వయస్సున చిన్నవాడు. ఇంతవరకు అధ్యక్షులందరూ న్యాయవాదులే, బందరు తాలూకాబోర్డు 1911 లో యేర్పడింది. శ్రీ దరగు వేమూరి వెంకటసుబ్బారావు పంతులుగారు చాల కాలం ప్రెసిడెంటుగా వున్నారు. తర్వాత వకీలు వడ్లమన్నాటి

నరసింహంగారు కొంతకాలం అధ్యక్షులుగా వున్నారు. పబ్లిక్ ప్రాసిక్యూటరగు శేషింబి హనుమంతరావుగారు కొంతకాలం వున్నారు. వీరి అనంతరం రైతుబిడ్డ మండలి రామస్వామి గారిని కొద్దికాలం టెంపరరీ ప్రెసిడెంటుగా నియమించారు. పల్లెటూరి రైతులలో ప్రథమ అధ్యక్షస్థానం వహించిన గౌరవంకూడా బ్రహ్మయ్యగారికే దక్కింది. ఆయన వయస్సున చిన్నవాడైనప్పటికీ, అధిక విద్యావంతుడు కాకపోయినా, స్థానిక పరిపాలనానుభవం లేకపోయినా, అధిక చాకచక్యంతో వ్యవహరించి అందరి మన్ననలకు పాత్రుడయ్యాడు. ఆయన అధ్యక్ష కాలం తాలూకాబోర్డు చరిత్రలో కెల్ల గర్వింపదగిన కాలం. పార్టీ పక్షపాతదృష్టితో కాకుండా, న్యాయదృష్టితోనే వ్యవహరించాడు. వ్యక్తిగతపక్షంతో అనవసర తగాదాలతో ప్రొద్దుపుచ్చక అధ్యక్షస్థాన గౌరవాన్ని కాపాడాడు.

ఆయన ఏ పనిలో ప్రవేశించినా సర్వశక్తులు వినియోగించి పట్టుదలతోను, దీక్షతోను చేయుట అలవాటు.

జాతీయ భాషలలోనే విద్య గరపవలెనని ప్రభుత్వ వ్యవహారాలు దేశభాషల్లో జరగాలని మన నాయకులు ఎంత కాలంనుంచో ఆందోళన చేస్తున్నారు కాని, దేశభాషలకు ఇప్పటికీ ఆ అదృష్టం పట్టనే లేదు.

1927 లోనే బ్రహ్మయ్యగారు బోర్డు వ్యవహారాలన్నీ తెలుగు భాషలోనే జరిపాడు.

తాలూకాలోని ఊళ్ళన్నీ స్వయంగాచూచి వారి కష్ట సుఖాలు కనుక్కొన్నాడు. ప్రతి పాఠశాల స్వయంగా తనిఖీ చేశాడు. నూతనంగా 35 పాఠశాలలను పెట్టించాడు.

బాలికా పాఠశాలలో అవకాశం చిక్కినప్పుడల్లా స్త్రీలనే నియమించాడు.

హిందూ పాఠశాలలో ఆది ఆంధ్ర ఉపాధ్యాయులను మొట్టమొదటగా నియమించిందాయనే. పాఠశాలలను బహిష్కరించడానికి ప్రయత్నాలు జరగగా ఆయా గ్రామములకు వెళ్ళి అస్పృశ్యతా నివారణావశ్యకతను నచ్చచెప్పి, వారిని ఒప్పించి, అస్పృశ్యతా నివారణకు పాటుపడ్డాడు.

ఉపాధ్యాయులతో సంప్రదించకుండా పాఠ్య పుస్తకాలను నిర్ణయించేవాడు కాదు

స్కూళ్ళలో ప్రతిదినం ఉదయం, నైతికబోధ చేయవలసిందిగా యేర్పాట్లు చేశాడు. మన విద్యావిధానంలో నైతికబోధ లేనిలోటు అందరు యెరిగినదేకదా.

పాఠశాలలో ప్రతి శుక్రవారం సాయంత్రం చర్చలు జరుగునట్లుచేసి, విద్యార్థులు జంకుగొంకులు లేక మాట్లాడునట్లు చేయుటకు కృషిచేశాడు.

ప్రతి బడిలోను జాతీయగీతాలు పాడునట్లు యేర్పాట్లు గావించాడు.

ఉపాధ్యాయు లందరు ఖద్దరుధారణ చేయవలసిందని సర్క్యులరు పంపుటేగాక వారు తనవద్దకు వచ్చినప్పుడు ఖద్దరుధారణావశ్యకతను నచ్చచెప్పేవాడు. సంచారం వెళ్ళినప్పుడు హాకింగుచేస్తూ (విక్రయిస్తూ) రాజకీయోపన్యాసాలు ఇస్తూ జాతీయోద్యమ ప్రచారం చేస్తూ వుండేవాడు.

సైమన్ కమీషన్ మొదటిసారి వచ్చినప్పుడు, ఆఫీసుపై నల్లజండా ఎత్తుటేగాక, పాఠశాలలన్నింటిని మూయించెను.

ఈవిధంగా కాంగ్రెసు ఆశయాలకు అనుగుణంగా వ్యవహరించెను.

మాస్టర్లకు జీతాలు సక్రమంగా యీయక 3 నెలల కొకసారి యిస్తూవుండే అలవాటును మాన్పించి, ప్రతినెల సక్రమంగా యిచ్చేటట్లు ఏర్పాట్లు గావించెను.

ఉపాధ్యాయుల ట్రాన్సుఫర్లవల్ల అనేక ఇబ్బందులు జరుగుతూండేవి. ఒక్కొక్కప్పుడు న్యాయం పాడువడిన సందర్భాలుకూడా లేకపోలేదు. ఈయన ఆ సంగతి గ్రహించి, మ్యూచువల్ ట్రాన్సుఫర్లు తప్ప ఇతరంగా మార్పులు మాన్పించెను. మాస్టర్లు ఇదివరకు తాలూకా బోర్డు అధికారులను చూచి అధికంగా భయపడేవారు. ఈయన ఆ అనవసర భయాలను మాన్పి వారిలో ఆత్మ గౌరవాభివృద్ధి పెంపొందించుటకు తోడ్పడ్డాడు.

ఉపాధ్యాయులను గుమాస్తాలను సోదరులుగా భావించి, వారి కష్టసుఖాలను గమనిస్తూ వారు కర్తవ్యాలను సక్రమంగా వహించునట్లు చూచేవాడు. అందుచేతనే ఆయనంటే అధిక ప్రేమ గౌరవాలు యేర్పడినవి వారికి. ఇప్పటికి వారు బ్రహ్మయ్యగారి పరిపాలనా సామర్థ్యాన్ని గూర్చి, సౌజన్యాన్ని గురించి చెప్పుకుంటారు.

కొన్ని వ్యవహారాలలో తన పార్టీవారుగాని మిత్రులుగాని చెప్పినా, ఆయనకు న్యాయమని తోచని విషయాలు మన్నించనందున కొందరికి అభిప్రాయభేదాలు కల్గినా క్రమంగా సమసిపోయేవి.

## తాలూకా బోర్డు సభ్యులు; ఉద్యోగులు

**నిలుచున్నవారు :**

ఎడమనుంచి :— కొల్లి శేషయ్యగారు 2. భట్టా జ్ఞానకోటయ్యగారు 3. మహమ్మద్ రవూఫ్ సాహెబ్ గారు 4. మాలెంపాటి వెంకటకృష్ణయ్యగారు 5. కావూరి కోదండరామయ్యగారు 6. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు (అధ్యక్షులు) 7. శెడింబి హనుమంతరావుగారు 8. వేములపల్లి వెంకటగోపాలరావుగారు 9. మంథని రామస్వామినాయుడుగారు 10 శేషల్లె వెంకటకృష్ణయ్యగారు 11. వెంకటరత్నంగారు.

**కూర్చున్నవారు :**

1 వ వరుస:— బత్తిన లక్ష్మీపతిగారు 2. బాబూరావుగారు (ఓవర్‌సియర్) 3. గద్దె నారయ్యగారు (ఉపాధ్యక్షులు) 4. లక్కావఝుల వెంకటేశ్వరరావుగారు H. C. 5. మండవ వెంకటరత్నంగారు 6. వజ్జ రామయ్యగారు 7. చెలసాని వీరయ్యగారు.

2 వ వరుస:— తాతా వీరాస్వామిగారు 2 చెలసాని కాకయ్యగారు (గుమాస్తా) 3. అశ్వధాటి రామమూర్తిగారు 4. నరసింహారావుగారు (Inspector)

ఆయన కార్యనిర్వహణదీక్షలోని స్వతంత్ర విధానం వలన తమ స్వార్థాలు ఈడేరని కొంతమంది బ్రాహ్మణులు ఆయన కమ్యూనిత్వము గలవాడని, కమ్మవారు బ్రాహ్మణ ద్వేషత్వం ఆపాదించారు. కాని కాలక్రమంగా ఈ నిందలన్నీ నీలాపనిందలుగానే పరిణమించినవి.

ఆయన పరిపాలన దక్షతతోను, సౌమనస్యంగాను, కాంగ్రెసుకు బలయుతంగాను జరిగింది. ఆయన అధ్యక్ష కాలంలో ఓటింగుకువచ్చిన విషయాలు రెండు మూడు మాత్రమే. అధికంగా ఏకమత్యంగానే జరిగిపోయేవి. జస్టిసు పార్టీ నాయకులగు శ్రీ లం జగన్నాధరావు నాయుడుగారు, ప్రతిపక్ష నాయకుడుగా వుండి గొప్ప ఔదార్యంతో ప్రవర్తించి సామరస్యానికి తోడ్పడ్డాడు.

బ్రహ్మయ్యగారు జిల్లాబోర్డులో కూడా అధికార రీత్యా సభ్యులు. కాంగ్రెసు పార్టీకి డిప్యూటీ లీడరు. జిల్లాబోర్డు వ్యవహారాలలో కూడా ప్రాముఖ్యమైన విషయాలు ఆయన సలహా సంప్రతింపులతో జరిగేవి.

ఆ॥ "కార్యసిద్ధి పొందు కాలంబు
దేశంబు నెరిగి బుద్ధిమంతులెల్ల ప్రొద్దు
సాహసంబు విడచి సామా
ద్యుపాయ ప్రయుక్తి చేయదగు యథోచితముగ"

—భారతం.—

# నల్ల జెండాలు

"తనిసిరే వేల్పు లుధధిరత్నములుచేత
వెరచిరే ఘోరకాకోల విషముచేత
విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు."

— భర్తృహరి.

1929 వ సంవత్సరాంతాన కాన్పూరులో జవహర్ లాలు అధ్యక్షతను కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము ఆమోదించింది. 1930 జనవరి 26 వ తేదీని సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవంగా నిర్ణయింపబడుటచే దేశమంతటా ఆరోజున సభలుచేసి సంపూర్ణ స్వరాజ్య తీర్మానం చదువబడెను. నివురుగప్పిన నివ్వువలెనున్న ప్రజల ఉత్సాహ పరంపరలు ఈ జయంతి ఉత్సవం ద్వారా వ్యక్తమయ్యెను.

దీనితో బ్రిటిషుప్రభుత్వపు బడాయి బట్టబయలయింది. లోకవంచన కొరకు గవర్నరు శ్రీ స్ట్రాన్లి వందిమాగధుల స్వాగత పత్రాలు పుచ్చుకొని దేశం తమ వైపుననే వున్నదని ప్రకటించుటకు సంచారము బయలుదేరెను. ఈ సంచార సందర్భములో నల్లజెండాలు ప్రదర్శించి తమ వ్యతిరేకతను కనపరచవలసిందని కాంగ్రెసు ప్రముఖులగు మోతే నారాయణరావు, ఆత్మకూరి గోవిందాచారిగార్లు పత్రికలలో ప్రకటించారు.

లోగడ జిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షుడు బ్రహ్మయ్యగారిని 1930 లో తిరిగి అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్ను

కున్నారు. 1930 ఫిబ్రవరి 1 వ తేదీని ఘంటశాలలో జరిగిన కృష్ణాజిల్లా సహాకార సభకు ఆయన ఆహ్వాన సంఘాధ్యక్షత వహించాడు. నరసింహదేవర సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు. ఆ సభను పురస్కరించుకొని ఆ తేదీనే జిల్లా కాంగ్రెసు సభకూడా జరిగింది. ఆ సభలో ఫిబ్రవరి 8 వ తారీఖున బందరు వచ్చు గవర్నరుగారికి నల్లజెండాల ప్రదర్శనం చేయవలసిందని యేకగ్రీవంగా తీర్మానం చేయబడింది.

ఆసభకు హాజరుగాని పెద్దలగు పట్టాభి, కృష్ణారావు గార్లు ఈ తీర్మానం తొందరపడి చేశారన్నారు. అయినా వేడి రక్తంగల యువకులు తీర్మానం ప్రకారం ఆచరించుటకు నిశ్చయించుకున్నారు. ఆంధ్ర దేశమంతటా నల్లజండాల ప్రదర్శనం చేయవలసిందని ప్రకటించిన ఆత్మకూరి గోవిందాచార్యులు, మోతే నారాయణరావుగార్లు ఏలూరు గవర్నరు వచ్చినపుడు మూలకుపోవడం లజ్జాకరమగు సంగతి. కాంగ్రెసు స్వాధీనంలోవున్న బెజవాడ మున్సిపల్ కౌన్సిలు, గోదావరి జిల్లాబోర్డు సైతం స్వాగతాలివ్వటం అవమానకరం. ఇవ్వని సంస్థ ఒక్క గుంటూరు మున్సిపాలిటీయే. గుంటూరు తన గొప్పతనాన్ని ఆ విధంగా నిలబెట్టుకున్నది. ఆంధ్ర దేశంలో నల్లజెండాల ప్రదర్శనం జయప్రదంగా జరిగింది, ఒక్క బందరులోనే. బందరు బడాయి గుంటూరు లడాయి అనేదానికి భిన్నంగా బందరు లడ్డులకేగాక లడాయికీగూడా గొప్పదని ఖ్యాతి గాంచింది.

సీతారామయ్యగారు కాంగ్రెసు వర్కింగు కమిటీకి వెళ్ళారు. ఫిబ్రవరి 7వ తారీఖున బహిరంగసభ జరిపి, వ్యతిరేక

ప్రదర్శనంలో పాల్గొనవలసిందని ప్రజలకు హెచ్చరిక చేయబడింది. ఆ రాత్రి జిల్లాకలెక్టరు, బందరు మున్సిపల్ చైర్మన్ శ్రీలం జగన్నాధరావునాయుడుగారు ప్రదర్శనం మానవలసిందిగా బ్రహ్మయ్యగారివద్దకు కబురుచేశారు. తాము నిశ్చయించుకున్న ప్రకారం నడచుటతప్ప అన్యథా ప్రవర్తించమని ఆయన తిరిగి కబురు చేశాడు. దీనిపైన రెండేసి సంవత్సరాలు కఠినశిక్షకు తయారుకావలసిందని బెదిరించాడు కలెక్టరు. వారు బెదిరించిన కొద్దీ వీరు బిరబిగిశారు.

అనుకున్నట్లుగానే మర్నాడుదయం జిల్లా కాంగ్రెసు అధ్యక్షుల క్రింద పెద్ద వూరేగింపు బయలుదేరింది. ముఖ్యులుగా వున్న 11 మందిని అరెస్టుచేశారు. మరి 20 మందిని డిటెయిన్ చేసి తర్వాత విడిచిపెట్టారు. అరెస్టయినవారిమీద కేసు పెట్టారు. 1 గొట్టిపాటి బ్రహ్మయ్య 2 పల్లూరు రామారావు 3 కొడాలి ఆంజనేయులు 4 మునుగంటి వెంకట్రావు 5 తల్లాప్రగడ రామారావు 6 బొబ్బా వెంకటశేషయ్య 7 అన్నే వెంకటరత్నం 8 బొబ్బా ఆదినారాయణమూర్తి 9 బొబ్బా రంగారావు 10 వడ్లమూడి కల్యాణరాయణ 11 గూడూరు వెంకటచలం. ఈ యీ పదకొండుగురు ముద్దాయిలు.

గూడూరు వెంకటచలం క్షమాపణ చెప్పుటచేత విడిచి పెట్టబడ్డాడు. 8, 9 10 ముద్దాయీలు డిఫెన్సు పెట్టుకున్నారు. మొదటి యేడుగురు తాము డిఫెన్సు పెట్టుకోతలచలేదన్నీ, అందుచే ప్రత్యేకంగా విచారించి శిక్షించుకోవలసిందని నిర్భయంగా కోరారు. కాని డిప్యూటీ కలెక్టరు అట్లా వీలులేదని 6 వారాలు విచారించి 1930 సం॥ మార్చి 15 వ తారీఖున

6 వారాలు శిక్ష, సంవత్సరం సెక్యూరిటీ శిక్షను విధిస్తూ, సెక్యూరిటీ ఇవ్వని పక్షమున 1 సంవత్సరం శిక్ష అనుభవించే లాగు తీర్పు చెప్పాడు.

ఈ జెండాల ప్రదర్శనంలో మరొక విచిత్రం జరిగింది. వీరి నల్లజెండాల వూరేగింపు గవర్నరు దగ్గరకు పోలేదు. వీరు మధ్యలోనే అరెస్టుచేయబడి ఆపివేయబడ్డారు. కాని గవర్నరు బందరు పురమందిరంలోనికి కారులో వస్తూండగా "గవర్నర్ గో బాక్, గవర్నర్ గో బాక్" అనే నినాదాలనిస్తూ ప్రజలు నల్లజండాలను కూడా ఆయన కారుపైకి విసరివేశారు. ఇట్లు విసరిన నల్లజండాలలో పిన్నమనేని వీరయ్యగారి జెండా గవర్నరుగారి అంగరక్షకుని వడిలో పడింది.

ఎంత పోలీసు బందోబస్తుచేసినా, ఈమాదిరిగా నల్ల జెండా వారికి ముట్టింది. తర్వాత గవర్నరు అంగరక్షకుడు బందోబస్తు బాగుండలేదని చీవాట్లువేశాడు. ఒకవేళ బాంబు వేసినా ఇంతేగదా అని మందలించాడు. కాదు - మండి పడ్డాడు. వారుమాత్రం తక్కువబందోబస్తుచేశారా? బెజవాడ లగాయితు బందరువరకు ఫర్లాంగు కొకరు చొప్పున పోలీసు కాపలా వుంచారు. జిల్లాలోని పోలీసుసిబ్బందినంతా బందరు దింపి బందోబస్తు బాగానేచేశారు. సముద్రఘోషను మరపించు ఈ జనఘోషను ఈ రక్షకభటులు అడ్డగలరా? ఈ జెండావీరులు సబ్ జెయిల్లోనుండగా మద్రాసునుండి ఆంధ్ర కేసరి రెక్కలగట్టుకొనివచ్చి ముద్దాయిలందరిని పరామర్శించి

ఆంధ్ర దేశంలో జీవమున్నదని తెలియజేసినందుకు అభినందనల నందజేస్తున్నానన్నాడు.*

తొందరపడ్డారని మందలించిన కృష్ణారావుగారు, సమయము వచ్చేసరికి నల్లజెండాతో తయారయ్యారు. మాని కొండ సత్యనారాయణశాస్త్రిగారుకూడా నల్లజండా పుచ్చుకొని నదురు బెదురు లేకుండా వచ్చి శాసనోల్లంఘన చేయ ప్రయత్నించగా, బ్రహ్మయ్యగారు నేను జిల్లా సంఘాధ్యక్షుని హోదాలో చెప్తున్నాను; మీరు మానుకొని ముందురాబోవు శాసనోల్లంఘన కార్యక్రమానికి జిల్లా ప్రజలను తయారు చేయవలసిందని చెప్పగా, ఆయన సుశిక్షిత సైనికునివలె మరలి వెళ్ళెను.

మహర్షి సాంబమూర్తిగారు ఏలూరు పౌరులు తమకిచ్చిన సన్మాన సమావేశంలో ఈ జండావీరుల సాహసాన్ని ప్రస్తుతించారు.

తొందరపడ్డారని మందలించిన మన పట్టాభిగారుకూడా అనంతరం దీని ప్రాముఖ్యం గుర్తించారు. నల్లజెండాల కేసు ఉప్పుసత్యాగ్రహానికి ప్రచారం చేయకుండా తోడ్పడిందని శ్లాఘించారు.

---

*"ఆయనయందు మూర్తీభవించిన యోధత్వము, అది మరియొకరిలో కొంత కన్పించినా వారిపై కొంత మమకారము ఆయనకు కలుగుతుంది. రాజకీయ ఖైదీలంటే, విప్లవకారులంటే, దెబ్బలుతిన్న వాలంటీర్లంటే ఆయన హృదయం కదిలివస్తుంది" అని అంటారు ఆచార్య రంగాగారు. చిత్రగుప్త 15-2-39.

"దేశగర్వము దీప్తిజెందగ
దేశచరితము తేజరిల్లగ
దేశమరసిన ధీరపురుషుల
తెలిసిపాడర తమ్ముడా" —రాయప్రోలు.

ఈ నల్లజెండాల కేసు తీర్పునుగురించి కృష్ణాపత్రిక సంపాదకీయాలలోని కొన్ని భాగాలు గమనించిన నాటిస్థితి దాని ప్రాముఖ్యము ద్యోతకం కాగలదు.

నల్లజెండాలు

"బందరు డిస్ట్రిక్టు మేజస్ట్రేటు తీర్పు ఏమాత్రము ఆశాభంగకరముగలేదు. శిక్ష మొదటినుండియు అనుకొనిన సంగతియే.

"కొట్టిపాటి బ్రహ్మయ్య, శేషయ్యగార్లవంటి సత్య వ్రతులు దుండగీడులని ఇన్స్పెక్టరు రిపోర్టుచేసిన చాలును. వారిని బద్మాషులుగ నిరూపించి దొంగల గుంపులో జేర్చుట తప్పదు. కోర్టులు, ప్రాసీజర్లు, సెక్షనులు, వారి చర్యల ననుసరించవలసి నదే కాని వాని కేమాత్రము కట్టుబడి యుండనక్కరలేదు. పోలీసువారి చర్యలు శాస్త్రవిరుద్ధములైనవి యని, న్యాయ వాదులు గొంతుకలు చించుకొందురుగాక! కేవలము నిష్ప్ర యోజనము. వారి వాదమును విను న్యాయస్థానమెక్కడ?...

"కాని ఈ న్యాయస్థానముల కతీతమైన ధర్మము కలదని ఘోషించుచు సబర్మతీ తీరమున మహాత్ముడు రణభేరి మ్రోగిం చుచున్నాడు. అత్యాది సకల దాస్య శృంఖలములను విచ్ఛేదింప గల రణభేరి. ఆ సత్యము ఎడల ప్రజలకుగల భయ మోహము

లను పటాపంచలు చేయగల రణభేరి. మిలిటరీ శతఘ్నులను, సహస్రఘ్నులను నిస్తంబ్ధము చేయగల రణభేరి. ప్రజా పీడకరములగు చట్టములను నిబంధనలను చూర్ణముచేసి ఆత్మయొక్క అప్రతిహత అకుంఠిత శక్తిని దిగ్దంతములకు చాటగల రణభేరి. ఈ ప్రభుత్వ విధానముపైనను, ప్రభుత్వాధికారుల యెడలను ప్రజలకెట్టి యనురాగములేదని సత్యమును ప్రకటింప సాహసించిన వీరులకు ప్రస్తుతము జైళ్ళే శరణ్యములు కావచ్చును. శాంతి పేరట పౌర స్వాతంత్ర్యములు నిరోధించి సత్యాగ్రహులను బందిఖానాకు పంపిన కపటనాటకులు మిత్రులో లేక, ప్రజల దారిద్ర్యసూచకముగ నల్ల జెండాలను ప్రదర్శించి జైళ్ళకు నడచిన సత్యసంకల్పులు మిత్రులో, వ్యాధి ముదిరి విషమించిన పిమ్మటగాని బోధపడదు. ఈ పోలీసు శాసనముల కంటె, అతీతమైన, అప్రతిహతమైన ధర్మరాజ్యము, శాంతి సంస్థాపన నొనర్చగల రణభేరి మ్రోగుటతోడనే శాంతి సైన్యదళములు ప్రాంత ప్రాంతముల ఎట్లుద్భవిల్లుచున్నవో తిలకింపుడు. మహాత్ముని మహాధ్వర దీక్షక్రింద నుపక్రమింప బడిన ఈ విశ్వాత్మ యజ్ఞమున పాల్గొనుటకు సకల రాజధానులెల్ల త్వరపడుచున్నవో ఆ మంగళ వాద్యముల నాలకింపుడు. సత్యాగ్రహులారా! భరతఖండమున మీకు తావులేదు. రండు. రండు అని జైలు కవాటములు చేతులు తెరచుకొని మిత్రుల వలె ఆహ్వానించుచున్నవి. గొట్టిపాటి బ్రహ్మయ్య, బొబ్బ వెంకటశేషయ్య ప్రభృతులు ధన్యులు. వారప్పుడే జైలు ఆలింగనమున స్వాతంత్ర్యామృతమును గ్రోలుచున్నారు. కాన వారిజిల్లా వారివెంట నంటియేయున్నది. వందలకొలది యువ

కులు బ్రహ్మయ్యగారి పదాంకానుసరణమున నడుచుటకు మాటముల్లె కట్టుచున్నారు".

—కృష్ణా పత్రిక, మార్చి 22 వ తేది 1930

కృష్ణా పత్రిక పేర్కొనినట్లు అనంతరం వెంటనే ఉప్పు సత్యాగ్రహం జరిగి వేలాదివేలు కారాగారాలు నింపటం జరిగింది. అందు చేత కృష్ణాపత్రిక అన్నట్లు బ్రహ్మయ్య గారి పదాంకానుసరణమే జరిగింది.

# రైతు ఉద్యమం

ఈ భూతములపై ఏ మానవుడైనా తల ఎత్తుకొని తిరుగుట కధికారమున్న యెడల అతడు రైతు. రైతే ధనమునకు మూలపురుషుడు. ఉత్పత్తిదారుడు. ధాన్యలక్ష్మికి పీఠము. తదితరు లందరు వానిని ఆశ్రయించుకొని బ్రతుకు పరాన్నభుక్కులు." —పటేల్.

భరతఖండంలో అనేక ఋషులు, కవులు, గాయకులు, వీరులు జన్మించారు. వారిని భారత జాతి బహువిధాల కీర్తించి పూజించింది. వారికి గుళ్ళు గోపురాలు కట్టింది. గ్రంధాలు వ్రాసి వారికీర్తి నలుదిశలు వ్యాపింపజేసింది.

కాని కష్టించి తమ స్వేదబిందువులచే ఒకగింజకు వదిగింజలు పండించి జాతిస్వత్వానికి మూలకందములైన పంటకాపులను మనసార ప్రేమించ లేకపోయింది. ఎంతసేపు జాతీయ వృక్షఫల [illegible]ములననుభవించి దానికి కారకులైన కర్షకులను విస్మరించింది

మన దేశం తలయెత్తవలెనంటే మన కళాకౌశలము, విద్యాసంస్కృతి, ఆర్థిక సంపత్తి, ఆధ్యాత్మిక సంపద అభివృద్ధి గాంచవలెనంటే మనభూములు పండాలి. మన గ్రామాలు ధన ధాన్య సౌభాగ్యాలతో తులతూగాలి. మనపల్లెలు పచ్చతోరణం నిత్య కళ్యాణానికి నిలయమవ్వాలి.

కట్టుగుడ్డ, తినతిండి లేని గర్భదరిద్రుడు తన జాతీయ రథాన్ని ఎలా లాగగలడు? మన ఆర్థిక సంపత్తికి, ఇంతేకాదు మన సకలసంపదలకు ప్రాణం పంటచేను అన్నసంగతి మన పెద్దలకు తోచనేలేదు. మన నాగరికత అంతా గంగా సరస్వతీ నదీ ప్రాంతాలలోని ధాన్యలక్ష్మి దివ్యగానమే గద! మన కళలు, సంస్కృతులు ఆ పావన నదీధారాసంజనితములేగద!

నేటికిని నూటికి ఎనభైమంది వ్యవసాయంవల్ల జీవిస్తున్నారనే నిత్యసత్యాన్ని గ్రహించలేకపోయారు. మన వ్యవసాయ పరిశ్రమ వృద్ధిపొందనిదే మన గృహపరిశ్రమలు పునరుద్ధరణ కానిదే దేశసంపద అభివృద్ధి పొందజాలదని మన నాయకులు గ్రహించలేకపోయారు.

మన పాడిపంటలు మన కుటీర పరిశ్రమలు అభివృద్ధి పొందవలెనంటే మన కర్షకుల కష్టనష్టాలు నివారించి వారిని అభివృద్ధి పంథాకు రప్పించాలి.

ఈ సత్యాన్ని గ్రహించి పదదళితులైన కర్షకుల కష్టనష్ట నివారణకై కంకణము కట్టుకొని వారిని కంటికి రెప్పవలె కాచి, వారిక్షేమానికై నిరంతరము కృషిచేసింది బాపూజీయే.

గాంధీమహాత్ముడు రాజకీయ రంగమం దవతరించక పూర్వం భారత స్వరూపమును గ్రహించినవారే లేరు.

భారత దేశమంటే గ్రామము, గ్రామమంటే రైతు. రైతు కష్ట నివారణే భారత దేశ కష్టనివారణ యని కనుగొన్న సత్య శోధకుడాయనే. ఈ సత్యాన్ని గ్రహించి లోకానికి చాటినది బాపూజీయే.

బాపూజీ బారిష్టరై కూడా కోర్టులో తనవృత్తి "వ్యవసాయం, నేత" అని చెప్పుట గమనింపదగిన విష యం. ఆయన అట్లు చెప్పుటేగాదు. మూర్తీభవించిన రైతులా ఆయన రైతు. ఆయన భారత కర్షకకోటికి ప్రతినిధి. ఆకోటాను కోట్ల రైతాంగంయొక్క వ్యక్త అవ్యక్త వాంఛలకు ఆయన ప్రతిబింబం. ఆయన మామూలు రైతు కానిమాట వాస్తవం కాని కోట్లకొలది కర్షకుల ఉత్తమమూర్తి.

బాపూజీని బహువిధాల భావించారు. కాని అసలైన విషయమేమంటే ఆయన అచ్చంగా ఒక పెద్దరైతు. అన్ని విషయాలు ఆయన రైతుదృష్టితోనే చూచేవాడు. జీవితానికి సంబంధించిన కొన్ని విషయాలలో రైతు ప్రదర్శించే అంధ త్వాన్నే ఆయన ప్రదర్శించాడుకూడా. ఆయన అసలైన రైతు వలె ప్రకృతి సాన్నిధ్యంలో వుండుటకు అధికంగా కోరెడివాడు. ఆయనదంతా కర్షక దృక్పథమే.

కర్షక ప్రధానమైన భారత దేశములో ఆయనే ప్రథమ ఆధునిక కర్షక రాజకీయవాది. ప్రభుత్వంమీదగాని చివరకు కాంగ్రెసుమీదగాని ఆధారపడక, కేవలం స్వయంసహాయం మీదనే ఆధారపడవలసిందని, ప్రబోధించిన ప్రబోధకుడు బాపూజీయే.

యథార్థ భారతస్వరూపం గ్రామములయందే కాన్పించునని, వ్యవసాయదారు దానికి కేంద్రము, కీలకము అని, రైతునకు సంబంధములేని యే స్వాతంత్ర్యపథమునకుగాని, పనికిగాని అర్థమే లేదని, భారత జాతీయ తత్వ ప్రధాన సూత్రమును ప్రథమంగా మహాత్ముడు మనదేశంలో ప్రకటించెను. ఈ సూత్రాన్ని అక్షరాల అమలులో పెట్టటానికి తమ జీవితాలను ధారపోసిన వారిలో మగన్‌లాల్ గాంధి, సర్దార్ పటేలు ఆచార్య రంగాగార్లు ముఖ్యులు. గురువు సూత్రాలు సృష్టిస్తే వాటిని ఆచరించు పద్ధతులు కనుగొని జీవితాల నర్పించారు శిష్యులు. అందులో వల్లభాయి, రంగాలకు మరొక సదుపాయము కలసివచ్చింది. వారు స్వతహా రైతుబిడ్డలు. అంతేగాక బాల్యంలో వారు వ్యవసాయకులు. అందుచేత వారికా భూపుత్రులతో అన్నివిధాల సంబంధముండుటచే, వారి కర్షకాభిమానం అధికమైనది.

రైతునాయకుడైన ఆచార్యరంగా కిసానోద్యమ నిర్మాత. ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం 1928 లో బాపనీడుగారి సహాయముతో, స్థాపించిందాయన. ఆచార్యరంగాగారికి సహచరుడుగా వుండి, కర్షకోద్యమంలో బ్రహ్మయ్యగారు కృషిచేశారు. అయిదురూపాయిలనుండి కృష్ణా ఉభయగోదావరి జిల్లాలలో యకరం 1 కి రు. 6-4-0 చొప్పున తీరువ భూయజమానులకు, ప్రభుత్వంవారు నిర్ణయించారు. ఆ నిర్ణయం, అక్రమమైనదని 1931 ఆగస్టులో రీ సెటిల్మెంటు ఆందోళన ఆరంభమైనది. ఆచార్యరంగా దీనికి మూలపురుషుడు. బలరామకృష్ణయ్య, బ్రహ్మయ్యగార్లు, కృష్ణాజిల్లాలో అధిక ఆందోళనచేశారు.

ఆసమయంలో బ్రహ్మయ్యగారు ఆచార్యరంగాగారితో కలసి, గ్రామాలవెంట తిరుగుతూ, ప్రబోధంచేయుటే కాక వూరూరా రైతుసంఘాలు స్థాపించారు. ఈ రీ సెటిల్‌మెంటు ఆందోళన సందర్భంలో రైతుసంఘాలు బలపడుటే కాక రైతులలో మంచి జాగృతి కల్గెను.

1931 లో బెజవాడలో జరిగిన కృష్ణాజిల్లా రైతు సభకు, కార్యదర్శిగా వుండి అధిక కృషి చేశారు. ఈ ఆందోళన సందర్భంలో జిల్లా సభ లేగాక, తాలూకా సభలు, ఫిర్కా సభలుకూడా చేయించి, రైతులం దపూర్వ సంఘటనా శక్తి నేర్పరచారు.

1931 నవంబరు 10 తారీఖున అంగలూరులో జరిగిన ఫిర్కాసభకు ఆయన ప్రారంభకులుగానుండి ఉత్తేజకరమైన ఉపన్యాసమును గావించియుండిరి.

ప్రథమంలో ఈ రీసెటిల్‌మెంటాందోళనలో కాంగ్రెసువారు జోక్యము కలుగజేసుకోలేదు. జిల్లాలోని కాంగ్రెసుపెద్దలందరు మూకీభావం వహించారనే చెప్పవచ్చును. బ్రహ్మయ్యగారు కాంగ్రెసువాది అయినప్పటికీ, తాను రైతు గాన తన కర్తవ్య నిర్వహణకు దీనిలో పాల్గొనుటే గాక, ఏలూరులో జరుగు రాష్ట్ర రైతుసభతోబాటు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యసంఘ సభకూడా జరుపవలసిందిగా కార్యదర్శిని ఆయన కోరారు. ఆయన కోర్కె ననుసరించి, సభ జరుగుటే గాక రీసెటిల్‌మెంటు ఆందోళనలో కాంగ్రెసుకూడా పాల్గొనుటకు

నిర్ణయమైనది. † ఈ విధంగా రైతు సమస్యలందు తటస్థముగా నున్న జాతీయ సంస్థ కాంగ్రెసుకు కూడ రైతాంగ సమస్యలకు సుముఖముగా నొనర్చ పాటుపడిరి.

ఈ ఆందోళన సందర్భంలో, పెక్కు సభలు చేస్తూ రాత్రింబవళ్ళు ప్రచారం చేస్తుండగా 7-1-1932 న పన్నుల నిరాకరణ బోధింపరాదని ఆయనకు 144 వ సెక్షన్ జారీ చేయబడెను. 2-1-1932 తారీఖున పన్నుల నిరాకరణ బోధిస్తున్నాడని ఆయనను అరెస్టుచేసి రెండు సంవత్సరముల కఠిన శిక్ష, వేయిరూపాయిలు జరిమానా విధించారు.

26-11-1936 లో తాడేపల్లిగూడెంలో జరిగిన పశ్చిమగోదావరిజిల్లా రైతు సభకు అధ్యక్షత వహించి రైతు సమస్యలను గురించి ప్రబోధం చేశారు.

స్వయం కృషివల్ల వ్యవసాయ సమస్యలను క్షుణ్ణంగా తెలుసుకొన్నవాడగుటచేత గ్రామ పునరుద్ధరణకు కావలసిన విధానాలు గ్రామస్థుల కష్టనష్టాలు ఆయన కధికంగా తెలియును.

అనేక రైతుసభల కధ్యక్షత వహించి, ఆయన చేసిన ఉపన్యాసాలు రైతుల కష్టనష్టాలు తెలుసుకొనుటకు ప్రమాణాలుగా నుండుటేగాక తత్పరిహార మార్గాలుకూడా చూపబడుటచే శాస్త్రీయ దృక్పథంగల ఉద్గ్రంథంగాకూడా వెలువరించ యోగ్యమైనవిగా ఉన్నవి.

---

† ఈ సందర్భంలో డాక్టరు పట్టాభిగారు బ్రహ్మయ్య గారికి అండగావుండి ఉద్యమానికి కారకులయ్యారు.

దివి తాలూకా రైతుసంఘ స్థాపకుడై ఆంధ్రరాష్ట్ర రైతుసంఘానికి కొన్ని సంవత్సరాలు ఉపాధ్యక్షులుగాను 1936 లో అధ్యక్షులుగాను వుండి ఆంధ్రరాష్ట్ర రైతువుద్యమ విజయ సారథులలో ఒకడుగా విఖ్యాతి గాంచాడు.

---

# జమీందారీ రైతు ఉద్యమం

"పన్నులభారాలు, పబ్లికు లంచాలు, పైగా కోర్టుఖర్చులోయి
వీటి భారమెపుడు తొలగునోయి
యీ దుష్టపద్ధతి నెపుడు తొలగింతువో దేవ
మాకొద్దీ జమీందార్ల పొందు"

—వెంకట్రామానాయుడు.

"భారతదేశ వడ్డీ వ్యాపారస్థులు; భూస్వాములును ఏ సమకాలిక, సాంఘిక, ఆర్థికపద్ధతిలోను లేనట్టి సర్వార్థ భుకులు"

—బ్రెయిల్సుఫర్డు.

భారతదేశం కని విని యెరుగని జమీందారీ విధానాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అమలులో పెట్టింది. దానివల్ల భారత రైతు కేవలం బానిసకంటె హీనుడైనాడు. ఈపద్ధతి ఒక్క రైతాంగాన్నే నాశనం చేయలేదు. భారతజాతి అభివృద్ధినే అరికట్టినది.

ఆచార్య రంగా ఆదిలో జమీందారీ రైతువుద్యమాన్ని ఆరంభించి, జమీందారీవిధానం నశించాలని ప్రథమంగా ఆయన నినాదమిచ్చినప్పుడు అపహాసించింది లోకం ఆయన్ని. ఆయన అనేక కష్టనష్టాలకు పాల్పడి, జమీందారీ రైతులలో

తీవ్రమైన ఆందోళన తీసుకొనివచ్చాడు. తర్వాత కాంగ్రెసు ఆ ఉద్యమానికి చేయూతనిచ్చింది.

1937 యెన్నికలలో భారతదేశమందంతటా అభివృద్ధి నిరోధకులగు ఈ జమీందారులు కాంగ్రెసుతో పోటీచేశారు. కాని జమీందారులవల్ల నష్టకష్టాలన్నీ అనుభవించిన రైతాంగం యెన్నికలలో వారు పెట్టిన తీవ్ర బాధా నిరోధముల నన్నింటిని ధైర్యంతో యెదుర్కొని కాంగ్రెసుకే వోటుచేశారు. ఆ కృషి ఫలితమే జమీందారీ రద్దు చట్టంగా రూపొంది రద్దు కావించింది.

బ్రహ్మయ్యగారు జమీందారీ రైతువుద్యమం ప్రారంభకులలో ఒకరు. ఆయన స్వయంగా చల్లపల్లి యస్టేటుకు సంబంధించిన జమీందారీ రైతు. కనుక జమీందారీ రైతులకు గల కష్టనష్టాలు ఆయనకు అనుభవంద్వారా తెలియును.

నెల్లూరుజిల్లాలోని వెంకటగిరి జమీందారీ రైతుబాధలు జగద్విదితం.

ఆంధ్రదేశంలో ఈ జమీందారీ ఉద్యమం వెంకటగిరి మునగాల యస్టేటు రైతుల బాధలతో శ్రీ రంగాగారి నాయకత్వమున వెంకట్రామానాయుడు మందేశ్వరశర్మల సాయంతో ఆరంభమై, ఆంధ్ర దేశమంతటా అభివృద్ధిగాంచి భారత దేశమంతటా బహుముఖముల వ్యాపించి అనేక చరిత్ర ప్రసిద్ధ పోరాటములను సాగించి రైతువీరుల త్యాగాగ్నిచే దీప్తి వహించి నేటి జమీందారీ విధాన నిర్మూలనమునకు కారణభూతమైనది.

వెంకటగిరి యెస్టేటులో జమీందారీ రైతుఉద్యమ ప్రముఖులైన కటికినేని కళ్యాణరావు, వెంకటరమణారావు సోదరులు, రామానాయుడుగారల ఆహ్వానా న్ననుసరించి ఆచార్యరంగాగారు ఆశీర్వాదంతో 1921 లో సెంబులూరులో జరిగిన వెంకటగిరి జమీందారీ రైతు సభకు బ్రహ్మయ్యగారధ్యక్షత వహించి ప్రబోధించుటేగాక వారి కష్టనష్ట నివారణకుగాను సంఘటనాత్మకమగు ఒక కార్యక్రమాన్ని సూచించి రైతులకు ఉత్సాహోద్రేకాలను పురికొల్పుటతోబాటు వారి ప్రశంసకు పాత్రులైరి

1935 లో పోతార్లంక గ్రామంలో దివి తాలూకా జమీందారీ రైతుమహాసభ వత్సరోత్సవ మొనర్చారు. ఈ రైతుసభలో జెండా ప్రతిష్టాపన సందర్భమున కొన్ని మతభేదాలకు కారణమయ్యెను. అదివరలో కొందరు రైతుసభలకు కార్మిక చిహ్నమైన యెర్రజెండాను కొంతమంది కాంగ్రెసు జెండాను ఉపయోగిస్తూ వచ్చారు.

మన బ్రహ్మయ్యగారు పోతార్లంక సభలో ఒక కొత్త పంథాననుసరించిరి. కాంగ్రెసు జెండాపైన, రైతుచిహ్నమగు నాగలి, యెద్దులు చిత్రించిన జెండాను ప్రతిష్ఠించి దాని ఔచిత్యమును ఆ సభలో విస్పష్టమొనర్చి, ఒక నూతన పథ ప్రదర్శకులైరి. నూతనమైన ఈ మార్పుకు రైతుఉద్యమ నిర్మాతలైన ఆచార్యరంగాగారు తమ హర్షామోదాలను తెల్పి, బ్రహ్మయ్యగారిని ప్రశంసించారు.

ఈ సభకు నెల్లూరుజిల్లా రైతునాయకులగు బద్దెపూడి వెంకటనారాయణరెడ్డిగారు అధ్యక్షులు. ఈ సభను యేదో

విధంగా భగ్నం చెయ్యవలెనని అధ్యక్షుని ఆజ్ఞలను జవదాటి జమీందారీ యేజంట్లు అల్లరిచేయ ప్రయత్నించగా స్థానిక పలుకుబడిగల బ్రహ్మయ్యగారు వారిని మార్కొని అల్లరుల నడచి తత్సభావిజయానికి తోడ్పడ్డారు.

చల్లపల్లి రాజాగారి సంగతి సర్వజన విదితం. ఆయన స్థానిక సంస్థల్లో పాల్గొని కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులుగవుంటూ తను యెస్టేటు వ్యవహారాల నేమాత్రమూ గమనించక జంపాల వెంకటేశం అనే ఆయనను దివానుగ నియమించి, సర్వాధికారాలు ఆయన పరమొనర్చారు. ఈ దివానుగారిని గూర్చి ఇక్కడ ఒక సంగతి చెప్పవలసివుంది. గుంటూరు జిల్లా పెదనందిపాడు ఫిర్కా పన్నుల నిరాకరణోద్యమ సందర్భంలో ఈ మహాపురుషు డక్కడ డిప్యూటీ కలెక్టరుగా వుంటూ, గవర్నమెంటువారి మెరమెచ్చులకై తాను రైతు బిడ్డకూడా, రైతులను నానాబాధలు పెట్టిన ప్రముఖుడు. ఇంగ్లీషు గవర్నమెంటువారీయనను రైతుల నణచడానికి వుపయోగిస్తూండేవారు. చూచిరమ్మంటే కాల్చివచ్చే స్వభావం గల మనిషి.

ఇట్టి ప్రముఖుని పరిపాలన యెంత ప్రజానురంజకంగా వుంటుందో వేరే చెప్పనక్కరలేదు. ఈయనకు ఎస్టేటు సంప్రదాయాలు బొత్తిగా తెలియవు. రైతులతో వ్యవహార సంప్రదింపులు యేమీ గిట్టవు. ప్రతిదానికి వ్యాజ్యమే. ఇక ధర్మపరతి విచారిద్దామంటే, వారు చూచిన పోరంబోకలు ధర్మచెరువులు యెస్టేటుకు సంక్రమించవలసిందే. ప్రతి గ్రామంలోను పార్టీలుపెట్టి తద్వారా యెట్టి కార్యములైనా చేయు

టకు వెరవని సాహసవంతుడు. యెస్టేటు బాకీలక్రింద రైతు భూములను కొట్టివేయించుకొనుట, ఈస్టుబ్యాంకు కెనాలు క్రింద రైతుల భూములకు వచ్చిన నష్టపరిహారాలకు అనవస రంగా పేచీలు పెట్టటం, సాధారణంగా పోరంబోకల్లోను, ప్రాంతల్లోను రైతుగొడ్లు మేసే పద్ధతిని దౌర్జన్యంగా మాన్పించి వేలం వేయించటం మొదలైన కార్యాలను నిరాఘాటంగా చేస్తూ రైతులను క్షోభ పెట్టసాగిరి. ఈ దివానుగారి దుర్భర పాలనవల్ల ప్రజల్లో అసంతృప్తి కలిగి, యెస్టేటు ఒక అగ్ని గుండంగా మారింది.

ఇన్ని కష్టా లనుభవిస్తున్నప్పటికి నిరంతర కష్టసహిష్ణుత కలవాటుపడిన అమాయక రైతువర్గం బహిరంగంగా ఈ అక్ర మాలను మాన్యాన సహించజాలక పోయింది. ఇట్టి పరిస్థితిలో బ్రహ్మయ్యగారు ఈ దివానుగారిపై పత్రికల ద్వారాను, కలె క్టరుగారికి రివిన్యూ బోర్డుకు అర్జీలద్వారాను, ఆందోళన జరిపి ఈ దివానుగారి దుర్భరపాలననుండి 1925 రైతులకు విమోచన కల్గించారు.

మునగాల పరిష్కారం

ఎస్టేటులన్నీ ఒక యెత్తు, మునగాల ఒక యెత్తు. ఈ యెస్టేటు నిరంకుశ ప్రభువగు నైజాం సరిహద్దున ఉండుటచేత ఆ పరిపాలనా విధానంలోగల దురంతాలన్నీ మూర్తీభవిం చాయి. యెస్టేటులోని సివిల్ క్రిమినల్ వ్యవహారాలన్నీ జమీందారే దౌర్జన్యంగా నిర్వహించేవాడు. ప్రభుత్వమున్న చిహ్నాలే కానవచ్చేవి కావు. అక్కడ జమీందారే సర్వాధి కారి. శిస్తులకు రశీదులు యిచ్చేవారుకాదు. ఆయన ఆగ్ర

వానికి గురియైన వాడెవ్వడు ఆ యెస్టేటులో వుండటానికి అవకాశం లేదు.

కాంగ్రెసు ప్రభుత్వాన్ని అండగా జూచుకొని జమీందారు మరంతాలను అరికట్టి పోరాటం సాగించాలనే సంకల్పం రైతాంగంలో కల్గింది. జమీందారీ రైతుసంఘం స్థాపించ బడింది. జమీందారీ అత్యాచారాలనుగూర్చి సంఘటనాత్మక మైన ఆందోళన ఆరంభమాయెను. ఈ ఆందోళన ఆంధ్ర రైతాంగం యావత్తు బలపర్చెను.

ఈ తీవ్రాందోళనను గమనించి ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుసంఘం జోక్యం కలిగించుకొని జమీందారునకు రైతులకు మధ్య రాజీ సంభాషణలను ప్రారంభించి రాష్ట్ర కార్యదర్శిగావున్న మన బ్రహ్మయ్యగారి మధ్యవర్తిత్వాన రైతు సంఘమూ జమీందారు రాజీచేసుకొన అంగీకరించారు.

అంతట బ్రహ్మయ్యగారు మునగాలవెళ్ళి ఉభయుల వాదనలు విని, విచారించి 1938 జనవరి 10 వ తారీఖున 15 షరతులతోకూడిన ఒక ఒడంబడిక తయారుచేశారు. ఆ పత్రింపైన రైతుసంఘ నాయకులు, జమీందారును సంతకాలు చేశారు.

సంతకం చేసిన సిరా ఆరక ముందే జమీందారు దానికి భిన్నంగా ప్రవర్తించుట సాగించాడు. దానిమీద రైతులు సత్యాగ్రహ సన్నద్ధులైరి. అంతట రివిన్యూ మంత్రి ప్రకాశంగారు, బ్రహ్మయ్యగారు జోక్యం కలుగ జేసుకొని సత్యాగ్రహం విరమింప చేశారు. రాష్ట్ర సంఘంవారు బ్రహ్మయ్యగారి ఒడంబడికను తర్వాత ఆయన యిచ్చిన

నిర్ణయాన్ని అమలు జరుపవలసిందిగా ఎర్నేని సుబ్రహ్మణ్యా గారిని పంపించారు. సుబ్రహ్మణ్యంగారుకూడా జమీందారులో హృదయ పరివర్తన కలిగించాలని శాయశక్తులా కృషి చేశారు. జమీందారు రైతుల కనుకూలంగా బహిరంగ ప్రకటనచేసి, ప్రవర్తనలో భిన్నంగా ప్రవర్తింప జొచ్చారు. అనంతరం కాంగ్రెసు మంత్రులు దిగటం జరిగింది. జమీందారు యథాప్రకారం తిరిగి తన నాజీపాలన ఆరంభించాడు.

1946 లో మళ్ళీ తిరిగి కాంగ్రెసు ప్రభుత్వం వచ్చేసరికి బ్రహ్మయ్యగారి ఒడంబడికను అమలు పరచమని రైతాంగం ఆందోళన సాగించింది. అంతట రివిన్యూ మంత్రి కళా వెంకట్రావుగారు బ్రహ్మయ్యగారి అధ్యక్షతన మునగాల జమీందారు ఎంతవరకు బ్రహ్మయ్యగారి ఒడంబడిక అమలు జరిపాడో విచారించుటకు ఒక కమిటీని నియమించాడు.

ఆకమిటీవారు విచారించి జమీందారుగారేమీ అమలు జరపలేదని ప్రకటించారు. మునగాల రైతులకు బ్రహ్మయ్యగారి పరిష్కారం ప్రాణప్రదమైనది. ♦

ఈ విధంగా పెక్కు విధాల జమీందారీ రైతులకు అండగావుండి అధిక కృషిచేశాడు.

ఈ సందర్భంలో జమీందారీ రద్దుచట్టాన్ని గురించి చర్చించుట ఔచిత్యభంగంకాదనే తలుస్తాను.

---

♦ ప్రకాశంగారు రివిన్యూమంత్రిగా వున్నప్పుడు ఏర్పడిన జమీందారీ విచారణ కాంగ్రెసు ఉపసంఘపక్షమున సభ్యులుగా వుండికూడ బ్రహ్మయ్యగారు జమీందారీ రైతులకు అండగావుండి అధికకృషి చేశారు.

ఆచార్య రంగాగారిచే ఆరంభమైన జమీందారీ రైతు ఉద్యమం జమీందారులను ప్రతిఘటించుటేగాక జమీందారీ విధాన రద్దుకే కారణభూతమైనందుకు ఆనందించతగినది.

1937 లో ప్రకాశం కమిటీ జమీందారీ పుట్టుపూర్వోత్తరాలు పూర్తిగా విచారించి, వారు కేవలం శిస్తు వసూలు దార్లేగాని, భూమిలో వారికి కట్టిహక్కు లేదని, 1802 నాటి శిస్తురేటుకంటే అధికం వసూలు చేయరాదని ప్రకటిస్తూ 18 పర్వాల నురొక భారతం ప్రకటించి ప్రస్తుతి గాంచింది.

అనంతరం కాంగ్రెసు మంత్రులు పదవీత్యాగం చేయటంవల్ల, ఆ రిపోర్టులవల్ల ప్రయోజనం కలుగలేదు. మళ్ళీ కాంగ్రెసువారు మంత్రిపదవులు 1946 లో పొందుటవల్ల రివిన్యూమంత్రి కళా వెంకట్రావుగారు జమీందారీ రద్దుబిల్లు ప్రవేశపెట్టాడు.

ఈ జమీందారీ పిశాచాన్ని సాగనంపిన రివిన్యూ మంత్రి కళా వెంకట్రావుగారి నామం కలకాలం స్మరణీయంగా వుంటుంది.

## అస్సెంబ్లీ అభ్యర్థిత్వం

**"Do the duty which lies nearest to thee"**

**— Carlyle.**

1937 ఫిబ్రవరి నెలలో శాసన సభా ఎన్నికలకు అభ్యర్థులను కాంగ్రెసు అన్నిచోట్లా నియమించింది.

ఎస్సెంబ్లీకి ప్రజామిత్ర పక్షం తరపున చల్లపల్లి రాజా సాధారణ నియోజకవర్గానికి, హరిజనస్థానానికి చంద్రు వెంకయ్య

గార్లు నిల్చారు. వేముల కూర్మయ్యగారు కాంగ్రెసు తరపున, అస్మత్ బుచ్చిదాసుగారు ప్రజాపక్షం తరఫున వారి జనస్థానానికి నిలిచారు. ఇక జనరల్ సీటు కళ్యర్థి కావలసి వున్నది. రాజాగారికి వ్యతిరేకంగా నిలబడుటకు యెవ్వరికీ తాహతులేకుండా వున్నది. చల్లపల్లి రాజాగారితో పోటీకి దేశోద్ధారక నాగేశ్వరరావుగారంతటివారు జంకిన సందర్భంలో, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులగు ప్రకాశం కార్యదర్శి సాంబమూర్తిగార్లు, గుంటూరు పశ్చిమగోదావరిజిల్లాల లోని కాంగ్రెసు ప్రత్యర్థులకు రాజాగారి ఆర్థిక సహాయం వగైరా లభించకుండా వుండుటకు, ఆ జిల్లాలలోని కాంగ్రెసు అభ్యర్థుల జయం సుకరమగుటకు, అపజయము లెక్కగొనక రాజాగారిని బ్రహ్మయ్యగారు పోటీచేయుట తప్ప గత్యంతరం లేదని నిర్ణయించారు.

అప్పట్లో బ్రహ్మయ్యగారు అస్వస్థతగా వుండి గ్రామం లోనే వుండుటచేత, డాక్టరు పట్టాభి, ఎర్నేని సుబ్రహ్మణ్యం, కామినేని వెంకటప్పయ్యగార్లు వచ్చి సంగతి సందర్భములు వివరించారు. ఆయన కభిలాష లేకపోయినా కాంగ్రెసు ఆజ్ఞకు లోబడి సుశిక్షితుడగు సైనికునివలె అంగీకరించాడు. ♦

---

♦ ఈ సందర్భంలో కృష్ణాపత్రిక ఇట్లా వ్రాసింది. "బ్రహ్మయ్య స్వతంత్రుడుకాదు. ఒక సైనికుడు. తన శరీరమును తన మనస్సును, తన హృదయమును, తన సర్వస్వమును కా[illegible]

కాంగ్రెసు అజ్ఞాపించినది, బ్రహ్మయ[illegible]

చూడలేదు. ధనసహాయ ము[illegible]

లేదు. ఆ బాధ్యత ఆ కాంగ్రెసుది. [illegible]

నిమిత్తమాత్రము." [20-2-

ఇక ఎన్నిక ప్రచారం ఆరంభమైంది. చల్లపల్లి రాజా గారికి వంశిమాగధబృందం ధన రథ గజ తురగాలు యెంత తక్కువ! యాభై కార్లతో ఒక ప్రావకాండ సేనతో గూడవల్లి రామబ్రహ్మంగారి సారథ్యాన సాగింది, ఎన్నికల కోలాహలం. అన్న సత్రాలకు అంతులేదు. ప్రచారకులకు లెక్కలేదు. ప్రయాణఖర్చులు అడగని వానిది పాపం. సంచులు తెచ్చారు చల్లపల్లి వారు. జిల్లా అంతా హోరెత్తిపోయింది.

ఇక మన కాంగ్రెసు తరఫున పు పాతకాపులు పరుగు లెత్తసాగాయి. మనకుమాత్రం ఏముంది మార్బలం తక్కువా! ప్రచారకులు నడుములు కట్టారు. ఊరూరా కాంగ్రెసు శంఖారావం మారుమోగింది. డాక్టరు పట్టాభిసీతారామయ్య, బొద్ధవాఙ్మయబ్రహ్మ బలరామకృష్ణయ్య, ఉపన్యాస కేసరి చెరుకువాడ, ఆచార్యరంగా మొదలగు నాయకులు ఊళ్ళ వెంట తిరిగి ఉపన్యాసాలచేత ఉద్రూత లూగించారు. విప్లవ కవి శెట్టిపల్లి తన కంచుకొంఠముతో గేయాలు గానం చేస్తూ అఖండ ప్రచారం చేశాడు. కరపత్రాలతో జిల్లా అంతా సంచలనం కలిగింది. తీవ్రంగా పోటీ జరిగింది. ఎవరికి వారు తామే గెలుస్తామనుకున్నారు ప్రచారం పూర్తయింది. పీర్లు గుణ్ణాన పడ్డాయి.

ఓట్లు లెక్కించ [illegible]ారు. కలెక్టరాఫీసంతా [illegible] రావాచ్చినయ్యాంటే ఒక [illegible] డ, కైకలూరు, బందరు లెక్కించేసరికి [illegible]రామయ్యగారికే తాలూకా. ఈ పెట్టె [illegible]నే వుంది

జయం. అవి పగులగొట్టేసరికి అమితంగా వున్నాయి, చల్లపల్లి వారికి. రాజాగారికి వోట్లు 60,965. చుండ్రు వెంకయ్యగారికి 210. బ్రహ్మయ్యగారికి 52180. కూర్మయ్యగారికి 10,543. బుచ్చిదాసుగారికి 400.

తనతోడి అభ్యర్థియైన కూర్మయ్యగారిని గెలిపించి, తానోడినాడు బ్రహ్మయ్యగారు. తనతోడి అభ్యర్థి వోట్లన్నీ తానే వేయించుకొని గెల్చాడు రాజాగారు. ఈ యెన్నికల లోని రహస్యమిది. 3 తాలూకాలలో బ్రహ్మయ్యగారికే వోట్లు ఎక్కువవచ్చుటచేత నైతికంగా బ్రహ్మయ్యగారిదే జయం.

కీర్తిపోయినా ప్రతిష్ఠ నిలుపుకున్నారు చల్లపల్లివారు. అపజయానికి కంగీకరించి నీతినిలుపుకొని, కీర్తిప్రతిష్ఠలు పొందినాడు బ్రహ్మయ్యగారు. ♦

ఆనాడు బ్రహ్మయ్యగారు అపజయం గాంచినపుడు కృష్ణాపత్రిక వ్రాసిన ఈ సంపాదకీయం గమనింపతగినది అన్ని విధాల.

## చల్లపల్లి విజయం

“ఫిబ్రవరి 25 వ తేదీనాడు మాఘపూర్ణిమ. ఆపర్వదిన మున సముద్రుడుప్పొంగినాడు. ఆనాడే వోట్ల లెక్కింపు పర్వ

♦ ఈ యెన్నికలలో చల్లపల్లి రాజాగారికి రెండు లక్షలు ఖర్చైయి నవి. కాంగ్రెసు అభ్యర్థికి పదివేలు మాత్రమే ఖర్చు. ఇందులో అధికంగా యిచ్చింది విశ్వదాతే. 2500-0-0 లు అంతకంటె అధికంగా యివ్వ కనందుకు ఆవేదన పొందాడాతడు. ఈ ద్రవ్యసహాయమే గాక పత్రిక ద్వారాను పలువిధములుగా ప్రచారానికి అండగా నిల్చాడు, దేశోద్ధారకుడు.

మగుటచే బందరు పట్టణము గూడ నుప్పొంగిపోయినది. ఆ ఉభయ తీర్థములు సేవించుటకై వచ్చిన మహాప్రజచే సముద్రము పట్టణముగా, పట్టణము సముద్రముగా మారిపోయి ఉభయఘోషలు ఒకదానినొకటి ఢీకొని ఆకసమున మారుమ్రోగుచుండెను. ఆ యపూర్వ వర్షాసమ్మేళనము మహోదయమును అర్ధోదయమును మఱపించుచుండెను.

పల్లెలలో సంవత్సరము పొడవున చేసిన కృషి ఫలములను నూర్చుకొని తమతమ గృహములను నింపుకొన్న ఆ ప్రజ మరల ఈ నెలదినములును చేసిన అపూర్వకృషి ఫలమును నూర్చుకొనుటకై పట్టణముపై వచ్చిపడెను. ప్రాణప్రదములగు ధాన్యరాసులను కన్నారగాంచి ఆనందించిన ఆ కర్షకలోకము, ఎలెక్షను వ్రతములో తాముచేసిన వోట్లపూజా ఫలశ్రుతిని చెవులార విని ఆనందించుటకు తహతహపడుచుండెను. విశ్వాసముతో నిండిన చూపులు ఆవేదనముతో గూడిన నడకలు – ఉత్కంఠముతో నిండిన హృదయములు ఆ ప్రజను నిలిచినచోట నిలువనీయక, సంభ్రమ వివశముగాపంచి, రస్తాలను, కాఫీహోటళ్ళను, వీధి యరుగులను, ఆఫీసులను, సత్రములను నింపివేసెను. కలెక్టరాఫీసు త్రోవపొడువునా ప్రజలే...జనజనము, మోటార్లు అచటి వార్తలను వాయు వేగముతో కొనితెచ్చి ప్రజలపై విసరిపోవుచుండెను. ఆ ప్రజల ప్రాణములన్నియు కలెక్టరాఫీసులోనే యున్నవి. ఆ వోట్ల పెట్టెలలో నిక్షేపించిన ప్రాణములు వేలకొలదిగా గంట గంటకు వెలుపలికి వచ్చి, ప్రజల దేహములతో చేరుకొనుచున్నట్లుండెను. ఆకలెక్టరాఫీసు సూతికాగారమై పోయినది. అచటినుండి తమ

ముక్తి ప్రసవవార్త యెపుడువచ్చునా, యెపుడువచ్చునాయని ప్రజలందరు తమ ప్రాణములన్నియు తమ చెవులలో చేర్చుకొని, పుత్రోదయ శుభవార్తను ప్రతీక్షించు క్రొత్త తండ్రులవలె నైపోయిరి.

ఆనాడు చెన్నరాష్ట్రమంతటను, ప్రతి పట్టణమును, యించుమించు యిట్టి పుత్సాహముతోనే నిండియుండెను. కాని తక్కిన రాజధానియంతయు నొకయెత్తు. తూర్పు కృష్ణా మండల మొకయెత్తుగా నెంచవలసినది. ఆంధ్రభూమి యందలి ప్రతి మండలమును పోరాడినది. జమీందారులతో నైన మాట నిజమైననూ, యిచట చల్లపల్లి రాజాగారితో ప్రజలకు ప్రవర్తిల్లిన పోరాటము మాత్రమట్టిదికాదు. ప్రధానమంత్రియై చెన్నరాష్ట్రమంతటిని తన పాదాక్రాంత మొనర్చుకోవలయునన్న పేరాసతో చాణక్య తంత్రములను పన్ని పౌలస్త్య దారుణకర్మముల కొడిగట్టి జగద్భయంకరుడైన బొబ్బిలినేతను ఓడించుట ఓడించుటకాదు. దీనజనావన పరతంత్రతయు, అసాధారణ వితరణశీలతయు, తనకు సంపాదించి పెట్టిన సత్కీర్తి ముందునడువ బ్రహ్మర్షి ఆశీర్వచనబలము తోడై వెన్నంటియే తేర, అపారమగు అంగబలమును, అర్థబలమును తోడు చేసుకొని, మూడు దినపత్రికలు, మూడుభాషలలో అనుదినమును, తనకు వందిమాగధకీర్తనములు సలుపుచుండ, చెన్నరాజధానిపై బొబ్బిలి మంత్రికి ప్రతిస్పర్థియై యెత్తి నడచిన పీఠికా పురాధీశ్వరుని, సపుత్రకముగా పరాజితునొనర్చుటకూడా లెక్కలోనిదిగాదు. జస్టిసుపార్టీ విఫలతకు మూలకందమైన వెంకటగిరినికూడా ముట్టడించి యాచభూప

కుమారద్వయము నోర్వవచ్చును. ఇంతకాలము కౌన్సిలు అధ్యక్షుడుగానుండి, సౌమ్యుడు, సహృదయుడు, సౌజన్యనిధి, అభిజన సంపన్నుడునైన రామచంద్రారెడ్డిని జయించుటకూడా గణింపదగినదికాదు. ఇక ఆసులోని కండెవలె అటునిటు తిరుగుచు, ఆస్థానావేశము, అకాండతాండవము ప్రదర్శించు భగ్నాశువు, పరశురామ పాత్రోను జయించుటనుగూర్చి వేరుగా చెప్పనక్కరలేదు. ఈ జస్టిసు మహారథు లొక్కరొక్కరే ఓడుచున్నవార్తలు పుంఖానుపుంఖములుగా శ్రవణపేయములై అనుదినము వచ్చి చేరుచున్నవే కాని, చల్లపల్లివార్త చెవులబడువరకు ఆ విజయవార్తలు మా మండలము, మనస్సుకెక్కనేలేదు. నిశ్చయమని ముందే ముడివేసుకొని కూర్చుంటిమి కాన, కాశీశ్వరరావు విజయవార్త మా చెవుల దూరనేలేదు. నారాయణస్వామి నాయని విజయవార్త గాని, రామకోటయ్య అపజయవార్త గాని మమ్మంత కలవర పెట్టలేదు. మా బ్రహ్మయ్య గెలిచెనన్న మంగళవార్తయే మా మండలమున కమృత సేచనమై ప్రసాదభూపతి పరాజయమును సాధించి, తూర్పుకృష్ణా పావనమగునని ఉవ్విళ్ళూరితిమి. కాని ఆశాభంగులమైతిమి. మేమేకాదు అశేషజనము. ముఖ్యముగా నారీలోకము.

ఈ యోడిన జస్టిసు రథికులందరికంటె చల్లపల్లి జమీందారుని అతిశయమేమియని ప్రశ్నింపవచ్చును. నిజమే; చల్లపల్లి జమీందారు పిఠాపురేశునికంటె పరోపకార పారీణుడు కాడు. వీరబొబ్బిలి ప్రభునికంటె రాజనీతి చతురుడు కాడు. వెంకటగిరిఱేఁడును భీష్మతుల్యుడు కాడు. అయినను వారెల్లరు

కాంగ్రెసు ఝంఝామారుతము ముందు దూది పింజలవలె యెగిరిపోవుచుండ ఈ యొక్క చల్లపల్లికి విజయము సిద్ధించుటలో విశేషముగలదు. ఈ దృశ్యమును గాంచియే జిల్లా యంతయు నివ్వెరపోవుచున్నది.

ఇందుగల విశేష మేముందురా? వినుడు. ఆ రాజులందరు వెలమ ప్రభువులు. వారి వెనుక స్వసంఘమనునది లేదు. రైతులు యితర కులములవారు. రైతుక్షేమము విస్మరింపజేయునంతటి కులాభిమానము వారి నంధులనుగా జేయలేదు. బొబ్బిలిమంత్రిని పరాజితునిగా జేసిన దెవరు? గిరి — బ్రాహ్మణుడు, కార్మిక నాయకుడు. పిఠాపురాధీశుని పీటీసున్న చేసిన దెవరు? వళ్ళ రాజు, తెలగ రైతుబిడ్డ. వెంకటగిరి కుమారరాజును పేటాక్షి పట్టిన దెవరు? నారాయణరెడ్డి యువకుడు. యిక్కడ చల్లపల్లిని పల్టీలుకొట్టించుటకు నిలువబడిన దెవరు? బ్రహ్మయ్యా చౌదరి కమ్మసంసారి, స్వసంఘీయుడు. కాని చల్లపల్లి వీని చేత చిక్కలేదు. బ్రహ్మయ్యా ఓటమి పొందినాడు. ఎంతటి గుణపాఠము! దశదిశలు కాంగ్రెసు విజయఘోషతో బిక్కటిల్లుచుండ తోటి జిల్లాలన్నియూ, కాంగ్రెసుకే పట్టముగట్టి యూరేగుచుండ చల్లపల్లి కాంగ్రెసునే దెబ్బగొట్టుటను కారణమేమి, యిక్కడ కాంగ్రెసు ప్రచారము తగినంతగా జరగలేదనెదరా? జరుగకేమి! అత్యాశ్చర్యముగా జరిగినది. దివి, బందరు, గుడివాడ కైకలూరు తాలూకాలు గడచిన ఆరువారములును కాంగ్రెసు ప్రచారముతో హోరెత్తిపోయినవి. ఎన్నిసభలు, యెన్ని వుపన్యాసములు, యెన్ని కరపత్రములు, యెన్ని వాలంటీరుదళములు గ్రామగ్రామమును గదలించి వైచినవి.

యెప్పుడును కాంగ్రెసు సందేశము చేరని పల్లెలలో కూడా ప్రబోధము జరిగినది. ఒక్కొక్కలమేమి సకల సంఘములు కాంగ్రెసు ఆవేశమున జిక్కుకొన్నవి. ఆ యెన్నికరోజున ప్రతి పోలింగు స్టేషను నందును, ప్రత్యేకమైన దృశ్యము లేచాయను. కాంగ్రెసు ప్రభావమెట్టిదియో చెప్పికయె చెప్పినవి. యే నైపున విన్నను రైతుగీతములే ప్రతిధ్వనించినవి. స్త్రీలు సయితము బిడ్డలను చంకనెత్తికొని, పసుపుపెట్టెను పూజించుటకు పేరంటాండ్రవలె వచ్చిరి. ఒక గ్రామమున ఒక కన్న వదలి కుమార్తెను వెంటబెట్టుకొని, పోలింగు స్టేషనుకు వచ్చుచుండెను. ఆ ప్రక్క నుండి మరి ముగ్గురు నలుగురు స్త్రీలు కూడా వచ్చి వీరిని గలిసికొనిరి. యింతలో వీరెవ్వరమ్మా యని ఆ నాలుగేండ్లపిల్ల ప్రశ్నించెను. వాళ్ళు మనవారేనే అని తల్లి జవాబుచెప్పెను. కాని ఆపిల్ల నాప్రత్యుత్తరము సంతృప్తి పరచలేదు. అమ్మా వాళ్ళు కాంగ్రెసు వాళ్ళేనా? వాళ్ళు మనవలె పచ్చపెట్టెలోనే వేస్తారా? అని తిరిగి ప్రశ్నించెను. ఆ చిన్నబాలికలో ఆ ఆవేదన కలిగించిన దెవరు? ఆ పలుకులు వినినప్పుడు యెవని హృదయము జలదరించకుండును? నారీలోకమంతయు కాంగ్రెసు భావభరితమైనదనుట నిశ్చయము. పురుషులను, కులతత్వములు స్వప్రయోజనములు కర్తవ్య మూఢులనుగ జేయుచుండినను నారీమణుల కోమలహృదయముల దేశభక్తి సంఘటితములై పసుపుపెట్టెలనే ఆశ్రయించెను. యిక కాపుజనులలో కలిగిన ప్రబోధము వర్ణింప నలవికాదు. ఒకమారటు చిన్నాపురము పోయి చూడుడు. యిటు కలిదిండికి వెడలి తిలకింపుడు. స్త్రీపురుషు

లలో కాంగ్రెసు అవబోధము ఎంతకలిగినదియు బోధపడును. అయినను కాంగ్రెసున కిట్టి అపజయము కలుగుటకు కారణ మేమి? దీనికి సమాధానము చెప్పవలసినది కాంగ్రెసువారు కాదు. రాజాగారును వారి యాశ్రితులును కొంత యాత్మ పరీక్ష జేసుకొనిన సమాధానము వారికే గోచరించును. ఒక కారణము సాంఘికము, రెండవకారణము ఆర్థికము. సాంఘిక మేమి యనెదరా? చల్లపల్లివారు కమ్మవారు. కమ్మసంఘమే యీ తాలూకాలో చాలాబలవంతమైనది. చల్లపల్లి పడిపో యిన కమ్మసంఘములకే హానికలుగునను దుష్ప్రచారమును సాగించిరి. కమ్మరైతుబిడ్డడగు బ్రహ్మయ్య విజయము కమ్మ సంఘమున కపకారమై చల్లపల్లి జమీందారుని ఓటమి స్వసం ఘీయులకు గౌరవభంగమని తలంచునంతటి యవివేకు లెవ రుందురు? అయినను కొందరట్టి యవివేకములోనే పడినమాట వాస్తవము. కాని నిజముగ వారిసంఖ్య బహుస్వల్పము అయి నను రాజాగారి గెలుపు యెట్లు కలిగినది? వాస్తవమునకు గెలుపెక్కడ? కాంగ్రెసుఅభ్యర్థులైన బ్రహ్మయ్య, కూర్మయ్య ఓట్లను కలిపిజూచినయెడల జస్టిసు అభ్యర్థులనోట్లెక్కువకావు. అధికసంఖ్యాకులైన కమ్మసంఘీయులైనను రాజాగారికి విజ యము జేకూర్చి పెట్టగలిగిరా? లేదు కమ్మవారందరును నట్టి కులతత్వ పీడితులనుకొనుట నట్టి పొరబాటు. రాజాశ్రయ ముచే స్వార్థమును నింపుకొనజూచు పరద్రవ్యోపజీవులు, అన్ని కులములలోను వుందురు. కమ్మవారిలోను కొందరు వుండిన వుందురుగాక. వారితోడ్పాటు కొంత కలదుగాని హెచ్చుమందియే కులపిశాచగ్రస్తులై, స్వప్రయోజనపరులై

యుండినయెడల రాజాగారు, వారి యాత్రికులుగూడా వాడ, వాడ తిరిగారు, తిరిగారుదిరిగి, చాకళ్ళు, మంగళ్ళు, గొల్ళ్ళు, పల్లె కాపుల. పంచముల వోట్ల నిర్లో ఆశక్తి చవలసిన అవసరమేమి కలిగినది? అట్టి వోట్లసంఖ్య వారి యేజంట్ల జమాఖర్చులను బట్టి నిర్ణయించుట కష్టముగాదు. అంతేకాదు. తమ యస్టేటు రైతులందరుచేత తమకు వోటు వేయించుకొనగలిగిన తమతోటి అభ్యర్థియైన చంద్రు వెంకయ్యగారిని యెందుకు గెలిపించలేకపోయిరి. నిమ్నజాతుల వోట్ల నాకర్షించుటచేతనే గాక, తోడి అభ్యర్థిని కబళించినగాని తమకు విజయము సమకూర్చుకొనుటయేమో బోధపడినదా?

ఈ విజయోత్సాహముతో రాజాగారికి ఆత్మపరీక్ష చేసుకొనగల చిత్తస్వాస్థ్యముండదని మాకు దెలియును. కాని ఈ మైకము ఒకటి, రెండు రోజులలో వదలగలదు. తమకు హెచ్చు వోట్లు వచ్చినంతమాత్రమున రైతులందరు తమపక్షమున నుండిరను భ్రమ వీడుట కొంతకాలమో పట్టదు. రైతులలో కలిగిన అవబోధ మపూర్వము. యిది సార్వజనీన సంచలనము. ఆశేతు హిమాచలపర్యంతము దేశమును మూలమట్టుకు గదలించి వైచు మహాజాగరణమిది. తోడి జమీందారులందరు 'నదీనాం సాగరో గతిః' అగుచుండ చల్లపల్లి యస్టేటుమాత్రము భద్రముగానుండగలదని యెట్లూహించగలరు? ఈ యెన్నికలను మించిన ప్రచండాందోళనము త్వరలో రానున్నది. ఫ్యూడల్ పద్ధతి యంతయు నామరూపములులేకుండా తుడిచిపెట్టుకొని పోవు రోజులు సమీపించుచున్నవని యీ యెన్నికలు కొంతవరకు సూచించుట

లేదా? అప్పుడీ కులాభిమానములు జమీందారులను రక్షింప
జాలవు. యిప్పుడే పంచముల, సాలీల గౌడుల, పల్లె
కారీల నోట్లసహాయంతో రాజాగారు నెగ్గగల్గిరో వారే
జమీందారీపద్ధతికి బద్ధవిరోధులై కొత్త ఆర్థికవ్యవస్థకు కారణ
భూతు లయ్యెదరనుట నిశ్చయము. నాయకులు ధాతులు. అనా
తురులు, నిరాధారులు, నేడు వారు పావలాడబ్బులకు కక్కుర్తి
పడవచ్చును. కాని రేపు జమీభూములలో అసలు పాలుకే
పోరాడెదరని తెలుసుకొనుడు. రేపు కాంగ్రెసువారి యొత్తి
డిచే శేరీభూముల శిస్తులు తగ్గినప్పుడు మీకిప్పుడు నోట్లిచ్చిన
యస్టేటు రైతులు హెచ్చుశిస్తుల నిచ్చుకొనుచుండుట కొప్పు
కొనెదరా? యస్టేటులోని పోరంబోకులను, బంజరులను బీళ్ళను
గ్రామస్తుల పరము జేయవలసినదిగ అసెంబ్లీలో బిల్లు ప్రవేశ
పెట్టబడినప్పుడు మీరైతులప్పుడు మీ ప్రతివాదనలను సహిం
చెదరా? అప్పుడైనను మీరు వారి ప్రతినిధులు కాజాలరని
తెలిసికొనకుందురా? మీ యస్టేటులోని సంపన్న గృహిణులు
అసూర్యంపస్యలు పోలింగుస్టేషనులకు నిర్భయముగపోయి,
మీ ప్రత్యర్థియైన రైతుబిడ్డకే వోటుచేయుటలో రానున్న
మహా సాంఘిక పరివర్తనము, మీకు బోధపడకుండా యెట్లుం
డగలదు. పైసంవత్సరము తిరిగి రాకపూర్వమే జమీందారులు
రైతులలో లీనమైపోవుటయో లేక సంస్థానభ్రష్టు లగుటయో తేల
గలదు. మీకిప్పుడు చేకూరిన విజయము మీకు నిజముగా
శుభావహముగాక, మీ మెడకు గుదిబండయై తీరనిదుఃఖము
వాటిల్లజేయును. యింతకును మీకివి మంచిరోజులుకావు.
అందుకనియే విపత్కరమైన విజయమొకటి మీకిప్పుడు దాపు

రించినది. మీరు అస్సెంబ్లీకి పోయినప్పుడుగాని, దీని విపర్యయము మీకు సరిగా హృద్గతము కానేరదు. ఆ రాజసభలో మీ కులగురువగు బొబ్బిలికానరాడు. జస్టిసుపార్టీ యొక తల లేని మొండెమొకటి యెదురగును. మీరు ప్రక్కజిల్లాలలో నిలబెట్టిన అభ్యర్థులుకూడా ఓడినపిమ్మట జస్టిసు యొక్క శిరమే కాదు పక్షములుకూడా లేని మొండెము, దుఃఖకరమైన దృశ్యము కాదా అది. ఆ రాజసభకుపోయి మీరిక చేయగలిగినదేమి! మీ యస్టేటురైతు నోడించితిననుసంతృప్తి దక్క మీకుకలుగు భాగ్యము కించిత్తయినను వుండదు. యెప్పుడు బొబ్బిలి పడిపోయినాడో అప్పుడు మీ కాశ్రయము పోయినది మీ మిత్రులెప్పుడు గెలువలేకపోయిరో మీరు రెక్కలు లేని పక్షులైతిరి. యెన్నికలలో రైతుగీతములు మీ చెవిని బడకుండా మీ చెవులు మూసుకొని యుండవచ్చును. కాని రేపు రాజసభలో మంత్రిపీఠమునుండియే రైతు గీతములు ప్రతిధ్వనించినయెడల మీ హృదయము లెట్లు తల్లడిల్లునో యెవరు చెప్పగలరు, అప్పుడు మీ యేజంట్లు మీ ఆశ్రితులు మీ బెదురు తీర్పజాలరు. ఆ రాజసభలకుపోయి, ఆ గాంధీ టోపీలనుచూచి బెదరిపోవుటకంటె చల్లపల్లికోటలో నెమ్మదిగా కాలము గడుపుటయే సుఖమని త్వరలోనే తెలుసుకొనగలుగుదురుగాక.

కృష్ణాపత్రిక 27-2.1937

—0—

# ఆంధ్ర రాష్ట్రీయ మహాసభ — అధ్యక్షత

మ॥ అదిగో ముంగల పెద్దమద్ది యటపో నా చెంత ద్రేపల్లెయు
న్నది, యాదండఁగళిందజాతటమునం దా పింఛభూజాళితో
గదుపుల్ మేపుచు గోపబాలకుడు నిక్కంబొప్పగాఁ దెల్పున
త్పవిఁబొమ్ముల్సభాసుభాస్పదముగా భావంబు రాజిల్లెడున్.

—కృ ష్ణ క ర్ణా మృ త ము.

బ్రహ్మయ్యగారు, కాంగ్రెసు రంగంలో ఇంతవరకు జిల్లా ప్రముఖులుగానే ఉండిరి. 20–6–1937 తేదీని నంద్యాలలో జరిగిన ఆంధ్ర రాష్ట్రీయ మహాసభకు అధ్యక్షత వహించుటతో ఆయన రాష్ట్రీయ ప్రముఖుడయ్యాడు. ఆయన ఆసభలో ఇచ్చిన ఉపన్యాసం సర్వతోముఖంగా వున్నది. సంగ్రహం గాను, సమగ్రంగాను ఆయన అవసరమైన విషయాల నన్నింటిని చర్చించాడు. ఆంధ్రరాష్ట్రీయ మహాసభా చరిత్రలో తెలుగున మొట్టమొదటగా అధ్యక్షోపన్యాస మిచ్చింది ఆయనే. రైతులలో ప్రథమంగా ఈ గౌరవస్థానం ఆయనకే లభించింది. ఆహ్వానసంఘాధ్యక్షులుగు నాయని శంకరరెడ్డిగారుకూడా రైతే. ఆయన అధ్యక్షోపన్యాసాన్ని ఇక్కడ నేను తిరిగి వ్రాయ తలచను. కాని ఆయనకు కలిగిన గౌరవాన్ని ఆయన యెట్లా తలచాడో, ఆయన రైతు హృదయం విదితం కాగలందులకు, ఆభాగం మాత్రమే ఉదహరిస్తాను.

"ఇంతవరకు ఈసభల కధ్యక్షత వహించినది ఆంధ్ర నాయక శ్రేణిలోనివారు పట్టభద్రులును, ధనికులును, పట్టణ

వాసులును అయియున్నారు. ఈ సందర్భము, సాంప్రదాయమునకు పూర్తిగ భిన్నముగ, పై అన్వత లేని ఒక పల్లెటూరి సామాన్య రైతునకు, నన్ని బాధ్యతతో కూడిన పెద్దరికమునను వినియోగించిరి. ఈ మార్పును కాంగ్రెసు క్రమానుగతముగ పొందుచూ వచ్చిన పరివర్తనలనే సూచించుచున్నది. పూర్వము కాంగ్రెసు పెద్దల దృష్టి పట్టణముల దాటి, పల్లెగ్రామములపై ప్రసరించలేదు. కాంగ్రెసును నడుపుచుండినది పూర్తిగా ఆంగ్ల విద్యాధికులే, జానపదులు కారు. 1920 సంవత్సరమున, కాంగ్రెసు నాయకత్వము మహాత్ముడు వహించిన నాటి కాంగ్రెసుదృష్టి పల్లెగ్రామములపై బడినది. కాంగ్రెసుయొక్క మూలశక్తి పల్లెగ్రామవాసులయందే కలదని కనుగొనబడినది. భారతీయులలో నూటికి 90 మంది గ్రామవాసులు. దేశములోని ప్రధాన పరిశ్రమయగు వ్యవసాయమునకు గ్రామములే మూలము. వ్యవసాయమునకు ఉపపరిశ్రమగా భావించబడు, ఖద్దరు వుత్పత్తి గ్రామవాసుల పెత్తనముననే సాగించబడుచున్నది. గ్రామ, ఫిర్కా, తాలూకా, జిల్లా, సంఘము లేర్పడినపిమ్మటనే, కాంగ్రెసు ప్రజాశక్తియందు ప్రతిష్ఠితమై సర్వతోముఖమైన అభివృద్ధి పొందగలుచున్నది. నేడు స్వరాజ్యమంత్రము మారుమూలలకు సహితము ప్రాకినది. అన్నము పున్నము నెరుగని పల్లెగ్రామవాసులు శిక్షితులగు సైనికుల వలె, స్వరాజ్యసంగ్రామమున పాల్గొని ప్రజాశక్తిని ప్రదర్శింపగలిగిరి. కావున పల్లెగ్రామవాసుల తరపున నేనీసభ కధ్యక్షత వహించుట అపూర్వమైనను, అసమంజసముగాదు. రైతుల

హార్థికీభావిధముగ గుర్తించిన జిల్లా కాంగ్రెసు సభ్యులకును ఆహ్వాన సంఘమువారికిని జానపదులవతుమున కృతజ్ఞతా పూర్వక వందనములు.

పల్లెటూరి వారియందును, నాకంటె అనేక విధముల యుండు కష్టాలను మేటిసోకులుండ, నాకీ ప్రథమ అవకాశము లభించుట దేశములోని కాంగ్రెసువాదులలో నాయెడగల ప్రేమయే కారణమనుట నిశ్చయము. విధేయుడనగు సైనికుడ నగుట, మీయాజ్ఞను శిరసావహించి యీ సభకు అధ్యక్షత స్వీకరించుచున్నాను. నన్ను నిమిత్తమాత్రునిగనుంచి, యీసభ జయప్రదముగ జరుపుకొను బాధ్యత మీయందే కలదని జ్ఞాపకము చేయుచు కోరెదను.”

ఈ సభను శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలా చార్యులుగారు ప్రారంభించుట మరొక విశేషం.

బ్రహ్మయ్యగారి అధ్యక్షోపన్యాసాన్ని మన తెలుగు పత్రికలన్నీ ప్రశంసించుటే గాక, మద్రాసు మెయిలుకూడా మహత్తరంగా వున్నదని అంటూ యిట్లా పేర్కొన్నది. “అధ్యక్షుడు తాను రాజకీయవేత్తను కానని, విద్యాధికుడను అసలే కానని, తాను కేవలం పల్లెటూరి రైతునని చెప్పు కున్నాడు. కాని ప్రారంభకుడుగా వున్న రాజాజీ ఉపన్యాసం కంటె ఆయన ఉపన్యాసం అన్ని విషయాలు చర్చించుటవల్ల, సమగ్రంగాను, సముచితంగాను ఉన్నది.”

ఇక సభాకార్యక్రమనిర్వహణంలో ఆయన చూపిన చతురత, సమయస్ఫూర్తి, శాంతము, యువకుల బుజ్జగించుట లోను, నాయకుల మందలించుటలోను, ఆయన చూపిన

అసమానప్రజ్ఞను రాయలసీమ పత్రికలన్నీ ప్రస్తుతించినవి. ఆంగ్లవిద్యాలోపము ఆయన అధ్యక్షుకీపికి వన్నె తెచ్చెనన్నవి. దేశకాలపాత్రములనుసరించి, అప్పటి ఆవేగము, ఆక్రోశ ములననుసరించి ఆంధ్రరాష్ట్రమహాసభాధ్యక్షత కాయన తగియుండెనని ప్రకటించినవి.

ఈ సభాసమయానే శ్రీయుత కాశీనాధుని నాగేశ్వర రావుగారు ఢిల్లీ శాసనసభకు రాజీనామా పెట్టిన ఖాళీస్థానానికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారి నియామకంలో తగాదా లేర్పడ్డవి. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారిని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు శిఫారుస్సు చేసింది. కాని తిరుమలరావుగారిని నియ మిస్తూ పటేల్ గారు టెలిగ్రాం పంపారు. రాష్ట్ర కార్యదర్శియగు సాంబమూర్తిగారు దానిలో యేదో తోళక్కంచేశారని, సత్య నారాయణమూర్తిగారి తరఫువారి విశ్వాసం. ఆనాడు రైతు సంఘాలకు యువజనసంఘాలకు, సోషలిస్టులకు ఆచార్య రంగా నాయకుడు. వారంతా సత్యనారాయణమూర్తిగారికి కలిగిన అన్యాయానికై, ఆక్రోశం అధికంగా చూపుతున్న సమయం. అట్టి వాతావరణంలో ఈ సభ యే నిమిషాన, రసాభాస మగునో, భంగమగునో అని ఆందోళన పొందుతున్న సమ యంలో, యెంతో ప్రతిభ, శాంతము, అనుభవము, దక్షత వుండవలెనుగదా అధ్యక్షునకు. అట్టివన్నీ ఆయనలో వున్న వని ఆ సభానిర్వహణములో ధ్రువపడెను.

ఆ సమయంలో సాంబమూర్తిగారిపైగలకోపం నిండు సభలో వెల్లడైనది. సాంబమూర్తిగారు ఉపన్యసించుచుండగా



నంద్యాల రాష్ట్రీయ మహాసభ



రాష్ట్రకార్యదర్శిగా మన రైతుపెద్ద

ఆయనను 'అసత్యవాది' అని యెవరో తూలనాడిరి. వెంటనే అన్ని మూలలనుండి ఆ మాటలను ఉపసంహరించుకోవలెను? కేకలు బయలు దేరెను. ఆ మాట్లాడిన దెవరో గుర్తుపట్టలేదు. అందుచేత సభ వారి తరపున, సభకు అధ్యక్షుడైన బ్రహ్మయ్య గారే, సాంబమూర్తిగారిని క్షమాపణకోరి కార్యక్రమము, క్రమముగా జరుగు ప్రశాంత పరిస్థితి యేర్పరచిరి. బ్రహ్మయ్య గారి సమయస్ఫూర్తికి సభ్యులందరు సంతసించిరి.

సాంబమూర్తిగారు మాట్లాడేటప్పుడు ఒక వివాద మేర్పడింది. దానిపై అధ్యక్షుడు నిర్ణయం యిచ్చిన తర్వాత మళ్ళీ సాంబమూర్తిగారు సవాల్ చేయ నారంభించారు. అధ్యక్షుని నిర్ణయం అయినతర్వాత, దానికి భిన్నంగా వారు మాట్లాడుట సభా మర్యాదగాదని బ్రహ్మయ్యగారు అనేసరికి, ఆయన నిష్పాక్షికతకు, వివేకానికి సభంతా హర్షామోదం చూపింది.

ఇటువంటి వడుదుడుకు సమయాన సభను సామరస్యంగా నడిపినందుకు శ్రీయుత కొండా వెంకటప్పయ్యగారు కొండంతగా కొనియాడారు; వేమవరపు రామదాసుగారు, వేనోళ్ళ వినుతించారు. మిగతా నాయకులు, ప్రేక్షకులు ప్రతినిధులుకూడా ఆ ప్రశంసలను తమ హర్షధ్వానుల మూలంగా వెల్లడించారు.

---

▸ సభలో సంగతులు సమీక్షిస్తూ పచారు చేస్తున్న పట్టాభిగారు అచ్చట నున్నవారితో "ఆ సమయస్ఫూర్తి చదువుకుంటే వస్తుందా? ఒక బి.యే.కు వస్తుందా? అది పుట్టుకతోనే వస్తుంది, పుస్తకాలవల్లరాదు-బ్రహ్మయ్య గారి గొప్ప గమనించారా?" అంటూ అభినందించారు.

క॥ తలవరువు, నోరెచెవ్వను
లలితాయల పండువరువు, రంగేచెవ్వన్ -
శిలవాజి, జనము నడకయుఁ
కులమును వేషమును జెప్ప గుర్వాలచెన్నా.

---

# రాష్ట్ర కార్యదర్శి

"భూమినుండి సమస్త పదార్థములను ఉత్పత్తి చేయ గలవాడు రైతు. మంటినుండి ధాన్యమును సృజింపజాలినరైతు యేమి చేయజాలడు? మనబలమును శక్తిని మనము గుర్తించ నంతవరకు మనము అసహాయులముగనే ఉందుము"

— రాజేంద్రబాబు.

భారతదేశమంతటా కాంగ్రెసు యెన్నికలలో పోటీ చేసింది. ఏడు రాష్ట్రాలలో విజయం గాంచింది. ప్రథమ తాంబూలం మన మద్రాసుదే. 215 స్థానాలలో 116 సాధారణ నియోజకవర్గములైనా, కాంగ్రెసు సంపాదించిన స్థానాలు 159. ఈ విజయసారథి ఆంధ్రకేసరే.

అప్పట్లో ఆంధ్రరాష్ట్ర అధ్యక్షులు ప్రకాశంగారు రివిన్యూమంత్రిగాను, కార్యదర్శిగానున్న సాంబమూర్తిగారు శాసనసభాధ్యక్షులుగాను యెన్నుకొనబడుటచేత పై పదవులు రెండు ఖాళీకాగా, యెన్నిక జరగవలసివచ్చింది.

అవకాశాలు అందరికీవస్తవి. కాని వాటిని అనుకూలంగా చేసుకొనే ప్రజ్ఞ కొందరికే వుంటుంది. అటువారిలో మన బ్రహ్మయ్యగారొకరు. ఆంధ్రరాష్ట్రీయసభ కార్యదర్శిత వహించిన తర్వాత ఆంధ్రరాష్ట్ర కార్యదర్శి పదవి ద్వారా ఆంధ్ర దేశ సేవ చేయవలెననుకొన్నాడాయన. ఆసంగతి ఆయన పెద్ద గురువు కృష్ణారావుగారితో చెప్పేసరికి, "నీవు కార్య దర్శిగా వుండడమేమిటి అధ్యక్షుడుగా వుండు. పట్టాభిగారిని కార్యదర్శిగా వుండమంటాను. బ్రాహ్మణుడెప్పుడూ మంత్రిగా వుండడం ఆచారమ"న్నారు. "అట్లాకాదు. అందుకు అర్హుడను కాను. కార్యదర్శిగానే వుంటా" నన్నాడు శిష్యుడు. "అట్లా ఐతే జిల్లా కాంగ్రెసు సంఘానికి మీరు ప్రెసిడెంటుగాను పట్టాభిగారు కార్యదర్శిగాను, యెందుకు పనిచేశారం"న్నారు కృష్ణారావుగారు. "ప్రెసిడెంటు అంటే యేమిటో, శెక్రటరీ అంటే యేమిటో సరిగా తెలియని రోజులు గనుక ఆనాడు అంగీకరించాను. ఇప్పుడు నాస్థితి నాకు తెలుసుగనుక కార్య దర్శికే నేను అర్హుడను" అన్నాడు బ్రహ్మయ్యగారు. "అట్లా ఐతే మీయిష్టం. అవశ్యం కానియ్యండన్నా"డు పంతులు గారు. పట్టాభిగారు మాత్రం మీరు శెక్రటరీగా వుండడం మంచిదేగాని, ప్రెసిడెంటునుమాత్రం వేరే చూచుకొండన్నారు.

ఇదివరకు అధ్యక్షులు తమకు అనుకూలమైన కార్య దర్శులకొరకు వెతుక్కొనేవారు. ఈసారి కార్యదర్శే తన కను కూలమైన అధ్యక్షుని అన్వేషించవలసివచ్చింది. పట్టాభిగారు తాను వుండనని చెప్పి సిమ్లా వెళ్ళారు. కృష్ణారావుగారు సీతా రామయ్యగారిని ఒప్పించగలరనే విశ్వాసంతో బ్రహ్మయ్య

గారు తాను కార్యదర్శిగాను, సీతారామయ్యగారు అధ్యక్షుడుగాను, ఏర్పాటు చేసుకొని ఎన్నిక ప్రచారం ప్రారంభించాడు. బ్రహ్మయ్యగారు కాంగ్రెసులో నేగాక రైతు రంగంలో కూడా పనిచేయుచుండుటచేత, ఢిల్లీలో వున్న రంగాగారు బ్రహ్మయ్యగారితో మాట్లాడి, ఆయనను రైట్టిస్టుల పక్షాన కార్యదర్శిగాగాని, అధ్యక్షుడుగాగాని, నిలబవలసిందిగా కోరమని కాట్రగడ్డ వారికి వుత్తరం వ్రాశాడు. దానిని పురస్కరించుకొని వామపక్షీయులందరు బెజవాడలో కూడి, బ్రహ్మయ్యగారిని రావించి, రంగాగారి అభిప్రాయము తెలియజేశారు. అందుకాయన తాను రైటిస్టుగా పోటీచేయదలచుకున్నానని చెప్పాడు.

అందుచేత ఎన్నికలలో పోటీజరిగింది. 1937 జూలైలో రైటిస్టుల తరఫున ప్రధానపాత్ర బ్రహ్మయ్యగారే వహించవలసి వచ్చింది. రైటిస్టుల పక్షాన అధ్యక్షపదవికి పట్టాభిగారు నిలనగా, వామపక్షాన మద్దూరి అన్నపూర్ణయ్యగారు నిలబడిరి. కార్యదర్శి పదవికి బ్రహ్మయ్యగారితో, అన్నాప్రగడ కామేశ్వరరావుగారు పోటీచేశారు. వామపక్షీయులు ఓడిపోయారు.

రెండవ సంవత్సరం ది 16-1-1938 తేదీని బెజవాడలో ఎన్నికలు జరిగినవి. అప్పుడుకూడా వామపక్షం తరఫున పోటీ జరిగింది. రంగాగారు పట్టాభిగారితో పోటీచేయగా రంగాగారికి 81 వోట్లున్నూ పట్టాభిగారికి 143 ఓట్లున్నూ వచ్చినవి. కార్యదర్శి పదవికి బ్రహ్మయ్యగారితో పోటీచేసిన పుచ్చలపల్లి సుందరయ్యగారికి 61 బ్రహ్మయ్యగారికి 161, ఓట్లు వచ్చి

నవి. ఆంధ్రరాష్ట్ర రాజకీయ సభ్యులలో ఆ కాలములో ఆయన ప్రాముఖ్యానికీ, ప్రేమకు ఆదరాభిమానాలకు ఆ సంఖ్య నిదర్శనం.

మూడవ సంవత్సరం పోటీలేకుండానే ఏకగ్రీవముగానే ఎన్నుకోబడ్డారు.

పట్టాభిగారు ఎన్నికల సమయాన (మొదట) లేనిసంగతి విశదమేకదా. సిమ్లానుంచి వచ్చినతర్వాత సీతారామయ్య గారు కాస్త తటపటాయించి తర్వాత స్వీకరించారు అధ్యక్ష స్థానం. వారు స్థానిక నాయకులు కారనే సంగతి పాఠకులకు తెలుసుకదా అఖిలభారత నాయకులైనందున అధికంగా పనులుండేవి. అందుచేత అధికభారం కార్యదర్శిపైననే వుండేది. అందులో విశేషించి పట్టాభిగారు స్వతంత్రాలోచన సమర్థత గల తమ శిష్యునికి అవరోధం లేకుండా అన్ని అవకాశాలు కలిగించారు. అందుచేత కార్యదర్శి కేవలం అధ్యక్షునకు అను చరుడుగానే వుండే స్థానంలో వుండక, యథార్థానికి గురువుతో గుద్దులాడుటకు జంకలేదు. పుత్రునిచేత తండ్రి, శిష్యునిచేత గురువుశ్చవిద్యలో పరాజితుడు అగుట మహానందంగా భావించుట మన సంప్రదాయం. ప్రతిభావంతులగు పట్టాభిగారు అప్పు డప్పుడు ఆ ఆనందాన్ని కూడా పొందేవారు.

వారి పరిపాలనాకాలం 2½ సంవత్సరాలు సరసంగానే సాగిపోయింది. ఒక్క చల్లపల్లి పార్టీలో మాత్రమే వేరైనారు.

బ్రహ్మయ్యగారి కార్యదర్శి ఎన్నిక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు రంగంలో మొట్టమొదటి సారిగా ఒక పల్లెటూరి రాజకీయవేత్త ప్రముఖపదవికి రావడం అన్నమాట. సహాయ

కార్యదర్శులు తరచు పల్లెటూరివారే, అవుతూ వచ్చారు. బ్రహ్మయ్యగారు ప్రథమదఫా కార్యదర్శి అయినప్పుడు, పూర్వపు సహాయ కార్యదర్శులుగు గొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, శరణు రామస్వామిచౌదరిగార్లే వున్నారు. రెండవదఫా, నీలం సంజీవరెడ్డి, చింతమనేని భావయ్య చౌదరిగార్లు, మూడవసారి కళా వెంకట్రావు. సంజీవరెడ్డిగార్లు.

బ్రహ్మయ్యగారు కార్యదర్శి అయినతర్వాత తన కాలమంతా దీనికి ఉపయోగించారు. ఆంధ్రదేశమంతటా సంచారంచేసి కాంగ్రెసు సందేశం నలుమూలలా వ్యాపింపజేశారు. క్రమశిక్షణను అధికంగా పాటించారు. తప్పులను ఆయన క్షమించలేదు. ముద్దాయిలను శిక్షించుటలో ఆయన పేరు గాంచినందున Convicting Judge అనే పేరు వచ్చింది. 'ఎర్ర కలం' అనే పేరుకూడా పొందాడు.

కాంగ్రెసు వ్యవహారాలలో అక్రమా లు జరుగకుండా చూచుటేగాక జమాఖర్చులలో కూడ అక్రమాలు జరుగకుండా వుండగలందులకు సరిగ్గా లెఖ్ఖలుంచుటకు సర్క్యులర్లు పంపుటేగాక, ఆడిటర్ల చే తనిఖీకూడా చేయించేవాడు.

స్థానికసంస్థల ఎన్నికలలో సరియైన అభ్యర్థులనే నియమించి, సకాలములో ప్రచారం చేసి, జయం గాంచేటట్లు చేసేవాడు.

స్థానికసంస్థ లన్నిటినీ పరిశీలించి, కాంగ్రెసు సిద్ధాంత రీత్యా వ్యవహారం జరుగుచున్నదీ లేనిది ప్రకటిస్తూవుండేవాడు.

కార్యదర్శిగా కాన్ఫరెన్సులుకూడా జరిపి కట్టుదిట్టాలు చేస్తూండేవారు.

సక్రమంగా బులెటిన్ ప్రకటిస్తూండేవాడు.

ఆఫీసు వ్యవహారం చాలా కట్టుదిట్టంగా జరుపుటచేతనే ఆనాటి ప్రధాని రాజాజీ మీ ఆఫీసు ఇంత ప్రాంప్టుగా వున్నందుకు అభినందిస్తున్నానన్నాడు.

స్థానిక సంస్థలకు అధ్యక్షులను నియమించుటలో, ఆయన ప్రజాస్వామ్య సిద్ధాంతాలను తూ చా తప్పకుండా అనుసరించేవాడు.

మెజారిటీ అభిప్రాయాన్ని మన్నించకుండా మూడు చోట్ల మాత్రమే ఆయన వ్యవహరించింది. అందుకు ప్రత్యేక కారణాలు ఉన్నవి.

అనంతపురం జిల్లాబోర్డు అధ్యక్షస్థానమునకు పోటీచేసిన వారిలో కమ్మ అభ్యర్థికి 31, రెడ్డికి 18 ముచ్చికి 7, వోట్లు మాత్రమే వచ్చినవి. జిల్లాబోర్డు మొత్తం 62 మెంబర్లలోను, ముచ్చ అభ్యర్థి ఒక్కడే జైలుకు వెళ్ళినవాడు. ఇంతేగాక నిమ్నజాతీయుని అధ్యక్షునిగా వుంచాలని ఎడ్వ్యకేట్ చేసి ఆవిధంగా చేశాడు. ఆ రాయప్పగారు అనంతరం యం. యల్. ఏ. అయ్యారు.

మహిళామణిని అధ్యక్షస్థానమలంకరింప జేయవలెనని తలచి, కడప జిల్లాబోర్డు అధ్యక్షస్థానమునకు ముగ్గురు పురుషులు పోటీపడగా వారిని మాన్పించి ఆ స్థానంలో శ్రీమతి రామసుబ్బమ్మగారిని నియమించుట జరిగింది.

అట్లాగే ఒక మహమ్మదీయుని అధ్యక్షునిగా ఉంచవలెనని పెద్దాపురం మునిసిపాలిటీకి మహమ్మదు అబ్దుల్ కరీం సాహెబుగారిని చైరుమనుగా నియమించారు.

ఈ మూడు సందర్భాలలోను సీతారామయ్యగారు సంచారములో వున్నారు. అయినా బాధ్యత వహించి సభ్యులకు నచ్చచెప్పి ఈ విధంగా వ్యవహరించి కార్యదక్షతగల కార్యదర్శి అని కీర్తిపొందాడు.

## జిల్లాబోర్డు వ్యవహారాలు

"ఎవరున్ సాటియె గొట్టిపాటికికి నెందేగానబో
మామనోజవమున్.................."

—బుచ్చి సుందరరామశాస్త్రి.

ఆంధ్రరాష్ట్రంలో కృష్ణాజిల్లా అధిక చైతన్యం కలది. మొట్టమొదట జిల్లా సంఘం ఇక్కడనే స్థాపించారు. కృష్ణా వ[illegible]కూడా జిల్లాసంఘం తరఫున ప్రచురింపబడుతూ సాటిలేని రాజకీయ ప్రబోధం కలిగించింది. వందేమాతరోద్యమానికి బందరే కేంద్రమై విలసిల్లింది. బిపిన్ చంద్రపాలుగారేగాక కోపల్లి హనుమంతరావు, కృష్ణారావు, పట్టాభిగార్లు యీ త్రిమూర్తులే ఆనాడు జాతీయోద్యమానికి జీవగర్రలుగా విలసిల్లింది. ఈ చైతన్యం ఐకమత్యానికి తోడ్పడక, భిన్నత్వానికి దారితీసింది. "బ్రాహ్మణానాం అనేకత్వం"

అన్న సామెత సర్వజన విదితం. తెలివిగలవారు అనేకమంది ఉండుటవల్లనే, పార్టీలు వర్గాలు యెక్కువ. జాతీయోద్య మంలో అగ్రగామిగావున్నా, కాంగ్రెసుద్వారా స్థానికసంస్థ లలోగాని, శాసనసభలలోగాని, ప్రధానస్థానం వహించక పోగా అధమస్థానం వహించింది. అందుకుకూడా అనేక కారణాలున్నవి. ఈజిల్లాను కాంగ్రెసునాయకులు పశ్చిమ గోదావరిజిల్లా ఏర్పడకపూర్వమే పశ్చిమగోదావరి, తూర్పు కృష్ణా, పశ్చిమకృష్ణాలుగా విభజించుకొన్నారు. వరుసగా దానికి దండు నారాయణరాజు, పట్టాభి, కాళేశ్వరరావుగార్లు నాయకులైరి. వీరికి కాంగ్రెసులో పలుకుబడికిగాను, అఖిల భారత కాంగ్రెసు సంఘ సభ్యత్వమునకునూ, తమలో తమకు పదవులను గురించి తగాదాలు రాకుండా ఏర్పాటు చేసు కొన్నారు. మొత్తం జిల్లాలసంగతి వారు గమనించనే లేదు. 1928 లో పశ్చిమ గోదావరి విడిపోయింది. ఆజిల్లాకు దండు నారాయణరాజుగారే నాయకులుగా ప్రఖ్యాతి గాంచారు. ఆయన శాసనసభాసభ్యు డయ్యాడు. జిల్లాబోర్డు ప్రెసిడెంటు అయ్యాడు. ఇక పశ్చిమకృష్ణా సంగతి, కాళేశ్వరరావుగారు బెజవాడ కాపురస్థులు గనుక, బెజవాడ మునిసిపాలిటీ ఒక్క మించుకొనుటకే ఆయనకృషి జరిగింది. దానిలో ఆయన కృత కృత్యుడయ్యాడు. శాసనసభ కాయన 1926 లోనే జయం గాంచాడు. తర్వాత బందరు, బెజవాడ పట్టణ నియోజకవర్గమే తన యెన్నికస్థానముగా గ్రహించి ఆసంగతిమాత్రమే చూచు కొంటూ 1937 సం॥ 1947 సం॥ లోనుకూడా జయం

గాంచాడు అస్సెంబ్లీకి. ఆయన దృష్టి జిల్లాబోర్డు రాజకీయాల పైకి పోనేలేదు.

ఇక మన పట్టాభిగారు, ఆయన ఒకసారి బందరు మునిసి పాలిటీకి సభ్యులయ్యారు. ఆయన నోచేంజరు. శాసనసభ గాని జిల్లాబోర్డుగాని ఆయన దృష్టిలో లేనేలేవు. కాంగ్రెసు, ఖద్దరు, స్వదేశసంస్థాన ప్రజలు, బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, వీటితోనే వారు సేవ చేద్దామనుకున్నారు.

ఈ జిల్లాలో కమ్మవారు అధికసంఖ్యాకులు. వారిలో గుడివాడ తాలూకాబోర్డు వ్యవహారాల్లో, అడుసుమల్లిపార్టీ, లింగంపార్టీ, అని రెండుపార్టీలేర్పడినవి. అవి జిల్లాఅంతటా ప్రాకినవి. స్థానికసంస్థల పోరాటమే వారి పరమావధి. కమ్మవారిలో ఉన్నంత అంతర్విరోధం మరొక కులంలో లేదు. వారి తెలివితేటలు, ధనం, తమలోతాము సాధించుకొనుటకు పరాయివారికి పాదాక్రాంతమగుటకు వుపయోగపడుతున్నవి. నాడేకాదు నేటికీకూడా. ఇక కాపుసంఘానికి రమణయ్య నాయుడుగారు యేకైక నాయకుడు. ఆయనమాట సుగ్రీవాజ్ఞగా, కైకలూరు, బందరు, దివిసీమకాపులు తలుస్తారు. కమ్మవారిలోవలె ఆయన కెదురాడువారు రెండున్నర తాలూకాలలోను లేరు. ఆయన పలుకుబడిగల ప్రముఖుడు. లింగం వారి పార్టీ కొంతకాలం మీర్జాపురంవారి పార్టీ కొంతకాలం ఆయనసలహాతోనే సంచరించినవి .ఆనాడు ఆయన జస్టిసుపార్టీ నాయకుడు.

ఈ జిల్లాలో ఉన్నంతమంది జమీందారులు మరియే జిల్లాలోను లేరు. మాంటిఫర్డు సంస్కరణలతో ఈ జమీం

దార్లంతా జస్టిసుపార్టీలో చేరి, శాసనసభల్లోను, స్థానికసంస్థల్లోను ప్రవేశించి తమధనబలము నుపయోగించి, స్వైరవిహారం చేయసాగారు. కృష్ణాజిల్లాకు కొంతకాలం, మీర్జాపురాధీశుడు, అనంతరము చల్లపల్లి సంస్థానాధిపతి పాలన సాగించారు. అడుసుమిల్లివారు చల్లపల్లివారికి అండగా వుంటే మీర్జాపురం, రమణయ్యనాయుడుగార్లు ప్రత్యర్థులుగా వుండేవారు.

కృష్ణాజిల్లాబోర్డు యెన్నడు కాంగ్రెసుపరం కాలేదు. 1923 లో మాత్రం, నామినేషనుబోర్డుగా ధన్వాడ రామచంద్రారావుగారి అధ్యక్షత క్రింద; కాంగ్రెసుబోర్డుగా చలామణి అయింది. అప్పుడున్నూ శాంతిలేదు, జస్టిసుపార్టీ తరఫున కొన్ని నామినేషన్లు యిస్తే కాంగ్రెసువారు కొన్ని తెచ్చుకునేవారు. యెప్పుడూ పోరాటమే పరిపాటై పోయింది. సామరస్యమంటూ లేనేలేదు.

1936-11-23 తేదీని జరిగిన జిల్లాబోర్డు యెన్నికలలో చల్లపల్లివారితో పోటీచేసింది కాంగ్రెసు. రమణయ్యనాయుడు గారిపార్టీ జస్టిసు పార్టీకి వ్యతిరేకంగా, కాంగ్రెసుకు అనుకూలంగా వున్నారానాడు. కాని, కాపులూ కాంగ్రెసు ప్రముఖులు కూడా ఓడిపోయారు. కాంగ్రెసు కొన్ని ఫిర్కాలలో అభ్యర్థులనే నియమించలేదు. కాపులకు రెండుసీట్లున్నూ కాంగ్రెసుకు 3 సీట్లున్నూ వచ్చినవి.

జిల్లా రాజకీయాలలో, చల్లపల్లి. మీర్జాపురం జమీందార్ల పోరాటం బొబ్బిలి మంత్రిత్వానికి బెడదగా వుంది. వారిద్దరిని కలిపి, ఈ జిల్లాను 1-12-1936 న విభజించి

బెజవాడ బోర్డు మీర్జాపురంవారికి, బందరు బోర్డు చల్లపల్లి వారికి పట్టంగట్టారు. కాంగ్రెసువారు 1-11-1938 లో జిల్లా బోర్డుల నన్నిటినీ కలిపివేశారు. అప్పుడుకూడా మీర్జాపురం రాజాగారు, చల్లపల్లి రాజాగారిని అధ్యక్షులుగా నుండ నంగీక రించారు.

మీర్జాపురం రాజాగారిని దిఃపుటకు చల్లపల్లివారితో పరోక్షంగా, కాంగ్రెసువారులు కొంతమంది మంతనాలు జరి పారు. తరువాత 1936 సం॥ జరిగిన యెన్నికలలో చల్లపల్లి వారిని ఓడించుటకు, మీర్జాపురంవారితో మంతనాలు జరి పారు. గాని అవి ఫలించలేదు. తర్వాత బోర్డును రద్దుచేయించ ప్రయత్నం చేశారు. అది విఫలమయింది. ఇంతకు కాంగ్రెసు నాయకులు తమ త్యాగసాహసాలతో పోరాడుటకు ప్రయ త్నింపక డిప్లమసీ వుపయోగించారు. డిప్లమసీలో వీరికంటె జస్టిసువారే అధికులగుటచే, కాంగ్రెసువారు విఫలులయ్యారు. యుగంధరుడని ఖ్యాతిగాంచిన కాళేశ్వరరావుగారి కృషి ఫలించ లేదు. చాణక్యుడని ప్రసిద్ధిగాంచిన పట్టాభిగారి ప్లానులు ఫలించలేదు. జిల్లాబోర్డు సంగతి జిల్లా పరిస్థితులు పాఠకులకు పరిచయంచేయడం అప్రస్తుతం కాదని యెంచి సంగ్రహంగా సమీక్షించాను.

ఆంధ్రరాష్ట్రంలో జిల్లాబోర్డులన్నీ కాంగ్రెసు పరమై నవి. కృష్ణాజిల్లాబోర్డు యెన్నికలు 1940 జనవరిలో జరుగ నున్నవి. రాష్ట్రసంఘాధ్యక్షుడు, కార్యదర్శి, యీజిల్లాకు చెందిన వారేకనుక ఈ జిల్లాకూడా గాంగ్రెసు జిల్లాగా పరిగణింప

బడుటకు జిల్లాబోర్డును స్వాధీనం చేసుకొనే ప్రయత్నాలకు ఆలోచనలు ఆరంభమాయెను.

చల్లపల్లి రాజాగారు, అప్పటి అధ్యక్షులు. ఆయనను యెలాగో ఒకలాగు ఒప్పించి బయటకు పంపించి బోర్డును కాంగ్రెసు స్వాధీనం చేసుకుందా మనుకున్నారు. రాజాగారు మాత్రం ఈ యెల్ల యేనుగును ఎంతకాలం పోషిస్తాడు? వారికీ మోజు తగ్గింది. సరేనన్నారు. కాని వారి పార్టీవారు మాత్రం ఒప్పుకోలేదు. అయినా రాజాగారు మొదట్లోనే చెప్పారు. మీరు అచ్చమైన కాంగ్రెసువారిని పెట్టుకొంటే నా అభ్యంతరంలేదు. రమణయ్యనాయుడు పార్టీవారికి కాంగ్రెసు ముద్ర వేస్తే, మావారికి వెయ్యాకతప్పదు. ఆయనపార్టీకంటె, మా పార్టీ పెద్దది. ఆ సంగతికూడా ఆలోచించవలసిందని ఆయన అన్నాడు.

ఈసంప్రదింపులు పట్టాభిగారు బ్రహ్మయ్యగారుజరిపారు. రాజాగారు, పట్టాభిగారితో తాము షరతులేకుండానే తప్పు కుంటామన్నారు. అయితే అచ్చమైన కాంగ్రెసువాదులను పెట్టేపద్ధతిలో. జిల్లాబోర్డు వ్యవహారంలో కాంగ్రెసు వాదులు సిద్ధాంతరీత్యా గాకుండా గెలుపుని దృష్టిలో పెట్టుకుని పని చేయసాగారు. అదెంతవరకు నెరవేరుతుంది? బ్రహ్మయ్య గారితో పట్టాభిగారు వర్కింగుకమిటీకి వెళ్తూ మీరు కృష్ణా రావుగారితో సంప్రదించి రాజీ మాట్లాడవలసిందని చెప్పారు. అనుభవజ్ఞులగు బ్రహ్మయ్యగారు ఈ బెడద తగ్గించుకొనుటకు రాజాగారిపార్టీకి పట్టాభిగారు అంగీకరించేయెడల 18 సీట్లు ఇవ్వ వొప్పుకున్నారు. వారి ఉద్దేశ్యం ఒక జిల్లాబోర్డు వ

పోరసమేగాక గ్రామాలలో శాంతి, సామరస్యము, కాంగ్రెసు యెడల అనురాగాభివృద్ధి పొందగలమను తలంపుతో. పట్టాభి గారిని రావలసిందిగా టెలిగ్రాం ఇచ్చారు బ్రహ్మయ్యగారు. కాని కృష్ణారావుగారు "పట్టాభిగారు ఎట్టి షరతులేకుండా రాజీ అన్నారు. పరిస్థితులనుబట్టి మీరు 18 సీట్లకు ఒప్పుకో వలసి వచ్చింది. పట్టాభిగారు రాకముందు మీరు ఒప్పుకుంటే ఆయన కప్రతిష్ఠరాదు. వారు ఆమోదించగలరు, అని అన్నారు." "నేను వస్తానంటే రాకముందే 18 సీట్లు యిచ్చి రాజీ పడడ మేమిటి?" అని పట్టాభిగారికి కలిగింది. ఇందులో తొందరపా టుంటే వుండవచ్చును గాని తప్పుమాత్రం లేదు. రాజీ భగ్న మైన తరువాత పట్టాభిగారు, బ్రహ్మయ్యగారిని జిల్లాబోర్డు అధ్యక్షునిగా వుండవలసిందన్నారు. "ఆ కోర్కె నాకెన్నడూ లేదు. నూరయ్యగారిని గురించే, నా కృషి. ఈ పరిస్థితులలో రమణయ్యనాయుడుగారి కనుసన్నలలో మెలగు జిల్లాబోర్డు ప్రెసిడెంటుపదవి నాకక్కరలేదు" పదవీవ్యామోహం లేనందుకు ఆయనపై ఆదరముండుటకు మారు, తమ మాట తోసి వేశా రనే అభిప్రాయం కలిగింది పట్టాభిగారికి. ఈ సంగతి సందర్భము లన్నీ, పాఠకులకు వివరంగా తెలియగలందులకు కృష్ణాపత్రిక లోని వ్యాసాన్ని ఉదహరిస్తున్నాను.

కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీల దురవస్థ : ఒక సంవాదము.

ప్రశ్న :- ఏమండీ, ఒక్క గుండెకాయవలె ఉండేవారే బ్రహ్మయ్య పట్టాభిగార్లు. వీరిమధ్య ఏవో పొరపులు వచ్చాయట నిజమేనా ?

జవాబు:- పొరపులేమి టండీ? ఏ విషయంలోనైనా అభిప్రాయభేదాలు వచ్చినంతమాత్రాన, పొరపులు వచ్చిన ట్లెంచుకోవలసిం దేనా? ఉభయులూ సంస్కారులు. అన్యోన్యం గౌరవవిశ్వాసాలుగల కాంగ్రెసు భక్తులు. వారి సఖ్యత ఈ జన్మలో విడేది కాదని ముందు గ్రహించండి.

ప్ర:- అట్లా అయితే వారికి అభిప్రాయభేదా లేవిషయంలో వచ్చినాయండీ?

జ:- ఆఁ! కృష్ణాజిల్లాబోర్డు ఎన్నికల వ్యవహారాల్లో ఉభయుల చూపులు కలియలేదు.

ప్ర:- అంటే?

జ:- అంటే ఏమీలేదు. చల్లపల్లి వర్గంతో జత కలుపుకోవడం విషయంలో వేరుత్రోవలైనాయి.

ప్ర:- పట్టాభిగారు కొంతకాలం క్రిందట చల్లపల్లి రాజాగారిని కలుసుకొన్నారనీ, రాజాగారికిమీదట బోర్డు ప్రెసిడెంటుగిరికి ప్రయత్నించవక బోర్డును కాంగ్రెసుకు వదిలివేస్తామని వాగ్దానమిచ్చినారనీ చెప్పుకొన్నారే. బ్రహ్మయ్యగారే ప్రెసిడెంటు అవుతారనికూడా అనుకొంటున్నారు. ఇక వచ్చిన చిక్కేమిటి?

జ:- చిక్కు ఏమీ లేదు. రాజాగారి అనుచరు లున్నారుగా. వారికి కొన్ని స్థానాలు కావాలన్నారు. వారు కాంగ్రెసు ప్రమాణపత్రాలు సంతకంచేసి కాంగ్రెసు నిబంధనలకు లోబడితే, వారికి పదునాలుగు స్థానా లివ్వడానికి బ్రహ్మ

య్యగారు, జిల్లా కాంగ్రెసు కమిటీ ప్రెసిడెంటు నూరయ్య గారు తుదకు పరిష్కారం చేశారు. ఈయంగీకారం పట్టాభి గారు దేశాంతరములో ఉండగా స్వతంత్రించి ఇచ్చారు. రాజాగారు బోర్డును కాంగ్రెసుకు దఖలు పరచటంలో ఎట్టి షరతులను కోరియుండలేదట. షరతులు కోరితే, తాము సమ్మతింపజాలమనికూడా పట్టాభిగారు మొదటనే రాజాగారితో స్పష్టంగా చెప్పారట. ఇప్పుడు స్థానాలకు బేరమేమిటని పట్టాభిగారి ప్రశ్న.

ప్ర:- అయితే, బ్రహ్మయ్యగారు చల్లపల్లి వర్గానికి ఎందుకు పదునాలుగు స్థానాలివ్వడానికి ఒప్పుకొన్నారు?

జ:- రాజాగారిని వేధించడం మొదలుపెట్టారు, వారి అనుచరులు. ఏషరతూలేకుండా బోర్డును వదలివేయడమేమిటన్నారు వారు. పాపం, రాజాగా రేమిచేస్తారు? ఇంత కాలం తమను నమ్ముకొనిఉన్న అనుచరులను ఎట్లాగైనా సంతృప్తిపరచి కాంగ్రెసులో జేర్పింపడం న్యాయమనుకొని, పశ్చిమకృష్ణాలో నాలుగు, తూర్పుకృష్ణాలో పదిఅడిగారు. ఇందుకు సమ్మతిస్తే నేకాని, ఐక్యత కుదరదనుకొని బ్రహ్మయ్య నూరయ్యగార్లు తలయొగ్గారు. దీనికి పశ్చిమ కృష్ణా కాంగ్రెసు ప్రెసిడెంటు కాకుమాని లక్ష్మయ్య గారును, సుప్రసిద్ధులైన అయ్యదేవర కాళేశ్వరరావు

గారును, ఒప్పుకొన్నారు. తాముకూడా ఒప్పుకొన్నట్లు రాజాగారితో మాట ఇచ్చారు.

ప్ర:- ఇక తగాయిదా ఏమున్నది ?

జ:- తూర్పు కృష్ణాలో కాపునాయకులు రమణయ్యనాయుడు గారున్నారుకదా వారిని కూడ సంప్రదించకుండా వారిని ఒప్పించకుండా, బ్రహ్మయ్య సూరయ్యగార్లు రాజాగారికి మాట ఇయ్యడం ఏమి న్యాయము ? నాయుడుగారు తూర్పులో పన్రెండు సీట్లు కావాలన్నారు. ఆపన్రెండులో రెండు రాజాగారికి పరిష్కారమైన వే—ముదినేపల్లి, నందమూరు సీట్లు. ఈ రెండు సీట్లను వారూ వదలుకోరు — వీరూ వదలుకోరు. పట్టుదలలు వచ్చాయి. బోటు దిబ్బెక్కింది.

ప్ర:- పట్టాభిగారు మధ్యవర్తిత్వం చేసి, ఒప్పించలేకపోయినారా?

జ:- వారు రమణయ్యనాయుడుగారిని ఒప్పించడానికి ప్రయత్నించారట. కాని లాభం లేకపోయింది. అవతల రాజాగారైనా వదులుకుంటే సరిపోయేది. ఉభయులకూ పట్టువిడుపులు లేకపోయినాయి. అయినా తూర్పు కృష్ణా కాంగ్రెసు వర్కింగుకమిటీవారు సమావేశమై రాజాగారికి పది, రమణయ్యనాయుడుగారికి పది ఇచ్చి, మిగిలినవారికి దరఖాస్తుదారులలో అభ్యర్థులను నిర్ణయించడానికి సూరయ్యగారికి సర్వాధికారం ఇచ్చారు. కాని ఇంత

లోపల బెజవాడనుండి కాకుమాను లక్ష్మయ్యగారు చల్లపల్లి ఒడంబడికను తమ కమిటీ ఒప్పుకోవటం లేదని తంతి ఇచ్చారు.

వ॥:- బలే చిత్రం జరిగిందే! లక్ష్మయ్యగారూ, కాళేశ్వర రావుగారూ రాజాగారికి తీరా మాట ఇచ్చి, ఇట్లా చెయ్యడము ఏమి న్యాయం?

జ :- మనజిల్లా పరిస్థితులూ, మన నాయకుల రాజనీతులూ ఇట్లా ఉన్నాయి. ఏమంటే ఏమున్నది! తమ మాట పోయిందికదా అని, తూర్పుకృష్ణా వర్కింగు కమిటీవారు అసలు ఎన్నికలలో పోటీచేయగూడదని తీర్మానిస్తూ భీష్మించుకొన్నారు.

వ॥:- బలె, కుక్కకాటుకు చెప్పుదెబ్బల్లే చేశారే. అప్పుడు పశ్చిమ కృష్ణా క్రిందికి దిగిందా?

జ:- దిగకేమి? గోపాలరెడ్డిగారిని పిలిపించుకొని, వారి హెచ్చరికమీద చల్లపల్లి పాక్టు వొప్పుకొంటా మన్నారు. ఆ మాటనమ్మి తూర్పుకృష్ణా వర్కింగుకమిటీవారు ఎన్నికలలో పాల్గొనడానికి తిరిగి నిశ్చయించారు—పశ్చిమకృష్ణా చల్లపల్లి పాక్టును ఒప్పుకొనే షరతుమీద.

వ॥:- ఇక ఉభయకృష్ణలకు ఐక్యత కుదిరిందన్న మాటేగా?

జ:- నిజమే, కాని ఇంకా తంతులేదూ? చల్లపల్లి పాక్టు నెట్లాగైనా వడగొట్టాలనేగా పశ్చిమకృష్ణావారిలోపలి సంకల్పం! కొందరు మహానుభావులు వారికి తోడైనారు. వారు కాన్వాసుచేశారు. తూర్పుకృష్ణా కాంగ్రెసు జనరల్‌బాడీ వారిని. ఈ పాక్టు లేమిటి? బ్రహ్మయ్య నూరయ్యగా

ర్లవరు రాజీలు కుదర్చడానికి? ఇదంతా బ్రహ్మయ్య తన ప్రెసిడెంటుగిరికోసం, స్వార్థపరత్వంతో పన్నిన పన్నాగం— అంటూ నానామాటలు ఆడారు జనరల్ బాడీవారు. వారిలో ఎక్కువమంది ఇట్లా అవిశ్వాసం తెలిపితే, చల్లపల్లి ఒడంబడికను బహిష్కరించేసిన, వర్కింగు కమిటీ వారేమి చేస్తారు? తమ పదవులకు రాజీనామా ఇచ్చారు పదిమంది. బ్రహ్మయ్య సూరయ్యగార్లు అసలు అధ్యక్షులుగానే నిలవమన్నారు. తూర్పుకృష్ణా ఇట్లా అరాచకంలోకి దిగింది.

ప్ర:- అప్పుడు పశ్చిమకృష్ణా వారేమిచేశారు?

జ:- వారా? కాళేశ్వరరావుగారు వారికి సూత్రధారులు. వారేమి నాటకం ఆడించలేరు? గోపాలరెడ్డిగారి హెచ్చరికను బుట్టదాఖలుచేశారు. చల్లపల్లి పార్టును తిరిగి నిలవడానికి మాట యిచ్చికూడా ఆ మాటను మింగేసుకొన్నారు. తూర్పుకృష్ణా కమిటీ రాజులేనికోట అయింది. పశ్చిమకృష్ణా చల్లపల్లి పార్టీను కూనీచేసింది. బ్రహ్మయ్య సూరయ్యగార్లీ పద్మవ్యూహంల్లోనుండి బయటపడ్డారు. వీరికి తోడుగ పశ్చిమకృష్ణాలో చిట్టి, జగన్నాధం, వేంకట సుబ్బయ్యగార్లు అయిదారుమంది ప్రక్కకు తొలిగారు. తుదకు పశ్చిమకృష్ణా సోషలిస్టుల ఒరిపిడిలో చిక్కుకొని భగ్నమయ్యేటట్టున్నది.

ప్ర:- అయితే చల్లపల్లి వారేమి చేయదలచుకొన్నారు? ఇట్లా కూనీకావడానికి ఒప్పుకున్నారా?

జ:- వారేనా నిస్పృహచెందేది? వారిలోను రోషంపెరిగింది.

చల్లపల్లి కోటమీద తిరిగి బావుటా ఎత్తారు. రణభేరీ ప్రయోగించారు. ఈ తూర్పు పశ్చిమ కృష్ణా కాంగ్రెసు కమిటీలవారిని వెనుకటి రెండు ఎన్నికలలో బూత్రిగ పీటీ మన్ను చేసేవున్నారు. ఈ పర్యాయం మాత్రం వీరెంత వరకు ఎదుర్కోగలరో చూద్దామంటూ సేనలను సమకూరుస్తున్నారు.

ప్ర:- తూర్పుపశ్చిమ కాంగ్రెసుకమిటీ లేకపైతేగా, చల్లపల్లి మీద యుద్ధానికి దిగగలిగేది ?

జ:- నిజమే. కాని ప్రావిన్షియల్ కాంగ్రెసు వర్కింగుకమిటీ వారు జోక్యం కల్పించుకొన్నారు. వారొకకమిటీ నేర్పాటు చేసి, కాంగ్రెసు యోధులను నిర్ణయించమన్నారు. యోధులుగ నిలవడానికి సాహసంఉన్నవారు నిలిచారు. తూర్పున, పటమటకూడా కాంగ్రెసుకు తగినంతమంది క్యాండిడేట్లు దొరకక అల్లాడుతున్నారు. అప్పుడే 10 ఖాళీలు.

ప్ర:- చల్లపల్లికి సంఘబలం, అర్థబలం ఉన్నది. పాపం! కాంగ్రెసుకు ఏమున్నది? ఒక్క నీతిబలం చూచుకొంటే చాలుతుందా!

జ:- కాంగ్రెసువారికిక ఏమి చేయమంటారు? శాయశక్తులా చల్లపల్లిని కూనీచేయడానికి ప్రయత్నించారు. రెండు సార్లుకంటె ఎవరూ జిల్లాబోర్డు ప్రెసిడెంటు కాకూడదంటూ అసెంబ్లీలో ఒకబిల్లు పెట్టించాలని అనుకొన్నారు. కొంతకాలం క్రిందట.

ప్ర:- అది బలే ఎత్తు అండీ.

జ: కాని ఆ ఎత్తు సాగిందికాదు. తర్వాత, చల్లపల్లి బోర్డు పరిపాలనలో జేసిన తప్పులను పురస్కరించుకొని గవర్నమెంటుచేత, వారిపై ఆంక్ష పెట్టించాలనుకొన్నారు. కాని ప్రకాశం, సాంబమూర్తిగార్లు అడ్డుపడడంవల్ల, ఆ ఎత్తు కూడ చెల్లలేదు.

ప్ర:- ఎవరండీ ఈ యెత్తులన్నీ వేసింది?

జ:- ఎవరైతే ఏమి? ఈ రెండూ సాగకపోయేటప్పటికి, జిల్లా బోర్డు సీట్ల నిర్ణయంలో జోక్యం కల్పించుకొని చల్లపల్లి ఎస్టేటులోని అయిదు సీట్లను మూటిలోకి తగ్గించారు. రమణయ్య నాయుడుగారి రాజ్యమనుకొనే కైకలూరు తాలూకాలో అయిదు సీట్లను ఏడు సంఖ్యలోకి హెచ్చించారు.

ప్ర:- అవును, కాంగ్రెసువారుకూడా జస్టిసుపార్టీ అవలంబించిన తప్పును త్రోవలనే త్రొక్కారన్నమాట.

జ:- సందేహమా? ఇన్ని చేసినా చల్లపల్లి అంటే డొక్కలో భయం లేకపోలేదు. అందుకని రమణయ్యనాయుడుగారి సహాయంకోసం —వా రెన్నిసార్లు కాంగ్రెసు నియమాల నుల్లంఘించినా కండ్లు మూసుకొంటూ వారి కండయై నిలుస్తున్నారు.

ప్ర:- రమణయ్యనాయుడుగారు కాంగ్రెసు నతిక్రమించి ఎట్టి పనులు చేశారనీ మీ రిట్లా మాట్లాడడం?

జ:- కొంచెం ఓపికపట్టి వినండి, వెనుక అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు ఖర్చుమీద బ్రహ్మయ్యగారి కోసం కాన్వాసు

చేస్తూ, కౌన్సిలు సీట్లకు కాంగ్రెసును ప్రతిఘటిస్తున్న భూమయ్యగారికి కాన్వాసుచేశారు. ఖద్దరు కట్టకపోయినా, కాంగ్రెసువారు వీరిని బందరు మ్యునిసిపలు ఛైరుమనుగ ఎన్నుకోడానికి నిశ్చయించుకొన్నారు. తర్వాత, యూనివర్సిటీ సెనేటు ఎన్నికలలో కాంగ్రెసు క్యాండిడేట్లను ప్రతిఘటించిన కూర్మా గోపాలస్వామినాయుడుగారికి ప్రత్యక్షంగా కాన్వాసు చేశారు.

ప్ర :- ఈవిద్రోహానికి కాంగ్రెసువారువారిని మందలించలేదా?

జ :- మందలించడం ఎందుకు ? పైగా వారినే కృష్ణా లోకల్ బోర్డుల తరఫున ఆంధ్ర యూనివర్సిటీ సీటుకు – చల్లపల్లి రాజాగారికి పోటీగ కాంగ్రెసు క్యాండిడేటుగ నిలబెట్టారు.

ప్ర:- ఎంతమాట?

జ:- తీరా నిలుచున్నతర్వాత, మీర్జాపురం సహాయం రాదని తెలుసుకొని గెలుపుకు నిస్పృహచెందినప్పుడు నామినేషను తేదీ దాటినతర్వాత, ఇంకో క్యాండిడేటు కవకాశం లేకుండా, వారు తమ యభ్యర్థిత్వాన్ని వదులుకోడానికి కాంగ్రెసువారు అనుమతించారు.

ప్ర :- కాంగ్రెసువారు రమణయ్యనాయుడుగారి యెడల ఇంత ఔదార్యం చూపడానికి కారణమేమిటి ?

జ :- నాయుడుగారు దివి, బందరు, కైకలూరు తాలూకాలకు మకుటంలేని రాజు. వారి సహాయముంటేనేకాని కాంగ్రెసువారు చల్లపల్లిని కొట్టలేమనుకొని, నాయుడుగారిని శరణుమంటున్నారు.

ప్ర :- పోనీ, చల్లపల్లినే నమ్ముకుంటే ఈ పోటీలే పోయి, కాంగ్రెసుదే ఏకఛత్రాధిపత్యం అయ్యేదిగా ఈజిల్లాలో.

జ :- చల్లపల్లిని నమ్మి ఉండడం ఎట్లా? చల్లపల్లి నిజంగా కాంగ్రెసు సఖ్యతనే కోరితే, 14 సీట్లు ఎందుకు కోరాలి? ఏ రెండో మూడో యిస్తే, తృప్తిపడ కూడదూ? వారిలో ఏదో కుటాలోచన ఉన్నదేమోనని కాంగ్రెసువారి భయం.

ప్ర :- బ్రహ్మయ్య, నూరయ్యగార్లకు చల్లపల్లివారి మీద ఇంత నమ్మకం ఎట్లా కుదిరిందని అడుగుతాను?

జ :- వీరి దృష్టి తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు. వట్టి అమాయకులు. కాశీశ్వరరావుగారు బోర్డుల వ్యవహారాల్లో కాచి వడపోసిన అనుభవజ్ఞులు. వారు మాట ఇయ్యాగలరు, వెంటనే ఆ మాటను మ్రింగివేసుకోనూగలరు. అంతమాత్రం సమయోచిత జ్ఞానం, రాజనీతి లేకపోతే—

ప్ర :- మీ మాటకు అడ్డంవచ్చానని అనుకోకండి. చల్లపల్లి వర్గాన్ని కాంగ్రెసులో కలిపేస్తే, ఇక ఈ జిల్లాలో కాంగ్రెసుకు ప్రతికక్షులుండరుకదా, దానివెంబడి గ్రామకక్షలుకూడా తొలగడానికి అవకాశం కలుగుతుందని బ్రహ్మయ్య నూరయ్యగార్లాశపడి ఉంటారు. ఈ గ్రామకక్షులవల్ల బాధపడేది వీరేగా? పట్టణాల వారికేమి తెలుస్తాయి గ్రామప్రజల బాధలు?

జ :- నిజమే అందుకనే వీరు సఖ్యతకోసం అంత తొందరపడి ఉంటారు. పట్టాభిగారుకూడా సఖ్యత కోరేవారే. కాని

చల్లపల్లి కాంగ్రెసును ప్రతిఘటించకుండా యుండేటంత సఖ్యతనే వారు కోరేది. బ్రహ్మయ్య, సూరయ్యగార్లింకో పైమెట్టు ఎక్కారు. చల్లపల్లి వర్గాన్ని తటస్థంగా యుండేటట్లు చేయటంకంటె, ఆ వర్గాన్నెట్లాగైనా కాంగ్రెసులో కలుపుకుంటే, ఉత్తరోత్తరా పోటీలే ఉండవనీ, జిల్లాలో కాంగ్రెసుకు ఎక్కువ బలం చేకూరుతుందనీ, వారు అభిప్రాయపడి ఉంటారు. రమణయ్యనాయుడుగారి వర్గాన్ని కాంగ్రెసులో చేర్చుకొని ఊరేగడం సక్రమమైతే, చల్లపల్లి వర్గాన్ని కాంగ్రెసులో చేర్చుకోవడం ఎట్లా తప్పవుతుంది ?

ప్ర :- ఇదా, బ్రహ్మయ్య, సూరయ్యగార్ల దృష్టి ?

జ :- తక్కిన జిల్లాల్లోగూడ బోర్డు ఎన్నికలు వచ్చేటప్పటికి ఇట్టి ఒడంబడికలు ఎన్నో జరిగినాయి కావా ? వాని నన్నిటిని కాంగ్రెసువారు అక్షరాల ఆమోదించలేదా ? మన జిల్లా కర్మమేమో కాని, అన్నీ ధర్మసందేహాలే, ఎత్తుపైఎత్తులే, కాంగ్రెసును దుర్బలపరచే రాగద్వేషాలే. అందుకనే, కృష్ణాజిల్లా అంటే బయటివారికింత చులకనైపోయింది. ఈ జిల్లాలో హేమాహేమీలున్నారు. కాని ఏమిలాభం? కార్యం గట్టెక్కించే సాహసంలేదు. పోనీ మనకెందుకు వచ్చిన గోల ఇది: ఏదైనా అనుభవంవల్ల కాని తెలిసి రాదు. కాలమే ఆ అనుభవాన్ని కూర్చిపెట్టుతుంది. పెద్దలకు మనమేమీ చెప్పలేనప్పుడు, కాలాన్ని నమ్ముకోవడమే మంచిది. "కాలాధీనం జగత్సర్వం" అన్నారు మన ఋషులు. కాంగ్రెసు మంత్రులు రాజీ ఇచ్చిన తర్వాత

మొదట జరిగే ఎన్నికలివ్వే. వీని పర్యవసానం ఎట్లా వుం టుందోనని లోకం ఎదురుచూస్తోంది."

— కృష్ణా పత్రిక 6 - 1- 1940

ఈ ఒడంబడిక రద్దయినతరువాత రాష్ట్ర సంఘంవారు కళా వెంకట్రావుగారి అధ్యక్షతను యెన్నికల కమిటీని నియ మించారు. ఆ కమిటీవారు బ్రహ్మయ్య నూరయ్యగార్ల సూచ నలను త్రోసివేసి, పట్టాభి రమణయ్యనాయుడుగార్ల మాట లను మన్నించి జయం దృష్టిలో ఉంచుకొని, అభ్యర్థులను నియ మించారు. ఎన్నికలు 1940 జనవరి 30 వ తారీఖున జరిగినవి. కాంగ్రెసుపేర 35 సీట్లు జయం. చల్లపల్లి వారు 17 గురు.

ప్రెసిడెంటు ఎన్నికతంతు రాష్ట్ర సంఘంవారు జరి పారు. అధికసభ్యులు బలరామకృష్ణయ్యగారిని ప్రెసిడెంటుగా వుండగోరారు, కాని జయంతిపురం రాజాగారిని అధ్యక్షునిగ మినిట్సు బుక్కులో వ్రాశారు. కాంగ్రెసు ముద్రతో గెల్చిన రమణయ్యనాయుడుగారి పార్టీ వారు ఆ రాత్రి మంతనాలు జరిపి మాకు అధ్యక్షస్థానం యివ్వకపోతే, చల్లపల్లి వారితో కలసి, మీరు పెట్టిన అభ్యర్థిని ఓడించి రాజాగారిని ప్రెసి డెంటుగా ఎన్నుకుంటామన్నారు. ఈ మాటవిని కాంగెసు కప్రతిష్ఠ రాగలదనే భయంతో జయంతిపురం రాజాగారిపేరు తొలగించి ఆ స్థానంలో కోలపల్లి లక్ష్మయ్య నాయుడుగారి పేరు చేర్చారు. అప్పటి రాష్ట్రకమిటి అధ్యక్షులగు ప్రకాశం గారే ఈ వ్యవహారమంతా నడిపారు.

ఆ పరిపాలనకూడా అంతంతమాత్రంగానే సాగింది. కొద్దిరోజులలోనే ప్రెసిడెంటుగారిపై విశ్వాసరాహిత్య తీర్మా

నంకూడా పెట్టబడింది. ఈ సంగతు లిట్లా వుండగా కాంగ్రెసు ప్రెసిడెంటుగారి పాలన అక్రమంగా వున్నదని 3 సంవత్సరముల వరకు గవర్నమెంటువారు బోర్డును రద్దుచేస్తూ స్పెషల్ ఆఫీసరును నియమించారు.

"కృష్ణాజిల్లాబోర్డు చరమ శ్లోకం.
జననం—ఫిబ్రవరి 28–1940
మరణం—జనవరి 15–1941
వాసోదకం.

యే కేచాస్మత్ కులే జాతా
అపుత్రా గోత్రిణో మృతాః
తే గృహ్ణంతు మయా దత్తం
సూత్ర నిష్పీడనోదకం.

ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం.

ఆత్మ శాంతి వచనం.
అనాథ ప్రేత సంస్కారాత్
కోటియజ్ఞ ఫలం లభేత్;
చల్లపల్లి కూటం.

ప్రెసిడెంటుకు అంకితం.

మీ హయాము తప్పక చరిత్ర ప్రసిద్ధమౌతుంది.
అ. కాళేశ్వరరావు.

కాంగ్రెసుపార్టీకి అంకితం.

జిల్లాబోర్డులోని కాంగ్రెసుపార్టీ, శీలంలో, నడతలో బాధ్యతలో బూర్జిగ దివాలాతీసింది.

అడుసుమల్లి గోపాలకృష్ణయ్య

కృష్ణాజిల్లాకు అంకితం.

కాంగ్రెసు వ్యవహారాల్లో కృష్ణాజిల్లా వంగరాష్ట్రంతో తులతూగుతుంది;

కళా వెంకట్రావు.

మృత్తికాస్నానం
అకార్యకరణపాపోశమనార్థం.
మృత్తికాస్నానం కరిష్యే,

యం. కె. గాంధి

బోర్డుకు అంకితం 25—1—41

నా అనంతరం ప్రళయం—After me the deluge.

కె. లక్ష్మయ్యనాయుడు,
ప్రెసిడెంటు."
—కృష్ణాపత్రిక.

ప్రళయం కాకపోతే మరేమిటి? ఏడేళ్ళయినా ఎన్నిక జరగలేదు.

బ్రహ్మయ్యగారు చేసుకొన్న ఒడంబడికను త్రోసివేసి కాళేశ్వరరావు, పట్టాభి, రమణయ్యగార్లు చేసిన ఘనకార్య మేమిటి? కాంగ్రెసు పేరుతో కొన్ని అవకతవకలు చేయించారు. చివరకు ప్రెసిడెంటు రాజాగారి శరణు జొచ్చాడు. అయినా ఆ బోర్డు రద్దయింది. చల్లపల్లికి 18 స్థానాలు యివ్వడ మేమిటన్నారు? కాంగ్రెసు వారు రమణయ్యగారు యేకమైనా చల్లపల్లి వారు 17స్థానాలు సంపాదించారు.

బ్రహ్మయ్యగారు రాజీలో యిస్తామన్నది యిక నొక్కటిగదా ♦ ఆ నాడు బ్రహ్మయ్యగారి మాటను మన్నించే వుంటే కాంగ్రెసు బోర్డు సుస్థిరంగా వుండేది. జిల్లాలో కాంగ్రెసు బలం పెరిగేది. గడచినదానికి వగచిన ప్రయోజనంలేదు. ద్వేషం యెదుటివారినే గాదు కాల్చేది, తమనుకూడా కాలుస్తుంది. కృష్ణాజిల్లాపెద్దలు మహాత్ముని నిజమైన శిష్యులవలె మనుటకు ప్రయత్నింతురుగాక! తమలో తమ కలహాలు వర్గభేదాలు మరచి ఇకనైనను అందరు సోదరులవలె మెలగెదరుగాక!

"జ్ఞాతులు దమలో. బొందిన
జేత్రో మోదమున వెలిగి చెలువొందుదు ర
స్నితిం బాసిన విగత వి
భూతిం గడకొ అవ్వుట్లు పొగయుదు రధిపా."

—భారతము.

---

♦ ఎన్నికలసంగతి బ్రహ్మయ్యగారికి తెలిసినట్లు ఇతరులకు తెలియదని ఋజువు కాలేదా? ఈసంగతే బ్రహ్మయ్యగారిని గురించివ్రాస్తూ నరసింహం గారిట్లావ్రాశారు! "ఈ జిల్లా పరిస్థితులు ఈయనకు తెలిసినట్లుగా మరెవరికీ తెలియవు. యెన్నికలలో కొంచెం డక్కా మొక్కీలుతిన్న రైతుబిడ్డ...లౌక్యపనులు ఈయనకు పనికిరావు...చిన్నవయస్సు అయినా లోకాన్ని వడకట్టిచూచిన సంస్కారి...ఎన్నికలు వచ్చినాయంటే ఎవరును యీయనను, సంప్రదించనిదే ముందడుగు వేయరు." కృష్ణాపత్రిక 26.9.81. ఇట్టి అనుభవజ్ఞుని మాటలు మన్నించక మనపెద్దలు జిల్లాను తీన్‌తేరా చేశారుగదా?

# కౌన్సిల్ ఎన్నికల విద్రోహం

క|| కందుకము వోలె సుజనుఁడు
గ్రిందబడియు మగుడ మీఁదికిన్నెగయు జుమీ
మందుఁడు మృత్పిండము వలె
గ్రిందబడి యడగియుండు గృపణాత్వమునన్.

—భర్తృహరి

ఈ కౌన్సిల్ ఎన్నిక ఎదుట పరచే ముందు ఒక సంగతి పాఠకులకు విశదపరచడం అవసరం. కృష్ణాజిల్లాబోర్డు ఎన్నికలు అయినవి. కాంగ్రెసువారు గెలిచారు. బ్రహ్మయ్యగారికి శృంగభంగం అయిందనుకున్నారు, చల్లపల్లి పార్టీను భంగపరచిన, అతిరథులు మహారథులు. అంతటితో వూరుకున్నారా? బ్రహ్మయ్యగారు మనతోపాటుండక మడికట్టుకున్నట్లు యెన్నికల్లో పనిచేయనందున ఆయనకు అంతు వేయాలనుకున్నారు. అంతట కుట్రపన్ని కాంగ్రెసుకు వ్యతిరేకంగాను, చల్లపల్లి పార్టీకి అనుకూలంగాను ఆయన ప్రచారం చేసినట్లు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులగు పట్టాభిగారికి అర్జీలు పంపారు.

ఆఫీసు గుమాస్తాలవల్ల కార్యదర్శి బ్రహ్మయ్యగారికి ఈ సంగతి తెలిసింది. అంతట ఆయన ఈ రికార్డు ఇట్లా వుండటం మంచిదికాదని యోంచి తాను దోషో, నిర్దోషో లోకానికి తెలియగలందులకు, రాష్ట్రసంఘంవారిని ఒక విచారణకర్తను వేయమని కోరారు. తదనుసారంగా పళ్ళంరాజుగారిని వేశారు. ఆయన అర్జీలు చేతపట్టుకొని ఆయా ప్రాంతాలకు విచారణకు వెళ్ళారు. ఆ విచారణలో

వాటిలోని సంగతులన్నీ కల్పితాలని తెలిసినందున, బ్రహ్మయ్య గారు నిర్దోషని రిపోర్టు వ్రాశాడు.

ఇదివరకు కాంగ్రెసు తరఫున కౌన్సిల్ సభ్యుడైన పూర్ణమల్లిఖార్జునుడుగారి స్థానానికి ఎన్నిక వచ్చింది. ఆ స్థానంలో రాష్ట్రసంఘంవారు బ్రహ్మయ్యగారిని నియమించారు.

రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులగు పట్టాభిగారికి బ్రహ్మయ్యగారు గెలవరని అనుమానం కలిగింది. అయ్యో! కాంగ్రెసుసీటు పోతుందే అని పరితాపం హెచ్చింది, పట్టాభి గారికి. దానిమీద వారు, కృష్ణాజిల్లా బోర్డు ఎన్నికల అనంతరం బ్రహ్మయ్యగారిపై ప్రజలకు అయిష్టం కలిగిందికాన ఆయన ఓటమి తప్పదు, కనుక లోగడ సభ్యుడగు పూర్ణమల్లిఖార్జునుడు గారిచేత గాక్డు నామినేషన్ వేయించి పటేలుగారిచేత బ్రహ్మయ్యగారిని తీయించివేసి మల్లిఖార్జునుడుగారిని నియమించేటట్లు చేయుట యుక్తంకాదా? అని ముట్న్నారి కృష్ణారావుగారితో సంప్రదించారు. కృష్ణారావుగారు, ఇదివరకే కమ్మటూళ్ళలో జిల్లాబోర్డు వ్యవహారంవల్ల పట్టాభిగారిపై వ్యతిరేకభావం ఉన్నదని చెప్పుతూ ఈపని మంచిదికాదని సలహా ఇచ్చారు. అంతట పట్టాభిగారు ఊరుకున్నారు. ఒకరోజున బ్రహ్మయ్యగారి కారులో ఎక్కి బందరులో ప్రచారంచేశారు.

కాంగ్రెసు అభ్యర్థికి పోటీగానిలబడ్డ అడ్డుమిల్లి గోపాల కృష్ణయ్య గారికిరమణయ్యనాయుడుగారు అనుకూలంగానేగాక కాంగ్రెసు అభ్యర్థిపై కత్తికట్టి కక్షతో పనిచేస్తూ పట్టాభిగారితో రోజూ మాట్లాడుతూ వెళ్ళుతూవుండేవారు. జిల్లాబోర్డు ఎన్నికలలో

తమ కనుకూలంగా పనిచేయలేదని కాంగ్రెసువారు కొందరు ఈయెన్నికలలో పనిచేయలేదు. కొందరు ప్రచారం చేస్తామని కారులు తీసుకొని అటు ఇటు, కులాసాగా తిరిగారు. కాని పనిమాత్రం చేయలేదు. 1940 మార్చి 15 వ తారీఖున యెన్నికలు జరిగినవి. ఇందరు ఇన్నివిధాల ఆయనకు వ్యతిరేకంగా ప్రవర్తించినా, అస్సెంబ్లివారికి అధికంగా వచ్చిన వోట్లు 86 మాత్రమే.

ఆనాడు చల్లపల్లి రాజాగారితో పోటీ చేసినప్పుడు, అపజయం గాంచినా కర్ణునివలె ఖ్యాతి గాంచారు. నైతిక జయం మీాదేనన్నాడు పట్టాభిగారు. నేడు బ్రహ్మయ్యగారు స్వపక్ష విపక్షీయులచే కర్ణునివలె ఓడింపబడ్డారు. కర్ణుని పొందల భారతమన్నట్లే కృష్ణాజిల్లా రాజకీయరంగంలో బ్రహ్మయ్యగారి తలే కాంగ్రెస్ చరిత్ర.

ఆయనయందు అకారణవైరం పూని అవివేకంగా కాంగ్రెసుస్థానాన్ని పోగొట్టారు, కాంగ్రెసువారు. దీనిపై వ్యాఖ్యానమెందుకు? స్థితప్రజ్ఞులగు కృష్ణారావుగారి మాట వినండి.

"కాంగ్రెసు విద్రోహము"

"బోర్డుయెన్నికలలో తక్కిన అన్నిజిల్లాలు కాంగ్రెసుకు పట్టం గట్టుతూవుంటే ఒక్క కృష్ణాజిల్లాలోమాత్రం కాంగ్రెసు ఆధ్వర్యం లేకపోవడం, తమకు తల కొట్టివేసినట్లవుతుందనిపించి యెట్లాగైతేనేం మసిపూసి, మారేడుగాయజేసి, ఆబోర్డుకూడా కాంగ్రెసుదని అనిపించుకున్నారు రాష్ట్రకాంగ్రెసు అధికారులు.

కాని ఆ సంతోషం నాలుగు రోజులు పాటైనా సరిగా నిలవ నీయకుండా కాంగ్రెసు తరఫున లెజిస్లేటివు కౌన్సిలుకు నిలబడ్డ బ్రహ్మయ్య అపజయం, తామిన్నాళ్ళు భయపడ్డ ఆ వెనుకటి పెనుభూతాన్నే తిరిగి మరియొక రూపులో ప్రత్యక్షం చేయించింది. తక్కిన జిల్లాలలో అది వరకు కాంగ్రెసువారివి కాని సీట్లుగూడా, యిప్పుడు కాంగ్రెసుకే వశముకాగా ఈ ఒక్క జిల్లామాత్రం, కాంగ్రెసుకు వున్న సీటుకూడాపోయి, నంచి లాభం చిల్లి కూడదీసినట్లు జిల్లాయొక్క దుర్యశస్సును తిరిగి ప్రాణప్రతిష్ఠచేసి నిల్పినది. వ్రతం చెడినా, ఫలం దక్కకపోతే యిక యేమనాలి చెప్పండి, మన దౌర్భాగ్యం.

బ్రహ్మయ్యగారు అపజయం పొందడానికి కారణమేమి? ఇది కేవలం ప్రతికక్షియొక్క బలంవల్ల కల్గిన అపజయమే అయితే, మనమంతగా చింతించవలసిన పనిలేదు. ఓటర్లలో యింకా జస్టిసు మెంటాలిటీయే ప్రబలముగా వున్నదని ఒక్క నిట్టూర్పువిడిచి వూరుకుని యుందుము. బ్రహ్మయ్యగారికి కలిగిన వోటము అట్టి సరళమైన ఓటమికాదు. ఇందులో చాల కుట్రలు విద్రోహములు జరిగినట్లుగా అనేక నిదర్శనములు బయట బడినవి. బ్రహ్మయ్యగారు చల్లపల్లి మనిషి అని, అతనికి ఓటు చెయ్యడం చల్లపల్లికి ఓటుచేసినట్లేనని, కాబట్టి గోపాలకృష్ణయ్య గారికే ఓట్లు ఇవ్వవలసిందనీ, ఆకాశరామన్న వుత్తరాలు గుడ్లవల్లేరు ఫిర్కానుండి గ్రామాలలోని కొందరు బ్రాహ్మణ వోటర్లకు వచ్చినవి. మొన్నటి జిల్లాబోర్డు యెన్నికలలో కాంగ్రెసు తరఫున నిలిచినవారే కొందరు

బ్రహ్మయ్యగారికి వ్యతిరేకముగా బహిరంగ ప్రచారము చేయుట సంభవించింది. బ్రహ్మయ్యగారి తరఫున ఆయా పోలింగు సెంటర్లకు పంపబడిన కాంగ్రెసు ఏజంట్లు కొందరు, పోలింగు నాడు అయిపులేకుండా గైరుహాజరైనారు. ప్రచారం నిమిత్తం కారులిచ్చి గ్రామాలకు పంపబడిన మరికొందరు కార్లతో సహా మాయమైపోయారు. యీ పరిస్థితులన్నీ ఏమి సూచిస్తున్నవి? కాంగ్రెసులోనే విద్రోహము బయలుదేరి, కాంగ్రెసు అపజయానికి కారణభూతమైనదని స్పష్టంకావడం లేదా? రాష్ట్ర కాంగ్రెసువారు యీ విషయములో సమగ్రమైన విచారణ చేయించి, కర్తవ్యానికి పూనుకొందురుగాక - అని హెచ్చరించుచున్నాము.

కృష్ణాజిల్లాలో కాంగ్రెసు నేడు యిట్టి దౌర్భాగ్యపు స్థితిలోకి బడిపోవటానికి, ముఖ్యకారణం ఏమంటే - కాంగ్రెసు నందు వస్తుతః అభిమానంలేని, కాంగ్రెసుతత్వం యెంత మాత్రమూ వంటబట్టని, స్వార్థపరుల పాలబడినది. జిల్లా కాంగ్రెసుయొక్క భవితవ్యం కాంగ్రెసుయొక్క పైపై విజయాల నాశించి, అందుకోసం ధర్మబలాన్ని కూడా బలిపెట్టడానికి వెనుదీయని ప్రవృత్తి పైఅధికారులలో వున్నంతకాలము ఈ దుస్థితి తప్పదు. రాష్ట్రాధికారులిప్పటికైనా కన్ను విప్పుతారా అని మా ప్రశ్న? కాంగ్రెసు కమిటీలు కాంగ్రెసు గోత్రులు అందరూ, శాంతి సమరానికి సంసిద్ధంకావాలని మహాత్ముడొకమూల ఘోషపెడుతున్నాడు. అహింసా యుద్ధానికి దేశమంతా పరిపక్వస్థితిలోకి రావాలని యెదురు తెన్నులు చూస్తున్నారు. కాని ఏ ప్రాంతమైనా పరిపక్వదశ

లోకి రాగలదేమోగాని మా కృష్ణాజిల్లా పరిపక్వమయ్యే సూచన మాత్రం యింతలో కనుపించడంలేదు. కృష్ణాజిల్లా యిప్పుడు పరిపక్వమై జిల్లాకాంగ్రెసువిద్రోహానికి వెంటనే ఆత్మపరిశోధన చేసుకొని తగిన ప్రాయశ్చిత్త విధిని జరుపుకుంటేగాని ఈ దోషం పరిహారమై ఈ జిల్లాలో కాంగ్రెసు, తన విశుద్ధత్వాన్ని తిరిగి ప్రతిష్ఠించుకొనజాలదు. కాంగ్రెసు అధికారులీ విషయములో అప్రమత్తత వహించెదరు గాక!" కృష్ణాపత్రిక 23-3-40

కాంగ్రెసువాదులలో ప్రముఖులకు మితవాదుల మేధగాని, రాజకీయ పరిజ్ఞానంగాని లేదు. జస్టిసుపార్టీ ప్రముఖులకుగల వ్యక్తిప్రాబల్యం, పలుకుబడి వీరికి శూన్యం. వీరిలో మహాత్ముడు త్యాగశక్తి; నైతికప్రతిష్ఠ కలగచేశాడు. అందువల్ల వీరు అధికులయ్యారు. ఆ శక్తిని పోగొట్టుకొని కౌరవులవలె ఒకరిచావు మరొకరు కోరుకొనుట దేశక్షేమం కాదు.

ఇంతేకాదు. Ceasor's wife must not only be chaste but above suspicion. దుశ్శీలం లేకపోవడం చాలదు. దుశ్శీలపు శంకకుకూడ ఎడమీయకుండా వుండాలి. ప్రజా సేవకు అంకితులైనవారు శ్రద్ధాభక్తులతో అనుష్ఠించవలసిన ధర్మమిది.

ఆత్మతరిశోధన చేసుకొని, అంతఃకలహాలు; ద్వేషాలు పోగొట్టుకుంటే కాని కాంగ్రెసువారి ప్రతిష్ఠ నిలవదు.

---

# అసెంబ్లీ అభ్యర్థిత్వపు అలజడి

"తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గము గావించెడు వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్."

—భర్తృహరి.

లోగడ ఎన్నికలు 1937 సం॥ ఫిబ్రవరిలో జరిగినవి. తిరిగి 9 యేండ్ల అనంతరం 1946 మార్చిలో వచ్చినవి. కాంగ్రెసు అభ్యర్థులను పెట్టదలచింది. ఈ దఫా బ్రహ్మయ్య, వల్లభనేని రామబ్రహ్మం, సీతామహాలక్ష్మమ్మ, దుక్కిపాటి నాగేశ్వరరావుగార్లు అభ్యర్థులుగా దరఖాస్తు చేశారు. రాష్ట్ర పార్లమెంటరీ ఉపసంఘంవారు అంతటా సంచారం చేసి విచారించినట్లే వీరిని గురించికూడా బెజవాడలో విచారణ చేశారు. వివిధ తాలూకా కాంగ్రెసు ప్రెసిడెంటు శక్రటరీలేగాక బ్రహ్మయ్యగారి కనుకూలంగా షుమారు మూడువందల మంది సాక్ష్యం చెప్పారు. అందుచేత వారు ఏకగ్రీవంగా బ్రహ్మయ్యగారినే ఆలించియూ పార్లమెంటరీ బోర్డుకు సిఫార్సు చేశారు, హరిజన అభ్యర్థిగా వేములకూర్మయ్యగారు కూడా

సిఫార్సు చేయబడ్డాడు. ప్రజాభిప్రాయాన్ని బట్టి బ్రహ్మయ్య గారే అభ్యర్థిగా వుంటాడని తలచి కమ్యూనిస్టులు యీ సిఫార్సుకు ముందే ఆయనపై వ్యతిరేక ప్రచారం చేయ సాగారు.

పానల్ ఎన్నికలలో తనతోటి అభ్యర్థి, కూర్మయ్య గారికి సాయము చేయుటవసరమని తలచి బ్రహ్మయ్యగారు, ఆయన మిత్రులు జిల్లా అంతా స్వంత ఖర్చుతో తిరిగి ప్రచారం చేసి, వర్కర్లనుకూడా నియమించారు. పరిస్థితులిట్లా వుండగా ఆలిండియా పార్లమెంటరీ బోర్డువారు ఈ నామినేషన్‌లను గురించి ఆలోచించసాగారు. ఆ బోర్డుకు పటేలు, పట్టాభి, శంకరరావు దేవులు సభ్యులు. విచారణ జరుగుతున్న బొంబాయి పట్నానికి, అభ్యర్థులు కొందరు, అభ్యర్థుల తరఫున కొందరు తమ నామినేషన్లను బలపరచుకోవడాని వెళ్ళారు. బ్రహ్మయ్య గారు స్వయంగా వెళ్ళనూ లేదు, మరియొకరిని పంపనూ లేదు. రావుబహదూరు బిరుదాంకితుడు జిల్లా యుద్ధసంఘ కార్యదర్శి కాంగ్రెసుకు బద్ధవిరోధిగా నుండి కొన్నిలు ఎన్నికలలో బ్రహ్మయ్యగారికి వ్యతిరేకంగా పనిచేసిన జస్టిసుపార్టీ ప్రముఖు డైన రమణయ్య నాయుడుగారు కాంగ్రెసుకు అన్యాయం జరుగుతుందనే నెపంతో బ్రహ్మయ్యగారియందుండే వ్యక్తిగత ద్వేషంతో నూతన ఖద్దరు వస్త్రధారియై బొంబాయి వెళ్ళాడు.

ఇట్టి రమణయ్య నాయుడుగారిని, తాను బందరు నోబుల్ కాలేజీలో ప్రొఫెసరుగావున్నప్పుడు, తన శిష్యుడని పలుకుబడిగల లీడరని ఆయన ఒకరి తరపున రాక, కృష్ణాజిల్లా పరిస్థితులు తెలుపుటకు వచ్చారని పటేలుగారికి పట్టాభిగారు పరిచయం చేశారు. రమణయ్యనాయుడుగారు, లోగడ అస్సెంబ్లీకినికాన్నిలుకను నిల్చి బ్రహ్మయ్యగారు ఓడిపోయారని పలుకుబడిలేని ఈ వ్యక్తిని తీసివేసి మరి ఒకరిని పెట్టటం అవసర మని చెప్పారు.

గుంటూరు జిల్లానుండి సూర్యదేవర రాజ్యలక్ష్మి దేవి గారు వెళ్ళి స్త్రీలు ఓటర్లలో సగంమంది వుండుటేగాక కాంగ్రెసులో ప్రవేశించి వారు ఘనతర త్యాగాలు చేశారు కనుక వారిని అధికంగా నిలుపవలసిందని హిందీలో పార్లమెంటరీబోర్డు యెదుట చెప్పారు.

ఆమరునాడే కృష్ణాజిల్లావంగతి విచారణకు వచ్చింది. బ్రహ్మయ్యగారు అభ్యర్థిగా వున్నందున కూర్మయ్యగారికి పానల్లో తక్కువవోట్లు వచ్చినవని, కృష్ణాజిల్లా కాంగ్రెసు ప్రెసిడెంటు రామబ్రహ్మంగారు పటేలుగారికి టెలిగ్రాం ఆ సమయానికే పంపారు. పర్యవసానం బ్రహ్మయ్యగారిని తగ్గించి, సీతామహాలక్ష్మమ్మగారిని ఆస్థానే నిలుపుట జరిగింది.

బ్రహ్మయ్యగారిని అభ్యర్థిగా తీసివేశారని తెలియ గానే జిల్లాలోను బయటనూకూడా గొప్పఅలజడి ఆందోళన బయలుదేరింది. ఆసువందల టెలిగ్రాములు వెళ్ళినవి. ఆ రాజ్యలక్ష్మి దేవిగారేమళ్ళా పటేల్ గారివద్దకు వెళ్ళి బ్రహ్మయ్య గారు చాలాకాలంనుండి ప్రజాసేవ చేస్తున్న ప్రముఖుడు, స్త్రీల

స్థానం కోసమైనప్పటికి ఆయనను తీసివేయటం అన్యాయమన్నారు. హరిజన అభ్యర్థి వేముల కూర్మయ్యగారు బ్రహ్మయ్యగారే ఇంతవరకు నాకు పాసత్ ఎన్నికలో పని చేశారు కాని జిల్లాసంఘమువారు యేమీ పని చేయలేదని గనుక ఆయనను తీసివేయుట అక్రమమని అన్నాడు.

మొర్నేని సుబ్రహ్మణ్యం, తమ్మా నాగిరెడ్డిగార్లు జిల్లా తరఫున రాయబారం వెళ్ళి జిల్లాపరిస్థితులన్నీ పటేలుగారికి విన్నవించారు. అంతట ఆయన వారు చెప్పిందంతా న్యాయమేనని అంగీకరిస్తూ బ్రహ్మయ్యగారికి అక్రమం జరిగినమాట వాస్తవమేగాని అది పట్టాభిగారి జిల్లాగనుక ఆయన అంగీకరించంది, తానేమీ మార్పుచేయజాలనని పటేలుగారన్నారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి కార్యదర్శిగా నున్న కళా వెంకట్రావుగారు బ్రహ్మయ్యగారిని తీసివేసినందున అక్రమం జరిగిందని అంతులేకుండా టెలిగ్రాములు వస్తూ వున్నవిగాన మీరు పునర్విచారణ చేయవలసిందని పటేలుగారికి టెలిఫోనుచేశారు. దానికి సమాధానంగా, బ్రహ్మయ్యగారికి అన్యాయం జరిగినసంగతి తనకు అర్థమైనదనీ పట్టాభిగారితో చెప్పి దీనిని మార్చవలసిందని ఆయనద్వారా తనకు తెలియజేస్తే తాను మార్చగలనని పటేలుగారన్నారు. జిల్లా ప్రముఖులు కొందరు పట్టాభిగారిని దర్శించి పటేలుగారి అభిప్రాయాన్ని తెలియచేస్తే, పటేలుగారు మారిస్తే తనకేమీ అభ్యంతరం లేదని చెప్పాడు.

ఇది ఇట్లా జరుగుతూండగానే నామినేషన్ రోజు వచ్చింది. రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుల ప్రత్యేక అనుమతిమీద

బ్రహ్మయ్యగారు నామినేషను వేయుట జరిగింది. నామినేషను ఉపసంహరించుకో వలసిందిగా పటేలుగారినుండి టెలిగ్రాం వచ్చింది. బ్రహ్మయ్యగారు సుశిక్షితుడగు సైనికునివలె తన నాయకునిమాట మన్నించాడు.

ఈసారి జమీందారులెవరూ కాంగ్రెసుకు వ్యతిరేకంగా నిలవలేదు. కమ్యూనిస్టులు ఆ జమిందారులు వరించిన యెత్రపెట్టనే వరించి కాంగ్రెసుకు వ్యతిరేకంగా నిలబడ్డారు. బ్రహ్మయ్యగారిని తీసివేసి ఆయనస్థానే సీతామహాలక్ష్మమ్మ గారిని నిలిపినందుకు ఆమెకు ఓట్లు యివ్వకుండా వుండాలని కొందరు, మరికొందరు అంతకంటె మరొకఅడుగు ముందు వేశారు. కమ్యూనిస్టు అభ్యర్థి చలసాని వాసుదేవరావు గారికేయిచ్చి, సీతామహాలక్ష్మమ్మగారిని ఓడింపతలపెట్టారు.

ఈ పరిస్థితులు పరికించారు బ్రహ్మయ్యగారు. మోటారులో వస్తూండగా ఆయనకు గూటిమీద బలమైనదెబ్బ తగిలింది. అయినా ఆయన యెన్నిచోట్లకు తిరగగలరు? అందుచేత ఆంధ్రప్రభలో (ది 1946 సం॥ మార్చి 13) కాంగ్రెసు ప్రతిష్ఠ కాపాడవలసినదని హెచ్చరిస్తూ ఒక ప్రకటనచేశారు. అందులోని ముఖ్యాంశాలు "ఈ నియోజకవర్గమున ప్రథమున రాష్ట్రపార్లమెంటరీ వుపసంఘము వారిచే యేకగ్రీవముగా నాపేరు నియమించబడి, అన్ని తాలూకాలలోను విరివిగా ప్రచారమొనర్చుట జరుగుటయూ, కొందరు స్థానిక ప్రముఖుల గూడుపుఠాణీవల్ల నాపేరు తొలగింపబడుటయు జరిగినందున జిల్లాలోని కాంగ్రెసు వర్గీయులలోను, ప్రజలలోను ఒక విధమైన నిరుత్సాహమేర్పడి, ప్రచారం వగైరా తగినంత చురుకుగా

జరుగుటలేదని తెలియుచున్నది. వ్యక్తులయొక్క ప్రవర్తన దృష్టిలో వుంచుకొనవలదనియు, కాంగ్రెసు ప్రతిష్ఠను కాపాడుటలో కాంగ్రెసు కార్యక్రమ నిర్వహణలో మన మితర జిల్లాల కెంతమాత్రము వెనుకబడరాదనియూ మనవి చేయుచున్నాను. 26 సంవత్సరములనుండియు కాంగ్రెసు యెడల భక్తివిశ్వాసములు కల్గి సైనికునివలె ప్రవర్తించిన నేను ముందునూ అట్టి భక్తి శ్రద్ధలతోనే కాంగ్రెసు కార్యక్రమ నిర్వహణలో ప్రాణార్పణ చేయుదునని మనవి చేయుచున్నాను."

"కాంగ్రెసు అభ్యర్థులకే మీరు వోట్లనిచ్చి, ప్రత్యర్థుల డిపాజిట్లుసహా పోగొట్టుకొనునట్లు చూడవలసినదిగా హెచ్చరించుచున్నాను"

దీని పురస్కరించుకొని ఆంధ్ర దేశంలో అధికవ్యాప్తి గాంచిన ఆంధ్రప్రభ 'మన కర్తవ్యం' అను శీర్షికతో సంపాదకీయం వ్రాసింది. దానిలో కొంతభాగం.

"నాకు అన్యాయం జరిగివుండవచ్చు. అయినా కాంగ్రెసుకు అన్యాయం చేయవలదు." ఈ పలుకులలో కాదుగాని ఈ ధోరణిలో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు చేసిన ఒక ప్రకటనను, నేటి సంచికలోనే వేరొకచోట ముద్రిస్తున్నాము. యీ ప్రకటన యెంత వుచితమైందో అంత వుత్తమమైనది. యెంత వుత్తమమైనదో అంత వుదాత్తమైనదికూడా.

"ప్రతి కాంగ్రెసు సభ్యుడు-ప్రతి కాంగ్రెసు అభిమాని ప్రతి జాతీయవాది, ప్రతి దేశభక్తుడు, ఒక్క మాటలో ప్రతి భారతీయ పౌరుడు ప్రస్తుతం అనుసరించతగిన అనుసరించ

వలసిన వైఖరిని (శ్రీ) బ్రహ్మయ్యగారు తమ ప్రకటనలో సూచించారు.

“శాసన సభలకు కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించడంలో ఆంధ్రరాష్ట్రంలోనేమి, అన్యరాష్ట్రాలలోనేమి కొన్ని పొరపాట్లు జరుగక పోలేదు. యిది యెంతైనా శోచనీయ విషయం కావచ్చు. కాని జరిగిపోయినదాని విషయమై యిప్పుడిక విచారించడంగాని, కినుక వహించడంగాని తగదు.

“కాంగ్రెసు అభ్యర్థుల నిర్ణయం విషయమై జరుగవలసిన-జరుగదలచిన - ఆందోళన, యేదో ఆల్ యిండియా పార్లమెంటరీ బోర్డు అంతిమ తీర్మానాన్ని చేయక పూర్వం జరిగింది. యిప్పుడిక యీ విషయమై విమర్శ కూడదు; ఆందోళన తగదు. ఆగ్రహం అనుచితం కాగలదు. అలక మహాపచారంగా పరిణమించగలదు.

“కాంగ్రెసు ప్రజాస్వామిక సంస్థ. అంతిమ నిర్ణయం జరగనంతవరకు విమర్శ చేయడం - నిస్సంకోచంగా - నిర్భయంగా, నిశ్చలంగా, నిశితంగా విమర్శచేయడం - ప్రతి ప్రజాస్వామిక సంస్థ సభ్యుని జన్మహక్కు. ప్రతి సభ్యుడు తన యీ జన్మహక్కును వినియోగించుకున్నప్పుడే ప్రజాస్వామిక సంస్థలకు బలం ప్రభా, దీప్తి”

“కాని అంతిమ నిర్ణయం జరిగినంతనే, విమర్శ సమసి పోవాలి. స్వీయనిర్ణయంగానే దాన్ని సంభావించాలి. యిట్లా సంభావించడం సహనంతో మాత్రమే కారాదు; సంతోషంగా; గత్యంతరం లేనట్లు మాత్రమే కారాదు; హృదయ పూర్వకంగా-శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు యీవిషయాన్ని

హెచ్చరిస్తున్నారు. యీ సత్యాన్నే వుద్ఘోషిస్తున్నారు. ఒక కృష్ణాజిల్లాకే కాకుండా, యావదాంధ్ర దేశానికి ఆయన చేసిన ప్రకటన వర్తిస్తుంది,

"యే వ్యక్తి కాంగ్రెసు అభ్యర్థి? అనే ప్రశ్నకు యిక ప్రాధాన్యం లేనేలేదు. కాంగ్రెసు అభ్యర్థికి విజయమా! లేక అతని ప్రత్యర్థికి విజయమా! యీ ప్రశ్నకే నేడు ప్రాధాన్యం.

"దీన్ని దృష్టిలో పెట్టుకొనే నేడు ప్రతి కాంగ్రెసు సభ్యునితో పాటు ప్రతి కాంగ్రెసు అభిమాని కూడా, కార్యరంగములో నిలవాలి; యెన్నికల ప్రచారాన్ని కొనసాగించాలి; విజయభేరిని మోగించాలి."

యెన్నికల ప్రచారానికై యస్టేటులో కార్యక్రమం వేసుకున్నారు పట్టాభిగారు. యువజనులంతా బ్రహ్మయ్యగారిని తిసి వేసినందుకు ఆవేశంతో వున్నారు. అలజడి అధికంగా వున్నది. ఈ సంగతి వారికి విన్నవించారు కొందరు. అందుచేత ఆ కార్యక్రమాన్ని ఆపేశారు. తర్వాత ఒక్క రోజున పట్టాభిగారు యెస్టేటంతా తిరిగారు. అప్పుడుకూడా కొడాలి మొదలగు కొన్నిచోట్ల పట్టాభిగారు వచ్చినప్పుడు, తమ వ్యతిరేకతను వెల్లడించకపోలేదు.

బ్రహ్మయ్యగారి హెచ్చరిక, దానిపై ఆంధ్రప్రభ వ్యాఖ్యానము చేసిన తర్వాత అందరూ అనుకూలురగుటే గాదు, కాంగ్రెసు అభ్యర్థి విజయానికై కంకణం కట్టుకొని ఆంధ్ర ప్రభ, బ్రహ్మయ్యగారు కోరినట్లు జయభేరి మోగించారు. ఎర్రపెట్టెలవారికి ఆనాడు జమీందారులకు పట్టెనగతే పట్టింది.

బ్రహ్మయ్యగారు శాసనసభాసభ్యుడు గాకపోయినా, ఆయన ప్రజాప్రతినిధే. ప్రజలు హృదయసీమలలో ఆయన గౌరవస్థానాన్ని పొందే వున్నాడు. పైవారు చేసే పూర్పుల వల్ల ప్రజాసేవకునకు పతనమంటూ వుండదు. పదవి ప్రజా సేవకు ఒక ఆలంబన. అంతకంటె అన్యముగా తలచరాదు. పదవి లేనందున గౌరవము లేదా?

"పదవి కొందరికి అలంకారమైతే కొందరు పదవికి అలంకారం. పదవి అధికార మిస్తుంది ఆధిక్యతకూర్చు తుంది; పదవివల్ల ప్రతిపత్తి లభిస్తుంది; ప్రతిష్ఠ సిద్ధిస్తుంది."

"పదవిలో పెద్ద విశేషం - చాలా లోపాలను చాలా వరకు కప్పివుచ్చడం.

"ప్రజ్ఞ లేకపోవచ్చు; ప్రతిభ శూన్యం కావచ్చు; శక్తి సామర్థ్యాల దారిద్ర్యం వుండవచ్చు. అయినా పదవికలవాడు - అతడు కేవలం శుంఠ అయితే తప్ప - యీ లోపాలు బయట పడకుండా గుంభనగా కాలక్షేపం చేయవచ్చు. యిక యేపాటి ప్రపంచజ్ఞానమున్నా, యేమాత్రం యుక్తాయుక్త విచక్షణ శక్తి యున్నా, పదవికూర్చే ప్రకాశంవల్ల దీప్తివంతుడననే భ్రమను, లోకానికి కల్గించవచ్చు."

"యిట్టివారు పదవిపోయిన వెంటనే అంచజారిన వోటి గోడవలె చతికిలబడతారు. కళాయిపోయిన అద్దములువలె వెల వెల పోతారు. గాలిపోయిన టైరువలె యీసుకుపోతారు."

"పదవివల్ల రాణకువచ్చేవారి సంఖ్య యెంతఅధికమో పదవికి రాణింపు తెచ్చేవారి సంఖ్య అంతస్వల్పము. మేధాశక్తి అందరిసొత్తుగాదు. ప్రతిభ ప్రదర్శించగలవారు బహుకొద్ది

మంది. వృత్తిపన్నులనగలవారు, అరుదుగాకాని గానరారు. త్యాగధనులైనవారేమి! నిస్స్వార్థపరులైనవారేమి, చాలాతక్కువ. అందువల్ల నే పదవికి రాణింపు కూర్చేవారు, సర్వత్ర స్వల్పం.

"యెట్టివారికీ పదవి అధికారాన్ని కూర్చవచ్చుగాని; దానివల్లవచ్చే అధిక్యతలేదు. వారి అభిమతాలు చెల్లడానికీ పదవి వుపకరించవచ్చునుగాని. దానివల్ల వారికి కొత్తగా వచ్చే యశస్సులేదు. పదవిలో వున్నప్పటిసలైనే లేనప్పుడుకూడా వారు స్వయం ప్రకాశులే" (ఆంధ్రప్రభ 18-6-43)

ఇట్టి స్వయంప్రకాశంగల ప్రముఖులలో గణించదగిన వారు బ్రహ్మయ్య గారు.

నాడు ఆయనకు శాసన సభ్యత్వం లేకుండా చేయ బడినది. కాని శాసనసభ్యునికంటె పలుకుబడి గౌరవం ప్రజలలోగాని ప్రభుత్వంలోగాని తక్కువగాదు. ఆయనకు ఆనాడు శాసనసభ్యత్వమేగాదు, ఎట్టి పదవీలేదు. కాని ప్రజా విశ్వాసం, కార్యదక్షత, లోకానుభవము, సేవాసక్తి మొదలగు గుణగణముల వలన ప్రజానాయకుడుగా యెన్నబడ్డాడు. ప్రజాసేవకునకు పదవి ఒక ఆలంబనగాని అధికారముగాదు. ఆయన జీవితవిధాన మీ సత్యాన్నే ఉద్ఘోషిస్తున్నది.

ఈ సందర్భంలో ఆయన 1937 మార్చి ఆరవ తారీఖున కృష్ణాపత్రికలో అస్సెంబ్లీ ఎన్నికల అనంతరం తెలి పిన అభివందనాలు, పదవులను గురించి ఆయన చిత్తవృత్తి యెట్టిదో తెలుసుకొనుటకు అధికంగా తోడ్పడగలదు.

"కాంగ్రెసు ఆజ్ఞను శిరసావహించి, నా సేవకనుజ్ఞ నీయవలసిందని మిమ్ము అర్థించితినే కాని దీనివలన నేదియో

మహాభాగ్యము ప్రాపింపఁగోరిన వాడనుగాను. మొదటి నుండియు రైతుల కష్టసుఖములలో భాగస్వామిని గనుక అవకాశము లభించినప్పుడెల్ల నా స్వబుద్ధితోను, కాంగ్రెసు సలహాలతోను, యింతకుపూర్వము చేయుచున్న మీ సేవనే యిప్పుడు మీ సెలవైనచో అస్సెంబ్లీద్వారమున చేయదలపెట్టితిని. అంతియేకాని, యితరములైన అధికార వాంఛలకు అర్రులు సాచిన వాడనుగాను. మీ అనురాగమే, నాకు సింహాసనము. మీ ఆమోదమే నాకభిషేకము. కావున నేనవలంబించిన సేవావ్రతమునకు అస్సెంబ్లీ ప్రవేశము కంకణధారణకాగలదే గాని, తద్ప్రవేశము వుద్యాపన మాత్రము కాదని విన్నవించుచున్నాను.”

నాడేకాదు నేడూ అంతే ఆయన ఆకాంక్ష. పదవిలేని గౌరవమే ప్రాముఖ్యతను గడిస్తుంది.

“వనజభవుండు కోపమున వాహనమైన మరాళభర్తకున్
వనజవనీవిహారకలనంబు దొలంగఁగఁ జేయుగాని గుం
భనమున దుగ్ధజీవన విభాగవిధాననిరూఢనైపుణీ
జనితయశోవిభవసారము హంసకు మాన్పఁజాలునే”.

— భర్తృహరి

—:—

# జైలు జీవితం

"దేశము కికి పోరాడు ధీరమతులు
ఆత్మస్వాతంత్ర్యమున దేలియాడు కతన
వారిపాలికి జెరసాల స్వర్గశాల
వారి కనమాన మనుమాట వట్టిమాట."

నల్లబెండాల కేసులో 1930 మార్చి 15 వ తారీఖున శిక్షింపబడిన మొదటి యెనిమిదిమంది ముద్దాయీలు రాజమండ్రి జయిలుకు పంపబడ్డారు. అది వరకు ఆయన జైలును గూర్చి వినడమేగాని ప్రథమానుభవ మిదే. ఆ జైలు తిండి, మన ఇళ్ళల్లో కుక్కలు కూడ తినవు. పురుగులు వడ్డ పాత పుచ్చుకు బియ్యపు ముద్ద. అందులో ఇనుపమేకులు సహా గలిజేకు వగైరా సమస్త ఓషధుల సంబంధమైనవి. పుచ్చు కందులతో వుడికీవుడకని దేవతా పులుసు; ఆముద్ద యీ పులుసుతో జీవయాత్ర చేయాలి. రూల్సుప్రకారం ఖైదీలకు రావలసిన కాయగూరలు అధికారులు కంట్రాక్టర్లు కైంకర్యం చేస్తారు. ఈ తిండి సహించక రెండు మూడు రోజులు పస్తు కూడా వున్నారు. తర్వాత కాలక్రమంగా అలవాటైపోయింది. రాజమండ్రి జైలుకువచ్చిన మొట్టమొదట రాజకీయ ఖైదీలు వీరే. ఆత్మగౌరవం గల ఈ రాజకీయ ఖైదీలు అధికార్ల ఆజ్ఞలను శిరసావహించక తిరస్కరించుటచేత ఈ ప్రభావం సాధారణ ఖైదీలలోకూడా పడుతుందనే అభిప్రాయంతో ఇక్కడనుండి వీరిని ట్రాన్సుఫర్ చేశారు. ఆ మార్పిడంలో కూడా వీరంతా ఒకచోటవుంటే సంఘీభావంతో ప్రతిఘటి

స్తారని తలచి విడదీసి, వేరు వేరు జైళ్ళకు పంపారు. బ్రహ్మయ్యగారిని బరంపురం జైలుకు పంపించారు. సత్యాగ్రహుల నైతిక ప్రతిష్ఠ ప్రథమంలో ప్రభుత్వంవారికి తెలియనందున హింసావాదులగు రాజకీయ ఖైదీలవలె, దొంగలకువలె బేడీలు వేసి, పోలీసు బందోబస్తుతో రాజమండ్రినుండి బరంపురం తీసుకువెళ్ళుట తటస్థించింది. బరంపురం స్టేషన్‌నుండి జైలుకు అంతకంటె బందోబస్తుతో తీసుకువెళ్ళారు. ఆయనను కష్ట పెట్టాలను వుద్దేశంతో చేసిన మార్పు ఆయనకు శుభప్రదమే అయింది. రాజమండ్రి జయిలు సూపర్నెంటువంటి కఠినచిత్తుడు కాడీ జయిలు అధికారి. అక్టింగు సూపరింటెండెంటుగానున్న మేజర్ కేరిక్ అయిర్లండు దేశీయుడు. చాలా యోగ్యుడు. ఖైదీలను కన్నబిడ్డలవలె చూచేవాడు. అంతంత మాత్రంగా వున్న ఈ ఖైదీల రేషన్‌లో దొంగిలించటమంటూ ఈ జైలులో లేదు. సామాన్య ఖైదీలనే ఆ విధంగా చూచినప్పుడు రాజకీయ ఖైదీలను మర్యాదగా చూడడంలో ఆశ్చర్యంలేదు. ఆయన స్థితిగతులను అడిగి, బి. క్లాసు యిచ్చాడు, సూపర్నెంటు.

ఇంతలో శాసనోల్లంఘనోద్యమం ప్రారంభమైంది. వందలాది దేశభక్తులు జైలుకువచ్చారు. ఈజైలుకు వచ్చినవారిలో ప్రథముడగుటచేత అందరిని ఆప్యాయంగా ఆహ్వానించే బాధ్యత ఆయనమీాదే పడింది. పాకశాల పరిపాలన అంతయు కలసి ఆయనమీాదే వుంచారు. అక్కడవున్న సత్యాగ్రహులకు అధికారులకు యేమైనా అభిప్రాయభేదాలు వస్తే తగాదాలు లేకుండాచేసి సామరస్యంగా నడుచుకునేటట్లు చూస్తూండేవాడు.

తర్వాత ఆయనకు బి. క్లాసు ఖాయమై వచ్చినందున అచ్చటినుండి వెల్లూరు జైలునకు పంపబడ్డాడు. వెల్లూరు జైలు సూపరెండెంటుకూడా బరంపురం సూపరెండెంటువలె రాజకీయ ఖైదీలనందరినీ మర్యాదగా చూచేవాడు. ఆ సమయములో కొద్దిగా యింగ్లీషు, హిందీకూడా చదివాడు, ఇక్కడ వున్న నాల్గు నెలలు బాగానే గడచినవి. పండుగ పర్వాలకు స్నేహితులు విడుదలైనప్పుడు పిండివంటలతో విందులారగించేవారు.

ఆయనతోటి 9–10 ముద్దాయిలపై పోలీసువారు అప్పీలు చేసినందున హైకోర్టు నెలరోజుల శిక్షమాత్రం ఖాయపరుస్తూ ఇది మిగతా ఖైదీలకుకూడా అన్వయిస్తుందని తీర్పు చెప్పబడెను. అందుచేత ఆయన డిశంబరు 24వ తేదీని విడుదల అయ్యాడు.

రీసెటిల్మెంటు ఆందోళనలో పన్నుల విరాకరణ బోధిస్తున్నాడనే నేరమారోపించబడి 1932 సం॥ జనవరి 15 వ తారీఖున రెండు సంవత్సరములు కఠినశిక్ష, వెయ్యిరూపాయిల జరిమానా విధింపబడిన సంగతి పాఠకులకు పరిచయమే. 16 వ తేదీకి రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపబడిరి. మళ్ళా వెనుకటి పర్యాయపు జైలునరకం ప్రత్యక్షం. వెనుక రాజకీయ ఖైదీలను వేరుగా వుంచేవారు. ఈదఫా రాత్రిళ్ళు మిగతా ఖైదీలతోకలసి లాకప్ చేయుట తటస్థించింది. జైలుఅధికారుల వుద్దేశంలో రాజకీయ ఖైదీలకు క్రిమినల్ ఖైదీలకు యేమీ భేదము లేదని చూపుటకుగాను యిట్లా చేశారు. పగటిపూట మాత్రం వారి పక్షాలుడక లేదు. సాధారణ ఖైదీలవలె పనులు

చేయించాలని ప్రయత్నించారు గాని వాళ్ళ తరం కాలేదు. రాజకీయ ఖైదీలతో కలిస్తే సాధారణ ఖైదీల పనికూడా చెడుతుందని వారు గ్రహించి, వారిని నామమాత్రంగా వర్కుషాపుకు తీసుకువెళ్ళేవారు. అప్పుడక్కడ 200 మంది రాజకీయ ఖైదీలుండేవారు. జైలు అధికారులతో వ్యవహరించుటకుగాను, మద్దూరి అన్నపూర్ణయ్యగారిని బ్రహ్మయ్యగారిని పెద్దలుగా యెన్నుకొన్నారు. వీరికి సలహా సంఘంగా యేడుగురు సభ్యులుండేవారు,

అక్కడ వుండగా ఛీఫ్ వార్డరు, ఒక రాజకీయ మైనరు ఖైదీని కొట్టినందున ఈ రెండువందలమంది ఒకరోజున ఉపవాసం చేశారు. 1 అప్పటినుండి అట్టి పని శంకర్ అనే జైలు సూపర్నెంటు వున్నంతవరకు మళ్ళా జరగలేదు. ఆయన వస్తుతః చాలా మంచివాడు.

ఇక్కడ వుండగా లాహోరు కుట్రకేసులో యావజ్జీవ శిక్ష విధింపబడిన శివవర్మ, 2 సిన్హాగార్లు ఆయన బ్లాకులోనే వుండుటచేత, వారి పరిచయం కల్గెను. వారి నిత్య సంతోషం ప్రసన్నవదనాలు, చూస్తే యెవరిలో దేశభక్తి ప్రజ్వలింపదు?

1. నీరుకొండ రామారావుగారు. తర్వాత వ్యవసాయ మంత్రి అయ్యారు. ఆయన అకాలమరణం రైతులకు తీరని నష్టం.

2. ఈ సిన్హాగారికే కృష్ణాజిల్లా అగ్రశ్రేణికి చెందిన కాంగ్రెసు నాయకుడగు అన్నే అంజయ్యగారు తన కుమార్తె శ్రీమతి రాజ్యాన్నిచ్చి వివాహం చేశారు.

జైలుస్నేహం దేశభక్తి రాష్ట్రాలను అధిగమించి, పిల్లనిచ్చి అల్లునిగా వరించుటకు కారణమగుట ప్రశంసనీయం.

వారి సిద్ధాంతాన్ని మనం అంగీకరించకపోయినా పాల్గొను బుగ్గల పసిప్రాయంపు ఆవీరులు దేశమాత పిలుపు విని ఉరి కంబముల నెక్కుటకు సిద్ధమైరి. వారి జన్మ ధన్యమైనది.

అక్కడనుండి బళ్ళారిజైలుకు మార్చిరి. ఇక్కడ దత్తు, మహావీరశింగు, డాక్టరు గయాప్రసాదులతో స్నేహమయ్యెను. వీరుకూడా లాహోరుకుట్రకేసు లోనివారే.

1942 ఆగస్టు డిటెన్యూగా తీసుకొని పోబడి 2 సం॥ నాలుగుమాసములు కారాగృహవాసము చేసిరి. అప్పు డక్కడ మెన్ మాసేజరుగా వుండేవాడు. మేయర్ కమిటీలో మెంబరు. ఆయన మేయరు పదవిని నొందక మేయర్ మేకరుగా వుండే వాడు.

ఆహా! మహాత్ముడు మన కళ్ళఎదుట ఎట్టి మహత్తర మార్పులను మనలో కలగజేసెను! హంసతూలికాతల్పమున తూగుటుయ్యాలలో ఊగు కుసుమశరీరులను, కర్కశారణ్య భాగములకు బంపెను. మదపుటేనుగుల నెక్కి మదాంధతచేమహీ చక్రమునుమీటు మహారాజులంతటి వారిని పాదచారులుగ ఒనర్చెను. బంగారుచేకులు భుజించు భాగ్యవంతులకు కటిక గంజిపాలు జేసివైచెను. బాలచంద్ర ప్రభలభాసిల్లు బాలభార తులకు బూడిదపూసి కౌపీనము లిప్పించెను. పట్టు దుకూల ములు బరువైనవని భావించు భామినులను మోటుఖద్దరు వస్త్రములను కట్టించెను.

మహాత్ముని బోధవల్ల జైలుయాత్ర తీర్థయాత్ర అయి నది. అది శ్రీకృష్ణజన్మస్థానమని ఖ్యాతి గాంచినది. దేశారాధ నకు అది ఒక గీటురాయి అయినది. అనేకమాసుల లక్ష

లాది భారత వీరనరనారీమణులు జైలు యాత్రచేసి బ్రిటిష్ ప్రభుత్వ నైతిక ప్రతిష్ఠ నాశనమొనర్చి లోకాన్ని విస్మయ చకితం చేశారు. ఈ కారాగార వాసమువల్ల మన దేశారాధకుల్లో అనేకులకు ఆరోగ్యభంగం కలిగింది. అసువులు బాసినవారు అనేకం. లోకమాత కస్తూరిబాకితినమైన ఖైదులోనే కాలం చేసెను. మహాత్ముని ప్రియశిష్యుడు, మహాదేవ దేశాయి ఇందు లోనే అస్తమించెను.

యతీంద్రనాథుడు పంచేంద్రియములను సమిధిలగచేసి పంచయజ్ఞ మొనర్చినది ఇచ్చటనే కదా !

దేశంకొరకు ప్రాణములను పుష్పములవలె అర్పించిన త్యాగులు తేజరిల్లారు, బాపూజీ బోధలవల్ల. కర్పూరము స్వరూపనాశనము చేసుకొని నప్పుడే తేజోరూపము నొందక గలదు. స్వాతంత్ర్యజ్యోతి ప్రసన్నమగుటకు కర్పూర నీరాజన మెత్తుటకు అర్హత ఈ భారతజాతికే. ఈ భీష్మ సంతతికే కల దన్న సంగతి ప్రపంచం ఎదుల రుజువైనది.

"ఇంతేకాదు. I Will spread out the freedom of India in Jails." భారత స్వాతంత్ర్యం కారాగృహాలద్వారానే సాధించెదనన్న మహాత్ముని ప్రవచనం అక్షరాలా సత్యమైనది. మహాత్ముని సమకాలికులుగా పుట్టుట మన భాగ్యం. ఆయన వారసులంగా వర్తిల్లుటకు ప్రమాణం స్వీకరించి, మనం తరించి, ఇతరులను తరింపచేతుము గాక !

---

# కుటుంబ జీవితము

"ఒకరి సౌఖ్యము నొకరు కోరుచు
ఒకరి మెప్పున కొకరు పొంగుచు
మనసు ప్రాణము లొక్కటగు
దంపతుల కీ డెవరు !" —పల్లెపట్టు.

తండ్రిపోగానే తోబుట్టువును, మేనల్లుని తమ ఇంటికి మేనమామలు తీసుకొనివెళ్ళిన సంగతి పాఠకులకు పరిచయమే. పెద్దమామకు అప్పట్లో పిల్లలులేరు. తమ్మునకు వివాహంకాలేదు. అందుచేత అందరును అల్లారుముద్దుగా పెంచారు. ఆయనతల్లి యశోదమ్మ, ఆయనమీద ప్రాణంవుంచి ప్రేమతో పెంచినదని వేరే చెప్పనక్కరలేదు. తండ్రిలేని లోటు యేమీ లేకుండా ఆయన పెరిగాడు. అసలు తల్లి లేకపోతే చిక్కుగాని తండ్రి లేకపోయినా బిడ్డ పోషణకేమీ లోటురాదు. అందుచేతనే ఏనుగంత తండ్రికంటె, ఏకుల బుట్టంత తల్లి మేలు అనే సామెత వచ్చింది. మేనమామలు సుబ్బయ్య, వెంకయ్య గార్లిద్దరు మేనల్లుని అతిగా రాబంగానే గాకుండా, కట్టుదిట్టంగా కూడా పెంచి పెద్దవానిని చేశారు. అందులో ఆయన మేన మామ సుబ్బయ్యగారు మంచి వ్యవసాయకుడేగాక వ్యవహర్త. బ్రహ్మయ్యగారి భవిష్యదభివృద్ధికి తగిన శిక్షణ ఆయనే యిచ్చాడు. అందుచేతనే ఆమేనమామంటే ఆయనకు అధిక భయభక్తులుండేవి. ఆయన మేనల్లుని పెంచి పెద్దను జేయుటే గాక తన స్వంత సొమ్ముతో మేనల్లునకు విద్యాబుద్ధులు

చెప్పించాడు. బ్రహ్మయ్యగారు చదువు మానిన తరువాత కూడా కొంతకాలం మేనమామల ఇంటనేవుండి 1909 లో స్వగృహామునకు వెళ్ళారు.

చిన్న మేనమామగారికి పురుషసంతతి లేనందున ఆయన తనకుమార్తెను, ఆ స్త్రీని ఇస్తానని చెప్పినప్పటికీ, ఆ స్త్రీనాశించక పెంచి పెద్దవానినిగా చేసి, విద్యాబుద్ధులు చెప్పించిన కారణమున యేవిధమైన పరికట్నములు కోరకుండా నే, పెద్దమేనమామగారి కుమార్తె నే వివాహమాడిరి.

బ్రహ్మ – సరస్వతి – పురాణదంపతుల పేర్లు. ఆ పురాణదంపతుల పేరులు కలసినటులే వీరి దాంపత్యము కల సినది. వీరి దాంపత్యము ఆదర్శనంతమును, ఆనందప్రదము అయినది. ఆమె చదువుల సరస్వతి గాకపోయినా సంస్కృ తిలో సరస్వతే మాట మర్యాదలలో గణనీయురాలు. భర్త వలె పొదుపు. ఆమె "సమాన హక్కులు, సమానధర్మాలు" అనే ఆధునిక స్త్రీగాదు. భర్త అడుగుజాడలలో పోవడమే పుణ్యము, పురుషార్థము అనే సాధ్వి. అందుచేత ఆమె యే ఉద్యమాలలోను పాల్గొనదు. ఇంతేగాక, ఇంట్లోవారికేగాక, వచ్చేపొయ్యేవారికి; వండిటం పెట్టడం, కాఫీ ఫలహారాలు చేయడం, వీటితోనే పూర్తిరాదదు.

తే॥ గీ॥ వండనలయదు వేవురువచ్చి రేని
నన్నపూర్ణకు నుద్దమా నతని గృహిణి
నలిధులేతేర నడికిరే మైనబెట్టు
వలయుభోజ్యంబులింట నవార్యగిగాగ.

అని పెద్దన్న ప్రవరుని భార్యను గురించిన చెప్పినమాట ఈ ప్రవరుని సతియందుకూడా, సార్థకత చెందినది. ఆ యిల్లాలు అట్లా సంచరించుటచేతనే ఆయన తాపేరు ప్రఖ్యాతులు వస్తూ వున్నవి. కష్టపడే దాకరు అనుభవించే దాకరు అనేమాట ఆమెపట్ల నిజం!

ఆమె దేశసేవ చేయలేదని జైలుకు వెళ్ళలేదని అనుకో నక్కరలేదు. భర్త సంపాదించిన పుణ్యములో సగంవంతు భార్యకు దక్కుతుందన్నారు పెద్దలు. అందుచేత ఆ అర్థాంగి కర్థభాగం తప్పదు!

ఆయనకు మాతృభక్తి అధికం. తనను తండ్రిలేని లోపంలేకుండా ప్రాణాధికంగా చూచుకొని పెంచి పెద్దవానిని జేసిన ఆ మాతృదేవి యెడల ఆయనకు కృతజ్ఞత హెచ్చు. ఆమె యెక్కువకాలం జీవించలేదు. 45 వ సంవత్సరములోనే కాలధర్మం పొందింది.

బ్రహ్మయ్యగారికి యశోదమ్మ అనే ఒక కుమార్తె. వీరరాఘవేంద్రరావు అనే ఒక కుమారుడు. తల్లిదండ్రుల యందు భక్తి ప్రపత్తుల వలన ఆ బిడ్డలిద్దరికి తన తల్లిదండ్రుల పేర్లే పెట్టారు. గృహిణీధర్మమే జీవితలక్ష్యమని యెంచి కుమార్తెకు విద్యాబుద్ధులుగరపి బావమరది చిట్టియ్యకిచ్చి వివాహము చేశాడు. వారికి ఒక కుమారుడు రామకృష్ణప్రసాద్. స్కూల్ ఫైనల్ చదువుతున్నాడు. మంచిఉత్సాహవంతుడు. కాంగ్రెసు భక్తుడు. మంచి చొరవ, చురుకుగలవాడు. తాతగారున్నా లేకపోయినా, మర్యాద మన్ననచేసి, సమాధానం చెప్పి సాగ నంపే సరసుడు. తాతంత కావాలని తలంపు!



బ్రహ్మయ్యగారి కుటుంబం:

ఎడమనుండి :— కోడలు సరోజిని, కుమారుడు రాఘవేంద్రరావు, బ్రహ్మయ్యగారు, మనుమడు రామకృష్ణ ప్రసాద్ సతి సరస్వతి, అల్లుడు చిట్టెయ్య, అమ్మాయి యశోదమ్మ.

కుమారుడు నేడు హైదరాబాదులో ఎల్, ఎల్. బి. చదువుచున్నాడు. అభివృద్ధికి రాగలవాడు. తండ్రి తర్కీతు కూడా అట్టిదే. స్త్రీల విషయములో ఉత్తమమాతగా ఉత్తమ గృహిణిగా రాణించాలని బ్రహ్మయ్యగారు అభిలషిస్తాడు. తన సతిని గృహదేవతగా భావిస్తాడు.

"అతుల సంసార సాగరమందు గాల
జలము సుకృత దుష్కృత, వాత చలితమగుచు
సుఖవిషాదపు తరగలై సుడియుచుండ
బడవవై గట్టుచేర్తువు సతిని గృహిణి."

—కృషీవలుడు.

---

# ప్రోత్సాహకులు

"తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్,
దమకార్యంబు ఘటించుచున్ పరహితార్థవ్యాకృతుల్,
మధ్యముల్,
దమకై అన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్, వృథా
న్యార్థ భం
గము గావించెడు వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్."

మానవులను భర్తృహరి పై విధంగా పేర్కొన్నాడు. ఒక ఆంగ్లకవి మానవజాతి, శునకజాతి వంటి దన్నాడు. కుక్కలు కుక్కలు పోట్లాడుకొని, కూట్లోదుమ్ము పోసుకుంట

వనే సామెత మన మెరిగినదే. అట్లాగే మానవులకును వాటి వలె స్వజాతి వైర మెక్కువన్నాడు.

డార్విను (Struggle for existence) బలమైనవాడే బ్రతికేది. చిన్న చేపను పెద్దచేప తిన్నట్లు, బలవంతుడు బలహీనుని నాశనంచేసి బ్రతుకుతున్నాడన్నాడు.

మార్క్సు వర్గపోరాటమే ప్రపంచ చరిత్ర అన్నాడు.

మహాత్ముడు సామరస్యమే మానవస్వభావ మన్నాడు.

మానవతత్వములోను దయాదాక్షిణ్యాలలోను నమ్మకం లేనివారు, మార్క్సు వ్యాఖ్యాతగా ప్రసిద్ధిగాంచిన యం. యన్. రాయ్, యేమి చెప్పుచున్నాడో వినుడు. "వర్గసంఘర్షణ చరిత్రయే, మానవ చరిత్రయని మనం నేర్చుకున్నాము. కాని అసలువిషయం విస్మరించాం. సమాజంలో, కలుపుగోలుశక్తి, ఒకటి వుంది. ఈ శక్తి లేకపోయినట్లయితే, మానవసమాజం యెప్పుడో విచ్ఛిన్నమైపోయేది. నాగరికతా పరిణామ మనేది లేకుండా పోయేది. సమాజానికి శ్రేయస్సనేది ఒకటి అన్ని వర్గాలను బంధిస్తుంది."—వర్గసంబంధాలు.

ఇవి మానవజాతినిగూర్చి పెద్దలు పలికిన ప్రవచనాలు.

మనది నిన్న మొన్నటివరకు బానిస దేశం. అందుచేత మనం అన్నివిధాలా అధోగతిలో వున్నాం స్వలాభం కన్న సంఘలాభం హెచ్చు అనే సిద్ధాంతం నేటికికూడా మనకు ఆదర్శమే కాదు. అందుచేత ఇక ఆచరణలో కెలా వస్తుంది? అందుచేతనే మనలో మనం స్వలాభం కొరకు కీర్తి కొరకు పరులను పడద్రోసి, వారి శవాలపై పైకి పోవాలనే నేడుకూడా వన్నాగాలు పన్నుతున్నాం. లేకపోతే కాంగ్రె

సులో యిన్ని గ్రూపు లెందుకు? నాయకులకింత ప్రాముఖ్య మేల? సిద్ధాంతాలకు ప్రాముఖ్య మివ్వాలి గాని, వ్యక్తులకు ఇవ్వరాదనుమాట, మనకు తెలియని విషయం. ఎత్తితే స్వర్గలోకానికి ఎత్తటం, పడత్రోస్తే పాతాళలోకానికి పడ దొయ్యటమే మనపని. ఆవేశంతోగాక, వివేకంతో ఆలోచించి పనిచేసుకునే స్థితికి వస్తేగాని, యివన్నీ తగ్గవు.

బ్రహ్మయ్యగారి స్వభావంలో మనము అభినందించ తగినది, దేశసేవచేయుటకు ఆయనకు ఉత్సాహ ప్రోత్సాహము లిచ్చిన వారిని, తన అభివృద్ధికి ఆధారభూతులైన వారిని మరువకుండుటేగాక, వారియెడ, భక్తిప్రపత్తులను ప్రకటిస్తూ, కృతజ్ఞత తెలియపరుస్తూ వుండటం. అటువంటప్పుడు ఆయన ప్రోత్సాహకులనుగూర్చి చెప్పట అవసరంకాదా?

మొక్క చిన్నదిగావున్నప్పుడు, దానికి పోషణ అవసరం. అట్లాగే ప్రథమదశలో ప్రతి మానవునకు ఉత్సాహ ప్రోత్సాహాలు అవసరం.

## కీ. శే. గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు

ప్రథమంగా ప్రోత్సాహమిచ్చింది. కీ॥ శే॥ గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు. ఘంటశాల గ్రామస్థులు. బందరు నోబుల్ కాలేజీలో చదువుతూ బ్రహ్మసమాజంలో వుంటూ బ్రాహ్మల ప్రోత్సాహం, వందేమాతరోద్యమంవల్ల ముట్నూరి కృష్ణారావుగారి ప్రసంగములవల్ల వుత్తేజితుడై 1910 సం॥లోనే

స్వదేశీవ్రత దీక్షగొని సాంఘిక రాజకీయ, కార్యక్రమాల్లో పాల్గొనేవాడు.

కమ్మవిద్యార్థి సంఘ కార్యదర్శిగా పనిచేసిన, విద్యార్థియేగాక విద్యాభిమాని. ఈ గ్రామంనుండి ఇతర గ్రామాల నుండి అనేకులను ప్రోత్సహించి ఆంగ్లవిద్యాభ్యాసానికై బందరు తీసికొని వెళ్ళెను. ఆ పిల్లలందరకు సంరక్షకుడుగా వుండి విద్య, ఆరోగ్యవిషయాలు చూచుటేగాక, సరియైన భోజనవసతికిగాను ఒక హాస్టలును యేర్పరచెను, ఆయన పిల్లలకోడి. మంచి ఉత్సాహవంతుడు. పట్టుదలగలవాడు. సంఘసేవ దేశసేవ గ్రామసేవ చేసిన ఆదర్శయువకుడు. 1916-8-30న ఆయన అకాల మరణమొందటం ఘంటశాలకేగాక, దేశానికికూడా నష్టమే.

కీ॥ శే॥ కానూరి వెంకటచలపతయ్యగారు కృష్ణాపత్రికలో "ఆదర్శవంతుడగు ఒక విద్యార్థి అస్తమయము" అనే శీర్షికతో ఆయనను ప్రశంసిస్తూ ఒక వ్యాసం వ్రాసెను. వెంకటేశ్వర్లు గారు బ్రహ్మయ్యగారిని విద్యార్థిదశలో స్వచ్ఛంద సేవకునిగా సభలకు తీసుకొనివెళ్ళి, సాంఘికసేవ నేర్పుటేగాక ఆ యా సభలకు వచ్చిన నాయకులందర్నీ గురించి తెలిపి ఉత్తేజ పరచేవాడు. పత్రికాపఠనాభిలాష, రాజకీయ పరిజ్ఞానం, దేశాభిమానం - స్వదేశీవ్రతదీక్ష కలిగించాడు. ఆనాడు ఆయనక్రింద ప్రథమంలో తరిఫీదైనవాడే మన బ్రహ్మయ్యగారు.

ఆయనద్వారానే వెంకటాచలపతయ్యగారివంటి రైతు నాయకులు, కృష్ణారావుగారివంటి దేశనాయకులు మొదలగు ప్రముఖుల పరిచయభాగ్యం కలిగింది, బ్రహ్మయ్యగారికి.

ఇంతేగాక ఘంటశాలలో వెంకటేశ్వర్లుగారు ఒక గ్రంథాలయం స్థాపించారు. ఆయన అనంతరం బ్రహ్మయ్యగారు ఆ గ్రంథాలయాభివృద్ధికై పాటుపడుటచేత, గ్రంథాలయోద్యమంద్వారా రాజకీయ ప్రముఖులతో పరిచయంకలిగి క్రమంగా రాజకీయాల్లో ప్రవేశించుట కవకాశం యేర్పడింది.

కనుక బ్రహ్మయ్యగారి దేశహితైక పౌరజీవితసౌధానికి పునాది వేసిన ప్రముఖులు వెంకటేశ్వర్లుగారు.

---

# కీ. శే. కానూరి వెంకటాచలపతయ్యగారు

## కాతరం, కృష్ణాజిల్లా.

ఆయన రైతుల్లో భీష్మపితామహుడు. ఆంగ్లభాష యే మాత్రము తెలియని రైతు నాయకుడు. మహామేధావి. రాజకీయవేత్త. ఆంధ్రదేశంలో యేసభలు వచ్చినా, ప్రభుత్వం వారికెట్టి నివేదికలు పంపవలసివచ్చినా, అగ్రస్థానం ఆయనదే. కృష్ణాజిల్లా సంఘసభ్యుడై, అధికసేవచేయుటేగాక, 1920 లో పెదకళ్ళేపల్లిలో జరిగిన 29 వ కృష్ణామండల సభకు అధ్యక్షుడు. ప్రథమంగా రైతులలో ఆ అధ్యక్షస్థానమలంకరించిన గౌరవము ఆ పితామహునిదేమో! ఆయన కాంగ్రెసు భక్తుడు. 1920 సం॥లో కాంగ్రెసు ఆదేశానుసారం తన శాసనసభాభ్యర్థిత్వమును మానుకొన్న మాననీయుడు.

ఆయన ఆచార్యరంగావలె అసమాన ఆందోళనకారుడు. పత్రికలకు వ్యాసాలు రాస్తూ సభలు చేస్తూ టెలిగ్రాములిస్తూ రాయబారాలు జరుపుతూ అనేక విధాల ఆయన ఆందోళన చేశాడు.

1914 సంIIలో మద్రాసు శాసనసభలో ఒకరు ఇరిగేషన్ పంచాయితీ బిల్లు నొక దానిని ప్రవేశపెట్టగా ప్రభుత్వంవారు దానిని తీసివేసి ఇర్రిగేషన్ బిల్లును ప్రతిపాదింపగా అది అనర్థమని, ఆపుదల చేయమని ఒక్కరోజున రెండువేలు టెలిగ్రాములు పంపునట్లుచేసి దానిని ఆపించిన అసమాన ఆందోళనకారుడు. ఇట్లాగే రైతులకు అనర్థదాయకమైన పెక్కు బిల్లులను ప్రతిఘటించిన రైతు పెత్తందారు.

మారటోరియం కావాలని ఆర్థిక మాంద్యంలో అధికాందోళన జేసిన ప్రముఖుడు. దానిఫలితమే కాంగ్రెసు మంత్రుల ఋణపరిష్కార చట్టం.

ఆయన ఆనాడు అధిక పలుకుబడి, ప్రఖ్యాతికలవాడు. పెక్కుసభలకు ఆయనను ప్రెసిడెంటుగా కోరేవారు. అందుచేత ఆయనకు ప్రెసిడెంటు చలపతయ్యగారనే ప్రఖ్యాతి వుండేది. గ్రంథాలయోద్యమంలోను, రైతువుద్యమంలోను, స్థానిక పారిపాలనా సంస్థలలోను, రాజకీయాలలోను ఆయన అందెవేసిన చెయ్యి.

దేశంలో ప్రతి అంగుళం వ్యవసాయం క్రిందకు రావాలని ఆయన ఆశయం. సముద్రాల నన్నింటిని శోషింపజేసి, సేద్యం చేయ ఆ పంటదొర సాహసం!

బ్రహ్మయ్యగారు చదువుకొంటున్న రోజులలో వెంకటేశ్వర్లుగారి గదికి అప్పుడప్పుడు వస్తూ, అక్కడవున్న విద్యార్థులకు రాజకీయాలు నూరిపోస్తూ ఆంగ్లవిద్యాభ్యాసంవల్ల అనర్థకాలు చెప్తూ వుండేవాడు. అట్టి శ్రోతలలో మన బ్రహ్మయ్యగారొకరు.

19 6 ఆగస్టులో ఆయన జ్వరపడివుండగా "నాయనా నీవు విషభోజనుడవోయ్. విద్యలేకుండానే వృద్ధిలోకి వస్తావు. నామాట విని నీవు చదువు చాలించు. ఈ పాడు చదువుతో నీ ఆరోగ్యం పోగొట్టుకోవద్దు. బడిమాని ఆరోగ్యంకొరకు ప్రయత్నించ"మని, ప్రబోధించాడు. ఆయన మాటమీదనే ఇంటికి వెళ్ళడం, తరువాత చదువు మానడంజరిగింది.

రైతు సమస్యలు రాజకీయాలు నచ్చచెప్పి తాను జీవించి వున్నంతవరకు బ్రహ్మయ్యగారికి పెక్కువిధాల ప్రోత్సాహమిచ్చిన పితామహుడు. ఆయనకు అనుచరుడుగా, సహాచరుడుగా అనేక ఉద్యమాలలో బ్రహ్మయ్యగారు పనిచేశారు.

చలపతయ్యగారి అధ్యక్షత క్రింద జరిగిన మండలసభలో పాల్గొని ప్రథమంగా రాజకీయాలలో ప్రవేశించుట జరిగింది.

—0—

# శ్రీ. శే. వేమూరి లక్ష్మయ్యగారు ఘంటశాల

అధికారంగాని గౌరవ పదవికాని యేమీ లేకుండా పలుకుబడిగల ప్రముఖుడు. ప్రజలలోనేగాక ప్రభుత్వోద్యోగులలోను అధిక పలుకుబడికలవాడు. ఆయనంటే అధిక భయం భ క్తికూడా వుండేది. బ్రహ్మయ్యగారిని బట్టి కాంగ్రెసు అభిమానిగావుండి, కాంగ్రెసు ఉద్యమమునకు పెక్కువిధాల ప్రోత్సాహమిచ్చెను. డాక్టరు కోకా అహోబలరావు, శీలం జగన్నాధరావు మొదలగు పెక్కుమంది ప్రముఖు లాయనకు మిత్రులు.

లక్ష్మయ్యగారు బ్రహ్మయ్యగారికి దగ్గరబంధువు, మేనమామ. ఆయన బ్రహ్మయ్యగారు యువకుడుగా ఉన్నప్పుడు పెక్కువిధాల ప్రోత్సాహ మిచ్చాడు. మొట్టమొదటగా గ్రామంలో ఇళ్ళు తగులబడినప్పుడు బ్రహ్మయ్యగారు, ఆయన మిత్రులు గ్రామంలో చందాలు వసూలు చేసినప్పుడు ప్రోత్సాహమిచ్చి అందులో సాయపడ్డాను. ఆ కాలంలో పెత్తనదార్లు గ్రామంలో పేదలచేత పనులు చేయించుకొనుటేగాని వారికేమీ సాయం చేసేవారుకారు. అట్టి స్థితిలో ఆయన తోడ్పడుట ప్రశంసార్హ్యం.

1920 లో దివితాలూకా కాంగ్రెసు సభ ఘంటశాలలో చేయ బ్రహ్మయ్యగారు సంకల్పించి తగు ప్రోత్సాహంలేక తటపటాయించుచుండగా "మీ పలుకుబడి మీకు తెలియదు. ప్రజలకు ఈ పెత్తందార్లయందుకంటే మీయందెక్కువ భ క్తి విశ్వాసాలు వున్నవి. మీరు తలపెట్టిన పని తప్పక నెరవేరుతుంది. జంకవద్దని" ప్రోత్సహించి తానుకూడ,

వెంటవుండి రు 500-0-0 వసూలుకు కారణభూతుడైనాడు. ఆసభలోనే బ్రహ్మయ్యగారికీ, ఘంటశాలకు తాలూకాలో ఖ్యాతికలిగినది.

తన మిత్రుడగు శీలం జగన్నాధరావు నాయుడుగారు శాసనసభకు నిలబడగా, ఆయనకు పని జేయకపోవుటేగాక బ్రహ్మయ్యగారి యందుండే అభిమానముతో కాంగ్రెసుకే పని జేసెను.

లోగడ తన అన్నగారగు వెంకయ్యగారు తాలూకా బోర్డు సభ్యుడుగా వుండి 1927 లో మరల నిలవనున్నప్పుడు ఆయనతో "నీవు వృద్ధుడవు, బ్రహ్మయ్య అభివృద్ధిలోనికి రాదగినవాడు; ఆయనకొరకు నీవు మానుకోవలసింది" అని నచ్చజెప్పి బ్రహ్మయ్యగారిని అభ్యర్థిగా నిలిపి "నీవు సభ్యుడవేగాక, అధ్యక్షుడవుకూడా కాగలవ"ని ఆశీర్వదించిన ప్రోత్సాహకుడు.

ఇటుల స్వజనాన్ని, మిత్రబృందాన్ని వీడి బ్రహ్మయ్యగారి అభివృద్ధికి అండగానిల్చి, పెక్కువిధాల ప్రోత్సాహమిచ్చినవాడు లక్ష్మయ్యగారు. తాను బ్రహ్మయ్యగారికంటె పెద్దవాడైనా బ్రహ్మయ్యగారియందు అధికలక్ష్యం కల్గి ప్రవర్తించేవాడు.

## చెరుకువాడ వేంకట నరసింహంగారు

జగమెరిగినవాడు. ఆయన బ్రహ్మయ్యగారికేగాక అనేక యువకులకు ప్రోత్సాహ మిచ్చిన ప్రముఖుడు. ఆయన నెంద రెందరినో జిల్లాబోర్డు సభ్యులను శాసన సభ్యులను చేశాడు.

నవయువకుల కనేకమంది ప్రోత్సాహం ఇచ్చి వృద్ధిలోకి తెచ్చాడు. అపకారం చేయడం అంటే యేమిటో యెరుగని పవిత్రమూర్తి.

బ్రహ్మయ్యగారిని 1920 లో తాలూకా సభ చేయ ప్రోత్సహించింది ఆయనే. ఆయనకు కాంగ్రెసు మతమిచ్చి మొట్టమొదటగా కాంగ్రెసు సభ్యుడుగా తన చేతిమీదుగా చేర్పించి దివి తాలూకాలో ప్రోగ్రాము వెంటవేసుకొని, తాను ప్రచారం చేస్తూ, ఆయన చేత చేయిస్తూ, ప్రోత్సహించింది నరసింహంగారే.

# కీ. శే. ముట్నూరి కృష్ణరావుగారు

ఆయనను యెరుగని ఆంధ్రుడుండడు. ఆయన్ని చూచినా, చూడకపోయినా కృష్ణాపత్రికను చదువని వారుండరు. ఒక్క బ్రహ్మయ్యగారే కాదు. ఇటీవల పెరిగి పెద్దవారైన యువజనులంతా, కృష్ణాపత్రిక ప్రోత్సాహంతో అభివృద్ధి గాంచినవారే. ఆంగ్లము రాని అనేకమందికి రాజకీయజ్ఞానం కలుగజేసి, ప్రజాసేవకులుగా తయారుచేసిన పత్రిక కృష్ణాపత్రిక. కృష్ణాపత్రిక ప్రభావం ఆంధ్ర దేశములోని ప్రతి యువకునిలోను కలదనుటలో అతిశయోక్తి కాదు.

ఆయన రాజకీయాల్లో ప్రవేశించు యువకులకే గాక కవులకు, గాయకులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటులకు వివిధరంగాల్లో కృషిచేస్తున్న వారందరికి చేయూత నిచ్చిన శేముషీ ధురంధరుడు.

1920 లో బ్రహ్మయ్యగారు, యువకుడుగా వుండి యే సభకు అధ్యక్షత వహించని పరిస్థితులలో జస్టిసుపార్టీకి ప్రాబల్యంగా వున్న దివి సీమ కోడూరులో కృష్ణారావుగారిని సభకధ్యక్షత వహించ వలసినదని కాంగ్రెసువారు కోరగా బ్రహ్మయ్యగారికి ప్రోత్సాహ మివ్వాలనే తలంపుతో ఆయనను అధ్యక్షస్థాన మలంకరింపజేసి, తాను ఉపన్యాసకుడై ఆయనను పదిమందికి యెరుకపరచి బ్రహ్మయ్యగారి శక్తి సామర్థ్యాలు, ప్రథమంగా పదిమందికి ప్రదర్శింపజేసిన ప్రోత్సాహకులు కృష్ణారావుగారు

తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘానికి 1921 లో కృష్ణారావుగారు ప్రెసిడెంటు, పట్టాభిగారు, కార్యదర్శి. 1922 లో కూడ కృష్ణారావుగారిని ప్రెసిడెంటుగా వుండవలసిందిగా, సీతారామయ్యగారు కోరగా, బ్రహ్మయ్య గారిని వుంచవలసిన దని, సీతారామయ్యగారు సందేహిస్తున్నా బ్రహ్మయ్యగారిని పెద్దనుజేసి ప్రోత్సహించింది కృష్ణారావుగారే.

శాసనసభా అభ్యర్థిగా నిలచినప్పుడు, చల్లపల్లివారితో ఒడంబడిక చేసుకొనుటలో, కాంగ్రెసువారు విద్రోహము జేసినప్పుడు, వేయేల యితరులు ఆయన ఆంతర్యాన్ని గ్రహించని సమయంలో, ఆయనకు ప్రోత్సాహ మిచ్చుటే గాక, పెట్టని కోటగా నిల్చిన ఉత్తముడు కృష్ణారావుగారు.

## ఆచార్య రంగాగారు

ఆచార్య రంగాగారిని గురించి నేను చెప్పే ముందు ఈ రచయితచే వ్రాయబడిన 'ఆచార్య రంగా'కు పరిచయం

వ్రాస్తూ బ్రహ్మయ్యగారు వ్రాసిన దానిలోని కొంతభాగం మీకు పరిచయపరుస్తున్నాను.

"1931 సం॥లో కృష్ణాజిల్లా రైతుసంఘము తీర్మానించుచు, గ్రామములవెంట బండ్లపై పయనించితిమి. సిసిటిల్ మెంట్ ఆందోళన ఆంధ్రదేశమున ఆయన నాయకత్వముననే నడచెను. రైతు నాయకుడుగ రైతువుద్యమమున ఆయనకు ప్రథమ జైలుప్రాప్తి అప్పుడే.

"ఆయనది రైతులోకం. రైతే తన సర్వస్వము. రైతు ధరణాయే ఆయన గమ్యస్థానము. అ రంగాయే నన్నాకర్షించెను. 1937 సం॥వరకు ఆయన సహచరుడుగ రైతుసంఘములందు పనిజేసితిని. ఆయనది, అనుకరణగాదు. స్వంతపరవడి. ఒక్కసారి వుత్సాహవుద్రేకములతో, కార్యక్రమములో దుమికిన వాడుగాదు. అమాంతముగా నాయకత్వమునకు యెగిరిన వాడునుగాదు. క్రమంగా ప్రజాసేవచేయుచు, తాను స్వయంగా సృష్టించుకున్న వాతావరణంలో, తన అనుచరబృందంలో తన ప్రణాళికలను క్రమబద్ధంగా అమలు పరచుచు, పిల్లల కోడిలా: వర్తించి, పల్లెప్రజల ప్రేమకు పాత్రుడాయెను.

"రాజకీయ రంగమున ఢక్కా మొక్కీలు తింటూ, విమర్శించుచూ, విమర్శింపబడుచూ, సింహావలోకనము చేసుకుంటూ, తప్పులను దిద్దుకొంటూ స్వయంకృషివల్ల నేడు ఆంధ్రనాయకుడాయెను.

"అహర్నిశలు, తిరుగుచు చదువుచు వ్రాయుచు ప్రజల కష్టసుఖములు తనవిగా భావించుచూ, ప్రజాసేవచేయు ఆంధ్ర నాయకుడాయన ఒకడే. ఆయనకు విశిష్టతగలదు. ప్రతి గ్రామ

మంది ఆయనను ప్రేమించి, అనుసరించు వ్యక్తులు గలరు. ఆంధ్రులలో యేనాయకునికి లేని అనుచరబృందము ఆయనకు గలదు. ఆయనది, సుగ్రీవసేన. ఆయనమాట వారికి సుగ్రీవాజ్ఞ".

బ్రహ్మయ్యగారన్నట్లు ఆయన స్వయంకృషివల్లనే నాయకుడయ్యాడు. ఆయనను ఆదినుండి ఆదరించి, అభిమానించి, ఆశ్రయమిచ్చి అభివృద్ధిలోనికి తెచ్చినవారులేరు. పైగా అందరు ఆయనమీద అగ్నిబాణాలు వేసినవారే. ఆయన కూడా యెవరిని వూరికే విడిచిపెట్టలేదు.

ప్రజాసేవకుని అధికారంలో వున్నవారు, అధికారంలోకి రాకుండా కొంతకాలమే ఆపగలరు. తుదిజయం ప్రజాసేవకునిదే. ఆయన ఆంధ్రరాష్ట్ర సంఘ అధ్యక్షుడు, కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యుడు అయ్యాడు. ప్రపంచ ఉత్పత్తిదారుల సభా కార్యనిర్వాహక సభ్యుడు. ఆంధ్రులలో అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ప్రముఖుడు.

ఆచార్య రంగాగారు ప్రజాసామాన్యాన్ని సేవింపగల సేవింపతలచుకొన్న యువతీయువకులను రాళ్ళల్లో రత్నాలేరినట్లు వెదకి పట్టుకొనుటేగాక, వారిని వుపాహుపరచి, ప్రజలకు వారిని పరిచయపరచి, వారి కాపరాని ప్రజారాధనా తత్పరత కలుగజేయును. ఆయన అనేకమంది వర్కర్లను తయారుచేయుటేగాక, వారిని అభివృద్ధికి తెచ్చుటలో అసమానుడు. నేడాంధ్ర దేశంలో విప్లవవీరులుగా, రైతుసేవకులుగా, ప్రజారాధకులుగా ప్రఖ్యాతిగాంచిన వారిలో అనేకులు ఆయనవద్ద శిక్షణపొందినవారే.

రైతాంగ యువతీ యువకులను ప్రచారకులుగ నాయకులుగ తయారు చేయుటలో ఆయన ఆదిగురువు.

రైతు రంగాయే బ్రహ్మయ్యగారి నాశ్రయించినట్లు రైతు బ్రహ్మయ్యగారినే రంగా గారభిమానించారు. అందుచేత, ఆయన రైతు ఉద్యమంలో ప్రోత్సాహమిచ్చాడు. రైతు వర్కర్లందరికీ బ్రహ్మయ్యగా రభివృద్ధిలోనికి రాదగినవాడు సమర్థుడని సదభిప్రాయం కలుగజేశాడు.

రీసెటిల్‌మెంటు ఉద్యమంలో ఆయన జైలులో వుండగా, బ్రహ్మయ్యగారితో వెంబులూరు రైతుసభకు అధ్యక్షత వహించవలసినదని ప్రోత్సహించాడు. రైతురక్షణ సంఘానికి కార్యదర్శిగానుండ ప్రోత్సహించాడు. ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాని కుపాధ్యక్షుడుగాను తర్వాత అధ్యక్షుడుగాను ఆయనను ఎన్నుకొనేటట్లు చేశాడు. ఇట్లా పెక్కువిధాల ప్రోత్సాహమిస్తూ, రైతుసమస్యల నవగాహనచేసి, అభిమానించి, తన తర్వాత వారసునిగా జేసి ఆంధ్రలోకపు మన్ననలగాంచ, అవకాశం కలుగజేశాడు.

ఆనాడు ఆచార్యరంగా లెజిస్లేటుగానుండికూడా, రైటిస్టుగానున్న బ్రహ్మయ్యగారికి రైతువుద్యమంలో ప్రధానస్థాన మివ్వడం ఆచార్యరంగాగారి ఉదారబుద్ధి, బ్రహ్మయ్యగారి సేవాతత్పరత చెప్పక చెప్పును.

## గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు

బ్రహ్మయ్యగారు ఈ వెంకటసుబ్బయ్యగారిని గురించి "ఆచార్య రంగా" గ్రంథానికి పరిచయం వ్రాస్తూ ఇట్లా

పరిచయపరిచారు. "నా సహాచరుడు, ప్రియమిత్రుడు శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు, గ్రంధకర్తగా, చరిత్ర కారుడుగా, ప్రసిద్ధిగన్నాడు. ఆయనకు ప్రత్యేకత గలదు. ఆయన వ్రాయు వ్యక్తిచరిత్ర ఆవ్యక్తికి సంబంధించి నంత వరకే కాదు. ఆయన సమకాలికులను గూర్చి, ఆనాటి ఆంధ్ర దేశమును గూర్చిన చరిత్ర. శైలి సులభమైనది. వ్రాయుపద్ధతి చదువరుల నాకర్షించునట్టిది. పూర్వకవుల చరిత్రకారుల పత్రికాధిపతుల అభిప్రాయములను, తన వాదనను పోషించుటకు క్రోడీకరించును. పుస్తకపఠనంతో తృప్తిచెందక చదివిన దానివలన యెంతో కొంతనేర్చి అనుష్ఠించునట్లు చదువరుల ప్రోత్సహించును."

బ్రహ్మయ్యగారు, ఈయన విద్యార్థి దశనుండి మిత్రులు. మేనులు రెండుగాని, మనస్సొక్కటే. "గంగా యమున సరస్వతి కలియుచోటు త్రివేణీసంగమ మంటారు. కాని కంటికి కనపడేది గంగా యమునలే. సరస్వతి అంతర్వాహిని. అందుచేత అది కన్పించదు. అట్లాగే, సుబ్బయ్య అంతర్వాహిని. ఆయన లేకుండా నేను చేసిన దేమిటి? లోకం యెరగని ఆవిషయం" అంటాడు మిత్రుడు బ్రహ్మయ్యగారు.

ఆయన బ్రహ్మయ్యగారికి సహాచరుడు, సలహాదారు, ప్రోత్సాహకుడు. అభిన్నులైనవారిలో ఒకరినొకరు ప్రోత్సహించుకొనుటలో గొప్పయేమీ లేదని తలుస్తాడు.

ప్రజాసేవకులపై యెన్నో నీలాపనిందలు వేస్తారు. కొందరు తుచ్ఛులు స్వార్థపరులు, వారినికూడా తమ కొలత బద్దతోనే కొలుస్తారు. కాని అంతకంటె విశాలదృష్టితో చూడ

బాలరు. ఈవిధంగా ప్రజాసేవకులకు గౌరవం తక్కువ, నింద లెక్కువ. ఈసత్యాన్నే ప్రజాసేవకులలో ప్రముఖుడైన గోపాల కృష్ణగోఖ్లేగారు ఇట్లా ప్రవచించారు.

"Public life in this country has few rewards, and many trials, and discouragements"

—My Master Gokhale. P—154

"ఈ దేశంలో ప్రజాసేవకులకు మర్యాదమన్నలు కొద్ది, వారిని విమర్శించడం దూషించడం హెచ్చు."

రాజకీయరంగంలో ప్రముఖులైనవారికి మిత్రులవలెనే శత్రువులధికం. అందుచేత శత్రువులు అభాండాలు వేయటం సహజం. పదవీ వ్యామోహంవల్ల మిత్రులుకూడ తన స్నేహితుని పడగొట్టుటకు కుట్రలు పన్నుట బహిరంగ రహస్యము.

ఈ విషయాన్ని గురించి, మన దేశంకొరకు తన సర్వస్వము ధారవోసిన అనిబిసెంట్ యేమి చెప్పిందో యెరుగుదురా? హిందూదేశంలో అన్నిటికంటె హేయమైన పని యేమిటని, ఆమె ఆంగ్ల దేశ మరిగినప్పుడు మిత్రులు ప్రశ్నించారట. 'ఇతరులను పడగొట్టి తాము పైకెక్కటానికి ఆ దేశంలో అధికంగా ప్రయత్నిస్తారు. ఇది అన్నిటికంటె హేయమైన పని" అని ఆమె అన్నదట. ఆమె అన్నట్లు నేటికిని మనరాజకీయాల్లో జరగడం ప్రత్యక్షమే.

ఆమేకాదు. దేశానికై తన సర్వస్వమును చివరకు తన శల్యాలనుకూడ ధారపోసిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారుకూడా అన్నమాట ఆలకించతగినది. "గుజ్జువు

బండివాడొక్కడే పైకిరమ్మని అనేవాడు" అన్నాడు. ఆయన తమెన్నో అపకారాలు పొందివుండవచ్చు. శత్రువులవల్ల, మిత్రుల పేరుతో వున్న యీర్ష్యాపరులవల్ల. హృదయం ఎంతెంత వేదనొంది యిట్లా ఆక్రోశించివుంటాడో ఆ మహాపురుషుడు. మిత్రులు, శత్రువులు, లోకులు బ్రహ్మయ్యగారిమీద లేని అపవాదులు వేసి ఆయనను రాజకీయ రంగమునుండి నిష్క్రమింపజేసి, తాము పట్టం కట్టుకుందామనే సమయంలో ఆయనకు లోకం పోకడజెప్పి, స్వీయశక్తి సామర్థ్యాలు తెలియజేసి, విరక్తిని విసగడని నిరుత్సాహాన్ని పోగొట్టి ప్రోత్సాహమిస్తుంటాడు ప్రియమిత్రుడు సుబ్బయ్య. బ్రహ్మయ్యగారికి ఛాయ ఆయన. బ్రహ్మయ్యగారి పెంపు తనదిగా తలుస్తాడు.

"కాంతులు వెలిగక్కు విలువగల మణులెన్నో చీకట్లు చిమ్ము సముద్రగర్భమున దాగియున్నవి. సౌందర్యమున కాలవాలమగు కుసుమములెన్నో, ఎట్టడవియందు నిరర్థకముగా నేల దొరులుచున్నవి" అని ఆంగ్లకవి థామస్ గ్రే అన్నట్లు ప్రతిభావంతులెందరో గలరు. వారిపై రాళ్ళు రువ్వవాలేగాని, వారిని రాణించునట్లు చేయువారరుదు సేవాపరాయణులకు చేయూతనిచ్చి వారి సేవాభాగ్యం పొందాలి.

"నతులగుచున్ మహోన్నతి దనర్చుచు సన్యగుణోక్తిచే గుణోన్నతిం బ్రకటించుచున్ బరజనప్రియ కార్య సమర్థతన్ సముచిత నిజకార్య సంగ్రహము చేయుచు నిష్ఠురవాదులన్ క్షమాధృతి నిరసించున్ బరగు ధీరులు బుణ్యాలుగారె యేరికిన్,"

—భర్తృహరి.

———

# గురువులు

"శిక్షితులైనవారలు విశేష బహూకృతి గాంతు రెందు; ని
ర్లక్షితులై పరాభవ పరంపర కేగెద రెంద శిక్షితుల్;
తక్షకుచేత చెక్కబడు దారు శిలల్ ప్రణతుల్ గ్రహించు; ప్ర
త్యక్షముచూడు: చెక్కనివి యావములోబడి కాలుమిత్రుడా."

—వ. సుబ్బారాయుడు.

వకాలతు చేయడానికి, వైద్యంచేయడానికి, గుమాస్తాపని చేయడానికి ఆరితేరినవారి దగ్గరకొంతకాలం పనినేర్చుకోవాలి. పరీక్షలు చదివినా ప్రయోజనంలేదు.

అటువంటప్పుడు రాజకీయాల్లో రాణించాలంటే, ప్రజాసేవచెయ్యాలంటే అనుభవజ్ఞుల అండను సంచరించవలసిన అవసరంలేదా? ప్రముఖత్వం వహించాలంటే కేవలం విద్య చాలదు, పెద్దల శుశ్రూష, సహచర్యం కావాలి.

గోఖ్లే, రనడే జోషి సర్‌ఫిరోజిషా మెహతాలను గురువులుగా భావించి వారిసాహచర్యంవల్ల మంచి అవకాశం, అనుభవం పొందాడు. 14 ఏండ్లు ఫక్తు రనడేగారివద్ద శిక్షణ పొందాడు. వారివల్ల వున్నతాశయాలు పొందుటేగాక, ప్రజాసేవలో సుశిక్షితుడయ్యాడు. అందరకు అట్టి అవకాశాలు వస్తయ్. ప్రోత్సాహకులు, మిత్రులుకూడా వుంటారు. కాని వారివల్ల మనం ప్రయోజనం పొందగల్గుచున్నామా? మనలను వున్నతమార్గములో పెట్టగల అనుభవజ్ఞులు, వివేకవంతులు, లభించగలరుగాని మనము ఆ అవకాశాన్ని వుపయోగించుకొనుట లేదు.

అనుభవజ్ఞులుగా క్లెగారు పూనాలో హిందూదేశ సేవక సంఘమును స్థాపించి తద్వారా దేశసేవాశక్తులకు శిక్షణావ కాశములను కల్పించారు.

అట్లాగే లాహోరులో లజపతిరాయిగారు ప్రజాసేవక సంఘము నొకదానిని స్థాపించి, దేశసేవకులకు శిక్షణ నివ్వ అవకాశం కల్గించారు.

ఆచార్య రంగాగారు రైతాంగ విద్యాలయంద్వారా వేలాది ప్రజాసేవకులకు తర్ఫీదు ఇస్తున్నారు.

బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు మొదలగు దేశ సేవాధురంధురులు ఆశ్రమాలుపెట్టి దేశసేవానిరతులగు అనేక మంది యువకులకు అవకాశం కల్గించారు.

గ్రంధపరిచయంతోపాటు లోకజ్ఞానం, రాజకీయాను భవం అధికమైనా, పెద్దల సాహచర్యముంటేనేగాని పరిపక్వ మైన రాజకీయజ్ఞానము అలవడదని గుర్తించి ఆంధ్రదేశంలో ప్రఖ్యాతులైన త్రిమూర్తుల సాహచర్య భాగ్యం పొంది, దేశ సేవాదీక్షయందు నిష్ణాతులైనారు బ్రహ్మయ్యగారు.

ఆ గురుత్రయాన్ని గురించి, వారివల్ల పొందినదానిని గురించి చెప్పేముందు, ఆయనను తమ శిష్యుడని చెప్పుకొనే వారుముగ్గురున్నారు. ఆసంగతికూడా కొంచెమిక్కడ తెల్పెదను.

కృష్ణాజిల్లా రైతువృద్ధమ పితామహులైన కానూరి వెంకటాచలపతయ్యగారు, సుప్రసిద్ధ న్యాయవాదులును బెజ వాడ పురపాలకసంఘాధ్యక్షులును ప్రజాసేవయందు ప్రఖ్యాతి గాంచిన కట్టమంచి కోళందరెడ్డిగారు; కృష్ణామండలసంఘము కృష్ణాపత్రిక స్థాపకులలో నొకరై బందరులోని ప్రతి ప్రజా

హిత కార్యములలో పాల్గొనుచు ప్రఖ్యాతిగాంచిన శ్రీ కొండి హనుమంతరావుగారు, బ్రహ్మయ్యగారిని తమ శిష్యునిగా భావించేవారు.

పెద్దలయెడ ఆయనచూపు భక్తి గౌరవములు మినహా పై ప్రముఖులకు బ్రహ్మయ్యగారికి గురుశిష్య సంబంధము లేదు.

ఆయన స్వాతంత్ర్య నిరతి, నిర్భయత్వం నిజాయతీనిబట్టి పెద్దలు, పిన్నవయస్కుడగు ఆయనను, శిష్యునిగా భావించుట మన సంప్రదాయం. అంతేగాని అన్యంగాదు.

# కీ. శే. ముట్నూరి కృష్ణరావుగారు

గుండ్రని ముఖం, విశాలమైన కాటుకకండ్లు, కోటేరు వంటి ముక్కు, విశాలమైన వక్షస్థలం, దీర్ఘబాహువులు, పండు వంటి శరీరచ్ఛాయ.

ఆ దివ్యసుందర విగ్రహానికి తగిన తెల్లని పారాడే పంచి కట్టు, చీలమండల వరకు వ్యాపించిన బారులాల్చి, రాజఠీవిని ధిక్కరిస్తూ, కోణాలు తీరిన ధవళశిరోవేష్టము, నల్లని ఆకు చెప్పులు, చేతికర్రను ధరించిన ఆ నిండైన విగ్రహాన్ని చూచి ఆయనను యెవరు మానవుడనుకొన్నారు? ఆయన ఈలోకపు మనిషి కాడు. దివ్యలోకమునుండి అవతరించిన మహాభాగుడు.

ఆయన వర్చస్సు యెట్టి ఆకర్షణీయమైనదో, ఆయన వస్త్రాలంకారము అట్టిదే. యెట్టి దివ్యాకర్షణమది! ఆయన వర్చస్సేకాదు వందనీయమైనది. వాక్కుకూడా. అది దివ్య వాణి. వాక్కేగాదు, వర్తనకూడా అట్టిదే,

ఆయనను సాధారణ లోకము కృష్ణాపత్రికాధిపతిగా ఎరుగును. కాని ఆ పత్రికపైన యెన్నడు ఆయనపేరే వుండేది కాదు. అదొక విచిత్రము.

ఆయన పత్రికానిర్వహణ ధురీణుడే కాదు. నవీనాంధ్ర భాషోద్యోగనిర్మాత, గద్యపద్యరచనా, లలితకళా పరిపోషకుడు.

'Style is the man' అన్నాడు కార్లైలు. ఇది ఆయన యెడల అన్నిటా సార్థకమైనది. ఆయన వ్రాతలో, ఆ వేశము అభినివేశము అంతర్దృష్టి అధికము. అందుచేతనే అవి వ్యాస ములవలె నుండక ఉపన్యాసములవలె ఉద్రేకం కల్గించేవి.

ఆయనకు ఒక విషయం తెలుసు, ఒక విషయం తెలి యదు, అని అనజాలము. సర్వజ్ఞుడు. ఆయన చర్చించని సమస్యే లేదు.

జాతీయతయే గాక, సంప్రదాయదృష్టి, మతదృక్ప థము, ముట్నూరివారి రచనలో ముప్పిరిగొన్నవి. ఆయన అభిప్రాయాలు ప్రజలపై అధిక ప్రభావము కల్గించినవి. ఆంధ్ర దేశంలో స్వాతంత్ర్య పిపాస, దేశాభిమానం కల్గించిన పత్రిక- కృష్ణాపత్రిక.

కృష్ణారావుగారన్నట్లు కృష్ణాపత్రిక న్యూస్ పేపరు కాదు వ్యూస్ పేపరు.

అది పలుకుబడిగల పత్రికేగాదు, పవిత్రమైన పత్రిక కూడా. ఆయన మహాప్రవక్తగా ప్రబోధించాడు. కృష్ణాపత్రికే కృష్ణారావుగారు, కృష్ణారావుగారే కృష్ణాపత్రిక. ఆయనగొప్ప వ్యాసరచయిత, వక్త, వ్యాఖ్యాత, భాష్యకారుడు, శోధకుడు, సాధకుడు, సత్యాన్వేషి, కళావేత్త, తత్త్వవేత్త, ద్రష్ట, ఉపదేష్ట.

పత్రికవల్లనే గాదు, ప్రవర్తనవల్ల కూడ ఆంధ్ర దేశానికి ఆయనది గురుస్థానం. ఆ మహామహుని సాహిత్య సేవకన్న, పాండిత్య గరిమకన్న, ఆయన నిష్కపట, నిర్మల చరిత్ర, ఆంధ్రలోకానికి ఆచార్యపీఠమును చేసినది.

దర్బారీయులకే కాదు ఆయన గురుపాదులు, యావదాంధ్రదేశానికి.

ఆయన సాధారణమానవునివలె, సరససల్లాపాలాడి నవ్వించాడు, ఆడాడు, పాడాడు. కాని ఆయన హృదయపు లోతులను మనము తెలుసుకున్నామా ?

అరవింద, రవీంద్ర గాంధిమహాత్ముల శిష్యుడని భావించాము. కాని ఆయన అరవిందునివంటి తత్త్వవేత్త, రవీంద్రునివంటి రసపిపాసి, మహాత్మునివంటి సత్యాన్వేషి.

వేదాంతం కళలు ఆయనకు అభిమాన విషయాలు. ఆయన కళా తపస్వి.

# భో. ప. సీతారామయ్యగారు

అద్దమువలె నున్ననైన నుదురు, అనుభవాన్ని విజ్ఞాన గరిమను సూచించు వెండివంటి తెల్లని శిరోజములు, ప్రతిభను ప్రదర్శించు ఆ బట్టతల, ఎక్స్రే చూపుగల నేత్రాలు, దూరశ్రవణశక్తిగల శ్రవణములు, పౌరుషాన్ని ప్రకటించే మీసకట్టు సన్నని దీర్ఘ ఆకారంతో మేలిమిబంగరుచ్ఛాయను ధిక్కరించు శరీరకాంతి, వేలాడే గోచీ, జారిపోయే పంచికట్టు, అంటీఅంటని అంగరఖా, మెడమీదనుండి జారిపోతూవుండే పైపంచి నిరంత

రాలోచనా నిమగ్నతను సూచించు దుస్తులతో పటాటోపం లేకుండా కన్పించే పురుషుడే పట్టాభిగారు.

పట్టాభిగారు నిండునిలువునా ఆంధ్రుడు. రూపములో, వస్త్రధారణలో, అభిభాషణలో, అభిప్రాయ ప్రకటనలో, అభిమానములో.

ఆయన చక్కని ఉచ్చారణ, శ్రావ్యమైన కంఠస్వరము శ్రోతలకు విందొనర్చును.

పెక్కు ప్రజ్ఞలు కలవాడు పట్టాభిగారు. ఆయన వక్త, వాద చతురుడు, సంభాషణలో సాటిలేని మేటి, పత్రికాధిపతి, బహుభాషాకోవిదుడు, గొప్పరచయిత, విమర్శకుడు, ఆర్థిక వేత్త, రాజకీయ వేత్త, నిర్మాణనిపుణుడు, వ్యవహర్త, ఘన వైద్యుడు, గొప్ప పార్లమెంటేరియను, డాక్టరు పట్టాభి అను ఆయన వాడుకపేరు సార్థకము.

ఆయనకెట్టి సహజశక్తి కలదో అట్టి జ్ఞాపకశక్తి కలదు. ప్రతివిషయం నాలుక చివరనే వుంటుంది. అంకెలు, ఘటనలే గాక, విషయాలకు సంబంధించిన తిథి వార నక్షత్రాదులను కూడా పేర్కొనగలడు. పది పుస్తకాలు ముందేసుకుని ఒక పుస్తకం రాసేపద్ధతి కాదాయనది. పుస్తకసహాయం లేకుండా జ్ఞాపకశక్తి వల్లనే అంకెలు, తేదీలు వ్రాయగల ధీశక్తి సంపన్నుడు. వేయేల? ఆయన జ్ఞాపక బ్రహ్మ.

ఆయనకు సహకారోద్యమము, బాంకింగు, ఇన్సూరెన్సు, వేదాంతము అవి, ఇవి, అననేల అన్ని విషయాలు తెలుసు. ఆయన ఒక జంగమ విజ్ఞానసర్వస్వము.

ఆయన బుద్ధికుశలతలో మరొక విశేషం అవధాన పటిమ. ఏకకాలమందు ఎన్నో కార్యాలను నిర్వహించగల నిపుణుడు.

ఆయనకు పెద్దలతో వున్న పరిచయ మెవరికున్నది? లోకజ్ఞానములో ఆయనతో సరివచ్చువారెవరు? ఆయనవంటి పొదుపరి లభించునా? కాగితాలను భద్రపరచుటలో ఆయన వంటి వారు మరిలేరు. ఆయన అన్నిటా ఆరితేరినవాడే.

ఆయన మేధాసంపత్తి, సద్యస్స్ఫురణ, సమయజ్ఞత, విషయవివేచనాసామర్థ్యము, రచనాకౌశలము, వాక్పటిమ, విమర్శనా నైపుణి, దూరదృష్టి, భారత దేశ నాయకత్వానికి అర్హత కలిగించాయి. ఆయనవంటి మేధావి ఆంధ్ర దేశములో అరుదు. భారత దేశములో బహుకొద్ది.

జాతీయ విద్యా ప్రచారకుడై, భాషాప్రయుక్త రాష్ట్ర విభజన ప్రణాళికా ప్రతిపాదన కర్తయై, వివిధ సంస్థల నిర్మాణ దక్షుడై, స్వదేశ సంస్థాన ఉద్యమసారథియై, కాంగ్రెసు కర్ణధారులలో నొకడై, కాంగ్రెసు చరిత్రకారుడై * మహాత్ముని భాష్యకారుడై భాసిల్లుచున్న భోగరాజు వారు ఆంధ్ర తేజం పెంచారు.

---

* రైతులంతా తాము రైతుబిడ్డలమని గర్వపడుతుంటే, పట్టాభిగారు కూడా తాను కరణపుబిడ్డనని గర్వపడతాడు. "పట్టాభీ నీవు మాట్లాడే టప్పుడు, నీ పలుకులు ములుకులవలె నుండునుగదా, ఇంత పెద్ద కాంగ్రెసు చరిత్ర వ్రాశావు. ఎవరిని ఏమీ అనలేదే" అని ఆయనను మహాత్ముడు ప్రశ్నిస్తే నేనుకరణం బిడ్డను కరణం ఎప్పుడూ వ్రాతలో దొరకడు" అని అన్నాడని అనుకుంటారు.

ఆయన కాంగ్రెసు గద్దెకాదు, గవర్నరుగద్దెకూడ అలంకరించాడు.

పట్టాభిగారికి ఖద్దరు స్వదేశ సంస్థాన ప్రజాప్రపంచము అభిమాన విషయాలు. ఆయన రాజకీయవ్యవహార కుశలుడు.

---

# చెరుకువాడ వేంకటనరసింహంగారు

అనూయకత్వాన్ని సూచించే ముఖము, స్వచ్ఛతను ప్రకటించే తెల్లనికళ్ళు, పట్టుదలను సూచించే ముక్కు, హృదయ వైశాల్యం సూచించే వక్షస్థలము లోకక్లేశము నుత్సహించే శ్రవణపుటములు, త్యాగాన్ని సూచించే ముండనము, జన్మ చేతనే సమత్వాన్ని సూచించే దేహాకారము, వస్త్రధారణ కలవారు, మన చెరుకువాడవారు.

ఆయన చదివినది స్వల్పము, తెలుసుకున్నది అధికం, తెలిపినది అంతకంటె అధికం, గొప్ప వయోజన విద్యాప్రచారకుడు. ఆయన ఉపన్యాసాలు పామరులను పరిణతులను జేసినవి. అయనవంటి వక్త అరుదు. పల్లెటూరివారికి తెలిసే భాషలో, ఆ ఉపమానాలతో, వారిలో నొకడై చెప్పినవాడు చెరుకువాడ. చెరుకువాడ వాక్కు చెరుకు రసం గదా!

ఆంధ్ర దేశంలో ఆయన పాదం పెట్టని గ్రామంగాని ఆయన వాక్కు విననివారుగాని వుండరంటే అతిశయోక్తి కాదు. ఆయన ఆంధ్ర డెమాస్తనీస్, ఉపన్యాస కేసరి. ఆంధ్ర దేశాన్నంతా ఉద్రూతలూగించాడు పూనూరు తిరిగి ఉపన్యాసాలద్వారా.

ఒక విషయాన్ని గురించి అనుకూలంగాను ప్రతికూలంగాను గంటల తరబడి చెప్పగల ప్రజ్ఞావంతుడు. హాస్యచతురతలో అందె వేసిన చేయి.

ఆయనవంటి కాంగ్రెసు ప్రచారకులు యెవరున్నారు? ఆనాడు బౌద్ధమత ప్రచారానికి బౌద్ధభిక్షువులు బయలుదేరి, బుద్ధభగవానుని బోధలు బోధించినట్లే, నరసింహంగారు నడుంగట్టి కాంగ్రెసు మతాన్ని లోకానికి వంటబట్టేటట్లు బోధించాడు. కాళ్ళు బలుపాలుకట్టేటట్లు పాదచారియై ప్రచారం చేశాడు ఆపరివ్రాజకుడు.

ఆయనలో బౌద్ధుల ప్రచారకళ, జైనుల సేవా దీక్ష, వేదవిదుల ధర్మతత్పరత దీప్తి గాంచినవి.

ఆయన నియోగిశాఖలో జన్మించాడుగాని స్వభావము చేత శుద్ధవైదీకి. ఆయన సేవకు శతకోటి యజ్ఞఫలం లభించగలదు. తన జన్మలో ఇంగ్లీషుచదువు చదువుట మినహా మరే పాపము చేయలేదని చెప్పే ఛాందసుడాయన!

ఆయన పెక్కు గ్రంథాలు వ్రాయలేదుగాని, వ్రాసినవి రెండూ రత్నాలే. "స్వరాజ్యదర్పణము" కాంగ్రెసు యువకులకు వేదం. 'శాసనసభలు' ఒక ప్రమాణగ్రంథము. ఆ గ్రంథాలా నాడు కాంగ్రెసు ప్రచారకులకు పట్టుకొమ్మలై పరిఢవిల్లినవి.

ఆయన భీమా కంపెనీలలో పనిజేసి "భీమాడింఢిమ" అని ప్రఖ్యాతిగాంచాడు. కానీ భీమాకంపెనీల తిరుగుళ్ళు తెలిపి లోకానికి హెచ్చరిక కలిగించాడు.

"ఆదర్శ ప్రాయమైన ఉపాధ్యాయధర్మాన్ని నెరపిన ఈనాటి బృహస్పతే మన చెరుకువాడ. ఆయనవృత్తం, త్యాగం అనితరం. చెరుకువాడ ముందరకో పెంపుకలగజేశాడు. ఆంధ్ర దేశానికి చైతన్యం కలగజేశాడు. కాని ఆయన పల్లకిబోయీ!

"కృష్ణాపత్రిక చతురతకు, ముసుముసదనానికి, వాడుక మాటలకు, సొగసైన పోకడలకు, హాస్యరస ప్రవాహమునకు, ఆనందమొసగు చణుకులకు, తావలమైన లోటిప్రాతలు చెరుకు వాడ పని" అని అంటాడు ఆచార్యరంగాగారు.

— 15-10-39-చిత్రగుప్త

ఆయన కొంతరం విద్యాలయంలో 10 యేండ్లు ఉపాధ్యాయుడై నందున, ఆంధ్రజాతీయ కళాశాలలో అధ్యాపకుడై నందున, ఆయన గురువుగా గుర్తింపబడలేదు. ఆంధ్ర యువ జన బృందానికి ఆయన గురువు. ఏకలవ్య శిష్యులు ఆయనకు వేలాది.

ఆయన లోకులను పెంచాడుగాని తాను పెరగలేదం టాడు ఆచార్యరంగాగారు. నేను అట్లాగే అనుకున్నాను. కాని ఆయన పదవులకు ప్రాకులాడ దలచలేదు. అధికారానికి అర్రులు జాచలేదు. ఆచార్యరంగాగారన్నట్లు ఆయన ఈనాటి బృహ

---

• వెంకటశాస్త్రిగారికివలె యీయనకును, వేలాది శిష్యజనం. ఏమాత్రం కవితావాసనవున్నవారైనాసరే శాస్త్రిగారి శిష్యులమనిచెప్పుకుంటారు. ఆయన ముఖమెరుగని ఏకలవ్య శిష్యులెందరో వున్నారు, కవితా ప్రపంచములో ఆయన ప్రభావమట్టిది. ఆయన కవికులగురువు. అశుకవిత్వంలోను,అవ

స్తుతి, గురుస్థానంకంటె ఉత్తమమైన పదవి ఏది? ఆయన కోరింది అదే. ఆయన రాణించింది అందులోనే. ఆయనను ఆదర్శంగా పెట్టుకుంటుందా, పదవీ వ్యామోహమైన ఆంధ్రలోకం? దేశ మత్తేంగాక స్వీయకీర్తి పలుకుబడి ప్రాపకం స్వార్థం కోరువారు ఆయనను అనుసరించగలరా?

---

ధానములోను, జంటకవిత్వంలోను, ఆయన అనుకరణీయు డయ్యాడు. తిరుపతి వెంకటకవులు యుగకర్తలు.

వారి శిష్యులలో ప్రతిభావంతులైన కవులు గలరుకాని, వారివలె తామరితింపరగా శిష్యగణం సంపాదించిన కవులు లేరు.

కాని అందులకు అతీతుడు మన చెరుకువాడ. చెరుకువాడ వారు కూడా శాస్త్రిగారి శిష్యులే. బెజవాడలో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు సమావేశ సందర్భంలో శిష్యగణం శాస్త్రిగారి పాదపూజ చేయుటజరిగింది. ఆసందర్భంలో చెరుకువాడవారుకూడా పాల్గొని తాము శాస్త్రిగారిశిష్యుల మని సగర్వంగా చెప్పుకున్నారు. అయితే ఆయన కవిత్వం చెప్పగలడా అని పాఠకలోకానికి సందేహం కలగవచ్చు. వారిగురువుగారు, వారిఉపన్యాస ధోరణికి ఆశ్చర్యపడి ఇదీ ఒక కవిత్వమేనోయ్, మూజావాణీ కవిత్వమని ప్రశంసించారట.

ఇంతేగాక కృష్ణాపత్రికలోని ఆయన వచన రచనాప్రాగల్భ్యము జూచి ఆయన కవిగాదని యెవరంటారు? "గద్యం కవీనాం నికషంవదన్తి" అన్నారు పెద్దలు. గేయాల్లోను ఆయన గొప్పవాడే. కృష్ణాపత్రికలోని తుమ్మెదపాటలు, బుడబుక్కలపాటలు చూస్తే, ఆయన కవితామాధుర్యం గోచరిస్తుంది. తిరుపతి వెంకటశాస్త్రిగారివలెనే, చెరుకువాడవారికి శిష్యగణం ఆంధ్రదేశమంతటా వున్నది.

ఆయన శిష్యబృందంలో, ప్రహ్లాదునివంటి భక్తులు, వికర్ణునివంటి ధర్మనిర్ణయవేత్తలు, అభిమన్యునివంటి వీరులు, అర్జునునివంటి సవ్యసాచులు, దుర్యోధనునివంటి సంపత్తి గల వారు, అతిరథులు మహారథులు ఏకలవ్యులు కలరు. ఆయన ఈనాటి ద్రోణాచార్యులు. ఆయన తన శిష్యగణాన్ని జూచి గర్వపడతాడు. ఆయనకేమి కొదువ? ఆయన కోరేది పెంపే! పదవులు పెరవారికే!

ఆయన శిష్యగణమైనా, నేడు గురుదక్షిణగా భావించి గురువుగారి, ఆదర్శానికై పాటుబడుట ధర్మంకాదా?

నరసింహంగారు గాంధీమహాత్ముడు ప్రవచించిన స్వేచ్ఛాదారిద్ర్యాన్ని వరించి పదవీవ్యామోహంలో పడకుండా జీవితకాలమంతా అక్షరాలా ఆచార్యుడుగా వుంటూ, శిష్యుల ఉన్నతి జూచి ఉప్పొంగుచూ, వారి నమస్కారాలు స్వీకరిస్తూ "అభివృద్ధిరస్తు" అని ఆశీర్వదిస్తూ 'ధన్యోస్మి' అని అనుకుంటూ ఆనందంలో వుండుటే ఆయన అభిమతము.

ఆయన జన్మతః ఆచార్యుడు. అజాతశత్రువు. పరశ్రేయము, పరోపకారము ఆయనకు పరమప్రియము.

"సర్వేజనా స్సుఖినో భవంతు. గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం." అనునదే ఆ ఆచార్యుని సంకల్పం.

ఇక నీ గురువులవద్ద బ్రహ్మయ్యగారు ఏమి గ్రహించెనో యెఱుకపడతును. వీరివద్ద బ్రహ్మయ్యగారు చదువుకున్నది లేదు. వారు చెప్పినదీ లేదు. వారి సామీప్య సాహచర్యభాగ్యములచేత నేర్చుకున్నదే. వారుబోధించాలా? వారి సాహచర్యమే చాలు వివేకవంతునకు. అందుచేతనే వారిని

గురువులుగా భావిస్తాడు. తన శ్రేయోభిలాషులుగా యెంచుతాడు.

దూరదూరాల నుండి వారి వ్రాతల ద్వారా పుత్తేజము నొంది వారిని గురువులుగా భావించేవారు వేలాది వేలుండగా వారి సన్నిహిత సామీప్యభాగ్యములచే వారి శిష్యుడగుట బ్రహ్మయ్యగారి భాగ్యముగాక మరియేమి?

కృష్ణారావుగారు ప్రథమ గురువు, పెద్దగురువు. బ్రహ్మయ్యగారు బ్రహ్మమందిర మందుండి చదువుకుంటున్న రోజుల నుండి వారి దర్శనభాగ్యమేగాక, వారి సామీప్య భాగ్యము వారి పవిత్రవాణి, శ్రవణేంద్రియములద్వారా గ్రోలే మహా భాగ్యం కలదు. వారు ఆదివారం రోజున చేసే ప్రార్థనలలో పాల్గొంటూ, ప్రసంగాలు విన్నాడు విద్యార్థిగా. కృష్ణాపత్రిక నాటినుండి నేటివరకు, వేదంగా పఠించే ఘనాపాఠి.

బందరులో ఉన్నప్పుడు దర్బారులో పాల్గొంటూ వుండేవాడు. అందువల్ల పెద్దగురువుగారి ప్రభావం అధికం. నీతికి నిలబడటం, కళాదృష్టికలగటం, కృష్ణాపత్రిక శైలి అనుకరించడం జరిగింది. ఈ గురువుగారివల్లనే ఆచారాలందు, సంప్రదాయాలందు అభిమానం కలిగించి రాజకీయంగానూ, వ్యక్తిగతంగానూ ఋజువర్తన వుంటేనేగాని యేవ్యక్తీ వృద్ధికి రాజాలడని గ్రహించాడు. ఆయనకు హృదయ వైశాల్యం కలిగింది. ఆనాటి బ్రహ్మసమాజ సంస్కారమువల్లనే నేటికిని యేది వ్రాసినా ఓంకారముతోనే ప్రారంభము. పెద్ద గురువుగారి ప్రభావము అట్టిది.

పట్టాభిగారు పుట్టుకతోనే పార్లమెంటేరియన్. వారివల్ల తీర్మానాలు వ్రాయటం, సవరణలు పెట్టటం, ఓటింగు తీసుకొనే పద్ధతి, సభానిర్వాహణం, కొత్తవారిని యెన్నుకోవడం, చర్చలో కుర్రలు వలకడం, వాదించడం, శీఘ్రనిర్ణయానికి రావడం, జాగులేకుండా ప్రతిపని త్వరగా చేయడం నేర్చుకొన్నాడు. ♦

చెరుకువాడవారివల్ల, ప్రచారం, ఉపన్యాసాలివ్వటం, సేవావ్రతం, మొదలగునవి నేర్చుకొన్నారు. వీరి స్వరాజ్యదర్పణం, శాసనసభలు ఆనాటి కాంగ్రెసు ప్రచారకుల కెలా ప్రయోగపడినవో, బ్రహ్మయ్యగారికి అలాగే ప్రయోగ పడినవి,

అసలు నేలంటు వదిలించింది చెరుకువాడవారు. నైతిక ప్రభావం కృష్ణారావుగారిది. లోకంలో మెలగడం నేర్చుకున్నది పట్టాభిగారిద్వారా.

---

♦ ఈసందర్భంలో ఒక సంగతి చెప్పుట అవసరము. బ్రహ్మయ్య గారి మేనమామసుబ్బయ్యగారు మంచివ్యవహర్త. అయినప్పటికి యెప్పుడూ కోర్టుకెక్కని పెద్దమనిషి. లోకులెవ్వరికి తనజన్మలో ప్రోనోటు వ్రాయని భీష్మాచార్యుడు. తగాదామనిషికాడు, కాని పట్టుదలవస్తే వెరవని నిర్భయుడు. కుటుంబసంబంధమైన సలహాలుచెప్పటంలో మంచిసలహాదారుడు. పెక్కుకుటుంబాలు మేనేజిమెంటుచేసి అభివృద్ధిలోనికి తెచ్చిన ఉదారుడు.

ఇట్టి సుబ్బయ్యగారు మేనల్లునకు మంచిశిక్షణ యిచ్చారు. నిర్భయంగాను, నిర్మొహమాటంగాను మాట్లాడడం, పెద్దలయెడల వినయవిధేయతలు కలిగివుండటం, సాధ్యమైనంతవరకు యితరులకు సహాయం చేయటం, పాడుపరితనం, జమా ఖర్చులు సక్రమంగా వ్రాయటం, వ్యవహారజ్ఞానం నిజాయితీ మొదలగునవి అలవడచేశారు. ఆయన గురువెందుకుకాడు? ఆయన శిక్షణకు పట్టాభిగారు మెరుగులు దిద్దారు.

అసలు ఈ త్రిమూర్తులు స్నేహితులు. వారిప్రభావం ఒండొరులపైన బడింది. అట్లాగే ఆ గురుత్రయ ప్రభావం శిష్యులపై బడింది. అందుచేత ఫలానావారివల్ల ఫలాని విషయం వీరికబ్బిందని చెప్పటంకూడా కష్టసాధ్యమే !

వారిది ఒకకూటమి. ఆ త్రిమూర్తులు కలసి పనిచేశారు.

హనుమంతరావుగా రుండగా కృష్ణరావు పట్టాభిసీతారామయ్యగారలు కలసి పనిచేశారు. హనుమంతరావుగారు స్వర్గస్థులైన తర్వాత చెరుకువాడ వారితో కలసి పనిచేశారు.

వారి కూటమిని గూర్చి చెరుకువాడ వారిట్లా చెప్పుకున్నారు. "పట్టాభిగారు యింజను, నేను లోడ్ వాన్, కృష్ణారావుగారు బ్రేక్ వాన్."

—కృష్ణాపత్రిక 1931-9-26

పట్టాభిగారు వారి కూటమినిగురించి యిట్లా అన్నారు. "హనుమంతరావు, కృష్ణారావు, నేను ముగ్గురమూ ఒక కూటం. ఒకమాట, ఒక కార్యక్రమము మీద పనిచేయుచుంటిమి. కృష్ణరావు తత్వవేత్త. హనుమంతరావు కవి. నేను లౌకిక వ్యవహారకుడను. హనుమంతరావు యింజను డ్రైవర్, నేను బ్రేకువేయు గార్డును, కృష్ణారావు ప్యాసెంజరు. యీ విధముగా, కళాశాల నడుపునప్పుడేమి, పత్రికా ప్రచారమునందేమి, గ్రంథ వ్యాపకమునందేమి, ముగ్గురము కలసి పనిచేయుచుంటిమి."

"మాకు కుడిచేయివలె కాశా శ్రీరామశాస్త్రిగారుండిరి. ఆయన భావవికాసము, వాక్పటిమ, వంగభాషాజ్ఞానము



బ్రహ్మయ్యగారి మేనమామలు :

కొండపల్లి సుబ్బయ్య, వెంకయ్యగార్లు

సాహసము, భావనలు ఆంధ్రదేశముయొక్క అప్పటి అభివృద్ధికి పునాదియని చెప్పవచ్చును. ఆంధ్ర భాషాభివర్ధనీ సంఘమును స్థాపించిరి. శాస్త్రిగారు ఒక ప్రావిడెండుఫండు కంపెనీపెట్టి తద్వారా లభించిన యెనిమిదివేల రూపాయలు కళాశాల కర్పించిరి. (ఆంధ్రపత్రిక 2-7-1945)

ఈ విధంగా ఒక కూటమిగా పనిజేశారు. దేశాభివృద్ధికి తోడ్పడ్డారు. కృష్ణారావు, పట్టాభి, చెరుకువాడలు ముగ్గురూ మిత్రులైనా వారి మన స్తత్వాలు భిన్నములు.

వారు వారినిగురించి చెప్పుకున్నారు. నేనుకూడా శాస్త్ర వారినిగురించి పోల్చి చెప్పెదను.

పట్టాభిగారు సముద్రుడు. ఆయన్ని చూడగానే భయం. కృష్ణారావుగారు గంగానదివలె పవిత్రుడు. ఆయన్ని చూడ గానే భక్తి. నరసింహంగారు తటాకంవలె సర్వజన సులభుడు. ఆయనను చూడగానే ఆప్యాయత కలుగుతుంది. *

ఈ త్రిమూర్తుల గుణాలు వారి శిష్యునియందునూ కలవు. ఆయన పట్టాభిగారివలె భయంకరుడు. కాని వాస్త వంగా నరసింహంగారివలె సర్వజన సులభుడు. కృష్ణారావుగారి వంటి విమల వర్తనుడు.

ఇంతేకాదు. పట్టాభిగారివంటి గడుసరి, నరసింహంగారి వంటి అత్మాక్యుడు, కృష్ణారావుగారివంటి స్నేహపాత్రుడు.

అందుచేతనే ఆయన నాయకుడు కాలేదు. అనుచరు డుగా ఉండలేదు. ఆయనది తృతీయపంథా !

---

* Like priests like people.

ఈ గురువుల ప్రభావం ఆయన కొక ప్రత్యేకవ్యక్తిత్వం కల్గించింది.

కృష్ణారావుగారికి ఆయనకు గల కలయిక హృదయ సంబంధమైనది.

పట్టాభిగారికి ఆయనకు సంబంధం మేధకు సంబంధించింది. గురువుగారి మేధకు ముగ్ధుడయ్యేవాడు శిష్యుడు. శిష్యుని తెలివితేటలను ప్రశంసించేవాడు గురువుగారు.

నరసింహంగారికి ఆయనకుగల బాంధవ్యం సేవావ్రతమునకు సంబంధించింది.

వీరి ముగ్గురిలోను బ్రహ్మయ్యగారిని బాగా అర్థం చేసుకున్నది కృష్ణారావుగారొక్కరే. ఆయన బ్రహ్మయ్యగారిని యెన్నడూ శంకించలేదు.

పట్టాభిగారు ప్రతిది మేధతోనే పరీక్షిస్తారు. ఆయన మేధావి. మేధ అందుకోలేని విషయం, హృదయం అందుకోగలదని ఆయన వ్రాస్తాడు. ఆ సంగతి సర్వజనవిదితం. అందుచేతనే యీ గురుశిష్యులకు అనేకసార్లు అభిప్రాయ భేదాలు కలగడం, పోవడం జరిగింది.

నరసింహంగారితో కలసి యేకనిర్ణయానికి రాలేకపోయినా, వెంటనే కలసిపోవడం కద్దు.

ఆ అజాతశత్రువు శిష్యవత్సలుడు గదా!

ఈ త్రిమూర్తుల ప్రభావం ఈ మాదిరిగ, ఇంతా నేను చెప్పలేనివిధంగా పనిచేసింది బ్రహ్మయ్యగారిమీద. ఆయన తన అభివృద్ధికి ఆధారభూతులైన ఈ త్రిమూర్తులను సందర్భానుసారంగా నిత్యం స్మరిస్తూవుంటాడు.

"నీరము తప్తలోహమునసిల్చి, యమానకమైనశించు, నా
నీరమె, ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చునా
నీరమె శుక్తిలోబడి, మణిత్వముగాంచు సమంచిత ప్రభం
బాయమవృత్తులిట్లధము, మధ్యము, నుత్తము గొల్చువారికిన్"
—భర్తృహరి.

—:—

# ఆయన విశిష్టత

" చేతబట్టి హాలాయుధము ప్రా
చీన తేజము బావుటాగా
గాదె భోయము శుభ్రయశమును
కార్యశూరుడవై ".  - పల్లెపట్టు.

కాంగ్రెసులో ప్రవేశించిన అనేకులు ఆస్తిపాసులు అధికంగానో అల్పంగానో పోగొట్టుకున్నారు. కాని బ్రహ్మయ్యగారు గత 40 సంవత్సరములనుండి కాంగ్రెసులో కార్యకర్తగావున్నా, ఖర్చు అధికంగా చేసినా, జరిమానాలు చెల్లించినా ఆస్తిమాత్రం పోగొట్టుకోలేదు. అదొక ఆశ్చర్యకరమైన విషయం.

. ఆయనలో ఆవేశంకంటె, ఆలోచన అధికం. అందుచేత ప్రతిపనీ ఆలోచించిగాని ఆరంభించడు. ఇంతేగాక ప్రధానమైనదేదో అప్రధానమైనదేదో గుర్తిస్తాడు.

ఆదాయ వ్యయాలను గమనిస్తాడు. ఆదాయాన్ని మించిన ఖర్చుచేయుట అపచారంగా భావిస్తాడు. అందుచేత

అప్పులు పాలుకాకుండా; ఆస్తి పోగొట్టుకోకుండా జాగ్రత్త పడతాడు.

పూర్వార్జితం అమ్ముట మహాపాతకంగా భావిస్తాడు. దానిని అనుభవించటానికే తనకు హక్కు కలదుగాని అమ్ముటకు హక్కు లేదని తలుస్తాడు. పెద్దలు ఈ ఆస్తిని అమ్ముకోనుటకు గాక అనుభవించుటకే ఇచ్చినట్లు తలుస్తాడు. కనుక పెద్దల అభిప్రాయానికి భిన్నంగా ప్రవర్తించిన పాపులగుదుము అని భావించుటలో అసందర్భమేమీ లేదు.

ఇంతేగాక బహుపొదుపరి. చాలామంది చెడిపోవుటకు కారణం తమ స్థితిగతులు గమనించకుండా ఖర్చుచేయటమే.

ఆయన పొదుపరితనం, ఒకరిని చేయిచాచడానికిగాని, ఒక లాల్లీపని చేయడానికిగాని ఆయన కవసరం లేకుండా చేసింది ∗ 1

మన దేశంలో స్వంత ఆస్తిలేకుండా, దేశసేవ చేయటం యెంత అవమానకరమో బాధాకరమో ఆయన బాగుగా యెరుగును.

దేశాన్ని నమ్ముకొని రాజకీయాల్లో తమ సర్వస్వము ధారవోసిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, డాక్టరు సుబ్రమణ్యం, సాంబమూర్తి, ప్రకాశంగార్లు మొదలగువారు పడ్డ అగచాట్లు చాలు మన రాజకీయ జీవనపు వొడుదుడుకులు గ్రహింపజేయ

---

∗ 1. లాల్లీ పనులు యీాయనకు పనికిరావు. అంటారు చెరుకువాడవారు.
కృష్ణాపత్రిక 26-9-32

డానికి. మనం, మన దేశారాధకులను పోషించే స్థితికి ఇంకా రాలేదు. * 2

అందుచేతనే తన బరువుభారములు లోకులపై వేయక తనదేశ హితైక జీవనంకు ఒడుదుడుకు రాకుండా వుండగలందులకే ఆయన ఆవిధంగా ప్రవర్తించుట మంచిదని మనం గ్రహించాలి.

ఆయన కాంగ్రెసు సందేశానుసారం సంచరించిన ప్రముఖుడైనా, కొండరివలె స్వగ్రామంలో కాంగ్రెసు వుద్యమాన్ని బలపరచకుండా, దేశాన్ని వుద్ధరించుదామని బయలుదేరలేదు. తన గ్రామాన్ని కాంగ్రెసు గ్రామంగాచేసి, కాంగ్రెసు సందేశానుసారం పనిచేయుటకు, బద్ధకంకణుడై బయలుదేరిన కార్యవాది. ఇంటగెల్చి రచ్చగెల్చిన ధీరుడు.

గ్రామంలో యెంత పలుకుబడి వున్నదో, తాలూకాలో అంత పలుకుబడి వున్నది. *

జిల్లాలో పట్టాభిగారితర్వాత పలుకుబడిగల ప్రముఖుడు.

రాష్ట్రంలో ప్రకాశం, పట్టాభి, రంగాగార్లు మొదలగు పెద్దల అనంతరం, పలుకుబడిగలవాడు.

మరొక విశేషమేమిటంటే ఆయన దేశానికెలా సేవ చేశాడో, గ్రామానికి అలా సేవజేశాడు. ఆయన గ్రామానికి చేసినసేవ పాఠకులకు విదితమే.

---

* 2 యీ భావమే రాజకీయ బాధితుల నిర్వచనములోను భూముల పంపకములోను, గ్రూపు రాజకీయాభిమానాలు; వేనోళ్ళ చాటుచున్నది.

* "ఇది తాలూకాలో ఈయన మకుటంలేని రాజని చెప్పవచ్చు"
కృష్ణాపత్రిక 26-9-31.

ఆయన ఉన్నత పదవులద్వారా కాంగ్రెసు రంగమున కృషిచేయునట్టి రైతాంగమునకుకూడా కృషి చేయునట్లు. ఇంతేగాక తాను చేసిన చేస్తున్న వ్యవసాయం వదలని రైతు.

—0—

# ఆయన ఆధిక్యం

"మానవమైత్రి మంగళతంతువె
మంత్రాంగములకు మూలసూత్రమని
సత్యాగ్రహఋషి చాటినపాఠము
యెల్లజాతులును పల్లవిపాడ
యెత్తవోయి నీ జయజెండా
విప్పవోయి నీ ప్రియకాండా." —రాయప్రోలు

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువాదులలో, ఆయనస్థానం యెట్టిదో యెవరికైనా ఎరిస్తేగాని, ఆయనశీలం, సరసత్వము, ప్రభావము వెల్లడిగావు.

కాంగ్రెసులో ఘనతరత్యాగాలు చేసినవారు కలరు. సాహసులు సమధికము. సేవావ్రతులు పెక్కురు. ప్రతిభాశాలురకు తక్కువలేదు. బ్రహ్మయ్యగారు వీటన్నిటిలో పరిణతి జెందిన ప్రముఖుడుగాదు. వీటిలో యేఒక్కవిషయంలోను

ఖ్యాతిగాంచినవాడు కాకపోయినా, ఆయన యువకుడుగా వున్నప్పుడు ఆంధ్రయువజన లోకములో ఒక పెద్దగా, ఒక ప్రముఖుడుగా, ఒక ప్రత్యేక గౌరవానికి పాత్రుడైనాడు.

కాంగ్రెసులో పెద్దలును, పిన్నలును గలరు. కాని పెద్దలకు, పిన్నలకు సమానంగా ప్రేమాస్పదుడైన ప్రముఖుడు బ్రహ్మయ్యగారు.

ఆయన ఆనాడు కాంగ్రెసు పెద్దలలో పిన్న. చిన్నలలో పెద్ద, అందుచేతనేగాదు, సామరస్యభావంవల్ల ఆయన సమధికుడైనాడు.

పిన్నలలో ప్రముఖులు కొందరు ఆయనను పేరుతో పిలువక అన్నగారని పిలుస్తారు. ఆయనకు మిత్రులన్న యేకోదరాంతఃకరణ.

ఆయన రైటిస్టయినా, ఆనాటి రైటిస్టులవలె లెఫ్టిస్టులను మారొకన్న వ్యక్తిగాదు. లెఫ్టిస్టుభావా లన్నింటిని అంగీకరించకపోయినా వారి దేశభక్తిని శంకించేవాడు కాడు.

కాంగ్రెసులో ఆయన సేతువువంటివాడు.

ఆంధ్రరాష్ట్రీయ మహాసభ అధ్యక్షత వహించినప్పుడు అతిక్లిష్టపరిస్థితులలో, ఆ సభ దిగ్విజయముగా జరుగుటకు కారణము రైటిస్టులేగాక లెఫ్టిస్టులకు, రైతు యూతు సోషలిస్టు వర్గములవారికి ఆయనయందుగల అనురాగమే కారణము.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ సెక్రటరీగా యెన్నుకోబడినప్పుడు, అధ్యక్షులగు పట్టాభిగారికంటె హెచ్చువోట్లు

వచ్చుటకు కారణం, ఆయనకు రైటిస్టులేక లెఫ్టిస్టులలో కొందరుకూడా వోటుచేయుటయే.

నాడేకాదు నేడూ అంతే. ఇటీవల ఆయన కౌన్సిల్ సభ్యత్వానికి అందరికంటె అధికవోట్లు వచ్చినవి. పార్టీభేదం లేకుండా కమ్యూనిస్టులు, ప్రజాసోషలిస్టులు అందరూ అభినందించారు.

ఈ విధంగా, కాంగ్రెసులోగల వివిధవర్గములయొక్క ప్రేమాభిమానములను చూరగొన్న వ్యక్తి మన బ్రహ్మయ్యగారు.

ఆంధ్రరాష్ట్రములోని అన్నిజిల్లాలలోను విభిన్నవర్గములకు చెందిన ప్రముఖులాయనకు ప్రియమిత్రులు. విశాఖలో పి. ఎల్. ఎన్. రాజు, స్వామిబాబుగార్లు ఆయనను ప్రేమింతురు. తూర్పుగోదావరిలో పళ్ళంరాజు, కళా వెంకట్రావు, చిక్కని వెంకటరత్నంగార్లు ఆయనమిత్రులే. పశ్చిమగోదావరిలో డాక్టరు రంగయ్య, బాపినీడుగార్లు స్నేహితులు. గుంటూరులో ఆచార్యరంగా, చంద్రమౌళిగార్ల ప్రేమకు పాత్రుడు.

కృష్ణాజిల్లాలో కొల్లిపర సూరయ్య, కొడాలి ఆంజనేయులు, కానూరి చినవెంకటదాసయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మరుపిళ్ళ చిట్టి, మద్దాలి జగన్నాధం, వీరపనేని గోపాలకృష్ణయ్య ప్రభృతులు ఆప్తునిగా తలుస్తారు.

నెల్లూరు జిల్లాలో గోపాలరెడ్డి, తిక్కవరపురామిరెడ్డిగార్ల ప్రత్యేక ప్రేమకుపాత్రుడు.

చిత్తూరులో అనంతశయనం అయ్యంగారు, రామకృష్ణరాజు

తిమ్మారెడ్డిగార్లు, కడపలో కోటిరెడ్డిగారు, కర్నూలులో రంగా రెడ్డి, ఓబులరెడ్డి, సంజీవయ్యగార్లు ప్రేమాస్పదుడుగా తలుస్తారు.

అనంతపురం జిల్లాలో కల్లూరి సుబ్బారావు, సంజీవరెడ్డి గార్లుస్వంతసోదరుడుగా భావిస్తారు.

తాలూకాబోర్డు అధ్యక్షులుగా నున్నప్పుడు తనకు జస్టిసుపార్టీ ప్రతిపక్షంగావున్నా బోర్డు పరిపాలనలో యెట్టితగా దాలూ లేకుండుటేగాక సభాసమావేశములలో వోటింగుతో నిమిత్తంలేకుండా సామరస్యమును సాధించిన సహృదయుడు.

అందుచేతనే, కాంగ్రెసులో తగాదాలుపడి వచ్చిన వారికి, రాజీకావాలంటే బ్రహ్మయ్యగారిని కోరుకోండి- తగాదా కావాలంటే నన్ను కోరుకోండి అని ఛలోక్తిగా పట్టాభిగారంటూ వుండేవారు.

అందరితోను కలసిపోయే స్వభావము, సమన్వయబుద్ధి ఇవే ఆయన అధిక్యత.

ఈ సందర్భములో కృష్ణాపత్రిక ప్రధాన వ్యాసము లోని కొన్ని భాగములను వుదహరించుట సముచితమని తలుస్తాను.

"బ్రహ్మయ్యగారు యువకులలో యువకుడు. రైతు లతో రైతు. సోషలిస్టులలో సోషలిస్టు. కాంగ్రెసు భక్తులలో కాంగ్రెసు భక్తుడు. ఏ ఉద్యమము నెడలను వీరికి స్పర్థ లేదు. అన్నిటిని సమన్వయము చేసుకొనగల ఉదారచరితుడు. జన సామాన్యముయొక్క గర్భిత సంఘటనా శక్తియందు సంపూర్ణ విశ్వాసముగల కార్యదక్షుడు. ప్రపంచముతోబాటు పరి వర్తనమునంద వలసియున్నను భరతవర్షము తన ధారావాహిక

మైన సంస్కృతిని రక్షించుకొనుటయందు నిండు భక్తిగల అభిమాని. సోషలిస్టు అయ్యు గృహ పరిశ్రమలే యెప్పటికైనను ప్రపంచమును బాధించుచున్న నిరుద్యోగ సమస్యను, ఆర్థిక స్పర్థను తొలగించి, జనపదముల భాగ్య భోగ్యములను పోషించగలుగునని నమ్ము కుటీరవిశ్వాసి. మంత్రిత్వ స్వీకరణమున కనుకూలుడైనను కాంగ్రెసుయొక్క విధికృత్యములు, శాసనసభల బయటనే యెక్కువగా నిర్వర్తింపబడ వలయునని, వాదించు గ్రామోజ్జీవ ప్రబోధకుడు, కర్షకులకు కార్మికులకు, ప్రత్యేక సంఘముల ఆవశ్యకత నిరూపించియు, కాంగ్రెసుయొక్క సమగ్రతను పోషింప సమకట్టు కాంగ్రెసువాది. సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యమును సంకుచిత పరచుటకు ఏమ మాత్రమును అంగీకరించక పోయినను, తత్ సిద్ధికి పూర్వము, దేశము క్రమానుగతముగ దాటవలసిన కక్ష్యాంతరములను గుర్తింపగల వివేకి. ఖద్దరు దేశకల్యాణము నపేక్షించు ప్రతి భారతీయుడు విధిగ ధరింపవలసిన దీక్షా వస్త్రమని వారి దృఢవిశ్వాసము. నేడు, సాంఘిక రాజకీయ విషయములలో ప్రబలుచున్న సమానప్రతిపత్తి, ఆర్థిక శాఖకు గూడ అనువర్తించిన కొలదియు సామ్యనీతి విరుద్ధమైన జమీందారీ పద్ధతి వెంటనే కాకపోయినను యెప్పటికైనను అంతరించక తప్పదని వాని సిద్ధాంతము. బ్రహ్మయ్యగారు తీవ్ర సామ్యవాదులు కోరునట్లు ప్రైవేటు ఆస్తి అనునది పూర్తిగా పోవుటకు అంగీకరించకపోయినను, ధనముయొక్క పెట్టుబడులచే, కర్మకారులయొక్కయు, పాలకప్రజనము యొక్కయు, కాయకష్టమును ద్రవ్యోపార్జన సాధకముగా జేసుకొను 'కేపిటలిజం' పద్ధతిని

పూర్తిగా నిరసించెదరు. సాధ్యమైనంతవరకు దేశములోని ప్రధాన పరిశ్రమలను సాహుకార్ల వశమునుండి తప్పించి వానిని నేషనలైజు చేయుట అవసరమనికూడా సూచించెదరు. రష్యాలోని కాన్స్టిట్యూషనులో యిటీవల జరిగిన మార్పులను బట్టి, వ్యష్టిజీవనమును, సమిష్టికి కేవలము దాస్యమొనర్చునట్లు చేయుట మానవ ప్రకృతి సహింపజాలదని, స్పష్టమగుచున్నది. వ్యష్టి సమిష్టిలు రెండును సమాన స్వాతంత్ర్యములు గలవి. వ్యష్టి స్వాతంత్ర్యము పేరట సమష్టియొక్క అధికారమును, సంపూర్తిగా నిరాకరించునా, సంఘము అరాచకమునకు దిగి విచ్ఛిన్నమగును. సమష్టి తనయధికారముచే వ్యష్టిని పూర్తిగా అణగద్రొక్కునా, స్వాతంత్ర్యము నామమాత్రమై మానవ ప్రకృతి విలసన రహితమైన, యంత్రము వగిది జడతుల్యమగును. మానవుని భావిదశ, ఈ వ్యష్టి స్వాతంత్ర్యమును, ఈ సమష్టి అధికారమును సమన్వయపరచుటయందే కలదని బ్రహ్మయ్య గారి సిద్ధాంతము. బ్రహ్మయ్యగారి వివేచనా పటిమ అత్యద్భుతము. ఏ విషయమైనను సమగ్రదృష్టితో పరిశీలింపగలరు. సంస్కారోత్సాహులయ్యు బ్రతి పాత వ్యవస్థను నిరసింపరు. ప్రాచీన సంస్థలయెడ గౌరవముండియు, క్రొత్తభావములను స్వీకరించుటకు సాహసమును జూపెదరు. జాతీయజీవనములోని సాంఘిక, ఆర్థిక నైతిక ప్రచురణము లన్నింటికిని యేకవాక్యతను గూర్చగల విశాలప్రతిభ గలదు. యువకులైనందుకు వుత్సాహపూరితులైనను, పెద్దలను తూలనాడరు. పెద్దలను గౌరవించుచు యువకులతో కలసి పని చేయగలరు. రైతులయ్యు, కాంగ్రెసు ఒక్క రైతు దేగాని, యితరులకందు తావుండరాదని వాదించరు.

కర్మకారుల సంక్షోభావమును ప్రోద్బలపరచుచున్నది. ఎఱ్ఱ జెండాను కాంగ్రెసు ధ్వజముపై నెక్కించునంతటి అసహన శీలురు కారు. పెద్దల నెమ్మదియు, యువకుల భావోద్వేగమును వీరియందు సామంజస్యము నొందినటుల యింకొకరియందు గాంచజాలము."

19-6-37 సం॥ కృష్ణాపత్రిక.

---

# కర్షక దృక్పధం

బ్రహ్మయ్యగారు చేసిన ప్రతి కార్యము కర్షకుడనే భావములోనే చేశాడు. ఆయనపొందిన ప్రతి గౌరవమూ కర్షక లోకమునదే అని భావించాడు. ఆయనది కర్షకదృష్టి.

గాంధీమహాత్ముడు భారతదేశమంటే గ్రామం, గ్రామమంటే రైతు. అని భారతస్వరూప సందర్శనం కలిగించాడు.

మహాత్ముని సూత్రాలను జీర్ణించుకొన్నందున బ్రహ్మయ్యగారి కార్యకలాపాలు ఆవిధంగా సాగినవి. నేటి ప్రధానసమస్య ఏమిటిఅనే ఆలోచనలు కలుగుతున్నవి. కొందరు నిరుద్యోగనిర్మూల మంటున్నారు. మరికొందరు ఆహారసమస్య అంటున్నారు. ఇంకా కొందరు నిరాక్షరాస్యతా నిర్మూలమంటున్నారు. వేరే కొందరు భూసంస్కరణలు అంటున్నారు. కాని సరిగా ఆలోచిస్తే మన ప్రధానసమస్య కర్షకోద్ధరణ.

మన దేశీయులేగాక విదేశీయులగు రాజప్రతినిధులు కూడ కర్షకుల ఆధిక్యమును అంగీకరించారు. "అన్ని రాజ్యాంగ వ్యవహారాలు ఎంత క్లిష్టములైనా, ముందుగా 5 యకరముల చిన్న రైతుల మీద ఆధారపడియున్నవి. ఆ ఆసామి బాగుగా ఉంటే గవర్నమెంటుకు ఎన్నిచిక్కులు వచ్చినా విడిపోలేవు" అని రిప్పన్ ప్రభువు అనెను.

రాజప్రతినిధి లినిత్ గో ఇట్లా అన్నాడు.

"The peasant now, as ever, is the hief source and the creator of both wealth and greatness and of him it may with truth be said he is India."

అన్ని కాలములయందును ఈనాడును రైతే ముఖ్యాధారము. అతడే ఐశ్వర్యమునకు, ఆధిక్యమునకు కారకుడు. యదార్థము వచించాలంటే అతడే భారతదేశము.

కృషీవలుని స్వేదబిందువే ఈశ్వరోద్దిష్టమైన ధనం. (Sweat is divine currency) ఇదే అర్థశాస్త్రానికి మకుట ప్రాయమైన సూత్రమని ఆదిమ అర్థశాస్త్ర వేత్తగు ఆడంస్మిత్ అన్నాడు.

ఈసత్యాన్నే, "నహిదాన్య సమానార్థనః" ధాన్యం తోసమానమైన ధనము లేదని ఏనాడో అన్నాడు మనభారతీయ ఆచార్యుడొకడు.

ఇటుల వివిధ ప్రముఖులచే ప్రస్తుతింపబడిన కర్షకులకు సంఘంలో స్థానములేదు. సాహిత్యంలో చోటులేదు. ప్రభుత్వంలో పలుకుబడిలేదు. అతనినిగురించి మొసలికన్నీరు కార్చు

వారు లేకపోలేదు. కాని యథార్థముగా కర్షకాభివృద్ధికై పాటుబడువారు, పరితపించువారు ఎందరున్నారు ?

మన వస్త్రపరిశ్రమ, పంచదార పరిశ్రమ రక్షణపద్ధతి మీద సాగుతున్నది. మన వ్యవసాయమో, రక్షణపద్ధతి లేక పోగా దోపిడీకి గురవుతున్నది. హిందూదేశ క్షామానికి కారణమిదే. డేనియల్ హేమిల్టన్‌గారిట్లా అన్నారు.

"ఎక్కువ పంటనంతను త్వరితముగ దేశమునుండి తీసుకొని పోగల రైల్వేలను దేశీయులకిచ్చితిమి. కాని ఉత్పత్తి నెక్కువ చేయుటకు ఉపకరించు బ్యాంకింగు పద్ధతి మనము వారికి యివ్వలేదు. పంటలు ప్రపంచమందన్ని ప్రాంతాలవారు తీసుకొని పోవుచున్నారు వర్తకుడు వ్యాపారస్థుడు పైకమును తీసుకొనిపోవుచున్నారు. ప్రజలను పిశాచములు తీసుకొని పోవుచున్నవి."

ఇది యథార్థ స్థితి. భారతదేశములో రైతాంగం అమాయికమైనది. అవిద్యావంతమైనది. కనుక దానిని దోచుకొనే వారు చాలామంది ఉన్నారు.

నేటి నాగరికత దేశాలగు గ్రేట్ బ్రిటన్, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా దేశాల్లో, రైతులకు అల్పవడ్డీలతో ఋణ సౌకర్యాలు, వారి పంటదినుసులు అమ్మటానికి సరైన ధరలు కలిగిస్తునారు.

మన ప్రభుత్వం ఏం కలిగిస్తున్నది ?

మన శాంతి రామమూర్తి గారిలా అంటున్నారు.

"మన దేశపు వ్యవసాయములో మన్నికన్న మనిషే ఎక్కువన్న సంగతి గమనించాలి. రైతుకు ఎక్కువ విజ్ఞానం

లిగించి అతని లోపం తీర్చే పూచీపడితే అధికోత్పత్తి చేయగలడు. ఏమాదిరి అభివృద్ధికైనా వ్యవసాయమే పునాది కావాలి. కృషిక కృషీవలునికి లాభించనిది దేశానికి ఏమీ లాభము లేదు.”

కోపెన్ హేగన్‌లో ప్రపంచ ఆహార సంఘానికి భారత ప్రతినిధిగా వెళ్ళిన జనాబ్ ఖాన్ అబ్దుల్ గనీ సాహెబ్‌గారు కేంద్ర శాసనసభలో అధికోత్పత్తి కార్యక్రమాన్ని విమర్శిస్తూ ఇలా అన్నారు.

“వేలకొలది ప్రణాళికలు తయారైనా, పిడికెడు ధాన్యము ఉత్పత్తి చెయ్యలేవు. నది ఒడ్డున కూర్చుండి రాగాలాపన చేస్తే చేపలు చేచిక్కుతాయా? ఉద్యోగుల బల్లల మీద కాగితపు ఫైళ్ళు, ప్లానులు, ఇంగ్లీషు వార్తా పత్రికలలో అధికాహారోత్పత్తి చేయండనే ప్రకటనలతో ఆహారోత్పత్తి గావించే ఉంటే ఈ పాటికి మనం ప్రపంచమంతటికీ అధికాహారాన్ని ఎగుమతిచేసే వారిలో ప్రథములమై ఉండేవారం.

దురదృష్టవశాత్తు బంగాళా దుంపలు ఉద్యోగుల కాగితపు కట్టలలో పైరు గావు.

ప్రభుత్వోద్యోగులు, విద్యాధికులు గమనించవలసినదేమిటంటే, పంటలు పండించేవి ఇవేవికావు. భారత దేశపు భూములుగావు. భూమిని దున్నే వ్యవసాయదారుడు. అతని మాట అందరూ మర్చిపోయారు. పండించి ప్రపంచాన్ని పోషించి అర్ధాకలితో అసువులు ఈడ్చుకొస్తూ ఉంటే అతని సంగతి ఎవరికీ అక్కర లేకుండా వుంది. నీ అజ్ఞానంలో నీ దారిద్ర్యంలో నీ రోగాల్లో నీవు మునిగి తేలుతుండమని అంతా అశ్రద్ధ చేస్తున్నారు.

దీనిఫలితం అంతా అనుభవించేది గ్రామమే. దేశమంతా గ్రామం. మీ కందరకూ ఆ కర్షకుడు ఇప్పుడైనా జ్ఞాపకము వచ్చినందుకు ఆనందిస్తున్నాను. అతడే మన ముఖ్య సమస్య. అతని సర్వతోముఖ అభ్యుదయములో అన్ని సమస్యలు పరిష్కారమయి పోగలవు."

ఈ దృక్పథంతో నే మన రైతుపెద్ద అనేక రైతు సభల లోను, ఆహారసభలోను ఫుడ్‌కమిటి మంత్రుల మంతనాల లోను, చెప్పినది.

మన వ్యవసాయమంత్రి తిమ్మారెడ్డిగారి దృక్పథము కర్షక దృక్పథమే. ఆయన అనేక ఆపదసమయాల్లో రైతుకు అండగా నిలచి రాష్ట్రప్రభుత్వముతోనూ, కేంద్రప్రభుత్వముతోనూ పోరాడారు.

వ్యవసాయమంత్రి, మన రైతుపెద్ద కలసి మెలసి కర్షక దృష్టిని పెంపొందింపచేసి రైతు కడగండ్లను బాప ప్రయత్నింతురుగాక.



## మంత్రిత్వమెందుకు?

సేవా త్యాగాలవల్ల కాంగ్రెసులో పొందవలసిన పదవులన్నీ బ్రహ్మయ్యగారు పొందారు. పదవి కొందరికి అలంకారమైతే ఆయన పదవికే అలంకార మయ్యాడు. అవి పదవులని భావించక సేవచేయుటకు అవకాశములను కలిగించిన మార్గములని భావించి తదనుగుణ్యముగ ప్రవర్తించి, ఆపదవులకు గౌరవం కలిగించిరి.

కారణాంతరముల ఆయన శాసనసభ్యుడు కాకపోయినా ఆయన ప్రజా ప్రతినిధే. ప్రజల హృదయసీమల గౌరవం గాంచియే ఉన్నాడు. పదవి లేనందున గౌరవం లేదా?

"పదవి పదవి యనుచు పలవరించు నరుడు
ప్రజలదృష్టి నెంతో పలుచబడును;
కూర్చగలవు కీర్తికోరని పదవులే
వాస్తవమ్ము నార్యవారి మాట!"

పదవికై ప్రాకులాడువారు పదు పాట్లు ప్రజలెరిగినదే. ఆ పదవిని ప్రజాశ్రేయస్సుకై ఉపయోగించువారే ప్రజలచే కీర్తింపబడతారు. పదవి వస్తుంది, పోతుంది. ప్రయోజనమేమిటి? బ్రహ్మయ్యగారు పదవికై ప్రాకులాడనూలేదు. పదవిని నిరాకరించనూలేదు. అది ఆయన ఆదర్శం.

అందుచేతనే ఆయన పదవిలో ఉన్నా, లేకపోయినా ప్రభుత్వోద్యోగులు, మంత్రులు, ఆయన మాటను మన్నించారు.

మద్రాసు మంత్రివర్గంగాని, ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం గాని, ఆయనమాట మన్నించకుండా ఉండలేదు.

ఆయన కాంగ్రెసులో తన పలుకుబడిని ప్రజోపయోగముకొరకును, పరహితము కొరకును ఉపయోగించెను. అందుచేతనే ఏమంత్రి అయినా ఆయన నిజాయితీని గుర్తించి ఆయనమాట మన్నించారు.

ఆయన ఆంధ్ర రాజకీయాల్లో ఏగ్రూపుకు చెందనివాడగుటచేత అందరు మంత్రులకు ఆయన మిత్రుడే. అందుచేత

"మంత్రిచేయలేని తంత్రమ్మునైనను
మాటలోనే చేయు మంత్రి సఖుడు;
మంత్రి మిత్రుడైన మంత్రిత్వ మేలరా?
వాస్తవమ్ము నార్ల వారి మాట"

## గ్రామోద్యోగుల విచారణ సంఘ సభ్యత్వం

గ్రామోద్యోగులు ప్రాచీనకాలమున ఇటు రైతాంగానికి అటు ప్రభుత్వానికి మధ్యస్థులుగావుండి మర్యాద మన్నలను పొందుతూ ఉభయులవల్ల పారితోషికమును పొందుతూ వుండేవారు.

బ్రిటిషు ప్రభుత్వములో వారు ప్రభుత్వోద్యోగులు అయిరి. రైతుక్షేమం వారు విచారించ పనిలేకపోయింది. ప్రభుత్వానికే దాసులైరి. ప్రభుత్వోద్యోగీయులలో వారికి అధికంగా వున్నది వారసత్వ మొక్కటే.

వారికి పనిపాటలు ఎక్కువైనవి. గౌరవ మర్యాదలు తక్కువైనవి. జీతాభత్యాలు చాలీ చాలనివిగా వున్నవి.

వారు సంస్థల నేర్పాటు చేసుకున్నారు. ఆంధ్ర దేశానికంతకుకూడా గ్రామాధికారుల సంస్థ యేర్పడినది. ఆ సంస్థ ద్వారా తమ కష్టనష్టాలు ఎరుకపరుచుకున్నారు. కాని ఫలించ లేదు. అంతటవారు జమాబందీలకు వెళ్ళ నిరాకరించారు. కొందరు రాజీ నామాలిచ్చారు. ఆంధ్రరాష్ట్రమంతటా ఆందోళన తీవ్రమైనది.

రివిన్యూమంత్రి వెంకట్రావుగారు పరిపాలన ప్రతిష్టంభన ఏర్పడకుండా రాజకీయ చతురత ఉపయోగించి 1957-7-25 న ఒక కమిటీని యేర్పాటుచేసి ఆందోళనను అరికట్టారు.

1 రెవిన్యూబోర్డు సభ్యుడు 1 శ్రీ కె. ఎన్. అనంతరామన్ అధ్యక్షుడు, 2 శ్రీ గొట్టిపాటిబ్రహ్మయ్య, 3 శ్రీకల్లూరి సుబ్బారావు, యం. యల్. ఎ, 4 శ్రీ లుకలాపు లక్ష్మణదాసు, యం. యల్. ఎ., 5. శ్రీ వై. తిరుపతిరెడ్డి, గ్రామాధికారులసంఘాధ్యక్షుడు. 6 శ్రీ పి. లక్ష్మీనారాయణమూర్తి, కరణాల సంఘాధ్యక్షుడు. 7 శ్రీ వెంకటరత్నం, రెవిన్యూబోర్డు అసిస్టెంటు సెక్రటరి. ఈసంఘు కార్యదర్శి.

ఈ దర్యాప్తుసంఘం రెండునెలలలో తననివేదికను ప్రభుత్వానికి సమర్పించవలసినదిగా కోరబడింది.

ఈ సంఘంలో మన రైతుపెద్దను నియమించటంలో, రైతు దృక్పథం, రైతు సమస్యలు, విలేజి ఆఫీసర్ల కష్టసుఖాలు తెలుసునని, అనుభవజ్ఞుడని, సామరస్యంగా పోగలడని.

బ్రహ్మయ్యగారు ఈ నియమామకం తెలిసిన పిమ్మట, ఈ ప్రాంతానగల కరణము మునసబులను పిలిపించి, వారి యొక్కొంట్సును, వారి కష్టనష్టాలను, అవసరాలను అనుభవం చేసుకొని కమిటీ చర్చలలో ప్రముఖపాత్ర వహించారు.

గ్రామస్థుడగుటచేత, వారి కష్టనష్టాలు అధికంగా తెలిసిన వాడగుటచేత, అందుబాటులో వుండుటచేత, తమ అవసరాలను తేటతెల్లంగా తెలుపుకొన్నందున, నివారణకాగలవని వారున్నూ తలచారు.

ఈకమిటీ విచారణచేసి, రైతులమీద ప్రత్యేకపన్నులు లేకుండా, గ్రామోద్యోగుల గౌరవ మర్యాదలను పెంచుతూ, ఆర్థిక సహాయం కొంత చేస్తూ, పరోక్షసహాయానికి అధిక అవకాశం కలిగించారు.

రైతులకు గ్రామోద్యోగులకు సమరసభావము కలుగుటకు పాస్‌బుక్కు ఒకటి యేర్పాటు చేశారు. ఈపుస్తకంలో రైతుపేరు, అతనిభూమి, సర్వేనెంబరు, విస్తీర్ణము, శిస్తు, తీరువ, సెస్సు వగైరాలు నమోదు చేయాలి. ఈపుస్తకం రైతు దగ్గర వుంటుంది. రైతుకు తన భూమి పరిమాణము శిస్తు తెలిసి వుంటుంది.

ఈవిధంగా ఈకమిటి, రిపోర్టును పంపి, ప్రభుత్వానికి, ఉద్యోగులకు, రైతులకు సామరస్యం కలిగించి రెవిన్యూమంత్రి ఆశయాన్ని నెరవేర్చింది.

## అడ్ హాక్ కమిటీ అధ్యక్షత

కృష్ణాజిల్లాలో కాంగ్రెసు సంఘాలు తూర్పు పశ్చిమ జిల్లాలుగా విభజింపబడినవి. ఈ రెండు సంఘాలను కలిపి ఏక సంఘంగా ఏర్పాటుచేయుటకు మన రైతు పెద్ద మరికొందరు చేశారు.

ఈనాడు అఖిలభారత కాంగ్రెసుసంఘం జిల్లాకు ఒకే కాంగ్రెసుసంఘం ఉండాలని తీర్మానించుటచేత, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుసంఘం ఈ రెండు సంఘాలను రద్దుచేసి అడ్ హాక్ కమిటీని ఏర్పాటు చేసింది.

ఈ కమిటీలో ఉభయ ప్రాంతాలవారిలో అందరికీ అనుకూలం కలిగించాలనే ఆలోచనతో కార్యనిర్వాహక సభ్యుల నియామకం జరిగింది.

ఉభయజిల్లాల దృష్టిని ఆకర్షించగల పెద్ద ఎవరా అని ఆలోచించి, ఈ కమిటీకి అధ్యక్షునిగా శ్రీ బ్రహ్మయ్యగారిని ఏర్పాటు చేశారు. కార్యదర్శిగా చెన్నుపాటి రామకోటయ్య గారిని నియమించారు.

బ్రహ్మయ్యగారు వివిధప్రదేశాలు తిరిగి ప్రబోధం గావించి, తాలూకా మండల పట్టణకాంగ్రెసు సంఘాల నిర్మాణం గావించారు.

మండలకాంగ్రెసు సంఘాధ్యక్షుడు, కార్యదర్శుల, కార్యకర్తల సమావేశంజరిపి, కాంగ్రెసును పటిష్టం చేయ ప్రబోధించారు. కాంగ్రెసును పటిష్టం చేయుటకు సర్వవిధాల ప్రయత్నిస్తున్నారు.

# వ్యాసరచన

మనరాజకీయ నాయకులకు, రచయితలకు సన్నిహిత సంబంధం ఏర్పడలేదు. అది దేశానికి ఒక కొరతే.

కొన్ని ప్రాంతాల్లో రాజకీయ నాయకులు రచయితలుగా, కవులుగాకూడా ఖ్యాతిగాంచారు.

మన ప్రధాని గొప్ప అంతర్జాతీయ నాయకుడే గాదు, అంతర్జాతీయంగా ఖ్యాతిగాంచిన గొప్ప రచయిత, కవి.

మన ఆంధ్రులలో కొందరు లేకపోలేదు. పట్టాభి సీతా రామయ్యగారు, బూర్గుల రామకృష్ణరావు, ఆచార్య రంగా, తెన్నేటి విశ్వనాథం, గోపాలరెడ్డి ప్రభృతులు.

మన రైతుపెద్దకు సాహిత్యమునందు అభిరుచి, కవుల యందు ఆదరాభిమానాలు అధికం.

ఆయన కుమారుని వివాహ సందర్భంలో కవులను సత్కరించటంకూడ జరిగింది.

అభినవ తిక్కన, తుమ్మల సీతారామమూర్తిగారి కుమారుని వివాహ సందర్భమున కవి పండితుల ఆశీర్వచన సందర్భంలో అధ్యక్షత వహించి, వారందరి మెప్పును చూరగొన్నాడు.

ఇంగ్లీషు నేర్చినవారికి హిందూ పత్రిక చదవంది తృప్తి ఉండదు.

అట్లాగే బ్రహ్మయ్యగారికి కృష్ణాపత్రిక పఠించకపోతే సంతృప్తి వుండదు.

కృష్ణాపత్రికే కృష్ణారావుగారు. ఆయన లేఖిని ఆంధ్ర దేశంలో ఎంతో చైతన్యం కలిగించింది.

ఆ పత్రిక పఠించుటచేత ఆయనకు చక్కని భాష అలవడింది. ఆయన గ్రంథాలేమీ వ్రాయలేదుకాని అనేక వ్యాసములు రచించాడు.

ఆ వ్యాసములలో కృష్ణారావుగారి రచనా ప్రౌఢిమ ఛాయలు చెన్నారును.

వ్యాసరచనలో ఎత్తుగడ, పెంపు ముగింపు ముచ్చటగా ఉండుటేగాక, విషయవైశద్యము, పూర్వాపర సందర్భాలతో రసౌచిత్యముగ రాణించును.

ఆయన వ్యాసాలలో కొన్నిటిని పరిచయం చేసెద.

ప్రధాని నెహ్రూ నియంతా ?

ఇది 2-4-1951 'కాంగ్రెసు'పత్రికలో ప్రచురింపబడింది

మహాఋషి టాండన్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్నప్పుడు నెహ్రూకు ఆయనకు అభిప్రాయభేదంరాగా నెహ్రూను నియంతగా కొందరు చిత్రించుట జరిగింది.

అప్పటి నెహ్రూచర్య సమర్థనీయమేనని 1907 కాంగ్రెసు ఘట్టమునుండి మహాత్ముని సారథ్యమువరకు జరిగిన విషమఘట్టాలను పేర్కొని, ఆ సందర్భములలో అప్పటి నాయకులు వర్తించిన విధముననే నెహ్రూ వర్తించిరని పేర్కొంటూ కాంగ్రెసు చరిత్రకారుడైన గురువుకు తగిన శిష్యునివలె ఈ వ్యాస రచన చేసిరి.

వ్యాస ప్రారంభమెంత ఉదాత్తముగ ఉన్నదో పరికించండి.

"కాంగ్రెసు అధ్యక్షులు, మహాఋషి టాండన్, ప్రధానమంత్రి నెహ్రూలకు గల అభిప్రాయభేదాలను పురస్కరించుకుని పలువురు పలువిధముల ఉభయులను నిందించుట, ఒకరిని పెంకె, తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళు అనువాడని, మరొకరిని నియంత అని విమర్శించుటవరకు వచ్చినది. త్యాగమూర్తులగు వారిరువురును కాంగ్రెసు గౌరవాదులను నిలబెట్టె

కాంగ్రెసు బలవత్తర సంస్థయని మరొకతూరి నిరూపింతురని ఆశించుచున్నాను."

నెహ్రూ నియంత కాదని చెప్పబోవుచు ఆయన ప్రత్యర్థి టాండనను ఋషి అనుట గమనించతగినది.

నిజముగా ఆయన మహర్షి. ఆయన కాంగ్రెసు గద్దెను పరోచితముగ త్యజించి, తన గౌరవాన్ని, దేశ గౌరవాన్ని నిలబెట్టుట ప్రశంసింపతగింది.

ఇక నెహ్రూ నియంతా? అను దానికి సమాధానం.

"కాంగ్రెసు అధ్యక్షు లెవరైనను కాంగ్రెసు అధినేత ఒకరుండుట చిరకాలమునుండి వచ్చుచున్నదియే. ఈ అధినేతలను ఎవరును ఏకాలముసను, నిరంకుశ నియంతలుగ వర్ణించుట జరుగలేదు. అసంఖ్యాకులగు కాంగ్రెసువాదులకు సచివుడుగ సరియైన నిర్ణయములను చేయుటకు ప్రోత్సహించుట, తీర్మానములను చేయించుట, జాతినంతను ఒక త్రాటిపై నడుపుట యీ నాయకుని విధియైయున్నది. సర్ ఫిరోజిషా మెహతా, బాలగంగాధరతిలక్, మహాత్మాగాంధీలు నాడు ప్రజల ప్రేమను చూరగొన్న నాయకులు. ఆసేతు హిమాచలము దేశప్రజల ధర్మకర్తలుగ కాంగ్రెసు అధ్యక్షు లెవరైనను కాంగ్రెసునౌకను విజయయాత్ర చేయించిన ధీరనాయకులు వీరు. వీరి నెవరను నియంతలుగ నిరసించలేదు."

ఈమాదిరిగా సోదాహరణముగా కాంగ్రెసు విషమ ఘట్టాల్లో వారెట్లా వర్తించారో మన ప్రధాని నెహ్రూ అట్లాగే వర్తించాడని వ్రాశారు.

ఇటువంటి విషయసమయాల్లో వ్యాసరచన ద్వారా ఆయన పాఠకుల హృదయాలను దేశ ఐక్యతకోరకు త్రిప్ప ప్రయత్నించుట గమనింప తగినది.

ఆంధ్ర దేశంలో కాంగ్రెసు పరాజయ కారణాలు

ఇది 1952 ఎన్నిక లనంతరం ఆంధ్రప్రభకు వ్రాసిన వ్యాసం.

ఎన్నికలలో కాంగ్రెసు ఓటమికి కారణా లేమిటో చెప్పి దానికి పరిహారమార్గాలు చూపెట్టారు.

ఆత్మవిమర్శ చేసుకొనని వ్యక్తిగాని, సంఘంగాని అభి వృద్ధి గాంచదు.

కాంగ్రెసు ప్రతిపక్షులు ఓటర్లను సమీపించి, తమకు ఓట్లు పడేటట్టుగా చెప్పారని, కాంగ్రెసు అభ్యర్థుల తరఫున కాంగ్రెసు సంస్థ సరిగా ప్రచారం చేయలేదని చెప్పూమా "ప్రత్యర్థుల బలంకంటే కాంగ్రెసువాదులలోగల అనైక్యత మిత్రద్రోహం ఈర్ష్యద్వేషాలు హెచ్చుగా తోడ్పడినవి. వీటినన్నిటిని వుపయోగించుకొనగల తెలివితేటలను ప్రత్యర్థులు ప్రదర్శించారు..."

మొన్న ఎలెక్షను అనంతరం జరిగిన బైఎలక్షనులోను కొన్నిలు ఎన్నికలలోను మన కాంగ్రెసువారు ఈధోరణినే నడిచారు.

గ్రూపు పద్ధతి, తమను పెట్టని పక్షమున పరోక్షం గానో ప్రత్యక్షంగానో కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రచారం చేయటంపోతేగాని కాంగ్రెసు బలపడదు.

లోగడ రాజులు ఇట్లాగే తమలో తాము పోరాడి పరరాజ్యపాలనకు కారకులయ్యారు.

మళ్ళీ ఆ ధోరణేనా?

ఇంకా మరికొన్ని కారణాలలో పోలీసువారి దమననీతి, గ్రామరక్షణకుగాను ప్రజలను నియోగించి రక్షణదళాలనేర్పరచిన సందర్భంలో పోలీసులజులుము ఆత్మగౌరవముగల ప్రజలపట్ల వారి వైఖరి ప్రజలకు విముఖత్వం కలిగించి, కాంగ్రెసు అభ్యర్థులను ఓడించడం తమ విధిగా భావించారని, అగ్నికి వాయువు తోడైనట్లు అసమర్థమైన దేశసంగు నిర్వాహణ, ప్రొక్యూర్మెంటుఆఫీసర్ల నిరంకుశత్వం ఏకమైనవన్నారు. వోటర్లు యెవ్వడు తమకు మేలు చేస్తారని వోట్లు వెయ్యరు. తమకు ఏ పక్షం అన్యాయం చేసిందని, చేస్తూందని తలుస్తారో తలచి దానికి వ్యతిరేకమైన పక్షానికి వోటుచేస్తారు. లోగడ యెన్నికల్లో కాంగ్రెసు వ్యతిరేకత ఈదఫా కమ్యూనిస్టు వ్యతిరేకత కనపరచారు. దీనికి మరికొంతబలం ఈదఫా కాంగ్రెసు ఐక్యత.

వైద్యుడు రోగ నిదానంచేసి వూరుకుంటే ఏమిలాభం చికిత్సా పద్ధతికూడా చెప్పవలె.

ఆ విధంగానే ముందు జయంపొందే మార్గాలను ఇట్లా చెప్పారు.

"ఈ వోటమి అనుభవాలను గురించియైన కాంగ్రెసు వాదులెల్లరు తమ స్థితిగతులను గూర్చి సింహావలోకన మొనర్చుకొని, కిసాన్ మజ్దూర్ పార్టీకి చెందినవారు, కృషికార్ లోక్ పార్టీకి చెందినవారు, అందరూ ఒకగూటిలోని పక్షులమనే సంగతి గుర్తుకు తెచ్చుకోవాలి. తడసిన తరువాతనైనా గుడిసె

కట్టుకునే పద్ధతి ననుసరించి; దేశ భవిష్యత్తుకొరకు కాంగ్రెసు సంస్థను సుసంఘటిత మొనర్చుకోవాలి. ఇందుకు ప్రతివారు త్యాగమొనర్చుటలో ముందుకు రావాలి."

మన రైతుపెద్ద చెప్పిన చావ్వవనే గత ఎన్నికల్లో సమైక్యతగా కృషి చేసినందువల్ల జయం పొందగలిగాం.

'United we stand divided we fall'.

సమైక్యత విజయానికి, విడిపోవటం మన అపజయానికి కారణం. అన్నమాట కాంగ్రెసువారందరు గ్రహించాలి.

## కూచిపూడి నాట్యం.

ఢిల్లీలో జరిగిన అన్యాయాన్ని సరిదిద్దాలి.

రాజకీయాల్లోనేగాక మన కళాసంస్కృతులపట్ల కూడ ఆయన శ్రద్ధచూపుట ప్రశంసింపతగినది.

ఆంధ్రుల నాట్యం, కూచిపూడి నాట్యం. అది నేడు కొనవూపిరితో వున్నది. ఈ ప్రాచీన కళను నిలపెట్టుటకు కూచిపూడిలో కళా కేంద్రాన్ని నిర్మాణం చేయుటకు ఆయన తగినవారితో ఆలోచించి తగు ఏర్పాట్లు చేస్తున్నారు.

అటువంటి సమయాన ఢిల్లీ అన్యాయం ఆయనకు వెన్నుపోటుగా తోచినది. అందుకని ఆంధ్ర వారపత్రికలో పై శీర్షికతో 10 9-58 వ్యాసం ప్రకటించారు.

ఆ వ్యాసం భారతదేశంలోని వివిధ నాట్య వైవిధ్య వైశద్యము, కళాభిరుచి కనపరుస్తుంది.

"నాట్యశాస్త్ర అధ్యయనం, అభ్యాసం, మతవిధిగా భావించి, నిత్యానుష్ఠానమును, శిష్ట సంప్రదాయముగ నిర్వ

హించుచున్న భారతదేశమున కూచిపూడి ఒకటియే అనుట సత్యము. ఈ గ్రామము 'భాగవతుల కూచిపూడి' అని ప్రసిద్ధినొందినది. ప్రతి బ్రాహ్మణుడు ఉపనయనమురోజున కాళ్ళకు గజ్జెలుకట్టి లయ్యలయుగా బద్ధముగవుపదేశికునకు ఆచార్యుని కనుసన్నల సంగీతసాహిత్యవిద్వాంసులఆశీర్వచనములతో శ్రీ రామలింగేశ్వరస్వామి ఆలయమున స్వామివారిని విద్యాభిక్ష నర్థించి, ఈ భరతనాట్య అభ్యాసమునకు జీవితమంకితము జేయుట జరుగుచున్నది. ఇట్టి ఆచారమెచ్చటనైన గలదా ? ఆంధ్ర దేశమున ఒక్క భాగవతుల కూచిపూడియందే ఈ ఆచారము గలదు."

ఇటుల కూచిపూడినాట్య సంప్రదాయమును ఉగ్గడించి, పెద్దలు చేసిన పెద్దతప్పు దిద్దుకొనుటకు "ఢిల్లీ అకాడమీవారిని కూచిపూడి సంప్రదాయసిద్ధమైన నాట్యశాస్త్రములు పరిశ్రమ చేయుచున్న పెద్దలను హైదరాబాదులో సమావేశపరచి, ప్రదర్శనలు, చర్చలు సాగించి ఆంధ్ర కళాలక్ష్మి భవిష్యత్తుకు రూపురేఖలు దిద్దవలసినదిగా రాష్ట్ర అకాడమీ పెద్దలను ముఖ్యముగా అధ్యక్షులు, కళారాధకులు ఆర్. బి. రామకృష్ణ రాజుగారిని ప్రార్థించుచున్నాను. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఇందులకు తగినచర్య తీసుకొనవలసినదిగా అర్థించుచున్నాను." అనిరి.

మనవారనేతలు ఢిల్లీచర్యకు ఆగ్రహ ఆవేశాలను వెలిబుచ్చారేగాని, ఇటువంటి సముచిత సూచనను చూపలేదు.

నవంబరు ఆఖరువారంలో ఇటువంటి ఏర్పాట్లు జరుగనున్నట్లు పత్రికలో ప్రకటితమగుట ఆనందించతగిన విషయం.

త్యాగమూర్తి ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు.

పంతులుగారు అవసానదశలో వున్నారని సందర్శించి, వారి మరణానంతరం పై శీర్షికతో ఆంధ్ర కేసరికి (9-10-58) వ్రాసిరి.

పంతులుగారు మన ఆంధ్ర పెద్దలలో పెద్దలు. వారు ప్రతిదానిలోను ప్రథములు. అందుచేతనే వారెన్నడును పదవి కాంక్షించలేదు.

అరవిందయోగి బంకిం చంద్రుని ద్రష్ట అన్నాడు.

మన ఉన్నవవారు ద్రష్టలే. వారి మాలపల్లిలో కాంగ్రెసువారి విడుదల, మంత్రిపదవీ స్వీకారం, స్వరాజ్యం, మొదలగు జరగబోవు సంగతులెన్నో చెప్పిరి. ఆ ధోరణిని రచన మరొకరు ఎవరు గావించారు? ఆయన్ని మన రైతుపెద్ద ఇట్లా చిత్రిస్తారు.

"ఆయన జీవితాన్ని సింహావలోకన చేస్తే కర్మను అనుష్ఠించుట ఆయన కర్తవ్యముగను, కర్మఫలమును త్యాగం చేయుట ఆయన విధిగను భావించినట్లు కనబడుతుంది."

"స్వరాజ్య సిద్ధికి, స్వరాష్ట్ర నిర్మాణానికి సంఘాన్ని సంస్కరించడానికి మాతృభాషకు మెరుగు దిద్దటానికి ఆయన చేసినత్యాగం, పడిన కష్టాలు అపారం. జీవితాంతంవరకు శివాలయ పూజారిగనే గడిపారు."

ఇటుల వారి దేశసేవను ప్రశంసించుటతో ఆగలేదు ఈ క్రింది సూచనను ఇస్తున్నారు.

వారి జీవితకాలములో వారిని సత్కరించి ఋణమును దీర్చుకొనుట జరుగలేదు. వారి అమూల్య అముద్రిత రచనలు ముద్రితమగుటకు ఒకనిధిని ఏర్పరుప హెచ్చరించారు.

ఇదెంతయు సముచితమైన సలహా.

రైతు దృక్పథం, రాజనీతిజ్ఞత మూర్తీభవించిన నాయకుడు.

ఈ వ్యాసం మన ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారి 46 వ జన్మదినోత్సవ సందర్భమున రచించినది. ఆ సంజీవి సన్మాన సంచికలో ఈ వ్యాసం మకుటాయమైనదని పలువురు ప్రశంసించారు.

ఇందులో ఒక్క సంజీవరెడ్డిగారి ప్రశంసేగాక మన ఆంధ్ర నాయకులను ప్రముఖులను సందర్భోచితముగ ప్రశంసించుట పరిగణించతగిన విషయము.

ఇట్లా ప్రారంభించారు.

"1926 వ సంవత్సరం కాంగ్రెసు ఆమోదముతో స్వరాజ్యపార్టీ నడిపి శాసనసభల ఎన్నికల సంరంభం ఆంధ్ర దేశమున దిగ్విజయ మందుటకు ముఖ్యకారకులు శ్రీ ప్రకాశం సాంబమూర్తిగార్లు. త్యాగమూర్తి ప్రకాశం కిరీటంలేని రాజు ఆంధ్రులకు. ఆయనకుతగినమంత్రి, సేనాని సాంబమూర్తిగారు. 1947వరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుఅధ్యక్షు కార్యదర్శులెవరైనా ఆంధ్ర నాయకులు ప్రకాశంగారే."

ప్రకాశం ఆంధ్రదేశానికిప్రకాశం. ఆంధ్రకేసరి ఆంధ్రుల సమగ్ర స్వరూపం. అందుచేతనే ఆయనవలె ఆంధ్రుల ఆదరాభిమానాలుచూరగొన్న నాయకుడు, నభూతోనభ విష్యతి.

ఆ భీష్మాచార్యులను ఆదరించి, అభిమానించి, అర్చించి, ఆయన కీర్తిని నిలపెట్ట తలచినవారిలో సంజీవరెడ్డిగారు స్మరణీయులు.

మంత్రిపదవిని వీడి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షత్వాన్ని స్వీకరించటంలో రెడ్డిగారి త్యాగనిరతిని, టాండన్ నెహ్రూ వివాదంలో, మన ప్రధాని పక్షాన నిలబడి దక్షిణభారతమున కంతకును విషమ సమయమున పథ ప్రదర్శనము చేసిన ఆయన సముచితనిర్ణయాన్ని; ఆంధ్రరాష్ట్ర సంపాదనలో, ఆంధ్రకేసరి ఆధ్వర్యమున పరిపాలన సాగించుటకు ఆయన ప్రదర్శించిన దూర దృష్టిని ప్రశంసించారు మన రైతుపెద్ద.

"ప్రభుత్వాధినేతగా ప్రకాశంగారిని, రాష్ట్ర సంఘాధ్యక్షులుగా గోపాలరెడ్డిగారిని పెట్టుకొని యీ యిద్దరి పెద్దల సహాయ సంపత్తితో కాంగ్రెసు యిరుశాఖలను సజీవమొనర్చుకొనుటలో ప్రధానపాత్రను సంజీవరెడ్డిగారు వహించారు."

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ నిర్మాణంలోను, విశాలాంధ్ర నిర్మాణంలోను, కృష్ణా బ్యారేజి మొదలగు నిర్మాణములలోను ఆయన చూపిన చాకచక్యాన్ని చెప్పక చెప్పుచున్నది ఈ వ్యాసము.

మనలో చాలామంది ఒకరిని ప్రశంసింప తలచినప్పుడు ఇతరులను హీనపరచ ప్రయత్నిస్తారు. అటువంటి దోషం లేకుండా ఈ వ్యాసం సర్వజనామోదముగా ప్రశంసార్హమైనది.

వ్యాసరచనలో స్వీయానుభవమును, సమయజ్ఞతను, గాంభీర్యమును, నిశిత దృక్పథమును చూపుచు సరసతను ప్రకటించిరి.

# కౌన్సిలు సభ్యత్వం

ఆంధ్రులు 40 సం॥లకు పైగా సాగించిన ఆంధ్రోద్యమ ఫలితంగా 1-10-1953 న ఆంధ్రరాష్ట్రమేర్పడినది.

ఆంధ్రరాష్ట్రానికి ఎగువ సభ అవసరమా అనవసరమా అనే చర్చ అప్పట్లో సాగినది.

నైజాం పరిపాలనక్రింద వున్న జిల్లాలు పోలీసు చర్య తరువాత భాషాప్రయుక్తముగా విడగొట్టబడినవి. అందుచేత తెలంగాణ ప్రాంతమంతా ఆంధ్రరాష్ట్రములో చేర్చబడి 1956-10-1 ఆంధ్రప్రదేశ్ ఏర్పరుపబడెను.

ఈ ఎగువ శాసనసభకు 90 మంది శాసనసభ్యులు. అందుకుగాను ఎన్నికలు జరుపవలసి వచ్చినది.

ఇందులో 78 స్థానములు ఎన్నికద్వారాను, 12 స్థానములు నామినేషను ద్వారాను పూర్తిచేయబడినవి.

ఇందులో 31 మందిని అసెంబ్లీ సభ్యులు ఎన్నుకొనవలసి వున్నది.

పదిమంది శాసనసభ్యులు ఒక కౌన్సిలు సభ్యుని ఎన్నుకొన వలయును.

కృష్ణాజిల్లా రాజకీయాలు చాలా ఒడుదుడుకులతో కూడుకున్నవి. ఇది అధికంగా జమీందార్లకు, ధనికులకు, కుల స్వాములకు నిలయం.

ఈ సంగతి తెలిసి ఉండికూడా కాంగ్రెసు తన అభ్యర్థి ఓటమిని గుర్తించే బ్రహ్మయ్యగారిని నిలబెట్టుతూవచ్చింది. ఈ వృద్ధ కాంగ్రెసు భక్తుని అనుభవం పొందుటకు శాసనసభా

సందర్భములో అవకాశంలేకుండా పోయింది. ఈ సందర్భం గ్రహించే ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు బ్రహ్మయ్యగారిని నిలబెట్టి విజయానికి తోడ్పడ్డారు.

పదిఓట్లు రావలసి ఉండగా ఎవరో మరొక కాంగ్రెసు భక్తుడు ఈయన కిచ్చుటచేత 11 ఓట్లతో జయం గాంచాడు.

కల్లూరి సుబ్బారావుగారు తీరని పనిలో నిమగ్నులై ఉండటంచేత విమానంలో వచ్చి, ఒకపాత కాంగ్రెసు సేవకునకు ఓటు ఇచ్చి ఎం. ఎల్. ఎ. గా నేను చేసిన మంచి పనులలో కెల్లా మంచి పనిచేశాను 'ధన్యోస్మి' అనుకొన్నారు.

ఆయన జయమును విని కాంగ్రెసు సభ్యులేకాక, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, పాత కె. యల్. పి సభ్యులు పార్టీ విభేదాలతో నిమిత్తంలేకుండా వచ్చి అభినందనలు తెల్పారు.

ఈ విజయానికి మన ముఖ్యమంత్రి కారకులని చెప్పిలిని గదా ! 1940 లో బ్రహ్మయ్యగారు శాసన సభ అభ్యర్థిగా అపజయం గాంచిన అనంతరం సంజీవరెడ్డిగారు ఈ విధంగా ఆయనకొక ఉత్తరంవ్రాశారు.

అనంతపురం
20-8-40

అన్నగారూ, నమస్తే.

మనం బంగారు చేతపట్టుకుంటే మట్టిగా మారుతుంది; విధి విపరీతంగా వున్నప్పుడు, రాష్ట్రమంతటా జయభేరి మ్రోగుతున్నప్పుడు, కృష్ణాజిల్లాలోమాత్రమిానోడు ఎందుకో!

చీకటిలో వెలుతురు ఇమిడివున్నటుల, ఈ మీా పరా జయములో ఏదో గొప్ప జయము అణగియుండి యుంటుంది. నిరుత్సాహపడకండి.

అపారమైన మీా సేవ, ఫలరహితము కానేరదు. ఒకటి మాత్రము మరువకండి. "United we stand, divided we fall."

కెలవు.

మిత్రుడు

సంజీవరెడ్డి.

సంజీవరెడ్డిగారు కోరినట్లు ఎన్ని అవాంతరములు వచ్చి నను కాంగ్రెసును అంటిపెట్టుకొనే ఆయన ఉండెను. అది గుర్తించే ఆనాటి తన మాటను ఈనాడు మన ముఖ్యమంత్రి నిలబెట్టుకున్నాడా!

సంజీవరెడ్డిగారి పూనికకు సహాచరులైన కళా వెంకట రావు, అల్లూరి సత్యనారాయణరాజు, గోపాలరెడ్డి, బ్రహ్మా నందరెడ్డి, రంగారెడ్డి, వళ్ళూరాజు ప్రభృతులు ఆమోదానం దాలు తెలిపి ఉండవచ్చును.

కొన్నిలు సర్వత్రా విజయానంతరం పెద్దలు, పిన్నలు, కాంగ్రెసు అధిష్టానవర్గములోనివారు, కళాసంస్కృతీ రంగాల్లో కృషిచేయువారు, అనేకులు అభినందనలు ఆయనకు పంపిరి. అందులో సాధ్యమైనంతవరకు కుదించి గ్రంథవిస్తరభీతిచే వివిధ రంగాల్లో పనిచేయు ప్రముఖుల అభినందనలను పొందుపరచు చున్నాను.

## శ్రీ సంజీవరెడ్డిగారు

శాసనమండలి సభ్యులుగా ఎన్నికయ్యారని తెలిసి చాల సంతోషిస్తున్నాను. నా హృదయపూర్వక అభినందనల నందుకోండి. మీరు శాసనమండలి కెంతో ఉపయోగపడాలని నా ఆకాంక్ష.

## శ్రీ గోపాలరెడ్డిగారు

శాసన సభ్యత్వంకోసం మీరింత దీర్ఘకాలం నిరీక్షించవలసి వచ్చింది. 1957లో మీరు చరిత్రాత్మక పోరాటం జరిపారు. అదంతా ఇప్పుడో పాతకథ.

ఇప్పుడు మీరు శాసన మండలికి వెళ్ళారని తెలిసి సంతోషిస్తున్నాను. పేర్లన్నీ చూస్తూవుంటే మీరు శాసన మండలి సభ్యులందరిలోకీ పెద్దవారని అనిపించింది. మిగతావారంతా యువకులు. శాసనమండలి వ్యవహారాల్లో ఎక్కువ ఆసక్తి చూపండి. వీరందరికీ సరైనదారి చూపండి.

## శ్రీ కొసరాజు సూర్యనారాయణగారు

మనరాష్ట్ర శాసనమండలి సభ్యునిగా ఎన్నికైనందుకు నా హృదయపూర్వక అభినందనలు. మీరు ఈజిల్లాలో తాకలు తీరిన కాంగ్రెసు వాదులు. అయినా ఏ కారణంవల్లనైతే నేమి ఇంతవరకూ మీరు శాసనసభల్లో సముచిత స్థానాన్ని పొందలేక పోయారు. రాష్ట్రంలోని వృద్ధ రాజకీయవేత్తల కోసం ఏర్పడిన శాసన మండలిలో మీరివ్వు డొకస్థానం సంపాదించినందుకు సంతోషం.

మీ చురుకుతనం, అందర్నీ యిట్టే ఆకర్షించగలనేర్పూ, చిరకాల ప్రజాసేవ, వ్యక్తుల విషయాలలో సమస్యల విషయంలో మీకూలంకషపరిజ్ఞానం, ఈఅన్నిలక్షణాలతో మీరు శాసనమండలి కార్యకలాపాలకు ఎంతో తోడ్పడగలరనీ ఆ విధంగా మనదేశ రాజకీయరంగంలో మీరు సముచిత స్థానాన్నలంకరించగలరనీ నా నమ్మకం.

## శ్రీ దామెర్ల వెంకటరావుగారు

శాసన మండలికి ఎన్నికైనందుకు నా హృదయపూర్వ కాభినందనలు. మనం కలుసుకొని చాలాకాలమైంది. మనం మమేకంగా తిరిగిన ఆ రోజులు మరచిపోలేను.

మీ రాజకీయ జీవితాన్ని సదా అభిమానంతో పరికిస్తూనే వున్నాను.

## శ్రీ బి. యస్ మూర్తిగారు

మీరు ఆంధ్ర శాసనమండలి సభ్యులయ్యారని తెలసి చాలా ఆనందిస్తున్నాను. అసలు మీరు 1937లోనే మద్రాసు శాసవసభ్యులు కావలసింది. కాని అలా జరగలేదు. అవును. 20 వళ్ళు గడచిపోయాయి. ఈనాడు ఆంధ్రరాష్ట్రం తనంత తాపిలిచి మీకు శాసనమండలి సభ్యత్వాన్ని సమర్పించింది. మీలాంటి నిస్వార్థ సేవాసక్తుల కిదొక విజయం.

## శ్రీ బి. తిరుమలరావుగారు

మీరు ఆంధ్ర లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఎన్నికయిన సందర్భములో నా హృదయపూర్వకమగు అభినందనములు తెల్పుచున్నాను. చిరమిత్రులలోను, పెద్దలలోను ఒకరగు మీరు శాసనసభలో ప్రవేశించుట మనస్సునకు తృప్తినీ, సంతోషమును కలిగించినదని, వేరే చెప్పనవసరము లేదు.

మాలపల్లి ద్రష్ట, మాననీయుడు కురువృద్ధుడగు ఉన్నవ లక్ష్మీనారాయణగారిట్లా దీవిస్తున్నారు.

భగవంతుడు దేశసేవకు తమకు అవకాశము యిచ్చినందుకు సంతసించుచున్నాను. ఇంకను పెద్ద అవకాశము వచ్చునని కోరితిని. మనచేతిలో లేదుగదా. మీకు భగవానుడు ఎక్కువ సదవకాశము లొసంగునుగాక.

## ఆంధ్రపత్రిక సంపాదకులు

శ్రీ బ్రహ్మయ్యగారికి నమస్కారాలు. ఎంతో కాలవంతో మీ ఎన్నిక నాకు పెద్ద సంతృప్తిని యిచ్చింది. ఈ మాటను ఇది వరలోనే వ్రాయడానికి మీ హైదరాబాదు చిరునామా తెలియక పోవడం ప్రతిబంధకమైనది.

......మున్ముందు మన రాష్ట్ర రాజకీయాల్లో మీరు మరింత - ముఖ్యమైన - కీలకమైన - పాత్రను వహించగలరనే విశ్వసిస్తున్నాను.

మిత్రుడు
నార్ల.

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

తమయొక్క విజ్ఞానమువలనను, భారతీయ సంస్కృతి వలనను, కాన్పులుకు వన్నె తేగలదు.

తమయొక్క ప్రతిభను దేశము గుర్తించి తన్నుతానే గౌరవించుకొన్నది.

అభినవతిక్కన అభినందనలు

మహాశయా!

తమ విజయవార్త పరమానందము కలిగించినది. ఇతోధిక గౌరవము తమ పాలివగుంగాక. నలువదేండ్లనుండి తాము సాధించిన నిస్స్వార్థ నిష్కలంక ప్రజాసేవ నిప్పటికైనను మన పెద్దలు గుర్తించినందుకు సంతసము.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ సంయుక్త కార్యదర్శి

శ్రీ ఉన్నవ గోపాలకృష్ణయ్యగారు

తాము హిందీ ప్రేమీాయులు. హిందీ అభ్యసించిన వారు. హిందీ ప్రచారాభివృద్ధికి తోడ్పడుచున్నవారు. తమకు నా పక్షమున, దక్షిణభారత హిందీ ప్రచారసభ పక్షమున కృతజ్ఞతాభివందనములు.

శ్రీ అన్నె అంజయ్యగారు

కాన్పులు పదవి ఎట్టకేలకు సంపాదించామని వ్రాశారు. నాకు చాలా విచారము కలిగించింది. (సంతోషముమాట అటుంచండి.) మిమ్మల్ని 30 సంవత్సరాలనుంచి ఎరుగుదును.

ఆంధ్ర దేశములోని ప్రధాన రాజకీయఘట్టాలలో మీరు ప్రధాన పాత్రను వహించని ఘట్టమంటూ లేదేమో.

ఏమాత్రం రాజకీయ చైతన్యం లేని ఆనాటి రోజులలో ముఖ్యంగా మన జిల్లాలోని యువకుల నెందరినో మీ త్యాగ ఫలితం ఆకర్షించింది. ఆ విధంగా మీకు తెలియకుండా ఎంత మందిని మీరు ఆకర్షించినారో మీకు తెలియకపోవడంలో ఆశ్చర్యంలేదు. పదవులకై పాకులాడకపోయినా చేతికందినట్లున్న పదవులు, చేజిక్కిన పిట్ట ఎగిరిపోయినట్లు పోయినా మీ ఉత్సాహం కుంటుపడలేదు. మీ శత్రువులుగా రాజకీయ రంగంలో ప్రవేశించి మీ స్థానమును ఆ గౌరవముతో వారా క్రమించినా మీ దేశభక్తి దెబ్బతినలేదు. నిరాశా, నిస్పృహా, మీకు తెలియనే తెలియవని అనునట్లు వ్యవహరించారు. చిన్నలు, పెద్దలు, అయినవారు, కానివారు, ఎన్నిసార్లు మీ అభివృద్ధికి ఆటంకములు కలిగించినా; మీ ధైర్యం— ద్విగుణీ కృతమైనది. గొలతవేసి చూస్తే మీ త్యాగము, మీ అనుభ వము ముందు నేడు మీకులభించిన ఈబాధ్యత ఎంత అల్పమో తెలుస్తుంది. సహజంగా మీరు ఉదారులు. అదేగాదు క్లుప్త జీవులు. అందుచేత ఎంత చిన్న బాధ్యతనయినా మీరు అతి శ్రద్ధతోనూ, బాధ్యతతోనూ, వ్యవహరించగలిగిన దక్షులు. మీకున్న స్థిరత, బహుకొద్దిమందికి కలిగినా కాంగ్రెస్ ఈనాడనుభవిస్తున్న దశమరొక విధంగా ఉండి ఉండును. మీకు ఈనాడు లభించిన ఈ కొత్త బాధ్యతను మీరు సరిగా వినియో గించి మీ గౌరవమును, తద్వారా కాంగ్రెసు గౌరవమును కాపాడగలరను కోవడంలో నాకు ఎలాంటి సందేహం లేదు."

శ్రీ చరుకువాడ వేంకటనరసింహంగారు

ఈ మధ్యనే నీవు M. L. C. గా ఎన్నికైనట్లు చదువగా విని చాలా సంతోషించాను. ఇట్టిస్థానమునకు సర్వవిధముగా సంపూర్ణార్హతగల నీవంటి వానికి ఇంత ఆలస్యముగానైన ఈ అవకాశములభించుట ఒకవిధంగా అదృష్టమేనని సంతసించాలి.

రాష్ట్రకాంగ్రెసు చక్రధారులైన వారి అనుగ్రహ కటాక్ష వీక్షణాలు నేటికైనా, అంతగా ప్రాధేయూక్రియింపు దీనత్వసంప్రార్థనలకు నిన్ను గురిచేయకుండా నీపై ప్రసరింప చేసినందుకు వారిని అభినందిస్తున్నాను...నీవు ఎంతకాలం అచంచల విశ్వాసంతో కాంగ్రెసు గర్భగుడి మూలవిరాట్టునే నమ్ముకొని ఉన్నందుకు గర్భగుడి అర్చకులైన స్థానాచార్యుల అనుగ్రహంకూడా నీమీద కొంతపడక తప్పిందికాదు. ఏదైతే నేమి! నీ అర్హతకు తగినస్థానం ఇంత ఆలశ్యంగానైనా నీకు లభించినందుకు ఎంతో సంతోషిస్తూ నిన్ను అభినందిస్తున్నాను.

# ప్రమాణ స్వీకారం

1958 జులై 5 వ తారీఖున లెజిస్లేటివ్ కౌన్సిలు తాత్కాలిక అధ్యక్షుడుగా రాజభవన్‌లో గవర్నరు శ్రీ భీమ సేన్‌సచార్ గారిఎదుట బ్రహ్మయ్య గారు అధికార ప్రమాణాన్ని స్వీకరించారు.

ఈ ప్రమాణ స్వీకరణోత్సవములో ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు, పార్లమెంటు సభ్యులు మండలి వెంకట కృష్ణారావుగారు, శ్రీ మంతెన వెంకటరాజుగారు ఎం.ఎల్.ఏ. శ్రీ మరుపిళ్ళచిట్టిగారు ఎం.ఎల్.ఎ. గుంటూరుజిల్లాకాంగ్రెసు

అధ్యక్షులు చింపయ్యగారు మరికొందరు మిత్రులు పాల్గొన్నారు.

మన ముఖ్యమంత్రి గవర్నరుగారికి బ్రహ్మయ్యగారిని పరిచయం చేస్తూ బ్రహ్మయ్యగారు 1920 లో కాంగ్రెసులోకి వచ్చారన్నారు.

అంతట గవర్నరుగారు "నేనూ 1920 లో వచ్చిన వాడనే" అన్నారు.

తిరిగి మన ముఖ్యమంత్రి "కాంగ్రెసులో అనేక బాధ్యతకల పదవులు బ్రహ్మయ్యగారు పొందారు. డాక్టరు పట్టాభిగారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి అధ్యక్షుడుగా ఉన్నప్పుడు వీరు ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. అప్పుడు నేను జాయింటు సెక్రటరీని. కృష్ణాజిల్లా ధనవంతులకు జమీందార్లకు పుట్టినిల్లు. వీరిని కాంగ్రెసు అభ్యర్థిగా పోటీగా పెట్టినప్పుడల్లా అపజయమని తెలిసికూడా ఈయనను బలిఇచ్చాం. ఈయనా అందుకు అంగీకరించాడు. అందుచేత వీరిని తాత్కాలిక అధ్యక్షులుగా గౌరవించాలని తలచాను. వీరు పెద్దలు. అన్నివిధాలా అర్హులు."

అంతట గవర్నరుగారు "జాను పెద్దలను ఎట్లా గౌరవించుకోవాలో మీాకు తెలుసు." అన్నారు.

అనంతరం బ్రహ్మయ్యగారు "సంజీవరెడ్డిగారు రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి అధ్యక్షుడుగా ఉన్నప్పుడు నేను ఉపాధ్యక్షునిగా ఉన్నాను." అన్నారు.

ఆమాట వింటూ " That is the sportsman spirit" అన్నారు గవర్నరుగారు.

అనంతరం ముఖ్యమంత్రిగారు లెజిస్లేటివ్ కౌన్సిలు

హాలుకు బ్రహ్మయ్యగారిని తీసుకెళ్ళి, అచ్చట ప్రధానోద్యోగు లకు పరిచయం చేసి, సమావేశపు హాలులో చేయవలసిన ఏర్పాటు వగైరాలను చెయిర్మన్ హోదాతో బ్రహ్మయ్య గారితో పరిశీలింపచేసిన సంజీవరెడ్డిగారి రాజకీయ ధురీణత ప్రశంసింపతగినది.

## తాత్కాలికాధ్యక్షత

ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిలు సమావేశం జూలై 7 వ తారీఖున ఉదయం 9 గంటలకు జరిగెను.

కౌన్సిలు హాలంతా ప్రేక్షకులతో క్రిక్కిరిసిపోయింది.

అంతట బ్రహ్మయ్యగారు ఇటుల ఉపన్యసించారు.

పెద్దలారా, నమస్కారములు. ఆంధ్రప్రదేశ్ చరి త్రలో నేడు సుదినం, సువర్ణాక్షరాలతో లిఖించతగినటువంటి శుభమైనరోజు. ఆంధ్రులు చిరకాలంగా కాంక్షిస్తున్నటువంటి ఈ పెద్దల సభానిర్మాణం నేడు పూర్తిఅయి అమలులోనికి వచ్చినది. సాయంకాలం మన ప్రియతమ నాయకోత్తముడు రాష్ట్రపతి రాజేంద్రబాబుగారిచే ప్రారంభోత్సవం జరుపబడు తుంది. దానికిముందు కార్యక్రమ నిర్వహణకు మనమందరము ఇక్కడ చేరాము. ఈ సభకు నన్ను అధ్యక్షునిగా నియమించిన ప్రభుత్వ అధినేతకు నా కృతజ్ఞతాపూర్వక నమ స్కారములు. "సుజలాం, సుఫలాం, సస్యశ్యామలాం" అనే మంత్రోచ్చాటనతో మన ఆంధ్రసీమను అఖిల భారతావనికి ధాన్యరాసిగా చేయ సంకల్పించిన ప్రభుత్వము, ప్రభుత్వం అధి నేత ఈ కార్యక్రమంలో ముఖ్య భాగస్వాము లైనటువంటి రైతులోకాన్ని గుర్తించాలనే సదుద్దేశముతో రైతులోకం

యెడల వారికిగల సద్భావం, పెద్దరికం చూపడానికి ఇది అదనుగా తీసుకొని ప్రత్యుకతోను, వ్యక్తిరీత్యాను వ్యక్తిత్వం లోను కూడ రైతునగు నన్ను రైతు వర్గానికి రైతులోకానికి ప్రతినిధిగా భావించి ఈగౌరవము నాకృతంగా రైతు లోకానికి యిచ్చారని నేను భావిస్తున్నాను. అందుకుగాను ప్రభుత్వానికి అధినేతకు మరొకసారి నా అభినందనలు తెలుపుతున్నానని మనవి చేయుచున్నాను.

ఇక నేడుజరుగవలసిన కార్యక్రమ నిర్వహణలో మీా అందరి తోడ్పాటు పూర్తిగా యున్నవలసినదని అర్థిస్తూ కార్య క్రమం ప్రారంభిస్తున్నానని మనవి చేయుచున్నాను,

సభ్యులు ప్రమాణాలు స్వీకరించటానికి వరుసక్రమాన్ని ఓంపరరీ చైర్మన్ వివరించారు.

సభ్యులలో మాజీమంత్రులు ముందుగా, ఆ తర్వాత మహిళలు, చివరకు ఇతరసభ్యులు తమపేర్ల అక్షరక్రమముతో ప్రమాణము స్వీకరించాలన్నారు:

ఇట్లా ప్రమాణస్వీకరణ అనంతరం చైర్మన్ ఎన్నిక జరిగింది.

మాడపాటి హనుమంతరావుగారికి ఒకటే మాత్రమే నామినేషన్ వచ్చినందున ఏకగ్రీవముగా ఎన్నికైనట్లు తాత్కా లిక అధ్యక్షులు ప్రకటించారు.

## అం త్యో ప న్యా స ము

ఈ కార్యక్రమంలో నివారిని(అధ్యక్షులను) అభినందించ వలసిన ఘట్టము వచ్చినది. మరు వృద్ధులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారిని అస్సెంబ్లీ స్పీకరుగా ఎన్నుకున్నాము.

ఇప్పుడు ఆంధ్ర పితామహులని ఈ కౌన్సిలు అధ్యక్షునిగా ఎన్నుకున్నాము. ఆంధ్రులు తమ పెద్దలను, విజ్ఞానవేత్తలను, త్యాగధనులను గౌరవించుకొనగలరనే ప్రతిష్ట ఆర్జించుకున్నామని, నేడు మనం ఆత్మతృప్తి, ఆనందం పొందవలసిన సుదినం అనిమనవిచేస్తున్నాను. ఆంధ్రపితామహులు ఈనాటివారుకారు. ఆయన తెలంగాణాలో ప్రథమంగా గ్రంథాలయోద్యమాన్ని చేపట్టి, ఊరూర తిరిగి గ్రంథాలయాలు, పఠన మందిరాలు, మహిళా సంఘాలు, రైతు సంఘాలు, వర్తక సంఘాలు స్థాపించి, అన్ని రంగాలలోకూడ వారు కృషిచేసి, ఆ ప్రజలలో నిద్రాణమైఉన్న ఆంధ్రత్వాన్ని ఏకీభావంలోకి తీసుకువచ్చి, కేంద్రీకరించి దాని శక్తిని ప్రజ్వలింప చేసి ఆంధ్రోద్యమానికి, స్వరాజ్య ఉద్యమానికి అది ఉపయోగపడేటట్లు చేసినటువంటి నిర్మాణ కార్యనిపుణులు వారు. అట్టి ఆంధ్ర పితామహుడు ఆంధ్రకు, తెలంగాణాకు, సేతు నిర్మాత అని నేను అభినందించిన అతిశయోక్తి కాదనుకుంటాను. (హర్షములు) అట్టి వారు ఈ సభకు అధ్యక్షులుగా దొరకటం మన భాగ్యమని తలుస్తున్నాను. వారి ఆధ్వర్యాన అభ్యుదయ సంస్కరణలను అభ్యుదయకరమైన శాసన నిర్మాణమును మనము చేసి మన ప్రభుత్వాన్ని, మన దేశాన్ని పటిష్టమైనదిగా చేసుకొను భాగ్యము ఈ సభకు కలుగుగాక అని నేను కోరుతూ ఆంధ్ర పితామహుని పద్మభూషణుని ఈ స్థానమును స్వీకరించవలసినదిగా కోరుట నా ఆఖరు కార్యక్రమం. వారిని ఈ స్థానమునకు తీసుకురావలసినదిగా ముఖ్యమంత్రిగారిని సభా నాయకుని, ప్రతిపక్షనాయకుని ప్రార్థిస్తున్నాను (హర్షము)

# కౌన్సిల్లో సంభాషణ

8-7-1958 తేదీన డిప్యూటీ ఛైర్మన్ ఎన్నిక జరుగవలసి ఉన్నది.

పార్టీ సమావేశములో సుబ్బరాజుగారిని బ్రహ్మయ్యగారు సూచించారు.

అనంతరం ఏకగ్రీవముగా జి. సుబ్బరాజుగారు ఎన్నుకోబడ్డారు.

## సంభాషణ

అధ్యక్షా, డాక్టరు సుబ్బరాజుగారు ఉపాధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నిక కాబడిన యీ సందర్భములో వారికి నా అభినందనములు. నిన్న పెద్దవారు, నేడు చిన్నవారు ఏకగ్రీవంగా ఎన్నుకోబడినారు. దీనినిబట్టి యీ విధాన సభ, పెద్ద చిన్నల యెడ సమాన దృక్పథం చూడగలదని తేలింది. అట్టి ఔదార్య భావంతో యీ విధాన నడువగలదని మనం రుజువుచేసుకున్నాము.

సుబ్బరాజుగారు విద్యార్థిగా నేగాక, పారిశ్రామిక వేత్తగా విజ్ఞానముయందు అభిరుచిగలిగి, తృష్ణతో పాశ్చాత్య దేశాలను పర్యటించి, ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయాలను సమన్వయం చేసుకొన్నటువంటి యువకులు. అట్టి యువకుడు యీ ఉపాధ్యక్షపదవికి ఎంతయు అర్హులని నేను భావిస్తున్నాను. సోషలిస్టిక్ పాట్రన్ ఆఫ్ సొసైటీఅనే నినాదంతో యీనాడు మనదేశం ముందుకు పోతోంది. ఈ పదం వినగానే పారిశ్రామిక వేత్తలలో గుండెదడుకు బయలు దేరుతున్న

రోజులలో ఒక పారిశ్రామిక వేత్తను మనం ఉపాధ్యక్షునిగా ఎన్నుకొని యీ సంఘాన్ని సోషలిస్టిక్ పాట్రన్ ఆఫ్ సొసైటీలో ఇముడ్చుకోగలమని ఋజువు చేశాము. పారిశ్రామిక వేత్తలలో కలిగిన గుండెదుడుకులనూ పారిశ్రామికవేత్త అయినటువంటి యీ సుబ్బరాజుగారు తీర్చగలరనే భావంతో వారిని మరొకసారి అభినందిస్తున్నాను. వారు పెద్దవారి అడుగుజాడల ననుసరించి యీవిధాన సభకు ఉపాధ్యక్ష స్థానం వహించి ఉత్తమమైన నూతన సాంప్రదాయాలను సృష్టించ గలరని విశ్వసిస్తున్నాను. అక్షరక్రమంలో మన ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానం ఆక్రమించినది. అదే విధంగా మొట్టమొదటస్థానం సత్సంప్రదాయాలను సృష్టించడంలోనూ మీ పెద్దలు-పిన్నలు ఇరువురుకూడా కృషిచేసి సృష్టించగలరని నమ్ముతూ విరమిస్తున్నాను.

శుభారంభం అను శీర్షికతో ఆంధ్రపత్రిక
ఇట్లు పేర్కొన్నది.

“అధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నికలలో సభ్యులు యెట్టి సమైక్యతను కనబరచారో, అధ్యక్షుని ఎన్నికవరకు సభా నిర్వాహణకుగాను కాంగ్రెస్ ప్రముఖుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య గారిని నియమించుకొనడంలో సయితం మన రాష్ట్ర పెద్దలు సమధికమైన ఔచిత్యాన్ని ప్రదర్శించారు. చిత్తశుద్ధికీ, త్యాగ శక్తికీ శ్రీ బ్రహ్మయ్యగారు పెట్టినది పేరు.”

---

15)

## 1958 ఆగస్టు 13 న గవర్నరు గారికి వందనసమర్పణ సమయమున సంభాషణ :

అధ్యక్షా, ఈ వందన సమర్పణ సందర్భములో ప్రొఫెసరు నివర్తి వెంకట సుబ్బయ్యగారు ప్రభుత్వము ఆచరించిన ఘన కార్యములకు అభివందనము తెలిపి యున్నారు. ఆ ప్రశంశలతో నేను ఏకీభవిస్తున్నాను. కొంత మంది మిత్రులు ఈ ప్రసంగము అస్పష్టము, అయోమయము అని అన్నా నాకు మాత్రము యిది సముచితము, సంతృప్తికరము, ఆశాజనకము అని భావిస్తున్నాను. రాబోయే భూసంస్కరణాలకు నేను నిండు హృదయముతో ఆహ్వానిస్తున్నాను. అయితే రెడ్డిగారి ఉపన్యాసంతో ఏకీభవిస్తున్నాను. ఇది సంస్కరణాల యుగము. ఈ యుగము సంస్థానాల విచ్ఛిన్నతతో ప్రారంభమయి జమీందారీ నిర్మూలనతో ఉత్సాహ భరితముగా నేటికి భూసంస్కరణాల వఱకు వచ్చింది. అయితే ప్రభుత్వము ఈ దృష్టిని పల్లెటూర్ల మీదనే కాకుండా బస్తీలమీదకూడా సారించి అక్కడ వున్నటువంటి కుబేరులయి నటువంటి ధనవంతులు, పారిశ్రామిక వేత్తలు, నెలసరి వేలకొలది రూపాయలు ఆదాయముగా వచ్చువారిపైనకూడ ప్రసరింప చేస్తుందని భావిస్తున్నాను. సామ్యవాద సంఘ నిర్మాణము యీ సంస్కరణాల పరంపర జరిగితేగాని పూర్తికాదు. అయితే యీ సందర్భములో నేను ప్రభుత్వమునకు వినతి చేయదలచుకున్నాను. పారిశ్రామికమిల దేశము ఉత్తరము. వ్యవసాయమునకు ప్రసిద్ధి

చెందిన దేశము దక్షిణాము. పారిశ్రామిక ప్రాబల్యము హిందూ దేశముమీద వున్నదనే ప్రతీతి ఒకటి వున్నది. ఆ పారిశ్రామికుల ప్రభావానికి మన ప్రభుత్వము, కేంద్ర ప్రభుత్వము కూడ లోబడవనే ఆశిస్తున్నాను. నేటి మన ఎన్నికల కార్యక్రమములో సంస్కరణాల పరంపర వుంది. సామ్యవాద సంఘ నిర్మాణము మన ఆశయము కాబట్టి ఆ సుదినము కోసము ఆ సంస్కరణాల కోసము ఎదురు చూదాము.

అయితే అధికోత్పత్తి దీనివల్ల జరుగదని కొందరం టున్నారు. అధికోత్పత్తి జరుగుతుందని నేను రైతుగా మనవి చేస్తున్నాను. Ceiling 3600 రూపాయలా, 5400 రూపాయలా అను వాదమువుంది. నిజమే extreme right నుంచి extreme left నుంచి ఇట్టి అభిప్రాయాలు వుంటాయి. నవభారత నిర్మాత అయిన శ్రీ వల్లభాయిపటేలు సంస్థాన విచ్ఛిత్తి ప్రారంభించినప్పుడు ఇట్టి వ్యతిరేక వాదనలు జరిగి నవి. కాని ఇప్పుడు ఆనందిస్తున్నారు. అట్లాగే ceiling 5400 రూపాయలు అప్పటికి ఇప్పుడు వ్యతిరేకించిన వారం దరు భవిష్యత్తులో ఆనందిస్తారు అని అనుకొంటాను. ఈ బిల్లుయొక్క ముఖ్యోద్దేశము exemption లేకపోవడమే. Exemption అనేది ధనవంతుణ్ణి ధనవంతుని చేస్తుంది. 3600 తో కూడిన ceiling, exemption తో కూడినదని, మనవి చెస్తున్నాను. 5400 exemption లేనిబిల్లు. అట్టి బిల్లు ఎట్టి amendments లేకుండా pass అయ్యే సుది నము వస్తుందని భావిస్తాను.

శ్రీ జి. రాజారావు :- Sugar factory క్రిందవున్న భూములు exemption లోనికి రావా ?

శ్రీ జి. బ్రహ్మయ్య :- అయితే నామిత్రుడు ఒక్కడే exemption అనుకొంటున్నాడని అనుకొంటాను. దానిలో 80 shares ప్రభుత్వానివే. అది వారు వదులుకొంటారు అనుకొంటాను. దానికి మన ఎరుగుగుండా వున్న మిత్రుడు, నేను ఆనందిస్తాము. Exemptions కూడా పోవటానికి ప్రయత్నించ వలయును. సింగరేణి గాగ్గునల సందర్భములో మన ప్రభుత్వముగు ధైర్య సాహసాలతో పోరాడింది. చివరకు ధర్మమే నెగ్గింది. ఆ ధోరణే ఎరువుల factory నిర్మాణానికి కూడ పోరాడాలని హెచ్చరిస్తూ ఎరువుల factory నిర్మాణములో ఒకవైపున centre తో బేర సారాలు సాగిస్తూ ఇక్కడ పారిశ్రామికులను ఆకర్షించి వారి చేత ప్రత్యేక factory పెట్టించుటకు వారి రాజనీతిజ్ఞత, శక్తి యుక్తులు ఉపయోగించిన యెడల Central Government భాగస్వామ్యము కొరకు మనవద్దకు రావలసిన సుదినము వస్తుందని ఆశిస్తాను. భూసంస్కరణాల సందర్భములో రైతుల భూములు ముక్కలు చెక్కలుగా వున్నవి. వాటిని ఏకీకరణ చేయుటకు చర్యలు గైకొనవలెను. ప్రత్యేక శ్రద్ధ తీసుకొన వలెను. ఇది పంజాబులో మాత్రం వుంది. అట్టి బిల్లు Revenue Minister గారు తీసుకొని వస్తారని భావిస్తున్నాను. ఇక గ్రామ ఉద్యోగుల జీతాలు కొద్దిగానే పెంచారు. అది ప్రత్యక్షముగా కొద్ది అయినా పరోక్షముగా వారికి ఇంకా సాయము జేయవలసినదై ఉంది. ఇవి వెంటనే

అమలు జరిపిస్తారని అనుకొంటాను. ఉద్యోగస్తులకు కార్మికులకు కొంత జీతము హెచ్చుచేశారు. వారు కోరినంత చేయక పోయినా కొంతచేసిరి. ఇంకా హెచ్చుకావాలి. అదే వారి ఎడల ప్రభుత్వానికిగల ప్రేమకు నిదర్శనము. అయితే ఉద్యోగస్థులుకూడ ప్రభుత్వంయొక్క ఆదాయమును పెంచి ప్రభుత్వముయొక్క దుర్వ్యయమును తగ్గించి ఎక్కువ జీతాలు పొందడానికి ప్రయత్నిస్తారని నేను భావిస్తాను.

## బ్రహ్మయ్యగారిని గురించి ఆయన సంభాషణను గురించి ప్రధాన మంత్రిగారి అభిప్రాయము :

"పార్లమెంటులో లేకపోయినా, శాసనసభల్లో లేక పోయినా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి వంటి రాజకీయ అనుభవము, ప్రజ్ఞ కలిగిన వారున్నారు."

"మా సోదరులు బ్రహ్మయ్యగారు మైక్ లేకుండానే గట్టిగా మాట్లాడారు. వారుకూడ ఒకసలహా యిచ్చారు. Co-operative basis వీలులేదు. ఎందుకు private sector లో చేయకూడదు అన్నారు. Fertiliser factory పెట్టించుటకు ప్రయత్నము చేస్తున్నాము. Private వ్యాపారస్థులకు కావలసిన assistance మేము ఇస్తామని చెప్పారు. మన దేశములోవున్న Fertiliser factory గురించి చెప్పాను. వాటికొరకు ప్రయత్నము చేస్తున్నాను."

"బ్రహ్మయ్యగారు యీ సూచన Reverue Minister గారికి ఇవ్వవచ్చును. వారు వీరు యీ అసెంబ్లీలోనే

సమావేశముకారు. బయట అనేకసార్లు కలుసుకొంటూ వుంటారు. అందుచే వారు Private గా కలుసుకొన్నప్పుడు ఈ Suggestion యిచ్చి దీనిని తీసివేయమని చెప్పవచ్చు."

## 1958 ఆగస్టు 21 తేదిన భూసంస్కరణలను గురించిన ప్రసంగము :

అధ్యక్షా, ఈ సంస్కరణాల యొక్క ఆశయం భూదాహం తీర్చడం కాదని దేశంలో జనాభా ఎప్పటి కప్పుడు లక్షలాది పెరుగుతూ ఉన్నదని, ప్రకృతిసిద్ధంగా వ్యవసాయ దేశమైన మన దేశంలో జనాభా పెరుగుదలకు తగినంత భూమిలో పంట పెరుగుట లేదని, భూమిలో వుత్పత్తి పెరిగి మనదేశం Self-sufficient అవటమే కాకుండ యితర దేశాలకు యెగుమతిచేసి ఆ డాలర్సుతో మనదేశంలోని పరిశ్రమలను వృద్ధిచేసుకొనవలెనని ఆశయమై వున్నది. ఎక్కువ ఉత్పత్తికి దోహదం చేయాలనే ప్రధాన ఆశయంతో భూసంస్కరణాల కొరకు చిరకాలముగా ఆందోళన జరుగుతున్నదని నేను తలుస్తున్నాను. ఈ భూమిని కొందరు వందలాది ఆకట్టి వ్యవసాయం చేయకుండా ఊసరక్షేత్రముగా చేయడం, మరికొందరు ఒక ఎద్దు వ్యవసాయమునకు కూడ తగినంత భూమిలేని కారణంచేత తమ శ్రమకు గిట్టుబాటుకాక వ్యవసాయాన్ని అభివృద్ధి చేయ లేని దుస్థితిలో వుండటం ఈ పేదతనం, ఈ ఊసరక్షేత్రం, సమన్వయం చేయాలనే భావంతో ఈ సంస్కరణాలను తీసుకు రావలెననే భావం కలిగింది. వేలాది ఎకరాలు ఆకట్టి దాని

మీద వచ్చే అయివేజుతో భోగలాలసత్వానికి, వారి విలా సాలకు. ఉపయోగించే ఒకవర్గమున్నా, వ్యవసాయ ఖర్చులు గిట్టుబాటుగాక బీదతనంతో గొట్టుమిట్టాడే రకం ఒకరున్నా, ఉండుటచే బీదతనములో ఉన్నవారి వ్యవసాయమును అభి వృద్ధి పరచాలనే దృష్టిలో ఈ సంస్కరణలు తీసుకువచ్చా రని అనుకొంటున్నాను. ఇది క్లిష్టసమస్య అగుటచే దీనిని పరిశీలించుటకు సుబ్రహ్మణ్యం కమిటీని, లక్కరాజు కమిటీని వేశారు. వారి సిఫార్సులను నెంటనే అప్పటి ప్రభుత్వాలు అమలులోకి తీసుకురాలేకపోయాయి. ఈ ప్రభుత్వం కష్ట సుఖాలన్నీ గమనించి ఈ రూపంలో బిల్లును తీసుకు వచ్చి నందుకు అభినందిస్తున్నాను. భూదాహం కేవలం Political slogan అనుకుంటాను. సభ్యప్రపంచంలో సమానంగా తిండి, బట్ట, చదువు, ఆరోగ్యం కలగాలనే కోరిక ప్రతివారికి ఉంటుంది. ఒక ఎకరం పొలం యిచ్చేకంటే, ఎక్కువ ఆదా యంవచ్చే ఇతర పరిశ్రమలు నెలకొల్పి సదుపాయం కలుగ జేస్తామంటే భూమి కావాలనే వెర్రివాడు ఎవడూ వుండడు. పల్లెటూళ్ళలో వ్యవసాయ కూలీగా ఉన్నవారు, యితర పరిశ్రమలలో ఎక్కువ లాభదాయకంగా పని చూపిస్తానంటే నాకు భూమే కావాలి, భూదాహం ఉన్నది. అని కోరేవారు మెవరూ లేరు. వ్యవసాయంమీద నూటికి 75 మంది బ్రతుకు తున్నట్లు తెలుస్తున్నది. మన దేశంలో భూమి నూటికి 75 మందిని భరించలేదు. 50 మంది వ్యవసాయంలో ఉంటే మిగతా 25 మందిని, భారీ పరిశ్రమలుగాని, మధ్యరకం పరి శ్రమలుగాని నెలకొల్పి వాటిలో జీవనం చూపించి దేశ

సౌభాగ్యాన్ని పెంచవలసి యున్నది. చాలామంది భూమి కలిగినవారిని పట్టణాలు ఆకర్షిస్తున్నాయి. పట్టణాలలో న్యాయవాద వృత్తిగాని, వైద్యవృత్తిగాని, వ్యాపారమునకు సంబంధించి గాని జీవితం లాభదాయకంగా సౌఖ్యప్రదంగా ఉంటుందని వాటిమీదపడకుండా వ్యవసాయంలోకూడ ఎక్కువ ఉత్పత్తికి అనుగుణ్యంగా చిన్న చిన్న కమతాలను ఏర్పరచాలనే ధోరణిలో ఈ సంస్కరణలు తీసుకువచ్చారని భావిస్తున్నాను. రు. 5,400 నికరాదాయం హెచ్చు అని ప్రతివారు అంటున్నారు. అది రు. 450/- అని నెలకు లెక్కవేసుకుంటే తక్కువే. షేర్వానీగారు చెప్పినట్లు 5 గురుగల కుటుంబం ఉన్నప్పుడు ఒక్కొక్కరికి రు. 90-లుగా విభజిస్తే కనబడుతుంది. ఈ బిల్లును గురించి రెండువైపులా చెప్పవచ్చును. ఒకరు యిది చాలా ఉదారమైన బిల్లు అని చెప్పవచ్చును; ఇంకొకరు ఇది రెండవ తరములోనో, మూడవతరములోనో మనుష్యులను వ్యవసాయ కూలీలుగా మార్చే బిల్లుగా ఉన్నదని అంటున్నారు. ఆ వాదన, ఈ వాదన అతిశయోక్తితో కూడుకున్నదై ఉండవచ్చును. కాని మధ్యరకంగా యీ రు. 5,400-లు సరైనదని భావిస్తున్నాను. సుందరయ్యగారి స్పీచ్ 'ఆంధ్రప్రభ'లో చూచాను. కావలిస్తే చదివి వినిపిస్తాను. 20 స్టాండర్డు ఎకరాలు ఒక కుటుంబానికి సరిపోతుందనే ధోరణిలో వారు చెప్పినట్లు తెలుస్తుంది. 20 స్టాండర్డు ఎకరాలు అంటే 40 మామూలు ఎకరాలు. ఈ రు. 5,400 నెట్ ఇన్‌కమ్ రావాలంటే 40 ఎకరాల సారవంతమైన భూమికంటె ఎక్కువ ఉండదని మనవిచేయుచున్నాను. ఊసర

క్షేత్రాలు, పండని పొలాలు వుంటే వుండవచ్చును. ఈ బిల్లులో పశుగ్రాసానికి గాను వేసే కొంత భూమి ఉంచుకొనవచ్చునని ఉన్నది. పల్లపు సాగు గ్రామాలలో పశువులకు బీళ్ళు వుండవు. ఆ ఆసామికి పశువులమీద ప్రేమ ఉన్నప్పుడు, పరాయి గ్రామాల్లో మెట్ట, మాగాణి ఉన్న గ్రామాలలో అట్టి పశువుల మేతకు ఏర్పాటు చేసుకొనుటకు వీలుగటుంది. మనము పశు పోషణకు ప్రాధాన్యం ఇస్తున్నాం. ప్రపంచంలో కోట్లాది పశువులుగల దేశం మనదే నేమో. పశువుల మేతకు ప్రత్యేకంగా బీళ్ళు ఉండాలి. ప్రాచీన కాలములో ప్రతి గ్రామంలోను పశుగ్రాసానికి కొన్ని భూములు కేటాయించడం జరిగింది. అవన్నీ కాలక్రమేణా పోయాయి. పశుగ్రాసానికిగాను, పశుపోషణ చేసేవారికి ఏ వెయ్యమందికో ఒక్కరికి 1/5 భూమి ప్రత్యేకించినంత మాత్రాన, అది జన సామాన్యాని కిందరికీ రాదు. పశుగ్రాసం దృష్టిలో పెట్టుకొని రు. 5,400/లును యింకా తగ్గించడం న్యాయంకాదు. పశు గ్రాసమునకు అనుమతించే భూమి వెయ్యమందిలో ఒక్కరికి ఉంటుంది. అందుకోసమని నికరాదాయము తగ్గించి హెచ్చుమందికి నష్టం కలిగించడం మంచిదికాదు. రు. 3600 నికరాదాయంగా నిర్ణయించిన తెలంగాణా బిల్లు ఎక్కువ radical గా ఉన్నదని కొందరు చెప్పారు. కాని దానిలో exemptions work out చేస్తే యీ రు. 5,400 లే దాని కంటె తక్కువ మొత్తంగా work out అవుతుందేమో. ఆ exemptions వల్ల కొలదిమందికి, వేళ్ళమీద లెక్క పెట్టే వారికి మాత్రమే లాభం కలుగుతుంది. ఈ రు. 5400

పెట్టినందువల్ల అంతకంటె ఎక్కువమందికి, మధ్యతరగతి రకానికి ఉపయోగపడుతుంది. ఇంకా ఎక్కువ లాభప్రదంగా ఉంటుంది. ధనవంతులను ఇంకా ధనవంతులుగా చేయడం కంటే మధ్యరకం వారికి వీలుగా-వారి బిడ్డలు చదువుకో డానికి, విద్యాబుద్ధులు నేర్చి సభ్య ప్రపంచంలో తిరగటానికి ఈ రూ. 5,400-లు సరిపోతాయని భావిస్తున్నాను. ఖర్చులు మొత్తం ఆదాయంలో సగం అనే అంచనా చాలా హెచ్చు అని కొందరు అంటున్నారు. ఇంతకంటె హెచ్చు ఖర్చులు అవుతాయని కొందరు అంటున్నారు. ఈ సంవత్సరంచూస్తే వేసవికాలంలో మండుటెండల కారణంచేత నారుమళ్ళు ఎండిపోయాయి. రెట్టింపు, మూడురెట్లు విత్తులు వేసుకోవలసి వచ్చింది. తరువాత ఆలస్యంగా కాలవ వచ్చింది. కాలవతో పాటు అధికవర్షాలు కురిశాయి. దుక్కులు దున్నటానికి వీలు లేకపోయింది. ఎక్కువ కూలి పెట్టవలసి వచ్చింది. ఇటువంటి సందర్భాలలో ఎక్కువ కూలి అవుతుందికూడా. అయినప్పుడు సగం Gross Income ఖర్చులకు తీసేసి సగం net Income గా చేయడమనేది సమంజసమయినదే. చాలామంది మిత్రులతో చెబుతూ వుంటాను. "నేను రైతును - మీరు రైతు నాయకులు" అని. రైతు నాయకుల అంచనాలు సరిగా వుండవు ! ఖర్చులు Gross Income లో సగానికి అంచనా కట్టడం మంచిదే. పూర్వపు రోజులలో వ్యవసాయం అమర కానికి ఇచ్చేటప్పుడు చెరిసగము (పంట) అనే పద్ధతి ఉండేది కాబట్టి ఇది భావ్యమని తలుస్తున్నాను. ఈ పంటల ధరల అంచనా వెనకటి 10 సంవత్సరాల ధరలు లెక్కలోనికి తీసు

కొని నిర్ణయించడం సమంజసమని అనుకొంటున్నాను. మూడు సంవత్సరాలు సరిపోదు. Monsoons వర్గరా లెఖ్ఖవేస్తే 5 సంవత్సరాల కొకసారి మంచిపంట పండుతుందని వున్నది. మన పంచాంగాలు పాతవి చూస్తే తెలుస్తుంది. మన రెవిన్యూ మినిస్టరుగారికి జ్యోతిషం, పంచాంగం భాగం కూడ తెలుసు. పాత పంచాంగాలు వెతికితే అయిదేసి సంవత్సరాల కొక సంవత్సరం మంచి పంట పండుతుందని తెలుస్తుంది. ధరల అంచనా విషయమై మన ప్రభుత్వం దూరదృష్టితో 20 సంవత్సరాలు వేసింది. మన ప్లానింగ్ కమిషన్ వారు చెరిసగం పంచాయితీ చేశారు. 20 సంవత్సరములు హెచ్చు అన్నారు. కాని 20 సంవత్సరాలు వేసినా తప్పు లేదని అనుకుంటాను. మధ్య మార్గంలో ధరలు అంచనా 10 సంవత్సరాలకు కట్టితే సముచితమని భావిస్తున్నాను. మిగులు భూమిని ముక్కలు చెక్కలుగాచేసి ఒక ఎకరము రెండెకరములు పంచటము అంత సమంజసముకాదు. భూమిలో ఎక్కువ పంటలు పండాలనే ఆశయానికి ఇది దోహదము ఇవ్వదు. వ్యతిరేకమే అవుతుంది. కాబట్టి ప్రభుత్వమువారు భూములు ఎక్కువగా ఉన్నచోట సమిష్టి వ్యవసాయాన్ని ప్రోత్సహించాలి. విత్తనములు, ఎరువులు సప్లయి చేసినట్లయితే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని వారికి లాభమవుతుంది. ఈ పద్ధతి రైతులకు ఉపయోగపడుతుంది. కాబట్టి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను ప్రోత్సహించాలని మనవిచేస్తున్నాను. తక్కువ భూమివున్న రైతు అష్టకష్టాలు పడుతుంటే

అతనికి మరికొంచెము భూమి యిచ్చి అభివృద్ధిపరచడం మంచిదనేది దృష్టిలో పెట్టుకొనవలసి యున్నది. ఐతే వ్యవసాయకూలీకి భూమి ఇవ్వవద్దని నేను అనడము లేదు. ప్రత్యేక శాసనం తీసుకువచ్చి వారికి భూమి ఇవ్వవలసిందే. కూలీలకు కూడా తగిన ఫలితము అందుబాటులో నుంచవలసిందే.

వ్యవసాయకూలీకి గిట్టుబాటయ్యే విధంగా వెంటనే శాసనం తీసుకురావాలని అర్థిస్తున్నాను. వారికి భూములు ఇచ్చేటప్పుడు సన్నకారు రైతులకు కూడ కొంత భూమిని ప్రత్యేకించటం న్యాయం. వ్యవసాయమే వృత్తిగాగల రైతాంగాన్ని అభివృద్ధిపరచటం అత్యవసరం. పెద్ద వ్యవసాయ కమతాలను కల్పించటం ఎంత అవసర్యమో చిన్న వ్యవసాయాలకు తగినంత వ్యవసాయ క్షేత్రాలను ఉంచటం కూడా సముచితమే అనుకుంటాను. కనీస ధరల నిర్ణయము, భూముల ఏకీకరణ వ్యవసాయకూలీల కనీస వేతనాలు వీటికి వీటిని గురించి ప్రత్యేక బిల్లులు తీసుకు వస్తామని ప్రభుత్వం వారు చెప్పారు. చాలా సంతోషం. భూస్వామ్యానికి వివిధ మైన ఎగ్జంప్షన్ ఉండకూడదని ఈ బిల్లు యొక్క ప్రత్యేకత. ఆ ప్రకారమే కొనసాగించవలసి యున్నది. నిజాంసాగర్ పంచదార మిల్లుకు ఎగ్జంప్షన్ ఉన్నది. దాంట్లో 80 షేరులు ప్రభుత్వంవారివే. మిగతా 20 షేర్లను గమనించకుండా ఎగ్జంప్షన్ తీసివేస్తే ఈ బిల్లు చక్కగా సర్వాంగసుందరంగా ఉంటుందని నేను భావిస్తున్నాను. పరిహారం ఇవ్వడంలో

ఎక్కువ భూమి గలవారికి 5 రెట్లు కంటె మించరాదు. తక్కువ భూమి గలవారికి 10 రెట్లు ఇవ్వడం మంచిది. కష్ట పడి ఈ బిల్లును తెచ్చిన ప్రభుత్వానికి ముఖ్యంగా రెవిన్యూ మంత్రిగారికి, ముఖ్యమంత్రిగారికి అభివందనములు అందచేస్తున్నాము. యీ బిల్లు వ్యవసాయయోత్పత్తి ఎక్కువ చేయడానికి దోహదం చేస్తుందని ఆశిస్తున్నాను, యీ సీలింగు తక్కువ అని, ఎక్కువ అని అన్నవారికి మధ్యమార్గాన్ని చూపిస్తూ రైతు అభివృద్ధికి దోహదం ఇచ్చేటట్లు చేయాలని మనవిచేస్తూ యీ అవకాశం ఇచ్చిన అధ్యక్షులవారికి నమస్కారములు చెబుతూ శెలవు తీసుకుంటున్నాను."

కౌన్సిల్లో మన బ్రహ్మయ్యగారు అనుభవజ్ఞులుగా, రైతు పెద్దలుగా ఆదరింపబడుతూ సామరస్య భావాన్ని సంపాదింపచేస్తు వుండుట సంతోషప్రదం.

— ••• —

# భ్రాతృభావం

కాంగ్రెసువారంతా ఏక కుటుంబీకులు అని గ్రహించాలి. ఈ కుటుంబములో దేశోద్ధారక విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుగారిది మాతృస్థానము. ఎవరేమన్నప్పటికీ, ఆయన తల్లివలె వాత్సల్యభావమునే చూపెను. ఆయన సహాయము పొందని వ్యక్తి, సంస్థ లేదంటే అతిశయోక్తి కాదు.

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారిది పితృస్థానము. ఆయన అనుగ్రహాన్ని, ఆగ్రహాన్ని, అనుగ్రహంగానే భావించాము. ఆయన ఆంధ్రదేశానికి ప్రకాశం కలిగిన పురుషుడు.

మాతృదేవోభవ, పితృదేవోభవ, అన్న పిమ్మట మన మనునది ఆచార్యదేవోభవ అనేగద.

ముట్నూరి కృష్ణారావుగారిది ఆచార్యస్థానము. కృష్ణాపత్రికే కృష్ణారావుగారు. కృష్ణారావుగారే కృష్ణా పత్రిక. ఆ పత్రిక ప్రభావం అనన్యం. అది ఎందరలోనో జాతీయ భావం కలిగించి దేశారాధకులనుగా తీర్చిదిద్దినది. పత్రిక వల్లనేగాక, ప్రవర్తనవల్ల కూడ వారిది ఆచార్య పీఠము.

ఈ ముగ్గురి అనంతరం ఆలోచనీయుడు ఆదరణీయుడు జ్యేష్ఠభ్రాత. మన బ్రహ్మయ్యగారిది భ్రాతృస్థానము. ఆయునిది ఏకోదరాంతఃకరణ.

అందుచేతనే గురువుగారూ, అని ఎవరైనా సంబోధించినపుడు నాది ఆచార్యపీఠము కాదు, భ్రాతృస్థానము. మనమంతా సోదరులము, అని ఎంతో ఆప్యాయతతో అనును,

కనుకనే ఆయనది కాంగ్రెసు కుటుంబములో అన్నగారి స్థానము.

ఈ సంగతి గుర్తించుటవల్ల, పిన్నలగు సంజీవరెడ్డి, కళా వెంకట్రావు, చిట్టిగార్లే గాక, పెద్దలగు మూలుగ్సారి రంగయ్య, మల్లాది యజ్ఞనారాయణశాస్త్రి, కాళేశ్వరరావు గార్లు కూడా అన్నగారూ, అంటూ ఎంతో ఆదరముతో పిలుస్తారు.

మన ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు, అన్నగారూ అని సంబోధించటమే గాక, ఎంత పనిలో నిమగ్నులైనా, బ్రహ్మయ్యగారు రాగానే ఆయన యెడల పెద్దరికభావాన్ని తెలియచేయుదురు.

బ్రహ్మయ్యగారు అని సెప్పిస్టు కొట్టితే బ్రహ్మయ్య అన్నగారు అని సంజీవరెడ్డిగారు సవరణ చేయుదురు.

కళా వెంకట్రావుగారు 'అన్నా' అనే సంబోధిస్తారు. అరమరలేకుండా ఆ అన్నదమ్ములిద్దరూ అన్ని విషయాలు మాట్లాడుకుంటారు.

మన కుటుంబవృద్ధు స్పీకరు అయ్యదేవర కాళేశ్వరరావు గారు యెంతో ఆప్యాయతతో 'బ్రహ్మయ్యన్నా' అని పిలుస్తారు.

నార్ల వెంకటేశ్వరరావుగారికి ఉత్తరం వ్రాసేటప్పుడు 'తమ్ముడూ!' అని సంబోధించుట ఆచారము.

ఒకసారి శ్రీ వెంకటేశ్వరరావుగారికి అనివ్రాస్తే, 'నేను పార్లమెంటు మెంబరు నైనాననా మీరు కౌన్సిలు సభ్యు

లయ్యారనా, సంబోధన మార్చారు' అని తెలియచేస్తూ, తమ్ముడూ అని యథాప్రకారంగానే సంబోధించవలసిందిగా హెచ్చరించారు.

అన్నల అడుగులకు మడుగులెత్తినవారు మనకు అధికంగా కనపడతారు.

కాని తమ్ముల పెంపు చూచి ఆనందించేవారేరి ?

ఒకసారి సంజీవరెడ్డిగారు 'మా అన్నగారికి మేమేమీ చేయలేకపోయాము' అని బ్రహ్మయ్యగారితో ఎంతో పరితాపంతో అన్నారు.

అంతట అన్నగారిట్లా అన్నారు :

"తమ్ములు అన్నకు చేయవలసినది ఏమీ లేదు. నేను మీకు అన్నను అగుటే ఆనందము. తమ్ముల అభివృద్ధికంటె అన్నకు కావలసిన దేమిటి ?"

ఇటుల అన్నను గురించి తమ్ములు, తమ్ములనుగురించి అన్న తలపోస్తూ వుంటారు.

ఆ నాడు బ్రహ్మనాయుడు చాపకూడు ద్వారా సర్వ సమత్వము స్థాపించాలని ప్రయత్నించాడు కాని ఫలించ లేదు.

ఈనాడు బ్రహ్మయ్యగారు ఏకోదరాంతఃకరణద్వారా భ్రాతృభావము పెంపొందచేస్తున్నారు. అందుచేతనే కుల మత భేదం లేకుండా సంజీవరెడ్డి, గోపాలరెడ్డి, తిమ్మారెడ్డి, కళా వెంకట్రావు, కల్లూరి సుబ్బారావు, మంతెన వెంకట్రాజు, మరుపిళ్ళ చిట్టి, పళ్ళంరాజు, స్వామి బాబు, మూలుపూరి రంగయ్య, అక్కయ్యనాయుడు, బి. యస్. మూర్తి,

కూర్మయ్య, సంజీవయ్య, అబ్దుల్ కరీం, కానూరి సోదరులు మొదలగువారి మన్నన పాత్రుడయ్యాడు బ్రహ్మయ్యన్న.

గురుదేవులు ముట్నూరి కృష్ణారావుగారి ప్రియ శిష్యుడు మన బ్రహ్మయ్య.

పాత కొత్తల మేలుకలయిన మన బ్రహ్మయ్యన్న.

మనమందరము ఒకే కుటుంబమువారమని భావము కలిగినపుడే మనము అభివృద్ధి గాంచేది.

భాతృభావమే మన శ్రేయోరాజ్యానికి, సర్వోదయానికి సరైన మార్గము.

బ్రహ్మయ్యన్నవలె మనము ఏకోదరాంతఃకరణముతో మెలిగి, పరస్పర శ్రేయోభిలాషుల మగుదుము గాక!

"భావమున భేదములు
బహునాయకత్వములు
అంధానుకరణములు
మొదలంట తుడిచివైచి
సోదరా!
కదలరా కార్యరంగమునకు."

—ఏడిద కామేశ్వరరావు.

—...—

17)

# స్వభావం

ఆయనకు పెద్దలయెడ భక్తి, గౌరవాభిమానములు మెండు. సహచరులను ప్రేమిస్తాడు. చిన్నలను బుజ్జగిస్తాడు. వర్కర్లయందభిమానము కల్గి వారి కష్టసుఖాలలో పాల్గొంటాడు. అన్నిరకాల మనుష్యులను ఆకర్షించగలడు. అందరిని ఆప్యాయంగా పలుకరిస్తాడు. ఆయనలో మరో విశేషమేమంటే అన్నిరకాల మనుష్యులతోను అరమరలేక అతికిపోగలడు. తాను పెద్ద, ఇతరులు చిన్న అనే భావం ఆయనకే కోశాన లేదు. వ్యక్తిగతంగాను, రాజకీయంగానుకూడా ఆయనది పవిత్రశీలం.

ఆయన క్షణం వృథాపుచ్చడు. ఏదో ఒకపని వుండాలి. ఆ పని చేయటంలో కూడా ఆలస్యం లేకుండా అతి త్వరగా ముగించడానికే ప్రయత్నిస్తాడు. పని అయ్యేవరకు నిద్రపోడు. తాను చేయుటే గాదు, ఇతరులను ప్రోత్సహించి చేయించగల శక్తివంతుడు.

ఆయన స్వభావంలో ప్రధానమైనది (One thing at a time) యేకాగ్రతతో పనిచేయుట. ఉత్తరంపైన చిరునామా వ్రాస్తూకూడా సంభాషణ చేయడు. కాలనిర్ణయ పద్ధతిని (Punctuality) అధికంగా పాటిస్తాడు. ఒక ఆదర్శంతో పనిచేస్తాడు. కాని Cheap popularity కొరకు యే పని చేయడు. (Deserve and desire) అర్హతను మించి ఆశించరాదని ఆయన ఆశయం. *

---

* దేశోద్ధారక నాగేశ్వరరావుగారు డిల్లీ శాసనసభకు రాజీనామా యిచ్చినప్పుడు దానికభ్యర్థిగా నిలువవలసిందని పట్టాభిగారు కోరగా, 'ఆ సభలో నేను చేయి నెత్తుట మినహా చేయగలిగిందిలేదు. మద్రాసు సభలో

పదవులు అక్కర్లేదనే ఛాందసుడూ గాదు, పదవీ వ్యామోహపరుడును గాదు. పదవిని, సేవావ్రతంగా భావిస్తాడు. అందుచేత ఒక్కదానిలోనే అట్టిపెట్టుకుని వుండకోరతాడు * ప్రథమ కోపం కద్దు. కాని దీర్ఘకోపి కాడు. పరాభిప్రాయములను గౌరవించగలడు. తనమాటే నెగ్గాలని పట్టుదలకలవాడు కాదు. అందుచేతనే ఆయనకు ప్రతికూల పక్షములలో కూడ మిత్రులు కలరు.

మొగమిచ్చకములు, మొరమొచ్చాలు లేవు. ఆ నిష్కర్షవల్లనే కొంతమంది కాయన అయిష్టు డయినాడు. తన మిత్రులైనవారు, తనను శంకించడం ఆయన సహించ లేడు. మిత్రత్వమునో శత్రుత్వమునో కోరునుగాని డోలాయమానంగాను, లౌకికంగాను వుండే మధ్యరకపు పద్ధతిని ఆయన నిరసించును. స్నేహపాత్రుడు. మిత్రులకై యెంత త్యాగమైనా చేయగలడు. ఆయనకు మిత్రప్రేమతో బాటు బంధుప్రేమకూడా అధికమే.

సాంఘికంగా విప్లవాది కాడు, పూర్వాచారపరాయణుడును కాడు. మధ్యమార్గమాయనది. అన్నిట్లోను అంతే!

అయితే నేను రైతు సమస్యలపై నా నియోజకవర్గానికేమైనా వుపయోగం చేయగలుగుతాను' అని అన్నాడు. యే సమావేశంలోనైనాసరే యేసభలోనైనాసరే, మొదటివాడుగానే వుండగోరుతాడు. కాని ప్రధానంగా వుండడంగాని అనవసర విషయాలలో ఆధిక్యతను కోరడం గాని ఆయన స్వభావానికి వ్యతిరేకం.

* 1937 సంIIలో యీయన రాష్ట్ర రైతుసంఘాని కధ్యక్షుడుగా నుండగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శియైనప్పుడు రైతుసంఘాధ్యక్షపదవికి రాజీనామా యిచ్చెను. పెక్కు రంగాలలో ప్రవేశించుటకు యిష్టపడక, తనశక్తియుక్తులన్నిటిని యేకోన్ముఖముగానుంచ ప్రయత్నించును.

ఒక విషయం తన ప్రతికూల పక్షంలోని వ్యక్తి మంచిది సూచించినా ఆమోదిస్తాడు. అలాగే తన ప్రతికూలుర విషయంలో కూడా ఆయన విషయాన్ని బట్టి మాట్లాడుతాడు గాని వ్యక్తిని బట్టి మాట్లాడడు.

శీఘ్రనిర్ణయం చేస్తాడు. ఒక నిర్ణయానికి వస్తే మారడు.

దానధర్మాలు యథాశక్తిగా చేస్తుంటాడు. హరిజనుల విషయంలోను విద్యార్థుల విషయంలోను అధికం. చేతనైన సహాయం చేసినవారిని యెట్లా మరిచిపోడో తనవల్ల సహాయం పొందినవారి మేలుకూడా యెల్లప్పుడు కోరుతూ వుంటాడు.

ఆయన అధికంగా పొమపరి. అర్థికంగా యెప్పటికప్పుడు తన సంగతి తాను చూచుకొనుటేగాక, తనమిత్రుల విషయం కూడా గమనిస్తూ, హెచ్చరిస్తూ వుంటాడు.

మానవులకుండవలసిన గుణములలో ఆత్మగౌరవము ముఖ్యమైనది. తనయందు తనకు గౌరవముండుటేగాక, ప్రతిమానవునియందు గౌరవముండుటే ఆత్మగౌరవ మనబడును. ఆత్మగౌరవమువలన మనుజుడు తాను గొప్పవాడగుటే గాక, ఇతరుల గొప్పతనాన్ని కూడా గుర్తెరిగి గౌరవిస్తాడు. ఈ గుణం ఆయనలో అధికంగా వున్నది. *

* సాధారణంగా ఉపాధ్యాయులుగాని, ఇతర చిన్న వుద్యోగస్తులు గాని అధ్యక్షుల యెదుట, పై అధికార్లయెదుట నిలబడి తమ కష్టసుఖాలను నివేదించడం ఆచారం. ఈయన తాలూకాబోర్డు అధ్యక్షులుగా వున్నప్పుడు ఉపాధ్యాయులు నిలబడే మాట్లాడ నారంభించిరి. కాని బ్రహ్మయ్యగారు

"తగినవేషంబు దనుదాను పొగడుకొనమి
మెచ్చియును గీడు వలకమి యిచ్చవగవ
కునికి, దనకెంత నడవకయున్నఁ బధము
దప్పకుండుట నడవడి కొప్పుసేయు."

—భారతం.

---

## జీవిత లక్ష్యం

"నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతింజెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ
ఘాతంబప్పుడ పొందనీ నియతిమైఁగానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్."

—భర్తృహరి.

కొందరు కాంగ్రెసువారు యెన్నికసమయాల్లోనే కనిపిస్తారు.

---

వారు కుర్చీలో కూర్చుండినగాని యేవిషయం తమతో మాట్లాడ వీలులేదని వారిని కుర్చీలో కూర్చుండి మాట్లాడేటట్లు యేర్పాటు చేశాడు. ఉపాధ్యాయులు ఆత్మగౌరవం కలిగి వుంటేగాని, భావిపౌరులు కాదగిన మనపిల్లలు కూడా ఆత్మగౌరవం కల్గివుండరు. కనుక వారి ఆత్మగౌరవము పెంపొందేలాగు చేయవలసియుంటుంది- అని ఆయన అభిప్రాయము. ఇంతేకాక ఇతర తాబేదార్ల యెడలగూడా యీాయన అట్లాగే నడిచేవాడు. తన ఇంటివద్దకు రోజూ ఆయనతో పని వుండివచ్చి, ఆయన యెదుట కూర్చుండుటకు జంకే వారినికూడా ఆయన ప్రేమతో కూర్చుండ నియమించిగాని మాట్లాడడు. యెంత పని తొందరలోవున్నా యీ విషయం ఒక నియమపాలనలాగా తప్పక పాటించుట పరిచయులందరకు తెలిసినదే.

మరికొందరు కేవలం కాంగ్రెసు రంగంలోనే పని చేస్తారు.

బ్రహ్మయ్యగారు అట్లాగాక, కాంగ్రెసు రంగములోను మెన్నికల్లోను పాల్గొనుటతోనే తమ పని నెరవేరినట్లుగా భావించక, తన గ్రామ, తాలూకా, జిల్లాలో విద్యా, సాంస్కృతిక, వ్యవసాయ మొదలగు అన్ని రంగాల్లోను పాల్గొంటూ యథాశక్తి ప్రజారాధనా నిమగ్నుడై యుండును.

ఆయనకు రాజకీయాలు సాధన, సాధ్యము ప్రజాసేవ.

అందుచేత, వర్గ, గ్రూపు, వ్యక్తి నాయకత్వానికి బద్ధుడుగాక, కాంగ్రెసు ఆదేశానుగుణ్యంగా సేవచేస్తూ, ఆత్మగౌరవాన్ని పెంపొందిస్తూ, భూదేవిని భజిస్తూ, 'సుజలాం, సుఫలాం మలయజ శీతలాం, సశ్యశ్యామలాం మాతరం' అను బంకింమహర్షి వందేమాతర మంత్రాన్ని జపిస్తూ, ఆ దేవిని ఆరాధించమని స్వీయ సాదృశంచేతనే ప్రబోధించుట ఆయన జీవిత లక్ష్యం.

---

# ఆత్మ పరిశీలన

"లోపమదేమి తెల్గు లతిలోక మనీషు లుదారతా సము
ద్దీపితులం చితార్థ సగుణీరులహో! భువనత్రయంబు నో
కూర్కొపున లేపువారు మహిమోజ్జ్వలు లేయటులయ్యు
నామమున్
రూపము లేకయుంటకగ నెఱుంగుడసూయలు కారణంబు
గన్"

—సుమ్నాలం.

ఆంధ్రజాతి ప్రాచీనమైనదే కాదు. అధిక ప్రాముఖ్య మైనదికూడా. నేడును మనం ఎవరికీ ఎందునా తీసిపోము. కాని ఈ జాతికి ప్రపంచంలో మాట అటుంచి భారతదేశం లోనే ఖ్యాతిలేదు. దీనికి కారణమేమి? ఉత్తరాదివారి యీసడింపు కాదు; అరవ పితలాటముకాదు.

మనలో అనేక మంచిగుణాలున్నవి. కాని ఆదినుండి నేటివరకున్న పెద్దదోష మొక్కటే. ఓర్వలేనితనము, కక్షలు, స్వజాతివైరము. మన జాతీయ చరిత్ర కక్షల కాకరం. అందు చేతనే కష్టభూయిష్టమైనది. మన పల్నాటియుద్ధం, బొబ్బిలి యుద్ధం ఏమి చెప్పుచున్నవి? ఆ యుద్ధాలేగాదు, నేటి మన గ్రామకక్షలు కలహాలు, యుద్ధాలుకూడ ఇందుకు నిదర్శనం.

మనం కాంగ్రెసులో ఘనతర త్యాగాలు చేశాం. కాని ప్రయోజనమేమి? కాంగ్రెసు గద్దెనెక్కిన ఘనత మనకు ఇటీవల గదా లభించింది. ఆంధ్రులలో భారత ప్రభుత్వమున ఒక్క మంత్రి లేడు.

మన పట్టాభిగారి పలుకులు పరికించతగినవి.

* "కొన్ని కొన్ని విషయాలను గురించి మనం ఆత్మ పరిశీలన చేసుకోవాలి. మనలో త్యాగధనులున్నారు. నిష్కళంక దేశభక్తు లున్నారు. స్వార్థత్యాగులున్నారు. ఉత్తర హిందూస్థానంతో పోల్చి చూచినప్పుడు మనలో ఒక విశేషం కనిపిస్తుంది. మనకు రెండవనాయకత్వం (Second rate) హెచ్చుగా వుంది. ఉత్తర హిందూస్థానంలో పరిస్థితి దీనికి భిన్నము. మనవారంతా అతిరథు లేగాని ఉపరథులు కారు. మహారథులకంటె కొద్ది తేడాలో వుంటారు. అది మన విశిష్టత.

"అయితే మనలో కొన్ని లోపాలున్నవి. అందులో ఒకటి మహాపాపిష్టిది, ఈర్ష్య. మరొకటి మహాప్రమాదమైనది గర్వం. మనలో ఒకడు పైకిరావడం, అగ్రశ్రేణి చెందడం మన తోటివారికే ఇష్టంవుండదు. పాతిక అర్జీలు, వంద ఆకాశరామన్న ఉత్తరాలు తయారు అవుతవి. ఇది చాలా శోచనీయ స్థితి. ఇలాంటివానివలన మనకు మంచిజరగదు సరికదా కీడు హెచ్చుతుంది.

"మనమంతా ఒక కుటుంబంవారం అనే సమిష్టిభావం పెంపొందించుకోవాలి. ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో సమస్యలన్నీ పరిష్కరించుకొని దేశక్షేమం దృష్టిలో నుంచుకొని ముందుకు సాగిపోవాలి."

* 1949-1-13 మద్రాసు ఉపన్యాసంనుండి

జాతి ఉన్నతి అవనతి జాతీయ ఐక్యతమీద ఆధారపడి వుండును. మనలో జాతీయైక్యత లేదు. ఐక్యతపూట అటుంచి జాతీయ జీవనము లేదు. ఇందువల్ల మనం హీనస్థితిలో వున్నాము.

ఆంధ్రులు ఈ స్వాతంత్ర్యం నుంచి విముక్తులుగానిచో వ్యక్తిగతంగాగాని సమష్టిగాగాని అభివృద్ధిపొందలేరు. ఈ సంగతి ఎంతత్వరగా గ్రహిస్తే అంతత్వరగా అభివృద్ధి పొందగలరు.

1955 ఆంధ్రప్రదేశ్ అస్సెంబ్లీకి, దివి నియోజకవర్గం తరఫున శ్రీ మండలి వెంకట శివరామ్ ప్రసాద్‌గారును శ్రీ మల్లిపూడి రాజేశ్వరరావుగారును, ఎన్నికొనబడినట్లు ప్రకటింపబడిన రోజున చల్లపల్లికోటలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగసభకు బ్రహ్మయ్యగారు అధ్యక్షత వహించిఇచ్చిన ఉపన్యాసము. దాని సారాంశము ఇక్కడ ఉదహరిస్తున్నాను. ఇది ఆత్మపరిశీలనకు అనువుగ వున్నది.

"నేటి సభకు అధ్యక్షత వహించుట చాల భారవహమైన పని. యీ సభాధ్యక్షత వహించుటకు ముందు, అహంకారము నా దరి చేరవలదు-అని అహంకారమును భక్తిశ్రద్ధలతో వేడుకొనుట వుచితమని భావిస్తాను.

మన ప్రేమకు పాత్రులై జయశ్రీ నందుకున్న మన కాంగ్రెసు ప్రతినిధులను శ్రీ శివరామ్ ప్రసాద్‌గారిని, శ్రీ రాజేశ్వరరావుగారిని అభినందించుచున్నాను. యీ విజయ దుందుభి మ్రోగించి కాంగ్రెసు ప్రతిష్ఠను పెంచిన ప్రజలకు నా ప్రణామములు.

యీ సందర్భమున ఆంధ్రరాష్ట్ర చట్టసభల యెన్నికల సంరంభములను సింహావలోకన చేయుట వుచితమని, భవిష్యత్తునకు లాభదాయకమని తలుస్తారు.

1937 లో జస్టిసు ప్రభావము మధ్యాందిన మార్తాండుని పగిది వెలుగుచున్నది. రాజకీయరంగమున పేరు ప్రతిష్ఠలు పెంచుకొన్నవారికి ప్రత్యర్థులను పెట్టుటే చాలా కష్టతరమైనది. పూజ్యులు ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం, సాంబమూర్తి గార్లకు, వారికితోడు శ్రీ పిఠాపురం వారి ప్రజాపార్టీ అభ్యర్థులు సహితం కాంగ్రెసుకు యెదురైరి. అన్ని అధికారపదవులందును వారి కనుసన్నల మెలగువారే ఆనాడు గలరు. జిల్లాబోర్డులన్నియు వారి అనుయాయుల పాలనయిందే గలవు. సహజంగా ధనవంతుల, భూస్వాముల, జమీందారు పార్టీ అది. లక్షలు రెండుచేతులా వెదజల్లగలశక్తి వారికి గలదు. హిరణ్యకశిపునివలె వీరును "యెవడురా దీక్షైన వారెవరురా యీ ముల్లోకముల మాకు" అనే ధోరణిలో యెన్నికల సంరంభమును సాగించిరి.

కాని ముక్కుపచ్చలారని నవయువకులు, కాంగ్రెసు యోధులు స్వరాజ్య సంపాదన దీక్షాబద్ధులు; కీ॥ శే॥ పుల్లెల శ్యామసుందరరావు, శ్రీ తెన్నేటి విశ్వనాథం, మల్లిపూడి పళ్ళంరాజు, కళా వెంకట్రావు, కల్లూరి చంద్రమౌళి, బెజవాడ గోపాలరెడ్డి, బద్దెపూడి వెంకటనారాయణ రెడ్డి ప్రభృ

తులతో ఘోరపరాజయ మందిరి. అంతటితో జస్టిసుపార్టీ రాజకీయ చరిత్రయు ముగిసినది.

1937, 1946 యెన్నికల విషయాలు కాంగ్రెసును పటిష్ఠమొనర్చెను. కాంగ్రెసును తేరిపార చూడగల శక్తి యెవరికి గలదు ? అనిపించెను. అంతటితో కాంగ్రెసు అభ్యర్థుల నాయకుల ప్రతిష్ఠయు చాలపెరిగెను. ఇక వారియెన్నిక Slogan 'కాంగ్రెసువారు కర్రను పెట్టినా పుల్లను పెట్టినా వోట్లనివ్వవలెన'నే ధోరణికీ స్థాయికీ పెరిగినది.

మనుష్యులుండగా కర్రలను పుల్లలను అభ్యర్థులుగా పెట్టుటయేమి ? అనే విమర్శనాపటిమ ప్రజలలో కల్గినది. దాని ఫలితమే 1952 యెన్నికలలో కాంగ్రెసువాదుల వోటమి.

నేడు విజయ తిలకమును ధరించిన శ్రీ చల్లపల్లి జమీందారు ఆనాడు 'కమ్మసంఘం నా అండను గలదు; నన్ను గెలువగల మగటిమి యెవ్వరికి కలదు' అని అహంకార పడిరి.

ఆనాడు కాంగ్రెసు అభ్యర్థినైన నేను, చల్లపల్లి జమీందారుగారు యెంత ధనవంతులైనా, వ్యక్తిగా యెంత ఘనులైనా: 'కాంగ్రెసు సంస్థ నా అండదండల గలదు, అభ్యర్థుల నిరువురిని నేను గెలవలేనా ?' యనే నా అహంకారమునకు పట్టపగ్గాలులేవాయెను. యిట్లుండగా మా అహంకా

రాలతో మేము ఉభయులము వోడిపోగా, ఆ యెన్నికలలో జయంపొందిన కమ్యూనిస్టులు, అది తమ ప్రయోజకత్వమని కన్ను మిన్ను గానక అహంకారంతో దివిసీమరంగు రక్తపు రంగుగా చిత్రించుకొనుటేగాక 'ఆలిలేదు చూలిలేదు కొడుకు పేరు సోమలింగ' మన్నట్లు రాబోవు ప్రభుత్వమున ముఖ్య మంత్రి ఫలానా, ఆర్థికమంత్రి ఫలానా, Home మంత్రిని నేను అని ప్రగల్భాలు పలికారు. కలలు గన్నారు. దీని నంతయు గమనించియుండిన ప్రజలు, యీ దివిసీమ సహజ రంగు పసుపుపచ్చ యని తేటతెల్లముగ నిరూపించిరి.

"అహంకార పూరితులకు పతనం తప్పదని చరిత్ర రుజువు చేయుచున్నది. గాన యీ కాంగ్రెసు విజయోత్సవ సందర్భమున, విజయతిలకమును నొసట ధరించిన ఆ శివరామ ప్రసాద్ బహద్దరు, మల్లిపూడి రాజేశ్వరరావు, వేముల కూర్మయ్య, అమసుమిల్లి సుబ్రహ్మణ్యేశ్వరరావుగార్లకు ప్రజల తరఫున నేను చెప్పునది - ప్రజాసంస్థయైన కాంగ్రెసు అభ్యర్థులుగా మిమ్ములను ప్రజలు ఆశీర్వదించి, వరించి, చట్ట సభలకు పంపుచున్నారు. ప్రజాసేవ చేయుచూ ప్రజా ప్రేమను చూరగొనుట మీ విధ్యుక్త ధర్మము. దానిని మీరు విస్మరించి ఆ విష్ణాలయంలోని పులిహోర దద్ధ్యోదనాలను మరగి శివాలయ మగు కాంగ్రెసుసంస్థను మరచిన ప్రజలు దీనినెల్ల గమనించి రాబోవు 1962 యెన్నికలలో

మీకు తగినట్లు సమాధాన మిచ్చెదరు సుమా? యని హెచ్చరించుట నా విధిగా భావిస్తున్నాను."

ఈ హెచ్చరిక ఒక బిపిసీమ అభ్యర్థులను గురించి చేసినా, కాంగ్రెసు శాసనసభ్యు లందరు, హెచ్చరికగనే భావించి, ఆత్మపరిశీలన చేసుకొందురుగాక !

" పలుకకయుండుకంటె దగబల్కుట మేలు వినుండు సత్యముం
బలుకుట ధర్మమార్గమున బల్కుట సర్వజనప్రియంబుగా
బలుకుట యోలి నెక్కుడశుభంగులు వీని నెఱింగి యుండుమై
బలుకక నాల్గు చందముల బల్కగ మెత్తురు వాని దేవతల్"

— భారతము.

—...—



బ్రహ్మయ్యన్న- తమ్ములతోను, మనుమనితోను :

ఎడమనుండి:— శ్రీ మండలి వేంకట కృష్ణారావు (పార్లమెంటు మెంబరు) 2. అల్లూరు సత్యనారాయణరాజు గారు (భారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి 3. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు (కౌన్సిలు మెంబరు) శ్రీ నీలం సంజీవరెడ్డిగారు (ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి.)

# షష్టిపూర్తి సన్మానం

బ్రహ్మయ్యగారికి 3-12-58 తేదీకి షష్టిపూర్తి అవుతుంది. షష్టిపూర్తికి ఇకను పూర్ణాయుర్దాయమునకు తగు మంత్రపరంగా పూజలుచేయుట హైందవ సంప్రదాయం.

నేడు దేశ సేవకులగు పెద్దలకు వారు చేసిన సేవకుగాను షష్టిపూర్తి ఉత్సవముచేసి వారిని గౌరవించుట ఆచారమైనది.

ఆంధ్ర దేశానికి గత నాలుగు దశాబ్దములుగా అకుంఠిత దీక్షతో అఖండమయిన సేవగావించిన శ్రీ బ్రహ్మయ్యగారిని గౌరవించడం తమను తామే గౌరవించుకోవడమని భావించి కృష్ణాజిల్లాలోని ప్రముఖులు బందరులోని జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో 1958-8-5 న శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారి అధ్యక్షతను సమావేశమై ఈ దిగువ తీర్మానములు గావించిరి.

ఈ సన్మాన సంఘమునకు:—

అధ్యక్షులు:—మండలి వెంకటకృష్ణారావుగారు.

ఉపాధ్యక్షులు:—1. వల్లభనేని రామబ్రహ్మంగారు, 2 మద్దాలి జగన్నాథంగారు, 3. కె. ఎల్. ప్రసాద్‌గారు.

కార్యదర్శులు:—1. చెన్నుపాటి రామకోటయ్యగారు, 2. వీరపనేని గోపాలకృష్ణయ్యగారు, 3. విన్నకోట రామలింగంగారు.

కోశాధికారి:—దోనేపూడి ఈశ్వర వెంకటేశ్వర్లుగారు.

ఈ షష్టిపూర్తి సందర్భంలో నిధి వసూలు చేసి ఆయన సేవకు చిహ్నంగా కృష్ణాజిల్లా కాంగ్రెసు కార్యాలయమయిన శ్రీ పట్టాభి భవనసంస్థ, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య షష్టిపూర్తి హాలును నిర్మించ మరొక తీర్మానము.

శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు రాత్రి అనక పగలనక శ్రమకోర్చి మిత్రబృందంతో జిల్లాఅంతట సంచారం చేసి ఆరవై వేల రూపాయలను అనతికాలంలోనే వసూలు చేయుట ప్రశంసార్హం.

హాలుకూడా వెంటనే నిర్మాణమగుట మరింత చెప్ప తగినది.

దాతలుకూడ తమ భక్తిశ్రద్ధలు బ్రహ్మయ్యగారి యెడల చూపుట అభినందించ తగిన విషయం.

ఇంత స్వల్పకాలంలో ఇంతనిధి ఇంతవరకు ఏ సందర్భంలోను ఈ జిల్లాలో కేవలం ప్రజలనుండి వసూలు కాలేదు.

తిథుల ప్రకారం బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి డిశంబరు 1. ఆరోజున ఆయన బంధుమిత్ర పరివేష్టితుడై సహధర్మపత్నీ సమేతంగా, మన మతాచార ప్రకారం పూర్ణాయుర్దాయమునకై భక్తిశ్రద్ధలతో పూజ లొనర్చారు.

బంధుమిత్రులు, సన్మానసంఘము తరపున మండలి వెంకటకృష్ణారావుగారు దంపతులకు నూతన వస్త్రములను బహూకరించారు.

బందరులో 31-12-58 వ తేదీన సన్మానోత్సవము జరుప దలచారు.



సహచరిణీ సమేతుడై బ్రహ్మయ్యగారు అర్చనచేయుట

బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి సన్మానము తలపెట్టిన సుముహూర్త విశేషమో, సంకల్పబలమో, లేక ఆయన యందు అందరకు గల ఆదరాభిమానాలో, అనుకొన్నవి అనుకొన్నట్లు అన్నీ అయిపోయినవి.

ఆయన విశాల హృదయాన్ని, ప్రసన్న వదనాన్ని శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య షష్టిపూర్తిహాలు వెల్లడిస్తుంది.

శ్రీ బ్రహ్మయ్యగారు ఎన్ని కష్టాలుకలిగినా కాంగ్రెసుకు నమ్మినబంటుగా, బద్ధకంకణుడై తన జీవితాన్ని కాంగ్రెసుకు అంకితమిచ్చినట్లుగానే ఆయన పేరుతో వసూలు చేసిన ధనాన్ని, కాంగ్రెసు కార్యకలాపాలకొరకు శాశ్వతమైన భవనమును నిర్మించుట అధిక ప్రశంసనీయము.

శ్రీ పట్టాభి భవనంపై శ్రీ బ్రహ్మయ్యహాలు నిర్మించుట ఆ గురుశిష్యుల సంబంధానికి శాశ్వత చిహ్నము. గురుశిష్యులకు అదొక గుర్తు.

అనుకున్నట్లుగానే 31 వచ్చింది. అంతకు ముందే సన్మాన సంఘమువారు బందరు పురవీధులను అలంకరించారు. శోభాయమానంగా తోరణాలు, స్వాగతాలు, ఆర్చీలు అందరినీ ఆకర్షించటమేకాదు, ఆహ్వానిస్తున్నాయి.

బందరు ప్రత్యేకతను ప్రదర్శించే, రాబర్ట్సన్ పేట సేట్వారు కన్నుల పండుగగా అలంకరింపబడింది.

31 వ తేదీ పెద్ద పండుగగా వున్నది. బందరంతా కళ కళ లాడుతున్నది. జనంతో కిటకిట లాడుతున్నది.

30 వ తేదీకే కొందరు వేంచేశారు. 31 ఉదయాన మంత్రులు, పెద్దలు కార్లతో, కడుమోదంతో

వేంచేసి, ఆహ్వాన సంఘమువారు ఏర్పరచిన బసలకు అరిగారు.

షష్టిపూర్తి సన్మానమునకై, హాలు ప్రాంగణములో ప్రత్యేకించి నిర్మించిన పందిరి అంతా ఉదయం తొమ్మిదింటికే నిండిపోయింది.

ఆంధ్రప్రదేశ్ 20 జిల్లాలనుండి ప్రముఖులు అరుదెంచారు.

కొందరు పెద్దలు తమ ఆశీస్సులను అందచేశారు.

మరికొందరు టెలిగ్రాముల ద్వారా తమ శుభాకాంక్షలను తెలియచేశారు.

## కొందరి పెద్దల ఆశీస్సులు :

యోగ్యుడు; పూజ్యమిత్రుడగు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్టిపూర్త్యుత్సవము తెలిసి ఆనందించితిని.

దేశంకొరకు మిక్కిలి సేవచేసిన వారిలో వీరొకరు. వీరికి మంచి భవిష్యత్తు కలదు.

ఈ షష్టిపూర్త్యుత్సవము జరుపుటనునది ఆయనను గౌరవించటమేగాక మనలను మనము గౌరవించుకొనుట యగును.

వారికి భగవానుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగాక !

—వి. వి. గిరి

ఉత్తరప్రదేశ్ గవర్నరు



శ్రీ పట్టాభి భవనము, బ్రహ్మయ్య షష్టిపూర్తి హాలు

శ్రీ బ్రహ్మయ్య గారి దొక మంచి ఆకర్షణీయమగు మూర్తివంతము. దానికి తగిన యోగ్య ప్రవర్తన. ఆంధ్ర ప్రదేశ్ ప్రజాహిత జీవనములోను, కాంగ్రెసులోను, దేశాని కనేక హోదాలలో సేవచేసినవారు.

వీరికి దీర్ఘాయున్నును దేశసేవ చేసేభాగ్యమును శ్రీ వేంకటేశ్వరుడు అనుగ్రహించు గాక.

—యం. అనంతశయనం అయ్యంగారు
లోకసభ స్పీకరు

మన్మిత్రులగు శ్రీ నాట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున నా సందేశము పంపు అవకాశము కలిగినందులకు నేను ధన్యునిగా భావించుచున్నాను.

శ్రీ బ్రహ్మయ్యగారితో నాకు కలిగిన పరిచయము చాల పరిమిత కాలముదే. గడచిన జూలై 7 వ తేదీనాడు సమావేశమైన నా ఎన్నిక సభకు నా అగ్రాసనాధిపత్యము వహించుటకు పూర్వము నేనెరుగను. ఆనాడు వారితో లభించిన పరిచయమును, వారి ఉదారవర్తనము వలనను, నాయెడ వారు తరుచు చూపిన సద్భావము వలనను ఈ కొద్దికాలములోనే గాఢమైత్రిగా వికాసమొందినది.

ఇటీవల ఈ శాసనసభా మండలి సమావేశములలో వారు నా ప్రార్థనపైన సభాపతిగా పనిచేసిరి. ఆ సందర్భమున వారి కార్యదక్షతను, కర్తవ్యనిర్వహణ భారము వహించుటలో వారు ప్రదర్శించిన ఉత్సాహమును స్వయముగా

గ్రహించగల్గితిని. వారి ఉదాహరణము అనుకరణీయమని నా అభిప్రాయము ఈ సందేశము ద్వారా తెలుపు చున్నాను.

—మాదపాటి హనుమంతరావు
కౌన్సిలు అధ్యక్షుడు

శ్రీ బ్రహ్మయ్యగారితో కలిసి కార్యక్రమములో పాల్గొనే సదవకాశము నాకును కల్గినది. సుమారు యిరువది సంవత్సరములుగ వారి పరిచయ భాగ్యము నాకు కద్దు. వారిసేవ ప్రత్యక్షముగ చూచినవారిలో నే నొకడను. అట్టి కాంగ్రెసు సేవకుని, త్యాగుని తాము గౌరవించ తలపెట్టడం మన కర్తవ్యం. ఇప్పటికైనా ఆంధ్రదేశము ఈ కార్య క్రమము తలపెట్టినందులకు నేనెంతయు సంతసించుచున్నాడను. వీరు కాంగ్రెసులో నాకు మార్గదర్శకులు.

వీరిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాడను. వీరికి చిరాయు రారోగ్య భాగ్యములు పరమాత్ముడు ప్రసా దించుగాక.

—ఆర్. బి. రామకృష్ణరాజు
యం. ఎల్. ఏ.

శ్రీ బ్రహ్మయ్యగారి చాకచక్యము చతురత సమర్థత ఆంధ్ర ప్రజానీకము పూర్తిగా ఉపయోగించుకొనజాలక పోయింది. వారు రైతులోకమునకు, కాంగ్రెసునకును చేసిన సేవ అపారము. జాతీయోద్యమ చరిత్రలో వారి నామము

చిరస్థాయిగా వుండగలదు. భగవంతుడు వారికి ఆయురారోగ్య భాగ్యముల నిచ్చి, ఇంకను మానవసేవ చేయుటకు అవకాశ మిచ్చుగాక అని కోరుచున్నాను.

—మల్లిపూడి పళ్లంరాజు
ఎం. ఎల్. ఏ.

బరంపురం జైలులో మా మిత్రులతో, నేను కలసి వెళ్ళినప్పుడు ముందు మాకు జైలుఖానా అధిపతిగాను, తరువాత మిత్రుడుగను, దర్జీలా చేదాంతిగాను, మా జైలు జీవితం ఈ శుభసమయంలో జ్ఞప్తికి వచ్చుచున్నది. అతడెప్పుడు భవిష్యత్తునందు దృఢవిశ్వాసము కలవాడు. సామాన్య జనసముదాయాభివృద్ధి నభిలషించు ప్రజారంజకుడు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఉద్యమ చరిత్రలో ప్రముఖ పాత్ర ధరించి మెప్పుకు పలుకుబడి, గౌరవము సంపాదించిన నాయకుడు, విధేయతగల సేవకుడు.

ఇంతవరకు విశాలమయిన జాతీయరంగంలో పనిచేసిన వీరికి పరమేశ్వరుడు దేశానికి, ప్రజలకింకను ఎక్కువ శ్రద్ధగా సేవచేసే భాగ్యము ననుగ్రహించుగాక.

—తెన్నేటి విశ్వనాధం

రైతుపెద్ద బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి ఉత్సవము రైతులకొక పండుగ. సూరేంద్ర శ్రీ బ్రహ్మయ్యగారు రైతు పెద్దగ కాంగ్రెసు నాయకులుగ వర్ధిల్లాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

—పి. తిమ్మారెడ్డి
వ్యవసాయ శాఖామాత్యులు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసును బలపరచుటలో నిర్విరామ కృషిచేసిన, కాంగ్రెసుపెద్ద శ్రీ బ్రహ్మయ్యగారు. వారి షష్టిపూర్త్యుత్సవము జరుపుచున్న ఈ శుభసమయములో నా హృదయపూర్వక అభివందనములు అందజేసుకొంటున్నాను.

—అనగాని భగవంతరావు
దేవాదాయ మంత్రి

## మంత్రులలో ఈ దిగువవారు సభను అలంకరించారు.

మన ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు, రివిన్యూ మంత్రి కళా వెంకట్రావుగారు, అంతరంగిక వ్యవహారాలశాఖా మంత్రి కొండ వెంకటరంగారెడ్డిగారు, స్థానిక స్వపరిపాలన కార్మికశాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు, ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు, విద్యుచ్ఛక్తి నీటిపారుదల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావుగారు, ప్రణాళికా మంత్రి శ్రీ వి. బసవరాజుగారు, విద్యాశాఖామంత్రి శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావుగారు, రహదార్ల మంత్రి శ్రీ ఎం.

నరసింగరావుగారు ఒకరోజు ముందుగనే వచ్చి హాలును సందర్శించి, ఆనందించి, బ్రహ్మయ్యగారిని అభినందించి, కార్యాంతర నిమగ్నులగుటచే అరిగారు.

## కాంగ్రెసు ప్రముఖులు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పిడతల రంగారెడ్డిగారు, ప్రధాన కార్యదర్శులు శ్రీ నూకల రామచంద్రారెడ్డి, శ్రీ పెన్మరాజు వెంకట్రావుగార్లు, వింధ్య ప్రదేశ్ మాజీ లెఫ్టినెంటు గవర్నరు శ్రీ మొసలికంటి తిరుమలరావు, పార్లమెంటరి సెక్రటరి శ్రీ బి. యస్. మూర్తి, నూకల నరోత్తమరెడ్డి, యం. పి. గార్లు సభ నలంకరించారు.

పాత కాంగ్రెసు ప్రముఖులు: మూల్పూరి రంగయ్య, చింతమనేని భావయ్యచౌదరి, శరణు రామస్వామిచౌదరి, మంతెన వెంకటరాజు, మురుపిళ్ల చిట్టి, మాగంటి రామయ్య, బిక్కిన వెంకటరత్నం, మల్లిప్రాగడ పళ్ళంరాజు, కొడాలి ఆంజనేయులుగార్లు, విచ్చేశారు. శాసనసభ్యులలో చల్లపల్లి జమీందారు శ్రీ రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్‌గారు, మాజీమంత్రి శ్రీ వేముల కూర్మయ్యగారు, ఇంకా ఎందరో పార్లమెంటు సభ్యులు, శాసనసభా, కౌన్సిలుసభ్యులు వేంచేసి సభను జయప్రదం చేశారు.

మేటి కవులగు కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, అభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తి గార్లు సభ నలంకరించుట మరొక విందు.

గుంటూరు జిల్లాలో శ్రీ చెరుకువాడ వేంకటనరసింహం గారు వంచేయుటం మహాభాగ్యం.

శ్రీ మాగంటి బాపినీడు గారు, గొట్టిపాటి బ్రహ్మయ్య గారు, కళా వెంకట్రావు గారు సీతారామయ్యగారు పూర్వమే పాలుకొన్నారుగద !

పురుషులే కాక, స్త్రీలు కూడ పెక్కురు విచ్చేసి, ఈ సన్మానానికి మరొక శోభను, విశిష్టతను కలుగచేశారు.

కాంగ్రెసు ఉద్యమములోను, మహిళోద్యమములోను కాకలుతీరిన శ్రీమతులు దువ్వూరి సుబ్బమ్మ, ద్రోణం రాజు లక్ష్మీబాయమ్మ, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, మనవాక కమలమ్మ ప్రభృతులే గాక శ్రీమతులు లేడీ సంజీవ రావు, జాస్తి సీతామహాలక్ష్మమ్మ ఎం. ఎల్. సి. అమ్మన్న రాజా, టి. లక్ష్మీకాంతమ్మ, సీతాదేవి మొదలగు ఎం. ఏలు విచ్చేశారు.

అష్టదిక్పాలురవలె ఎనమండుగురు మంత్రులే గాక, శాసనసభ కౌంసిలు శాసనసభ్యులు, స్పీకరుకూడా వున్నారు.

అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి అల్లూరి సత్యనారాయణ రాజుగారు సభను అలంకరించారు. కృష్ణా జిల్లాలోని రైతు లక్షకంగా అనుపెంచారు.

విశేష మేమంటే ఈ పండుగ మా అన్నగారిది అని, సంజీవరెడ్డి, వెంకట్రావుగారు ప్రభృతులంటూంటే, మా రైతుపెద్ద దని రైతులోకం అనుకొంటుంది.



జాతీయ గీతం గానం

ఎవరో ఈ ఉత్సవం చేస్తున్నట్లుగాక, ప్రతివారు తామే చేస్తున్నట్లు, తామే ఆనందిస్తున్నట్లు 'కర్తా భోక్తా జనార్దనః' అన్నట్లుగా వున్నది.

సభావేదికపై, స్వీకరు కాశీశ్వరరావుగారు, అభినవ బృహస్పతులు శ్రీ చెరుకువాడ నరసింహంగారు, కళా వెంకట్రావు, నీలం సంజీవరెడ్డి, పిడతల రంగారెడ్డి, అల్లూరి సత్యనారాయణరాజు, బ్రహ్మయ్య, పట్టాభి రామారావు గార్లు మొదలగువారు ఆసీనులైనారు.

పతాకోత్సవము శ్రీ పిడతల రంగారెడ్డిగారు చేశారు.

బాలలు ప్రారంభోత్సవాన్ని వేదపఠనం చేస్తూవుండగా మన ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు గావించారు.

సభ ప్రారంభానికిపూర్వము బాలికలు 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అనే మంగళహారతిపాట మనోహరంగా పాడారు.

సభంతా కిక్కిరిసిపోయింది. వాలంటీర్లున్నా వారి ప్రమేయం లేకుండానే సభ్యులు నిశ్శబ్దంగా, నిరీక్షిస్తున్నారు.

శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడగుచున్న ఆహ్వాన సంఘాధ్యక్షుడగు మండలి వేంకటకృష్ణ రావుగారు సభ్యులకు స్వాగతంచెప్పి, తన తపస్సు ఫలించిందనే ఆనందంతో శ్రీ బ్రహ్మయ్యగారిని చందన తాంబూలాదులతో అర్చించి, బ్రహ్మయ్యగారికి, ఆయనసతి సరస్వతమ్మగారికి, నూతన వస్త్రాలను బహూకరించి, వివిధ ప్రముఖులచే రచింపబడిన వ్యాసాలతో, బహు చిత్రపట శోభితమై

శోభిల్లుచున్న సన్మానసంచికను, నతమస్తకుడై శ్రీ బ్రహ్మయ్య గారికి అర్పించారు.

అంతట మన రైతు పెద్ద శ్రీ బ్రహ్మయ్యగారిని కొందరు పూలమాలలతో అర్చించి, తమ ప్రేమను వెల్లడించారు.

సభలో అన్ని వైపులనుండి పూల దండలతోను, నూతన ఖద్దరు వస్త్రాలతో పెక్కురు విచ్చేసి సమర్పించి తాము కృతార్థుల మయినట్లు భావించారు.

వేసే దండలతో, ఆ ఆజానుబాహువు నతమస్తకుడై ఆగి ఆగి భారం భరించలేక, ఒక వైపున వుంచుతూంటే, ఆ మాలలు ఒక రాశి అయినవి.

మరొక వైపున వుంచిన నూతన వస్త్రాలు మరొక గుట్టయై, వింతశోభను కలిగిస్తున్నవి.

ఉన్నతకాయుడైన శ్రీ బిక్కిన వెంకటరత్నంగారు పట్టరాని సంతోషంతో రెట్టింపై, బ్రహ్మయ్యగారిని పూల మాలచే అలంకరించి, తన చేతిని వున్న ఉంగరాన్ని పట్ట బలవంతాన లాగి, వద్దన్నకొద్దీ, 'అన్నకు అన్న' అదమా యించి తమ్ముడు వేలున అలంకరించాడు.

బావగారికి గడియారం లేకపోతే బాగుండదని వేమూరి వెంకటరత్నంగారు గడియారం చేతికివ్వుంచారు. తాతగారి చేతిలో కర్ర అవసరమని చిన్న ఎం. ఎల్. సి. చక్కని చేతి కర్రను చేపట్టించాడు.

ఆ బ్రహ్మయ్యను బ్రహ్మానందంతో బ్రహ్మాండంగా అర్చించారు. అందరూ ఆనందబాష్పాలు రాల్చారు.

అంతట మండలి వెంకటకృష్ణరావుగారు శ్రీ కళా వెంకట్రావుగారిని సభకు అధ్యక్షత వహించవలసినదిగా కోరారు.

శ్రీ కళా వెంకట్రావుగారు అంతట ఇట్లా ఉపన్యసించారు.

"మా అన్నగారికి తొలిగానే నేను షష్టిపూర్తి చేసుకుంటున్నాను. డిశంబరు ఒకటవ తేదీన అన్నగారు వదినగారు వారి ఇంటివద్ద బంధువర్గముమధ్య జరుపుకున్నారు. 40 సంవత్సరాలపాటు బ్రహ్మయ్యన్న (సం 1 కి 365 రోజులూ) దేశసేవలో నిమగ్నులై నిర్విరామంగా కృషి చేశారు.

1920 నుంచీ నేను వారి నెరుగుదును. కార్యక్రమ రంగంలోనూ, జైళ్ళలోనూ కూడా వారిసేవా స్వరూపాన్ని కాంచే భాగ్యం లభించింది. ఆ స్తమానమూ ఆ చిరునవ్వుతో అందరినీ కూడతీసుకురాగల నేర్పు ఆయనది. పెద్దల సాంగత్యంవల్ల ఏర్పడిన నేర్పు కార్యదక్షతతో వ్యవహారం నడిపేవాడు.

వారి గురుత్రయం-డాక్టరు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ వెంకట నరసింహారావు గార్ల, గుణగణాలు వారిలో లీనమై పెద్దల అడుగుజాడలలో నడవగలిగారు.

ఇక వారి అనుచరులు - కొందరిముఖాలు కనుపిస్తున్నాయి ఆజానుబాహులు బ్రహ్మయ్య, కొల్లిపర సూరయ్య,

వారిమధ్య వామపమూర్తి కొడాలి ఆంజనేయులు, అదుగో అవతల తలనెరిసిన మీసాల ఆమూర్తి నాగేశ్వరరావు. వీరంతా చక్కని వాతావరణం కల్పించుకున్నారు. నైతిక స్థాయిని పెంపొందించారు. కాంగ్రెసు సంఘాలలో లెక్క లంటూ (పుస్తకంగా) వుంచటం వీరినుండే వ్యాపించింది.

బ్రహ్మయ్యగారు ఇంటి దగ్గర్నుంచే చూపే ఆదరాభిమానాలు అపారము. నీలం, భావయ్య, శరణు, కళా, వారి జాయింటు కార్యదర్శులు. పట్టాభిగారు అధ్యక్షులు, బ్రహ్మయ్యగారు కార్యదర్శి, ఆ మూడు టరములూను.

బ్రహ్మయ్య పెద్దవాడుగా మాకు మంచి తర్ఫీదు ఇచ్చాడు. వంకతిరుగుళ్ళు తప్పించుకొని పైటపడటం నేర్పాడు.

రైతు కార్యక్రమాలలో అందెవేసినచెయ్యి. పెద్దలతో చెప్పి రైతు సమస్యల కార్యరంగంలో బాగా పని చేశారు. ఈ విషయంలో చిక్కన (వెంకటరత్నం) మా అన్నకు అన్న.

భారతావని అంతటిలోను ఎక్కడా కానని విలక్షణమైన ప్రత్యేకత ఆంధ్రలో కానవస్తుంది. రాజకీయాలలో, కాంగ్రెసు ఉద్యమాలలో మధ్యతరగతి కుటుంబీకులు అధికంగా ప్రవేశించి పనిచేశారు.

అమెరికానుండి ఇండియా వచ్చేసరికే, 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం ఆంధ్రలో ముగిసిందని ఒక అమెరికా పత్రికా విలేఖరి వ్రాశాడు.

చిన్నా పెద్దా అంతా పనుగత్తారు. రాజమండ్రి జైలు నాలుగునోజులలో భర్తీ అయింది.

ప్రజానీకంలో రైతుకుటుంబాలలో రాజకీయ చైతన్యం కలిగించిన వారిలో బ్రహ్మయ్యగారొకరు. వారికి తెలుగుగడ్డ ఆజన్మాంతం కృతజ్ఞతగా వుండాలి.

మూర్తిత్రయం-(Iuspiration) ప్రభావంతో జాతీయోద్యమ వివిధ రూపాలలో, రంగాలలో పీరు పాల్గొన్నారు.

పట్టాభిగారు పెక్కు సంస్థలను సృష్టించారు. అందులో ఒకటగు హిందుస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీకి బ్రహ్మయ్యగారు మేనేజింగ్ డైరక్టరు. సరియైన గురువుకు సరియైన శిష్యుడు.

ఈయనకు దేహబలం అండగా నిల్చింది. అధికంగా ఇకముందు దేశపునర్నిర్మాణ పథకంలోకూడ వారు తమ విస్తృత్త పిషులను సమర్థతతో నిర్వహింపగలరు.

మేను చెప్పజాలనంత ముదము 1960 నాటికి షష్టిపూర్తి అయ్యేవారం ఇక్కడ చేరాం. మాకు ఆశగావుంది.

బ్రహ్మయ్య షష్టిపూర్తిహేలు జిల్లావాసులకు ఆయనపై గల ఆనరాభిమానాలకు శాశ్వత చిహ్నము కాగలదే. ఒక్క మండలి కృష్ణరావు జీపువేసుకు తిరిగితే అయ్యేపనా ఇది !

ఏ ఆదర్శాలకై బ్రహ్మయ్య తన జీవితం అంకితం చేశాడో, ఆ ఆదర్శాలకు ఈ హేలు చిరస్థాయిగా వుండగలదు!

అనంతరం అధ్యక్షులు, అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి అల్లూరి సత్యనారాయణ రాజుగారిని బ్రహ్మయ్యగారి చిత్రపటావిష్కరణ చేయమని అభ్యర్థించారు.

సత్యనారాయణ రాజుగారు, చిత్రపట ఆవిష్కరణ చేస్తూ ఇల్లా ఉపన్యసించారు.

"బ్రహ్మయ్యగారు ఆంధ్రరాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా వుండగా, నామీద క్రమశిక్షణ చర్య తీసుకున్నారని అంటున్నారు వెంకట్రావుగారు. అందులో వెంకట్రావుగారి మద్దతు ఏమీ తక్కువ లేదని మనవి. ఇంత ఉద్యమం సాగించి ఈనాడు ఇంతమందిని ఇక్కడ సమావేశపర్చిన మండలి వెంకటకృష్ణారావుకు అభినందనాలు.

ఎంతశక్తి ప్రపత్తులున్నా, ఆంధ్రులలో అనైక్యత జాస్తిఅని, తమ నాయకులను తాము గుర్తింపజాలరని వున్న అపవాదు ఈనాడు పోగొట్టుకున్నాము.

భారతీయ సంస్కృతికే చిహ్నమైన బ్రహ్మయ్యకు శాశ్వత చిహ్నాన్ని నిర్మించడం మెచ్చతగ్గది.

ఆ తరంవాళ్ళలో నేను చాలా చిన్నవాణ్ణి. నాపై చర్య తీసుకొనేనాడుకూడా బ్రహ్మయ్యగారు నాపై పగబూనలేదు. నేను చెప్పేదానిలో విలువ ఎక్కువ. గతచరిత్ర కళ్ళముందు గిర్రున తిరిగి ఆనందంగా వుంది. కఠోరత, కక్ష, ద్వేషం, అసహనం జీవితంలో లేని మహావ్యక్తి బ్రహ్మయ్యగారు.



షష్టిపూర్తి సంఘాధ్యక్షుడు మండలి వెంకటకృష్ణారావుగారు బ్రహ్మయ్యగారిని అర్చించుట



శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు బ్రహ్మయ్యగారి చిత్రపటాన్ని ఆవిష్కరిస్తున్నారు.

నేటి సంస్థలో తిరుగుబాటుదారులు చేస్తున్నట్లు మేము చేయలేదు. కాలానికి తలవొగ్గాము. ఆనాటి కార్యక్రమాలలో ఉత్సాహంగా, ఆనందం ఉండేది. ఆందోళన సంఘర్షణ లేవు. కార్యక్రమాలపై ఆదర్శాలపైగాక, వ్యక్తుల ప్రాబల్యమూ, పదవులు లేకపోవడము, ఈనాడు రాజకీయాభిప్రాయాలకు కారణము.

మన రాజ్యాంగానికి ప్రజాస్వామ్యము పునాది. విభిన్న అభిప్రాయాలు కలిగివుండటమే దాని అభివృద్ధికి మూలం. అభిప్రాయభేదం లేనిదే అభివృద్ధి లేదు. ఈ ఘర్షణలో సత్యం తేలుతుంది. నిర్ణయం తేలినతర్వాత దానిని ఆచరించడం ప్రజాస్వామ్య మూలసిద్ధాంతం. కాంక్షను పరిధులు దాటిపోకుండా అదుపులో వుంచుకోవడమే బ్రహ్మయ్యగారిలో గల విశేషం.

1945 ఎన్నికలలో ప్రచారమధ్యలో వున్న ఆయనను తొలగించి, హైకమాండు శ్రీమతి సీతారామహాలక్ష్మమ్మను ఆ స్థానమునకు నియమిస్తే ఆయన ఆమెను బలపరుస్తూ క్రమశిక్షణ కలిగి వర్తించారు. ఆ విధమైన ప్రవృత్తి మన రాజకీయాలలో లోపిస్తున్నది. 'సంస్థకంటే నేను అల్పుడను, సంస్థను పటిష్టం చేస్తే, దానితో నేను పెంపొందగలను' అని గుర్తెరింగిన రాజకీయ శిక్షకుడు బ్రహ్మయ్యగారు.

భూస్వాములెవరో, రైతులెవరో, గుర్తెరిగి అట్లనే వ్యవహరించడం ఎరుగునుగాని, భూస్వాములను రైతులుగా చిత్రించే వర్గంలోని వారు కారు వీరు.

రైతులమధ్యా, విజ్ఞాన కేంద్రాలలోనూ, సమంగా చలామణీ కాగలడు. పాత కొత్తల కలయిక ఈయన.

పాత సంస్కృతి వున్నా, వ్యవహారపద్ధతి నామా నేడూ ఒకటే. అభిప్రాయభేదాలను గుర్తించి వ్యవహరింప గల దక్షుడు.

ఇంతకూ కారణం గురుమూర్తుల ప్రభావం. దానితో సహజ సంస్కారం మేళవించాడు. ఆయనవలె వివేచన విచక్షణాలతో వ్యవహరించడం, దీక్ష క్రమశిక్షణ అవసరం.

ఇంతేమనిషి ఇంతకాలానికిగాని ఒక పదవిలో ప్రవేశించే అవకాశం కలిగించకాదు. వీరు దూరంగా వుండటం శ్రేయస్కరంకాదు. ప్రభుత్వానికీ, ప్రజలకూ మధ్య వీరి సేవలు అత్యంతం కావాలని వీరిని ఎం. ఎల్. సి. గా ఎన్నుకొని ప్రథమ అధ్యక్షపదవి ఇచ్చి గౌరవించారు."

షష్టిపూర్తి హాలుకు ప్రారంభోత్సవంచేసిన ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారిని, అధ్యక్షులు ఉపన్యసించవలసినదిగా కోరారు.

వారిలా ఉపన్యసించారు :

"బ్రహ్మయ్యగారు నాకు పెద్దన్నగారు. నేను రాజకీయాలలో ప్రవేశించిందే తడవుగా పట్టాభి సీతారామయ్యగారి పరిచయం లభించడం, వీరి అండను రాజకీయ శిక్షణ నేర్వడమూ జరిగింది. ఆ రుణం తీర్చుకోలేను.

అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు సర్దుబాటుగా మెలగవలసిన తీరుతెన్నులు బ్రహ్మయ్యగారు నేర్పారు. పట్టాభి



ముఖ్యమంత్రి పంజీవరెడ్డిగారు ఉపన్యసించుట



కాంగ్రెసు కార్యదర్శి శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజుగారు
బ్రహ్మయ్యగారి చిత్రపట ఆవిష్కరణ చేయుట

గారు అధ్యక్షులుగావున్న మూడుటరములూ బ్రహ్మయ్య గారి ప్రక్క నేను సహాయ కార్యదర్శిగానే వున్నాను. పట్టాభిగారు ఉన్నతులు, నేను చిన్నవాణ్ణి. తప్పుకు తప్పుకు తిరిగేవాడిని. బ్రహ్మయ్యగారు చాలా చనువుగా అందు బాటులో ఉండేవారు. పెద్దలలో పెద్దగా, చిన్నలలో చిన్నగా మెలిగేవారు. పెద్దలకు సేవచేస్తూ చిన్నలకు ఉత్సాహశక్తులు కలిగించేవారు. రాష్ట్ర రంగంలో బ్రహ్మయ్యగారిది ప్రధానపాత్ర.

వారికి స్వేచ్ఛనిచ్చి పట్టాభిగారు అఖిలభారత రంగంలో కార్యక్రమాలు చూచుకొనేవారు.

ఈర్ష్య అసూయలకు తావు ఇవ్వకుండా, అవసరమైనప్పుడు తాను మారుతూ, ఇతరులను మారుస్తూ, కార్య దక్షుడు అనిపించుకున్న కొద్దిమంది ఆంధ్ర నాయకులలో బ్రహ్మయ్యగా రొకరు.

కక్ష వారి మతం కాదు. చిన్నతనంలో ఇచ్చిన శిక్షణ చిరస్థాయిగా వుంటుంది. నాలుగేళ్ళపాటు నడచిన శిక్షణ నాది.

ప్రకాశంగారు అధ్యక్షులై బ్రహ్మయ్యగారి స్థానే వెంకట్రావుగారు కార్యదర్శిగా వచ్చినా, నేను సహాయ కార్యదర్శిగానే వున్నాను.

త్యాగధనులైన పెద్దలను గౌరవించటం ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాం.

దేశం నలుమూలలనుండి వచ్చినవారందరూ బ్రహ్మయ్యగారిని గౌరవిస్తున్నారు.

ఈ దేశములో త్యాగధనులైన నాయకులు ఎందరో వున్నారు. కాని పైకి పోయేవారిని కాలు పట్టుకు లాగటం పద్ధతి మార్చుకోవాలి.

ఈనాడు కాళేశ్వరరావు, హనుమంతరావుగార్లకు అర్థస్థానాలు యిచ్చి గౌరవించాం. 'అంగీకరించక ఏమి చేస్తారులే' అని కవిస్త్రమాట్ను నామినేట్ చేశాము. అల్లానే బ్రహ్మయ్యగారిని ఎన్నుకున్నాం. వారికిదే మన గౌరవము. ఈ విధంగా మనదేశాన్ని మనం గౌరవించుకున్నాము

బ్రహ్మయ్యగారిది పింఛను దారీ (Retiring) స్వభావము. ఆయన రైతుపెద్ద-మళ్ళీ పెద్దరైతు అయితే భూ సంస్కరణాల బాధవుంది.

ఎంతవరకు అవసరమో, అంతవరకే మాట్లాడుతారు.

కాళేశ్వరరావుగారు స్వీకరవబట్టె సరిపోయింది. చూస్తిరిగా కళావారి కోపము! ఆయనే అయితే మాట దక్కేదికాదు.

ఆనాడు పట్టాభి నాయకత్వాన బ్రహ్మయ్యగారి చెప్పుచేతలలో మెలగి, తరువాత ప్రకాశంగారివద్ద తర్ఫీదు పొందాను. ఆ శిక్షణాలే ఆస్తిగా నేను ఈనాడు మీ సేవ చేయకలుగుతున్నాను.

బ్రహ్మయ్యగారి పేరు మహత్యంవల్ల ఇంత పైకం వసూలు సాధ్యమయింది. ఆంధ్రదేశంలో 20 జిల్లాలనుండి ఇందరువచ్చి గౌరవించడం శుభావహం."

కురువృద్ధులు కాశీశ్వరరావు పంతులుగారు, గురువులు చెరుకువాడ వెంకటనరసింహంగారు ఆశీర్వదించుతూ పలి కారు.

హోంశాఖామంత్రి కొండా వెంకట రంగారెడ్డిగారు ఇంత ఘనులైనవారి ప్రక్క నే వుండికూడా తెలుసుకో లేనం దుకు వగచారు. వారుకూడా ఆశీర్వదించారు.

అనంతరం బ్రహ్మయ్యగారు వినమ్రులై కృతజ్ఞతా పూర్వకంగా ఇట్లా ప్రసంగించారు:

"సోదర సోదరీ మణులకు నాపైగల ప్రేమ, వారి హృదయాలలో నాకుగల స్థానము నేను గుర్తెరిగి గలిగాను.

ఘంటసాలలో కొందరుమిత్రులు నా శిలావిగ్రహ ప్రతిష్ఠాపన చేస్తామంటే; నా అనంతరం చేసుకోండి, ఇప్పుడు కాదన్నాను.

గురువులు పట్టాభిగారు ఆ మధ్య 'బ్రహ్మయ్యగారూ మీ వయస్సెంత ?' అన్నారు. 'అరవై అనుకుంటున్నాను' అన్నాను. షష్టిపూర్తి ప్రస్తావన పత్రికలలో చూడరాదేం ? అంటూ హెచ్చరించారు.

"పెద్దలకు జరిగిన సన్మాలను కొంచపరుప జాల న'న్నాను.

కాని చివరకు మనుమడు కృష్ణారావు 'మీ పేర హాలు కట్టుకుంటాం' అంటే కాదనలేకపోయాను.

సువిశాలమైన ఈ హాలు మూలముగా కృష్ణాజిల్లా వాసుల హృదయాలలో నాకెంత విశాలమైన స్థానమున్నదో తెలుసుకున్నాను. కృతజ్ఞుడను.

ఇంకా పదిపాళ్ళు మాత్రమే నాకు చెందుతుంది. మిగతా 90 పాళ్ళు నా గురుపరంపరకు చెందుతుంది.

నా ప్రధానగురు దేవులు ముట్నూరి కృష్ణారావుగారు.

తాతవలె సైనికుడనో, పినతండ్రివలె న్యాయవాదినో కావాలనుకున్న నేను, బ్రహ్మసమాజంలో కృష్ణారావుగారి ఉపన్యాసాలు, కృష్ణాపత్రికలో వారి వ్యాసాల మహిమ వల్ల తండ్రివలె ప్రజా సేవకుడనుగా తయారయ్యాను.

అంటరానితనం పాటించకుండా వుండటం, స్వదేశీ వ్రతము, మున్నగు కార్యకలాపాలద్వారా, నా జీవితాన్ని తీర్చి దిద్దాగు. మా మాన్య తల్లిదండ్రుల ప్రేమ.

అది 31-7-1920. తిలక్ నిర్యాణం గాంధీజీ భారత రాజకీయ కర్ణధారి కావడం.

విజయవాడలో జరిగిన జాతీయవాదుల సమావేశములో ప్రతినిధిగా నేను రాజకీయాలలో పూర్తిగా ప్రవేశించిన రోజు.

1920 లో జవిసీమ కోడూరులో సభ జరిగింది. కృష్ణారావుగారు, అబ్దుల్ బాషా, బోడి నారాయణరావు, చెరుకువాడ నరసింహంగార్లతో వెళ్లాను.

కృష్ణారావుగారి ఆదేశానుసారం నన్ను సభాధ్యక్షుణ్ణి చేసి ఆదరించారు పెద్దలందరు.

నా పరోక్షాన నరసింహంగారు, కృష్ణారావుగారు అక్కరకొచ్చే కుర్రవాడు అనుకున్నారు.

కాంగ్రెసు సభ్యునిగా ప్రథమంగా చేర్పించింది నరసింహంగారు.

1921 లో కృష్ణారావుగారు జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షులు. మరుసంవత్సరం నన్ను ఉండమన్నారు వారు. నేను ఉండనన్నాను. మామధ్య పోటీ. పెద్దలఓట్లు నాకు; పిన్నల ఓట్లు వారికి.

పట్టాభిగారు లెక్కలో ఒక ఓటు ఎక్కువ వేశారో ఏమో, నేనే గెలిచా నన్నారు. అధ్యక్షుణ్ణయ్యాను. తరువాత వారి ఆశీర్వచన బలంతో తాలూకా కాంగ్రెస్సు అధ్యక్ష పదవి నిర్వహించాను.

1926 లో పట్టాభిగారు గాంధీగారి ననుసరించి శాసన సభా ప్రవేశానికి వ్యతిరేకిగా వున్నా, కాంగ్రెసు ఆదేశానుసారం, శాసనసభా ప్రవేశానికి అనుకూలంగా పనిచేశాను. కాంగ్రెసు అన్నిరంగాలలోను పాల్గొన్నా, 16 అణాల సైనికుడను. కాంగ్రెసు సంస్థకు మినహా ఏ ఒక్కరికీ లోబడలేదు. విభేదాలు వచ్చినప్పుడు గురువుతో గ్రుద్దులాట తప్పనప్పుడు నమస్కార బాణం వేసి మరీ వ్యవహరించాను. అందుకే ఈ సన్మానమేమో! రాజకీయరంగం పూలపాన్పు కాదు. జీవితాంతంవరకు కాంగ్రెసు భక్తుడుగానే వుండాలనికోరిక.

తపస్సు పిండమై జన్మించిన మూర్తి కృష్ణారావుగారు, ఆనాడు అధ్యక్షపీఠం ఎక్కించారు.

అన్న పీఠం సృష్టించి, వెంకట్రావు, సంజీవరెడ్డిగార్లు గౌరవిస్తున్నారు. ఎందరో పెద్దలూ పిన్నలూ కూడా ఆప్యాయతతో 'అన్నా' అంటే వళ్లు జలదరిస్తుంది.

మూడో క్షత్రియవర్గం. అవసరమున్నపుడు యుద్ధ క్షేత్రం; తదితర కాలంలో క్షేత్రపాలన.

సోదరుడు సంజీవరెడ్డిగారు నేను కోరకుండానే హైదరాబాదు పిలిచి ఎం. ఎల్. సి. ని చేశారు. ప్రజాసేవకు మరొక అవకాశం కలిగించాడు ఆయన. తదనుసారంగా సేవచేస్తానని వాగ్దానం చేస్తున్నాను.

మండలి కృష్ణారావు తాత పీఠం సాధించాడు. అతను కూడా చిరకాలం ప్రజాసేవ చేసి అందరిచేత 'తాతా' అనిపించుకోవాలి.

గురువులతో, సోదరులతో, మనుమలతో, కాడికలిపి లాగిన ముసలిఎద్దును నేను.

సెలవు"

## ఊరేగింపు ఉత్సవము

ఆ సాయంకాలం 5 గంటలకు షష్టిపూర్తి హాలు నుండి బందరు పురవీధులగుండా మ్యునిసిపల్ పార్కుకు పెద్ద ఊరేగింపు ఉత్సవం.

చక్కగా అలంకరింపబడిన బండిలో మన రైతుపెద్ద బ్రహ్మయ్యగారు, చెరుకువాడ వెంకట నరసింహంగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఆసీనులయ్యారు.

ఆ బండికి రైతుపెద్దకు తగినట్లు 60 జతల ఎడ్లను కట్టారు. ఆ ఎడ్లజతలముందు వేలాది ప్రజలు, మేళతాళాలు మతాబులు బాణసంచాలు, అవ్వాయి చువ్వలు.

కన్నుల పండుగగా ఆ ఊరేగింపు సాగింది.

## బహిరంగసభ

పార్కులో చక్కగా అలంకరింపబడిన వేదికపై, అధ్య క్షులు కాశీశ్వరరావు, బ్రహ్మయ్య, అల్లూరి సత్యనారాయణ రాజు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, తుమ్మల సీతారామమూర్తి, సంజీవరెడ్డిగారు మొదలగు ప్రముఖులు ఆసీనులయ్యారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు మండలి వెంకటకృష్ణారావు గారు ఈ క్రిందివిధంగా ప్రసంగించారు.

ఆంధ్రకాంగ్రెసులో క్రమశిక్షణ పాటించిన మనపెద్ద బ్రహ్మయ్యగారికి షష్టిపూర్తి చేస్తున్నాము.

నాయకులందరూ విచ్చేసి ఇందులో పాల్గొన్నారు. కాశీశ్వరరావుగారు అధ్యక్షత వహిస్తున్నారు.

పని ప్రారంభించిన వేళా విశేషం. మూడు నెలల్లో 60 వేలు సేకరించి బ్రహ్మయ్యగారి పేర బ్రహ్మాండమైన హాలు నిర్మించి, కార్యక్రమం పూర్తిచేశాం. ఆహ్వానసంఘము వారు నిమిత్తమాత్రులు. దాతలు ఆనందంతో యధాశక్తి యిచ్చి ఈ కార్యక్రమానికి తోడ్పడినందుకు కృతజ్ఞతా పూర్వక వందనములు."

ప్రథమంలో పురపాలక సంఘాధ్యక్షులు కోళ్ళపర్తి నరసింహారావుగారు, నాయకులకు, బ్రహ్మయ్యగారికి స్వాగతము పలికి స్వాగతపత్రము సమర్పించారు.

ఆయన వ్యక్తిగతంగా బ్రహ్మయ్యగారికి నూతన వస్త్రములను బహూకరించారు.

అంతట బందరుపట్టణ తృతీయమండల కాంగ్రెసు సంఘము, చల్లపల్లి మండల రైతు కాంగ్రెసు సంఘము, దివితాలూకా కాంగ్రెసు రాజకీయ బాధితుల సంఘము, కూచిపూడి వెంకట్రామా నాట్యమండలి, బందరు ది కృష్ణా మోటారువర్కర్సు యూనియన్, గుడివాడపట్టణ తాలూకా కాంగ్రెసు సంఘములు మొదలగు సంఘాలవారు సన్మాన పత్రాలు సమర్పించారు బ్రహ్మయ్యగారికి.

తర్వాత అధ్యక్షులు కాళేశ్వరరావుగారు, విశ్వనాథ సత్యనారాయణగారిని ఉపన్యసించవలసిందిగా కోరారు.

సత్యనారాయణగారిట్లా ప్రసంగించారు :

"బ్రహ్మయ్యనుగురించి ఒకమాటలో చెప్పాలంటే 'మా బ్రహ్మయ్య' అంటే చాలు. ఆయన అందరికీ అన్న. నేను ఆయన ఒకరిద్దగు అన్నలలో ఒకణ్ణి.

ఈసభకు కాళేశ్వరరావుగారు అధ్యక్షులుగావుండటం చాల ఔచిత్యం.

ఒక్కొక్క ఊరికి ఒక్కొక్క చరిత్ర వుంటుంది. బందరు ఊరికి ఊరుతనం తెచ్చినవారు, పట్టాభి వగైరా నాయకులు. అట్లనే బెజవాడకు బెజవాడతనం తెచ్చింది కాళేశ్వరరావుగారు.

తెలియకుండానే ఆయా పెద్దల ముద్ర ఆయా ప్రాంతాల ప్రజలపై పడతాయి.

నామీద బందరు నాయకుల ముద్ర లేగాక బ్రహ్మయ్య వంటి పిన్నల ముద్రలుకూడా వున్నాయి.

ఆ రోజులలో నేను అల్లరివాణ్ణి. నేను; బ్రహ్మయ్య, సూరయ్య, ఆంజనేయులు గుప్పిసలాడుతూ తిరిగేవాళ్ళము. ఆ రోజులలో అప్పుడప్పుడు వ్రాస్తూవచ్చిన పద్యాలు ఒక సంపుటంగా తయారుచేస్తున్నాను. దాన్ని బ్రహ్మయ్యకు అంకితం ఇయ్యతలచాను. ఆ అంకితంలోనుంచి పద్యాలు నాలుగు వినిపిస్తాను.

అని కొన్ని పద్యాలు చదివారు.

అనంతరం పార్లమెంటరి కార్యదర్శి బయ్యా సూర్య నారాయణమూర్తిగారు గద్య పద్యాత్మకంగా ప్రసంగించారు.

"బ్రహ్మయగారు కేవలం ప్రాంతీయ నాయకుడే గాక యావద్భారత నాయకుడు. ఈయన ప్రకృతికి సంబంధించిన వ్యక్తి.

సంఘ వ్యవస్థలో కులాలు పోతేగాని అభివృద్ధి లేదు. గాంధేయపంథాలో బ్రహ్మయ్యగారు చిరకాలం దేశ సేవ చేయుదురుగాక !"

తుమ్మల సీతారామమూర్తిగారు బ్రహ్మయ్యగారి సేవను ప్రశంసిస్తూ పెక్కు పద్యాలను శ్రావ్యంగా వినిపించారు.

చంద్రకాంతమ్మ, జ్ఞానానందకవి, రాజారావుగార్లు తాము రచించిన పద్యాలను పఠించారు.

సభాధ్యక్షులు కాళేశ్వరరావుగారిట్లా ప్రసంగించారు:

"నేనూ బందరువాడినే. నా చదువు యిక్కడనే. ప్రథమంలో నేను ఇక్కడ ఉపాధ్యాయుడను.

సౌకర్యంకొరకు పట్టాభిగారు 37 ఏళ్ళక్రితం కృష్ణా జిల్లాను,తూర్పు పశ్చిమ కాంగ్రెసు జిల్లాలుగా రెండుచేశారు. మళ్లా నేడు కాంగ్రెసువారు కలిపారు. దీనికి బ్రహ్మయ్యే నే డధ్యక్షుడు.

ఆయనకు ఈనాడు ఇంతగా సన్మానం జరగడం సంతోషం. ఈ శుభసమయంలో చక్కని భవనం కట్టించారు. ఆంధ్రరత్నభవనానికేమీ తీసిపోయేదికాదు ఇది.

బ్రహ్మయ్య ఏమంత పెద్దవుద్యోగికాడే! అవిచ్ఛిన్నమైన సేవ చేశాడు. అందువల్లనే ప్రజా హృదయాన్ని చూరగొన్నాడు.

గ్రామగ్రామంలోను బ్రహ్మయ్యంతటి నిస్వార్థ దేశసేవకులు కావాలి.

మాతరంవారం సంతృప్తితోపోమా ? నిరాశతోనా ! బ్రహ్మయ్య పూజతో దేశంమీద ఆశ కలుగుతోంది. నిస్వార్థసేవ చేసేవాణ్ణి పూజించడం జరిగింది."

అనంతరం అల్లూరి . సత్యనారాయణరాజుగారిట్లా వచించారు :

"ఘంటసాలలో జన్మించి, మొదట కృష్ణాజిల్లాలోను అనంతరం ఆంధ్రరాష్ట్రమంతటా అఖండ సేవ చేసిన యోధునకు జోహారులు. చిరకాలం జీవించి, ఇతోధికంగా నాయకత్వం వహించవలసినదిగా కోరుచున్నాను.

మండలివంటి యువకులంతా వారినుండి ఎన్నో పాఠాలు నేర్చుకోవాలి.

బ్రహ్మయ్యగారి రాజకీయజీవితం 35 ఏళ్ళు అనంతరం స్వస్థానం గుర్తింపచేసి చరితార్థమయింది.

అసమాన మెరుగరు, సంతృప్తి హృదయులు, యువకులకు నూతనోత్సాహం కలిగిస్తూవుంటారు. వరుసలతో పిలుస్తూ, ఆప్యాయతగా ప్రోత్సహించటం వారి ప్రత్యేకత.

క్రమబద్ధమైన జీవితాన్ని గడపిన మహావ్యక్తి. కాంగ్రెసుకు, ప్రజాస్వామిక ప్రభుత్వానికి బలం ఆయన. వారికి కాంగ్రెసు కార్యకర్తల పక్షాన జోహారులు.

బ్రహ్మాండమైన సంస్థకు సంబంధించిన వ్యక్తులం మనం. సంస్థ వ్యక్తులకంటే చాలా ఉన్నతమైనదని చెప్పేవారు. ఇటువంటి నాయకుల అండను, నెహ్రూ మహానాయకుని అనుసరించి ప్రజాస్వామ్యాన్ని రక్షించుకుందాం."

బ్రహ్మయ్యగారి గురుత్రయంలో ఒకరగు చెరుకువాడ వేంకటనరసింహంగారిలా వచించారు:

"ఆప్తులు, మిత్రులు, పెద్దలు వచ్చి ఆశీస్సులు ఇచ్చారు. బ్రహ్మయ్య షష్టిపూర్తిని పురస్కరించుకుని మంచిమాటలు చెప్పుకుందాం.

బ్రహ్మయ్య అత్యంత సన్నిహిత ఆప్తుడు. గురుజన విధేయుడు. యోగ్యులైనవారు చిరకాలం జీవించి దేశసేవ చేయడం అవసరం. యువకులందరు తల్లిదండ్రులకు పేరు తెచ్చేవిధంగా దేశసేవ చేయకలగాలని వారికి బ్రహ్మయ్య

చక్కని వరవడి పెట్టాడు. దానిని అనుసరించండి. అదే ఈ ఉత్సవ లక్ష్యం."

ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు ఇట్లా ఉపన్యసించారు:

"మా అన్నగారి షష్టిపూర్తి బందరువారికే కాదు. ఆంధ్రదేశంలో 20 జిల్లాలనుండి, కార్యకర్తలు ప్రజలు—ప్రభుత్వ ప్రతినిధులు, శాసనసభ్యులు, కోరంవుంది. సభాధ్యక్షులతో సహా అందరంవచ్చి పాల్గొంటున్నాం. ఇందరిని ఆకర్షించగల మహాశక్తి బ్రహ్మయ్యగారిలో వున్నది.

ఆదిలాబాద్, శ్రీకాకుళం, నెల్లూరు, అనంతపురం వంటి దూరపుజిల్లాలనుండి ఇందరు వచ్చారంటే వారి ఆకర్షణశక్తి సామాన్యమా?

ఆయనతో వ్యతిరేకించే వారిలో ఏదో లోపం ఉండాలి. అంత సరస హృదయులు వారు.

20 ఏళ్ళక్రితం బందరులో వారికి సహాయ కార్యదర్శిగా వుంటూ ఈ బందరువీధుల్లో తిరుగుతూండేవాణ్ణి. అవే మంచిరోజులు.

ఈనాడు ఎక్కడ ఏ బాధ వచ్చినా ఈ ముఖ్యమంత్రి మీద పడుతుంది బాధ్యత. ఇప్పుడే వార్త విన్నాను—నెల్లూరులో ఆహారధరల ఆందోళనలో వ్యవహారం పోలీసుల కాల్పుల వరకు వచ్చిందని. గత అయిదారు ఏళ్ళుగా రాష్ట్రంలో కాల్పులు లేకుండా జరుపుకొనివచ్చాం. నేటికీ సంఘటనకు విచారిస్తున్నాను. నా మనస్సు అక్కడేవుంది.

ఇలాంటి విషమఘట్టాలలో బ్రహ్మయ్యన్నగారు సరైన సలహా యివ్వగలవారు. రైతుదృష్టిలో, సమైక్య దేశక్షేమ దృష్టిలో సలహా వారివ్వగలరు.

విషయాలు తెలియకుండానే ఈవిధంగా దేశంలో కేకలు వేసేవారు ఎక్కువ కాబట్టి అనర్థాలు వస్తున్నవి. *

రైతుల ప్రస్తుత ధరలు తమకు గిట్టుబాటు కావంటారు. బస్తీవారు కొనుక్కునేవారు ధరలు తగ్గించాలంటారు. ప్రభుత్వం ఈ రెంటినీ సమన్వయ పరచుకురావాలి.

పేదల పేదతనాన్ని కొందరు రాజకీయాలకు ఉపయోగించుకో చూస్తున్నారు. అది సాగనీయరాదు.

ఇలాంటి క్లిష్ట సమయాలలో బ్రహ్మయ్యగారివంటి నాయకుల సలహా అవసరం,

కాశీశ్వరరావుగారి అధ్యక్షతను బందరు పెద్దలమధ్య ఇంత సన్మానం జరుగుతున్నందుకు సంతోషిస్తూ అన్నగారికి బహుకాలం దేశసేవ చేయగల భాగ్యం భగవంతుడు ప్రసాదించాలని కోరుతున్నాను"

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు ఎం. ఎల్. సి. స్త్రీల తరఫున బ్రహ్మయ్యగారి సేవలనుకొనియాడుతూ, "ఆయన బహుకాలం వర్ధిల్లి ఇతోధిక సేవచేయ భగవానుడనుగ్రహించుగాక !"

---

* సభలో ఎవరో ధరలు తగ్గించాలని కేక వేశారు.

బ్రహ్మయ్యగారికి అత్యంత ఆప్తులు అయిన పండిత వెంకటసుబ్బయ్యగారు తాము రచించిన సరోజినీదేవి చరిత్రను ఈ శుభసమయాన అంకితం చేస్తూ ఇట్లా పలికారు:

"మా బ్రహ్మయ్యకు ఏదో సంబంధం కలిగించుకొని పిలిస్తేగాని తృప్తిలేదు.

కళా వెంకట్రావు, సంజీవరెడ్డిగార్లు ప్రభృతులు అన్నా అని సంబోధిస్తున్నారు. 'మండలి'వంటివారు 'తాతా' అని సంబోధన.

ఇక నాకే సంబోధనా మిగలలేదు. అన్నమాట అంటే ఔచిత్యమేముంటుంది.

అందుచేత 'త్వమేవాహం' 'నీవే నేను' అంటున్నాను.

కాంగ్రెసువారిలో దేశోద్ధారక నాగేశ్వరరావుగారిది మాతృస్థానము.

ఆంధ్రకేసరి ప్రకాశంగారిది పితృస్థానము.

కళా తపస్వి కృష్ణరావుగారిది ఆచార్య స్థానము.

రైతుపెద్ద బ్రహ్మయ్యగారిది అన్నగారి స్థానము. ఆయనది ఏకోదారాంతః కరణ.

ఆయన హృదయ పద్మమునుండి ఆవిర్భవించే ఆప్యాయతలోని విశిష్టతవల్లనే అందరినీ ఆకర్షించి, అందరిచేత ఆకర్షింపబడుచున్నాడు.

పిన్నలగు సంజీవరెడ్డి, కళా వెంకట్రావు గార్లేగాక పెద్దలగు యజ్ఞనారాయణశాస్త్రి, కాళేశ్వరరావుగార్లు కూడా, 'అన్నా' అని ఆప్యాయతతో అంటారు.



వెంకట సుబ్బయ్యాగారు అంకిత మిచ్చుట



బ్రహ్మయ్యగారు 'సరోజినీదేవి'ని అంకితమిచ్చిన: వెంకట సుబ్బయ్యగారిని సన్మానించుట

తమ్ముల అభివృద్ధి చూచి ఆనందించే బ్రహ్మయ్యన్న మార్గాన్ని అనుగమిస్తూ, ఆయన షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున ఈ ప్రేమోపహారమును ఒసంగుచున్నాను."

అనంతరం నంబూరి శ్రీనివాసరావుగారు, బ్రహ్మయ్య గారి చరిత్రను బుర్రకథగా రచించి అంకితమిచ్చారు.

ఇరువురకు బ్రహ్మయ్యగారు నూతన వస్త్రాలను బహూకరించారు.

షష్టిపూర్తి హాలును ఇంత త్వరలో ప్రశంసాపూర్వకంగా నిర్మాణం చేసిన కోట భావనారాయణగారికి బ్రహ్మయ్యగారు సన్మాన సంఘం తరపున నూతన వస్త్రాలు బహుమతి చేశారు.

తుదకు బ్రహ్మయ్యగారిలా సమాధానం చెప్పారు.

"పుట్టింది ఘంటసాలలో. కార్యరంగం బందరు. కృష్ణాజిల్లావారి ఆదరాభిమానాలే గాక, యావదాంధ్ర ప్రజల మన్ననల అందుకొనే భాగ్యం లభించినందున ధన్యుడ నయ్యాను.

ఇది ఆంధ్రులు నన్ను ఆదరించి నట్లుగాక, ఆశీర్వదించినట్లుగా భావించి, ఈ ఆశీస్సులను శిరసావహిస్తాను.

40 ఏండ్లు సైనికుడుగా కాంగ్రెసుకు పనిచేశాను.

గాంధిగారికి ! ముట్నూరి కృష్ణారావుగారికి మీ మన్నలంటే, కృష్ణారావుగారికే అగ్ర తాంబూలం. కృష్ణారావుగారి ఉపదేశ ఫలితముగ 1917 లో నా సేవలను దేశా

నికి ఐక్యంచేశాను. 1920 లో కాంగ్రెసులో చేరాను. సేవా బీజాలు నాలోనాటి తరువాత తీర్చిదిద్దిన ఘనత వారిదే. వారి ఆదేశానుసారం సైనికుడుగా మెలిగాను. వారియందు, చెరుకువాడ వెంకటనరసింహంగారి యందు చనువెక్కువ. పట్టాభిగారు హిమాలయ పర్వతంలా వుండే వారు. కృష్ణారావుగారు, కృష్ణమ్మ తల్లి, నరసింహంగారు ఊరట చెరువులాంటివారు.

ఒకప్పుడు పెద్దగురువుగారికి మతిపోయింది అని వ్రాశా రేమి? అని అడిగాను, కృష్ణారావుగారిని. "ఇదిగో ఈ కిరీటం, ఈ భుజకీర్తులు, ఈ ఖడ్గం, (అంటే కలం) ఉన్నంతసేపు అడ్డు లేదు. స్వ పర విచక్షణ లేదు. అంతా నిష్పక్షపాతం. ఈ కిరీటం తీశానా నేనూ సామాన్యుడనే" అన్నారు.

వెనుకటికి గాంధిమహాత్ముడు ఒక విలేఖరితో మాట్లా డుతూ చెప్పిన మాట. "కాంగ్రెసుతో పోల్చిచూస్తే నేనొక ఇసుక రేణువును మాత్రమే."

రామాయణంలో నాకు ఆదర్శప్రాయులు ఆంజ నేయులు, లక్ష్మణుడు. వారిది నిస్వార్థసేవ.

దేశంకొరకు కాంగ్రెసుద్వారా సేవ ప్రారంభించిన నేను శేషజీవితం ఆ సేవలోనే గడపాలని ఉవ్విళ్ళూరు తున్నాను.

పై గురువులే గాక, కాళేశ్వరరావుగారు, కానూరి వెంకట చలపతయ్యగారు, ప్రకాశం, నాగేశ్వరరావు,

కొండా వెంకటప్పయ్య, మహర్షి సాంబమూర్తి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కోటిరెడ్డి, కల్లూరి సుబ్బారావుగార్లు నాకు మార్గదర్శకులు. గురు పరంపరలోని వారు.

కళా వెంకట్రావు, సంజీవరెడ్డిగార్లు సహచరులు.

అనుచర శ్రేణి లేదునాకు. షష్టిపూర్తి అంటూ పలువురు ఏమో చేస్తామంటే కాదన్నాను. చివరకు మనమడి ముద్దు చెల్లించి షష్టిపూర్తి హాలు నిర్మాణానికి అంగీకరించాను. 65 వేల వరకు చేకూరింది. నేను నిమిత్తమాత్రం. కాంగ్రెసు పేర, పౌరుల ఉపయోగార్థము, ఆదర్శప్రాయంగా చిరకాలం యువకులకు, పిల్లలకు ఉద్బోధకరంగా వుంటుంది.

ఈ సన్మానమంతా తనదని భావిస్తాడు మా వెంకట సుబ్బయ్య. మా ఇద్దరి సంబంధం అట్టిది.

ఆయన 'సరోజినీ తల్లి' చరిత్ర అంకితం ఇచ్చాడు నాకు.

మా యాత్రలో ఆయనది చుక్కాని, నాది గడ. 'మన రైతుపెద్ద' రచనద్వారా నా పేరు వెల్లడికి తెచ్చిన ఈయనతో నా సఖ్యం చిరకాల ముండాలి.

శ్రీనివాసరావూ నేనూ కోటి కార్యకర్తలం. తన మాలపిల్లను నాకు యిచ్చాడు. మా ఆవిడా నేనూ ముసలివారము గాన తగాదా లేదు. అభివందనీయులు.

నాకు ఇచ్చిన సన్మానాలలో పేర్కొన్న గుణాలు కలిగి వుండటానికి ప్రయత్నిస్తాను.

సభకు రాలేని పట్టాభిగారు సందేశం పంపారు. వీరే గాక గురుపరంపర అందరకూ కాళేశ్వరరావు నరసింహం గార్లకు ధన్యవాదాలు."

మండలి వెంకటకృష్ణారావుగారి వందనాలతో సభ రాత్రి 10గం. కి ముగిసింది.

ఉ॥ ఖ్యాతిగడించుకొన్న మొనగాడగు శిష్యునిగాంచి దేశికుల్
చేతము పల్లవింప దయచేసిరి దీవనలన్ విశేష వి
ఖ్యాతిని గన్న పెద్దలు సుభాషిత లుంచిరి నే ప్రశంసలన్
ప్రీతికొలంది చేసెదను విప్రుడనై కవినై హితుండనై.

చ॥ జయజయ షష్టిపూర్తి పరివత్సరమేశ్వర, సద్గుణాకరా,
జయజయ దేశభక్త విలసన్నుత భూరియశో దురంధరా!
జయజయ రైతుపెద్ద! సువిశాల మనోహర భవ్యవైభవా!
జయజయ గొట్టిపాటి కులచంద్ర దయానిధి
బ్రహ్మయాభిధా.

సీ॥ తన కులోచితమైన ఘనమైన సొబగైన
కమ్మని పిండువిగ్రహము తోడ
తన విగ్రహమ్మున కనువైన గంభీర
ప్రౌఢిగల్గిన తనూ బలముతోడ
తన తనూ బలముతోడను సర్వవిధముల
తులతూగు నట్టి ధీ బలముతోడ
తన ధీ బలమ్మున కెనయైన మృదువైన
శాంతగంభీర భాషణముతోడ

లినదు మృదు భాషణమునకు ఘనతగూర్చి
రమ్యమై చెలువారు చిర్నగవుతోడ
ఆసనముతీర్చి కూర్చున్న ఆంధ్రపుత్ర
ఆర్యవర్య! బ్రహ్మయ్య! దీర్ఘాయురస్తు.

ఉ॥ మాటగులాబితోట, సుకుమారమనోహర రాజబాట, ము
క్కోటి తెనుంగుబిడ్డలకు కొంగుననున్న పసిండిమూట, ఏ
లోటును గొట్టిపాటి కిలలో కనుపింప దదేమి చిత్రమో
లోటాక వోటులందెయని లోకులు పల్కెద రెంత
సత్యమో.

గీ॥ అనుచు సభలోన నినుమేల మాడినాడ
ఎట్టకేలకు జయమబ్బె గొట్టిపాటి!
అరుపదులైన లేతప్రాయమ్మునందు
కాన నిన్ను సన్మానింప బూని రిచట.

మ॥ తెలుగున్ తల్లికి వీరమాతయను కీర్తిన్ గూర్చి బాలెంత బె
బ్బులి మీసమ్ములబట్టి యీడ్చిన జవమ్మున్ ధైర్యముం
జూపి, శ
త్రుల నిర్జించినదండనాయకులు వీరుల్ సాహసౌదార్య వ
ర్యులు మీవంశజులెన్న క్రమకుల విద్యుద్దీపప్రభాభిధా.

చ॥ నిరుపమ దేశభక్తి మదినిన్ వెలుగొందగ గాంధిసేన సం
బరమున జేరి ఆంగ్లపరిపాలకులన్ తరలించి పంపి భా
స్వర విజయాంక రేఖ ముఖపద్మమునన్ చెలువార వెల్గు, ఓ
అరువదిఏండ్ల పెండ్లికొడకా! కవిదీవనలవ్ గ్రహింపుమా.

— కాకాని నరసింహారావు

పొంగులు వాఱుచున్ సుతులు వోవుచుఁ బైకొనివచ్చు వేనవేల్
భంగములన్ గణింపక విపత్కర నక్రకఠోర దంష్ట్రికా
శృంగములూడ్చి, కృష్ణ కెదురీదిన దిట్టవు నీవు నేఁడునున్
ఖంగున ఘంటసాల జయగాథల నల్గడ మ్రోయ బ్రహ్మయా!

వైరులనోర్చి బాహుబల వైభవ దుర్వహనైక జీవులై
వీర రస ప్రధానులయి విశ్రుతి కెక్కిరి నీ పితామహుల్
వైరులనోర్చి యాత్మబల వైభవదుర్వహనైక జీవివై
వీర రసావతారమయి విశ్రుతి కెక్కితివీవు సత్కృతీ.

బందరులో మహామహులు ప్రాజ్ఞులు ముప్వరుసీసు నొజ్జలై
వందలు వేలుగా వలయు వన్నెలు దిద్దఁగవచ్చుఁగాని మీ
యందఱిలోన గాంధి కలఁడయ్యది కారణమై నిరంతరా
నందపు నిట్టనై సొగసినాడను నేనును నీమహాస్సునన్.

బంధుర దేశదాస్య పరిభావ నికృంతన దీక్షపూని ని
ర్బంధములెల్ల సైచితివి బాముల లగ్గున నొక్కరీతి ని
ర్మంథర వృత్తి సాగితివి మాన్యచరిత్రుఁడవైతి వద్దిరా!
గాంధికి నిన్నువంటి మొనగాండ్రె కదా విజయైక హేతువుల్.

విచ్చిన మోముతోఁ జెవికి విందులు సేయు మృదూక్తితోఁ బారల్
పొచ్చములున్ గనంబడని పోకడలో వెడ నిక్కుటెక్కులన్
మెచ్చని చూపుతో నెనరు మేలిమితో నెనలేని తాల్మితో
నచ్చపుఁ బల్లెటూరి సొగసంతయు లోఁగొని తీవు కర్షకా!



తుమ్మలవారి పద్య పఠనం



శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు బ్రహ్మయ్య గారిని దీవించుట

లోకము వక్రమార్గములలో బడియెన్ జెడియెన్ భవిష్యమే
పోకలుపోవునో యనుచు బుద్ధిమదగ్రణు లారటించుచో
నీ కిటు షష్టిపూర్తి మహనీయ మహస్సు ఘటించినట్టి సు
శ్లోకుల మెచ్చెదన్ సుగుణ లుబ్ధులకున్ గయి మోడ్పులిచ్చె
దన్.

అఱువదియేండ్లు నిండిన రవంతయు జంకని దండిగుండెతో
నిఱువది యేండ్లవానివలె నీవు చరింతువు నీకు బ్రాఁకిరియా!
మఱియొక షష్టిపూర్తి; మనమల్, మునిమనుమలు, వారి
మనుమలున్
గుఱువునఁ గుల్కఁగా మురిసికొందువులే! భగవత్కృపాయ
తన్.

అభినవతిక్కన

—తుమ్మల సీతారామమూర్తి

19)

# అనుబంధము

## ఆహారసభలో అమూల్య సలహాలు:

మన దేశంలో తిండికొరవు ఏర్పడింది. ఆ కొరవు నివారణకుగాను ఆహార సంఘాలు దేశమంతటా ఏర్పడినవి. బ్రహ్మయ్యగారు రాష్ట్రీయ ఆహార సలహాసంఘములో సభ్యుడు.

స్వయముగా వ్యవసాయము చేయు రైతైన మన రైతు పెద్ద అనుభవ పూర్వకపు సలహాలు గమనించ దగినవి.

ఆయన చేసిన సూచనలు అమల్లోకి తెచ్చుటకు మనమంతా కృషి చేసి ఆకలి ప్రపంచానికి, రైతులోకానికి తోడ్పడాలి.

## ప్రథమ సభలో ఆయన సూచనలు- 10-2-48.

“మనది పూర్తిగ వ్యవసాయదేశం. ఫలవంతమైన భూములు పంటల కనుగుణ్యమైన వర్షములు, జలాధారములు ప్రకృతిసిద్ధముగనే గలవు. అయినను నానాటికి ఆహారకొరత హెచ్చుచున్నది. దీనికి కారణం ప్రభుత్వము వ్యవసాయమువైపు చూపు నిర్లక్ష్యభావమే. కనుక తిరిగి విదేశీయ ప్రభుత్వ పద్ధతులను పూర్తిగ రద్దుచేసే వ్యవసాయ అభ్యున్నతికై విప్లవాత్మక (Revolutionery) కార్యక్రమము నేర్పరచి యుద్ధకాలమున సేనల తరలింపుకై చేసినంత చురుకుగ యీ కార్యక్రమము నమలుపరచవలెను.

ఇందులకు నూతన ప్రాజెక్టుల నిర్మాణమునుగూర్చి ప్రభుత్వము తీసుకొనుచున్న శ్రద్ధ ప్రశంసనీయమే. ఆ నిర్మాణము యింతలో పూర్తి అగునది కాదు. మనది తరుగు రాష్ట్రముగా లెఖ్ఖలవల్ల తేలుచున్నది. స్వయం సంపూర్ణతకై కృషి చేయవలసిన బాధ్యత మనపైగలదు. కూటికి, గుడ్డకు పరులపై ఆధారపడు దేశము స్వతంత్రముగ మనజాలదు.

ప్రభుత్వ సంజాయిషీనిబట్టి గత సంవత్సరంకంటె నాల్గవవంతు పంట నష్టమైనట్లు కన్పడుచున్నది. యీ లెఖ్ఖలు సరియైనవికావని చెప్పవలసి వచ్చినందుకు చింతించుచున్నాను. ప్రభుత్వ తాశీల్దార్లు భూములపైకి వెళ్ళి వేసిన అంచనాలుకావు యివి, అట్లుగా వేసుకున్న అంచనాలున్నూ సరిగా వుండవు అని రైతుగా నాకుగల అనుభవంవల్ల మనవిచేయుచున్నాను. యేది యెట్లున్నను హెచ్చు వుత్పత్తికై పాటుపడుట మన ప్రథమకర్తవ్యం.

అందులకు నా సూచనలు :

1. సాగుబడి కాలములో, జూన్ జులై ఆగస్టు 15వ తేదీలోగా యెన్ని యెకరాలు హెచ్చుచేస్తే అంత పంట హెచ్చురాగలదు. 'చేతిలో కర్ర కంటె చేలోకర్ర మురుకు' హెచ్చుపంట నివ్వగలదు, అని వ్యవసాయ సామెత కలదు. యిందుకు పబ్లిక్ వర్క్సుశాఖవారు హెచ్చు శ్రద్ధ వహించాలి. యీ వుద్యోగుల గౌరవ ప్రపత్తులను వారి పాలనలో గల భూమి మురుకు వూడ్పునుబట్టి పరిగణించాలి.

౨. నెం 12 రు, పొట్టి అక్కుళ్ళు, నెంబరుసన్నం, బసంగి, కృష్ణ కాటుకలు వగైరా హెచ్చుపంట నివ్వగలవని ప్రభుత్వనిపుణులు చెప్పు చున్నారు. నాల్గవనంతు పంట హెచ్చు కాగలదని అనుభవంవల్ల మాకు తెలియును. అయితే యెరువులు హెచ్చుగా అవుసరం గాన యెరువులున్నూ శ్రేష్ఠమైన విత్తనాలు సప్లయిచేయుట, ప్రచారము, వ్యవసాయశాఖవారు చేయవలసి యున్నది. దురదృష్టవశాత్తు యీ డిపార్టుమెంటునుండి రయితు లకు సహాయము జరుగగలదని ఆశించినదానిలో శతాంశమైనను జరుగుట లేదని చెప్పక తప్పదు.

ధాన్యసేకరణ సందర్భమున రివిన్యూ వగైరా ప్రభుత్వ వుద్యోగులు పడు తాపత్రయం చూస్తే యిందులో పదవవంతు శ్రమ సాగు రోజుల్లో జరిగితే బాగుండును. ఆవుకు ఆబోతును కలిపే రోజులలో శ్రద్ధవహించక ఆవు యీని చిన్నదూడను పెట్టినపుడు యేడ్చే రయితు స్థితి యీ వుద్యో గుల స్థితి జ్ఞప్తికి తెచ్చుచున్నది.

గాన ధాన్య వుత్పత్తి హెచ్చుకై రివిన్యూ నీటి సరఫరా, వ్యవ సాయశాఖలు సమిష్టి ప్రయత్నం లాభదాయకం. అందులకు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. నేటి కాగితపు ఫర్మానాలు పనిచేయజాలవని మనవిచేయు చున్నాను. నేను మిగులు (Surplus) జిల్లాకు చెందినవాడను, తరుగు (Deficit) జిల్లావారి కష్టములను తెలియనివాడను కాను. చెన్నరాష్ట్ర మంతయూ యేక కుటుంబముగా సమిష్టి బాధ్యతతో వ్యవహరించవలసి వుంటుందను బాధ్యత నాకు తెలియనిది కాదు. అధిక వర్షాలవల్ల అధిక నష్ట మునకు మాజిల్లా గురిఅయినా, గత సంవత్సరంకంటె హెచ్చు ధాన్యసేక రణ చేయగలమని నేను హామీనిచ్చుచున్నాను. అయితే ప్రభుత్వంవారు

ప్రచురించినట్లు ధాన్యసేకరణ అంతయు రెండు నెలలలోనే పూర్తికావలెననియు, బియ్యంగాకాక ధాన్యంగానే యెగుమతిచేయబడుననియు, అనునది కాగలపనికాదు. (not practical) కాగితములపై కలలు గనుటయే.

ధాన్యం యెగుమతి చేయుటకు హెచ్చు రైల్వే వేగన్లు కావలసివచ్చును. యీ జిల్లాలలోని బియ్యపు మరలన్నియు మూతబడి నిర్వ్యాపారస్థితి యేర్పడును. అందు పనిచేయు కార్మికులకు యితర వృత్తులను ప్రభుత్వం చూపగలదా ?

అధికవర్షాలవల్ల కొంత వరిగడ్డి కుళ్ళిపోయినది; మిగిలినది సారం లేనిదైనది. రెండవ పైరు పెసర, మినుము వగైరా నష్టమైనది. ప్రభుత్వంవారి అసమర్థతవల్ల వ్యాపారులగిడ్డంగులలో జనుములు నిల్వవున్నా సకాలములో ప్రభుత్వంవారు నిర్ణయించిన ఖరీదునకు జనుములు సప్లయి చేయబడలేదు; యిట్టి స్థితిలో పశువుల దానాకై వుపయోగపడు చిట్టు తవుడు కూడ రయితులనుండి తీసుకొనబడుటయగును. దీని పర్యవసానం పశువులు యింకా బక్కచిక్కి వ్యవసాయం చేయుటకు శక్తిలేనివగును; దానివల్ల రాబోవు సంవత్సరం యింకా పంట తగ్గక తప్పదు.

యింకా యెరువులకు వుపయోగించు బూగగ; రాయికై ఉపయోగించు వూక, మసి, కూడ రైతున కందుబాటు లేకుండపోవును గాన యెట్టి పరిస్థితులలోను ధాన్యం యెగుమతి కూడదు. బియ్యయే రెండు నెలలబదులు ఆరు నెలలలో యెగుమతిచేయుట; చేయతగినది.

గతసంవత్సరం యివ్వబడినట్లు రయితుకు బోనస్ యివ్వమని ప్రకటించారు. బోనస్ యిచ్చు ఆచారం మంచిది కాదని నే నంగీకరించుచున్నాను. కాని ధాన్యం ధర పెంచవలసిన ఆవశ్యకత గుర్తించబడనందుకు విచారించుచున్నాను. బియ్యం యెగుమతి చేయు వర్తకునకు హెచ్చు లాభం వచ్చునట్లు చూచుట ప్రభుత్వం తన విధిగా భావించి వుత్పత్తిదారునికి యెంత మాత్రం వ్యవసాయం గిట్టుబాటుకాని విధానమునే అనుసరించుచున్నది. యీ మీ విధానము హెచ్చు వుత్పత్తికి రయితును ప్రోత్సహించదు. పైగా యింకా లోటునకే దారితీయగలదు. వ్యవసాయం గిట్టుబాటు కాని కారణాన కొంతమంది వ్యవసాయమును నిర్లక్ష్యమొనర్చి వర్తకము వైపునకు ప్రవేగుట మనము చూచుచున్నాము.

గాన ధాన్యం ధర కాటా బస్తా 1 కి రు 16-0-0 పదహారు రూపా యిలకు తక్కువ కాకుండా నిర్ణయించవలసిన ఆవశ్యకతను గుర్తించవలసిన దిగా మనవిచేయుచున్నాను.

యిక కంట్రోల్సునుగూర్చి: యిది కృత్రిమపు విధానము. దీని ఫలి తము చీకటి బజార్లు, లంచగొండితనం. వుత్పత్తిదార్లుగాని, అనుభవందార్లు గాని యిందువల్ల లాభం పొందుటలేదు. ప్రభుత్వమునకా సిబ్బంది ఖర్చు హెచ్చు; వుద్యోగియులలో అవినీతి వ్యాపన దీని ఫలితం. మహాత్మాజీ యీ కంట్రోల్సు యెట్టి పరిస్థితిలోను వుండరాదని యిచ్చిన అభిప్రాయమును గమనించి ఆచరించుట యుక్తమని మనవిచేయుచున్నాను."

అదనపుఖర్చులేకుండ అధికోత్పత్తికి అనుభవపూర్వకమైన అత్యుత్తమ సలహాలను ఇచ్చుట గమనింపారుగద. ప్రభుత్వంవారు ఎప్పటి పద్ధతినేగాని యీసలహాలను అమలులో పెట్టక; 'అధికోత్పత్తి; అధికోత్పత్తి' అని అరచుట తప్ప అధికోత్పత్తికి ఆవగింజంతైనా తోడ్పడరు. పండించిన రైతును మాత్రము పట్టి నేధించుట మినహా వాని గోడు వినువారు లేరు.

## రెండవమీటింగులో చేసిన సూచనలు-7-10-48

కంట్రోళ్ళు: రేమనింగు ఫలితం అవినీతి; దొంగవ్యాపారం, లంచగొండి తనం అనుట నిస్సందేహం. మహాత్మాజీ సలహా కంట్రోళ్ళు పూర్తిగ రద్దు చేయాలి అని. ప్రభుత్వ నిర్ణయం అమలు – కొంతవరకు రేమనింగు తీసి వేయుటమాత్రమే. రవాణా నిర్బంధాలు; లైసెన్సులద్వారా అమ్మకంధరల కంట్రోళ్ళు తొలగించలేదు.

ఇప్పుడు ద్రవ్యోల్బణ (Inflation) తగ్గించుట అను సాకుతో తిరిగి కంట్రోళ్లు అమలు అను పొలికేక వినబడుచున్నది. మన రాష్ట్ర ప్రజాభి ప్రాయంలో రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగ యేకీభవించి కంట్రోళ్ళు తిరిగి పెట్టుట లాభదాయకం కాదని అభిప్రాయపడుట ప్రశంసనీయమే. యే దుష్ఫలితములను రద్దుచేయుటకు మనము కంట్రోళ్ళు నెత్తివేయుటకు నిర్ణయించితిమో తిరిగి పెట్టుటవల్ల ఆ అవినీతి, దొంగవ్యాపారం, లంచ గొండితనములను పరోక్షముగ ప్రోత్సహించుచున్నామను సంగతి గమనించ వలసి యున్నది.

తిరుగు ఆహార ధాన్యాదులను సప్లయిచేయు చున్న కారణాన కేంద్ర ప్రభుత్వం కంట్రోళ్ళు పెట్టుటకై రాష్ట్రప్రభుత్వమును వత్తిడిచేయుట గర్హించదగిన విషయము. పెట్టుబడిదారు అప్పుతీసుకున్న బీదవాని స్వేచ్ఛను అరికట్టి తన కనుసన్నల నృత్యముచేయించు సామ్యమే యిందును కన్పడుచున్నది.

ప్రజా నాయకుడైన మహాత్ముడు ప్రజాభిప్రాయములో యేకీభ వించెను. నేడు ప్రభుత్వమును నడుపుచున్న మహానాయకులు పట్టణవాస్తవ్యుల, విద్యార్థుల, వుద్యోగస్థుల ఆందోళనకు జంకి ప్రజాభిప్రాయమునకు స్వస్తిచెప్పి అల్ప సంఖ్యాకులకు లాభమును కలుగజేయు కంట్రోళ్ళను తిరిగి ప్రజలపై రుద్దనిర్ణయించినారు. యిందులకు పల్లెటూళ్ళ ప్రజలతరఫున వ్యవసాయంపై జీవించు నూటికి 8౦ గురు ప్రజానీకం తరఫున మా వ్యతిరేకతను తెలుపుట మావిధి.

బీద ప్రజలకు ప్రభుత్వ తాబేదార్లగు చిన్న వుద్యోగియులకు చౌక ధాన్యపు డిపోలను పెట్టవచ్చును. యిట్టి కొలదిమందికొరకు వుత్పత్తిదారుకు నష్టదాయకములగు ప్రతిబంధముల కల్పించి ధనవంతులగు పట్టణ వాస్తవ్యులకు లాభములు కలుగజేయరాదు. దీనినే బీదవానిని మరింతబీదవానిని చేయుట, ధనవంతుని మరింత ధనికుని చేయుట యను పాలసీ విధానము. పది సంవత్సరాలనాడు శ్రీ విశ్వేశ్వరయ్యగారు ప్రకటించిన సం॥ కి తల ఆదాయం.

కెనడా — రు 1033

అమెరికా — 1400

ఇంగ్లాండు— 980

ఇండియా — 65 ఆదాయమును పెంచి, కొనుగోలు శక్తిని హెచ్చుచేసిన దేశసౌభాగ్యమునకు అది చిహ్నము. ధాన్యపుధరలు పెరిగిన కారణాన రైతుస్థితి బాగుపడినట్లు ప్రభుత్వ రిపోర్టులలో కలదు. యిది యదార్థపు పరిస్థితులకు వ్యతిరేకం. ధాన్యపుధరలు రెట్టింపుమాత్రమే పెరుగుటయు రైతు కొనుక్కొనవలసినవి అయిదురెట్లు, పదిరెట్లు పెరుగుటయు, వ్యవసాయకూలి మూడు నాలుగురెట్లు పెరుగుటయు గమనించవలసియున్నది.

ధాన్యపు ధర రు 16. 17 వుంచుటయేగాక హెచ్చుధాన్యం వుత్పత్తికి ప్రభుత్వం దీక్షవహించవలసిన ఆవశ్యకతను గురించ కోరుచున్నాను. విత్తనాలు, వ్యవసాయ పనిముట్లు యెరువుల సప్లయి యేమాత్రం లేదు. పై పెచ్చు యీ సప్లయి బాధ్యత తనకు లేనట్లు ప్రభుత్వం వర్తించుచున్నది. బాధ్యతలు నిర్వర్తించిన వారికే హక్కులు అను విషయము ప్రభుత్వమునకున్నట్లు వర్తించునని జ్ఞాపకం చేయుచున్నాను; యిక ధాన్యపు సరఫరాకు నా సూచనలు:—

ప్రతిజిల్లాను ఒక (Unit) గా నిర్ణయించి, అందు ప్రతి గ్రామం లోని నిలువ పురులను చూచి ధాన్యపు వుత్పత్తి, ప్రజనుబట్టి కావలసిన ధాన్యపు అంచనాను మినహాయించి పదియకరాల పై రైతునుండి యకరాల ననుసరించి విధిగా ధాన్యం యివ్వవలెననే నిర్ణయం, లెవీమాదిరిగా.

ప్రతి సంవత్సరం కలెక్టరు నేటి జమాబందిమాదిరిగా, ఫిర్కామీటింగులు విధిగా జరిపి వెనుకటి సంవత్సరం కంటె ముందు సంవత్సరమునకు హెచ్చు పంటకుగాను సలహాలనిచ్చి ఆచరించుటకు అనువుగా ప్రణాళికల నేర్పరచి అమలు జరుపుట. గత సంవత్సరం జనపవిత్తులు సప్లయివలెగాక శ్రేష్ఠమైన విత్తనాలు, యెరువులు సప్లయిచేయాలి.

మిల్లర్లు ధాన్యమును మజూరికి ఆడుటయే వృత్తిగా పెట్టుకొనవలెను గాని వ్యాపారము చేయరాదు. అందులకు అవుసరమైన లైసెన్సులను ప్రభుత్వ మివ్వరాదు.

ప్రభుత్వ యేజంట్లుగా ధాన్యం కొనుగోలు యెగుమతులు వగైరా P. C. C. సొసైటీలు, సహకార సంస్థలు చేయాలి. వాటికి కావలసిన పెట్టుబడులు ప్రభుత్వం బ్యాంకుల ద్వారా సప్లయి చేయాలి. యివి లేని చోట ప్రభుత్వ వుద్యోగియులే యీ పనులు నెరవేర్చవలెను. వుత్పత్తి దారు, వుపయోగించువారి మధ్య దళారీ లుండరాదు. ఇరువురి మధ్య ప్రభుత్వమే యే రూపముననైనా వ్యవహరించవలెను.

కేంద్రమునుండి వచ్చు బోనస్ రైతుకు యివ్వకుండా అధికోత్పత్తి కార్యక్రమము (Grow more food) నకై వినియోగించుతాము అనుట

సవ్యం కాదు. యీ అధిక ఆహార వుత్పత్తి కార్యక్రమము విఫలమైనదనుచు దానిపై యింకా వ్యయపరచుట వ్యర్థము.

నీటి సరఫరా, రివిన్యూ, వ్యవసాయ, ఆహార, P. W. D. (Revenue, Agriculture, Food irrigation) ఆఫీసుల, శాఖలవ్యవహార సరళినిగూర్చి నే నిదివరకు ముచ్చటించాను. యెట్టి మార్పులు కానరావు. ప్రతి ఆఫీసులోను పనులు తొందరగా జరుగుటకు కాగితాల ఆలస్యం కాకుండా నాటంత టనే వాయునేగాన (Movement short cut procedure) జరగాలి.

రివిన్యూబోర్డును రద్దుచేసి వ్యవసాయబోర్డును (Agricultural Board) " యేర్పరచాలి.

## భారత వ్యవసాయ సంస్కరణ సంఘము ఎదుట యిచ్చిన సాక్ష్యము:

అఖిల భారత కాంగ్రెసు భారతదేశములో ప్రధానవృత్తి అగు వ్యవసాయమును గురించి భారతదేశమంతట విచారించి తెలియచేయుటకు జె. సి. కుమారప్పగారి అధ్యక్షతక్రింద ఒక కమిటీని ఏర్పరచెను.

ఆ కమిటీవారు వ్యవసాయములో అనుభవమున్న రైతులను రైతు సంఘములను విచారించి రాష్ట్ర ప్రభుత్వ సూచనలతో, భారత వ్యవసాయము తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభదాయక మగునట్టుల సంస్కరించి సత్వర దేశ ఆర్థిక అభివృద్ధికి దోహదమొసంగ సంకల్పించి ఒక ప్రశ్నావళిని జారీచేసిరి.

## 1948 డిశంబరులో ఆ కమిటీవారు బెజవాడ వచ్చినపుడు యిచ్చిన నివేదిక:

"ఉత్తర హిందూదేశానికి, దక్షిణ హిందూదేశానికి భేదం గలదు. అక్కడ భూమి చాలాభాగం జమీందారుల ధనవంతుల వశంలో నున్నది.

యిక్కడ నూటికి డెబ్బదిమంది స్వంత వ్యవసాయదార్లు పదిహేనుమంది మాత్రమే భూఖామందులై యితరులకు కవులుకిచ్చుకొనువారు.

| | |
|---|---|
| యం 2 లోపు వ్యవసాయకులు | 51 |
| 2—5 లోపు | 31 |
| ౫—10 | 7 |
| 10 పైన | 11 |
| | 100 |

ముప్పది యకరములలోపు వ్యవసాయం యెంతమాత్రం గిట్టుబాటుగా లేదు. రయితు నట్టి దరిద్రుడు. పండేపంట పన్నులకు ఖర్చులకుకూడ సరి పోదు. అందుచే ఋణాగ్రస్థుడై యున్నాడు. రయితు ఋణపరిష్కారబిల్లు పెట్టినా ధాన్యపుధరలు పెరిగినా యింకా యీరాష్ట్రి రయితుల ఋణం 140 కోట్లు గలదు. రయితు ఋణం లేనివారుగా వుండాలి. యింటులకు ప్రయినేటు వడ్డీవ్యాపారం నిషేధించాలి. సహకార పరపతిసంఘాలు వూరూర స్థాపింపబడాలి. దీర్ఘ వాయిదాల అప్పుల నివ్వాలి. ప్రస్తుత కోర్టుల లోని వ్యవహారం (Litigation) చంపాలి. అందుచే (Tribunal) సంచార న్యాయస్థానాలున్నూ యేర్పాటు చేయబడాలి. యిప్పుడు న్యాయం చాల ప్రియమగుచున్నది. చౌక కావాలి.

3. రయితుల భూములు ముక్కలుగా చెక్కలుగా పలుచోట్ల గలవు. గట్లక్రింద భూమి పాడు అగుచున్నది. అనేకచోట్ల వ్యవసాయం కష్టం-నష్టం. ఆసాములమధ్య పరటాగా ఈ యేకీకరణ విధానం నిర్బంధంగా జరుపాలి.

యిందులకు ట్రిబ్యునల్సు యేర్పరచాలి.

| | |
|---|---|
| మొదటి ట్రిబ్యునల్ | 1 పంచాయితీబోర్డు అధ్యక్షుడు |
| | 2 రయితు సంఘ అధ్యక్షుడు |
| | 3 సహకార పరపతిసంఘ అధ్యక్షుడు |
| అపీలు ట్రిబ్యునల్ | 1 జిల్లా రయితు సంఘ అధ్యక్షుడు |
| | 2 డిప్యూటీ కలెక్టరు |
| | 3 డిస్ట్రిక్టు మున్సిఫ్ |

౪ రయితులకు తగినంతభూమి సాగుకు లేనికారణాన; ఖర్చులు హెచ్చు, రాబడి తక్కువ అగుచున్నది. అందుచేత తీవ్రతర సంస్కరణలు అవసరం.

Economical Holdings నిర్ణయించాలి. అందులకు కనీసభూమి పల్లం 15 (పదిహేను) యకరాలు.

మెట్ట 30 (ముప్పది) యకరాలు.

యీ పరిమితభూమి ఒకే ఖండంగా వుండునట్లు చూడాలి. భాగార్వత కలవారు సహితం యీ భూమిని పంపిణీ చేసుకొనరాదు. దీనిమీద వచ్చు ఆదాయం పంచుకోవాలి. * హెచ్చుమంది భాగస్వాములు వున్న యెడల వ్యవసాయమునకు కావలసినవారు మాత్రమే వ్యవసాయం చేస్తూ మిగతావారు యితర చేతిపనుల వృత్తులను అవలంబించాలి.

౬. సహకార వ్యవసాయం :-ప్రస్తుతం మూడవవంతు భూమిమాత్రం సాగుచేయబడుచున్నది. యింకా సాగుకు లాయఖు అయిన భూమి కనీసం మూడవవంతు అయినా కలదు. యీ భూమిని స్వంతభూమి లేక వ్యవసాయమే వృత్తిగాగల వ్యవసాయ కూలీలకు వుచితముగా యిచ్చి సహకార పద్ధతిని వ్యవసాయం సాగించాలి. నవీన పనిముట్లు సప్లయి సాంకేతికనిపుణుల సహాయం, వడ్డీలేని అప్పులు సమకూర్చబడాలి. చిన్న చిన్న యంత్రములను సహితం వ్యవసాయాభివృద్ధికొరకు వినియోగించాలి. యీ యంత్రాల మరమ్మత్తు చేయగల పనితనమును గ్రామములలో వుండే వడ్రంగులకు; కమ్మర్లకు అలవరచాలి; వారి శక్తిసామర్థ్యములను (Skill)ను పెంచాలి. విద్యుచ్ఛక్తి సరఫరా వ్యవసాయాభివృద్ధికి వినియోగించాలి. శ్రేష్ఠమైన విత్తనాలు సప్లయిచేయుట; పండినపంటకు సరియైన ఖరీదులను రాబట్టుటకు వర్తక సౌకర్యములను చేయుట, ధాన్యం వగైరా నిల్వలకు వసతులను కలుగజేయుట వగైరా కార్యక్రమంవల్ల సహకార వ్యవసాయం లాభసాటియని Practicalగా రుజువుచేసి ప్రస్తుతమున్న వ్యవసాయకుల నెల్ల సహకార వ్యవసాయ పద్ధతికి తీసుకొనివచ్చుట. యిది ఐచ్ఛికముగ నుండవలెను. నిర్బంధం వుండరాదు. యిందులకు హెచ్చు ప్రబోధం అవసరం.

---

* ఇట్టిది ఈజిప్టులో కలదు.

6. నీటివనరులు : మాగాణీసాగుకు పంటనీటి సప్లయి వనరులు ప్రస్తుతం తృప్తికరముగ లేవు. వీటిని హెచ్చించవలెను. మురుగునీటి సదుపాయం యేమాత్రంలేదు. వీట్లకు ప్రత్యేకశ్రద్ధ వహించాలి. పంటకాల్వల ప్రారంభం లోను మధ్య చివరను సాగులకు నీటి సరఫరా సమానముగా నుండవలెను.

7. శ్రేష్ఠమైన విత్తనాలను సప్లయిచేసి హెచ్చు వుత్పత్తినిగూర్చి రయితును ప్రబోధించాలి. యీ విత్తనాలు గ్రామాలలోని రయితులకు అందుబాటులో వుంచాలి. యెరువులను వ్యవసాయ పరికరాలను సప్లయిచేయవలెను. యిందులనుగూర్చి వ్యవసాయశాఖ చేయుచున్న సహాయం శూన్యమని చెప్పక తప్పదు.

నీటిసరఫరా, రివిన్యూ వ్యవసాయశాఖలు:-(P. W. D. Revenue, Agircultural Departments,) పూర్తిగ సంస్కరింపబడాలి. రయితు సేవ, వ్యవసాయ అభివృద్ధి దృష్టిలో వుంచుకుని వ్యవహరించాలి. తాలూకాకు యిద్దరైనను డెమానుస్ట్రేటర్లు వుండాలి! ఫిర్కాకు ఒకరైన వ్యవసాయ మేస్త్రీ వుండాలి.

8. పశువులు : ప్రపంచం అంతటా 70 కోట్ల పశువులు.

హిందూదేశంలో 20 కోట్ల పశువులు.

వ్యవసాయమునకు అవుసరం గొడ్డు, బిడ్డ. బిడ్డకంటె గొడ్డునకే హెచ్చు ప్రాముఖ్యం. వ్యవసాయ పశువుల వధ నిషేధించి శిక్షార్హతను ఖచ్చితముగ అమలుపరచాలి. శ్రేష్ఠమైన పశువుల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ వహించాలి. మంచి సాంప్రదాయమైన హెచ్చుపాలను యివ్వగల పశుజాతిని వృద్ధిపరచాలి. అందులకు శ్రేష్ఠమైన ఆబోతులను మన్నలను ప్రతి గ్రామ సముదాయమునకు ప్రభుత్వం సప్లయిచేసి దాని పోషణకు తగిన యేర్పాట్లు గ్రాంటుల మూలంగా యేర్పరచాలి. ఫిర్కాకు ఒకటైనా పశువైద్యశాల వుంచుతూ మూడు నాలుగు సెంటర్లలో వైద్యసహాయపు ఏర్పాట్లు చేయాలి. పశుగ్రాసమునకు బీళ్ళను వదలి పన్నులేకుండా చేయాలి. అడవుల రక్షణ అవుసరం.

9. ధాన్యపు ధరలు :— ధాన్యం పండితేనే కాదు; ధరకూడ పండితేనే రైతు బాగు. Central Marketing Board ను యేర్పరిచి రయితు పండించే పంటకు న్యాయమైన ధరవచ్చునట్లు చూడాలి. పండించే

రైతును కొనుక్కునే వానిని Consumer నష్టపరచి మధ్య దళారీలు హెచ్చులాభమును అక్రమముగా పొందుచున్నారు. యీ మధ్యదళారీలు అంతమొందవలెను. ప్రభుత్వ నియమిత సహకార సంస్థలు; ప్రభుత్వ బ్యాంకులనుండి తృప్తికరముగ పెట్టుబడులను తీసుకొని యీ ధాన్యపు వ్యాపారములను సాగించుట జరుగవలెను. ధాన్యపు నిల్వలకు తగిన కట్టడములను ప్రభుత్వం గ్రాంటులనిచ్చి నిర్మించవలెను. ధాన్యపు ధరలను పెంచి రైతు కొనుగోలుశక్తిని పెంచిన పరిశ్రమలకు లాభమేకాని, నష్టంకాదు.

10. పన్నులు :— యితర దేశములతో పోల్చిచూచిన పంట తక్కువ పన్నులు, హెచ్చు మనస్థితి. యీ స్థితి తారుమారు కావలెను. కుటుంబ పోషణకు తగిన పంటను పండించుకొను రైతుపై పన్ను భారముండరాదు– అను ప్రాతిపదికపై వ్యవహరించుట న్యాయము. రాబడిపన్ను వగైరా అన్ని పన్నులను ఆ అంతస్థుపైననే వేయుచుండు చున్నవి. వ్యవసాయమునకు ప్రత్యేక రక్షణ నీయుటకు మారు ప్రత్యేకం మోయలేని భారము వుంచబడు చున్నది. యిప్పటిస్థితి పూర్తిగా మారవలెను.

యింకులకు నా సూచన క్రమానుగత పన్నుల అభివృద్ధి విధానము.

య 16 లకు య 1 కి 1–0–0 పన్ను మాత్రమే.

య 15—50 2–0–0

50—100 3–0–0

100 పైవారికి 4–0–0 లో లేక యింక హెచ్చుపన్ను.

భూమిపై ఒకే పన్ను వుండాలి. వ్యవసాయ ఆదాయంపై పన్ను వేయబడే యెడల యీ భూమిపన్ను రద్దుపరచబడవలెను.

11. ఉపపరిశ్రమలు.— వ్యవసాయంపై ఆధారపడి జీవయాత్ర గడుపువారు నూటికి 86 మంది గలరు. యింతమందిని వ్యవసాయం పోషించలేకున్నది. దీనికితోడు ఉపపరిశ్రమలను ప్రోత్సహించవలసి యున్నది.

అవి:— రాట్నం, వడ్రం, కమ్మరం, కుమ్మరి, తేనెవుత్పత్తి, పాడి, కోళ్ళు, తాటిబెల్లం, చక్కెర, బిస్కత్తులు, మాట్లులు, కాగిత పరిశ్రమ వగైరా—

రాష్ట్రం విషయమై యింకా అభివృద్ధి జరగాలి. యితరదేశాలనుండి దిగుమతి అయ్యే సరుకులను యిక్కడనే కుటీర పరిశ్రమలుగా పెంపొందించాలి. యీ సందర్భంలో జపానును అనుకరించాలి.

పెద్ద పరిశ్రమలలో చిన్న చిన్న భాగాలను పల్లెటూళ్ళకు మార్చాలి. దీనివల్ల రెండు విధాలు లాభాలు.

1. బస్తీలలో హెచ్చు కేంద్రీకరణ అయిన కార్మికుల సమ్మెలు వగైరాలు తగ్గగలవు.
2. పల్లెటూళ్ళలోని నిర్వ్యాపారత తగ్గగలదు. నిపుణత పెరుగుతుంది.

వ్యవసాయానికి, ఉపపరిశ్రమలకు సహితం Power విద్యుచ్ఛక్తిని వుపయోగించుటవల్ల తక్కువ శ్రమలో హెచ్చు ఉత్పత్తి అగుటకు తోడ్పడవలెను.

12. వాణిజ్యపు పంటలు:— Commercial Crops. ఆహారకొరతను దృష్టిలో వుంచుకుని వాణిజ్య పంటలు (Commercial Crops) ను పండించరాదని ఆంక్ష చేయుట దూరదృష్టిలేనిపని. నూటికి 84 యకరాలలో ఆహారపదార్థములే వుత్పత్తిచేయబడుచున్నవి — నూటికి ఒకటి రెండు యకరాలకు తక్కువగనే యీ — వాణిజ్యపు పంటలు (Commercial Crops) చేయబడుచున్నవి. యీ పైర్లు పండింపబడు భూములు ఆహారపదార్థముల పంటకు అయోగ్యము లను సంగతి ప్రథమతః తెలుసుకొనతగినది భూసారమునుబట్టి, శీతోష్ణస్థితులనుబట్టి నువ్వు, మిరప, ధనియం, వేరుశనగ; జొన్న, పసుపు, కూరగాయలు, పండ్లతోటలు వగైరాలను ప్రోత్సహించుట అవుసరమున్ను న్యాయమున్ను అయియున్నది. అమెరికా, జపాను దేశములందు మనకంటె హెచ్చుగా యీ వాణిజ్యపు పంటలు (Commercial Crops) సాగుచేయబడుచున్నసంగతి గమనించవలసియున్నది.

13. విద్య :— విద్య వ్యవసాయాభివృద్ధికి హెచ్చుగా వుపయోగపడాలి. సాంకేతిక విద్య; వృక్ష, పశు, కీటక ప్రకృతిశాస్త్రాల బోధనలకు ప్రాముఖ్య మివ్వాలి.

**14.** ధాన్యం రక్షణకు :— నేడిచేయు యంత్రాలు, పబ్లిక్ గోదాములు (Dying machines, Public ware Houses) కావాలి. సరియైన గోదాములు (Godowns) లేక 10 లక్షల టన్నులు ధాన్యం నష్టమైనదని ప్రభుత్వపు అంచనా. యిందులకు దీర్ఘ వాయిదా అప్పులనిచ్చి కొలది గ్రాంటుల నిచ్చి రైతుల ప్రోత్సహించవలెను. ధాన్యం అమ్మకానికి మార్కెట్లు (Open markets) అవుసరం. మిల్లుదారులనుండి రైతుకు రక్షణ అవుసరం. ప్రభుత్వమే సహకార సంఘాలద్వారా వ్యాపారం సాగించాలి.

**15.** ధాన్యం, పశువుల భీమా సంస్థల నిర్మాణం అవుసరం.

**16.** కౌలుదార్లు :— ఇతరవృత్తులలో వుండి భూములను సంపాదించి వాటిని కౌళ్ళకు యిచ్చి ఫలాన్ని లాభమును గుంజువారు గలరు. కౌలుదార్లకు నూటికి 25 కంటె హెచ్చు గిట్టుబాటు యెట్టి పరిస్థితులలోను వుండదు. ఈ సొగసు రెండు సంవత్సరముల నోటీసు నిచ్చి స్వంత వ్యవసాయం చేసుకొనవలసినదిగా నిర్ణయించవలెను. అట్లుగా చేసుకొనని యెడల ఆ భూములకు ఒక నిర్ణీతమైన ఖరీదు యిగునది వాయిదాలలో యిచ్చునట్లు కౌలుదారుకు సంక్రమింప చేయవలెను.

కౌలు నిర్ణయము చేయవలెను. పంటలో సగంకంటె హెచ్చుకౌలు నిర్ణయించరాదు.

**17.** వ్యవసాయకూలీలు :— ఇకొక ప్రత్యేక సమస్య. వీరిస్థితి రైతు స్థితికంటె అధ్వాన్నముగ నున్నది. తిన తిండి, కట్ట గుడ్డ, నివసించుటకు గృహమైనను లేక బహు దీనస్థితియందున్నారు. ఇందులో హెచ్చునంది హరిజనులే.

వీరి కుందుకున్న అప్పులనెల్ల రద్దుపరచాలి. వీరికి పెట్టుబడి పెట్టినది రైతులే. వారి వ్యవసాయంలోనే వీరూ వున్నారు. గాన యెట్టి షరతులు లేకుండా ఆ అప్పులన్నియు రద్దుచేయబడవలెను.

వీరి ప్రత్యేక గూడెముల నివాసములను రద్దుచేసి గ్రామాల వంటివున్న భూములను ప్రభుత్వంవారు స్వాధీనపరచుకుని ఒక్కొక్క కుటుంబమునకు ఆరు సెంట్లు లేక మూడువందల గజాల స్థలమును ప్రత్యేకించి అందులో పక్కా భవనములను నిర్మించి సగం మొత్తం ప్రభుత్వం భరించి మిగతా సగం పదిహేను వాయిదాలపై ఆ వ్యవసాయకూలి యెవరి పనిలో వుండునో

ఆ రయితువద్ద వసూలు చేయవలెను. (భీమా కంపెనీ వాయిదాలవలె) బంజరు భూములనెల్ల ఈ వ్యవసాయ కూలీలకిచ్చి వీరిని భూస్వాములుగ జేసి సమిష్టి వ్యవసాయ కేంద్రమున సభ్యునిగ జేయవలెను.

దెబ్బలు, జబ్బులు, వృద్ధాప్య పోషణలకు ప్రభుత్వం, వ్యవసాయకుడు చెరిసగం భరించవలెను. కనీస కూలీ నిర్ణయం జరగాలి. బస్తా ఖరీదులో 1-0-0 కి 0-1-0 లేక 0-1-3 పనుల వత్తిడినిబట్టి హెచ్చుకూలి తీసుకొనవచ్చును.

జనరల్ :— ఉద్యోగుల లంచగొండితనము, వర్తకుల దోపిడీవిధానము, పన్నుల భారము, రైతుల ఋణగ్రస్తత నేటి వ్యవసాయాభివృద్ధికి ఆటంకములుగ నున్నవి. వీటి నిర్మూలన జరగాలి. రయితు సంఘాలకు కార్మిక సంఘాలకు (Trade Unaions) ప్రతిపత్తి యివ్వాలి. ఆధునిక వ్యవసాయ పద్ధతులగూర్చి రైతులకు వ్యవసాయ ప్రదర్శనాలు, ప్రచురణ ప్రచారం విరివిగా జరగాలి.

మనది పట్టణాల దేశం కాదు. పల్లెటూళ్ళదేశం. పల్లెలకు మరలండి అని కేకలేస్తే చాలదు. పట్టణాలకంటె పల్లెటూళ్ళు వాసయోగ్యంగా చేయాలి. పట్టణాలలో నివసించే వర్తకుడు, డాక్టరు; ఆచార్యుడు, ప్లీడరు మొదలగువారు యే తిండి తింటున్నారో యెట్టి ఆరోగ్యవసతులు సౌకర్యాలు వగయిరా పొందుతున్నారో వాటి నన్నిటికి రయితు, రయితుకూలి సమాన ప్రతిపత్తిగా నుండునట్లు సంఘమును ఆర్థిక ప్రతిపత్తిని సంస్కరించాలి. అప్పుడే గ్రామము, వ్యవసాయవృద్ధి ఆకర్షవంతముగ లాభదాయకముగ మార్పునొందగలవు.

రైతు ప్రతిపత్తి, రాబడి, కొనుగోలుశక్తి ప్రథమంగా పెంచుట ప్రధాన ధర్మము. రైతుకూలినికూడ భూస్వామిగా క్రమానుగతముగ మార్చు విధానమును అవలంబించాలి.

---

# నివేదిక

గౌరవనీయులగు శ్రీయుత చందూలాల్ మాధవలాల్ త్రివేది ఐ. సి. యస్. గవర్నరు – ఆంధ్రస్టేటు వారి దివ్య సముఖమునకు,

ఆర్యా,

నూతన ఆంధ్రరాష్ట్రమునకు సమర్థులును, పరిపాలనా దక్షులును అయిన తాము గవర్నరుగ నియమింపబడినందుకు మిమ్ములను, కేంద్ర ప్రభుత్వమును అభినందించుచున్నాను.

ప్రజాస్వామ్య సిద్ధాంతములందు అకుంఠిత విశ్వాసముగల నేటి ఆంధ్ర ప్రభుత్వము మీ రక్షణలో సుస్థిరతగలిగి చిరకాలము ప్రజల విశ్వాస ప్రేమలను చూరగొనునట్లు అభ్యుదయకరముగ పాలనను నడుపునని ఆశించుచున్నాను.

కేంద్రప్రభుత్వమునకు విధేయతను, విశ్వాసమును చూపు ప్రభుత్వముతో రాష్ట్రములందున్న గాని కేంద్రప్రభుత్వము బలవత్తరముగ నుండి జాతీయ అంతర్జాతీయ రంగములందు పటిష్ఠముగ వ్యవహరింపజాలదు. గాన మా ఆంధ్రప్రభుత్వము కేంద్రమును సర్వదా బలపరచు ప్రభుత్వముగా తమ ఆశీర్వచనలతో మనుగాక యని ఆశించుచున్నాను.

ఆంధ్రులు ఐకమత్యము లేనివారనియు, నాయకు లెక్కువనియు ప్రతీతి గలదు. ఇందు కొంత సత్యము గలదని అంగీకరించక తప్పదు. సాధారణ తెలివితేటలకు మించిన విజ్ఞాన వికాసాలు ఆత్మగౌరవ ప్రతిపత్తిగల మధ్యతరగతి ఆంధ్రులలో హెచ్చు. అందుచే పై ఆపాదనల కవకాశము గలదు. తమ సహకార సంపత్తివల్ల ఆంధ్రనాయకులలో ఐకమత్యమును, యేకనాయకత్వమును సిద్ధించుగాక.

నేటి ఆంధ్రరాష్ట్రము అసమగ్రమైనది. ఆంధ్రభూము లన్నియు మన రాష్ట్రమునచేర్చబడి ఆంధ్ర విజ్ఞాన వికాసము నభివృద్ధిపరచి ఆంధ్ర సంస్కృతి భారత సంస్కృతికి దోహదము చేయునుగాక.

కృష్ణా డెల్టా ఇరిగేషన్ :— కృష్ణా ఉభయగోదావరులు ఆంధ్రదేశమునకే గాక దక్షిణాదికంతయు ధాన్యాగారము లను సంగతి నిర్వివాదమైనది. కృష్ణా గోదావరి ఆనకట్టలు పురాతనమైనవి. అభివృద్ధిని గూర్చిన ప్రత్యేక శ్రద్ధ అత్యావశ్యకము.

కృష్ణ ఆనకట్ట అయిదున్నర లక్షల యకరముల సాగుకు మాత్రమే ఉద్దేశించబడినది. ఇప్పుడు పదకొండు లక్షల యకరములకు పైగా సాగు చేయబడుచున్నది. భూములు ఫలవంతమైనవైనను రైతాంగము కష్టించి పని చేయగల మానసిక తత్వము కలిగి, తరతరాలనుండి వ్యవసాయమే వృత్తిగా గలవారి సంతతివారు అయినప్పటికిని భూములు తృప్తికరముగా పండుటలేదు. దీనికి ముఖ్యకారణాలు రెండు.

1. పంటనీటి సప్లయి సకాలమున లేకపోవుట:— ఊడ్పులు జూన్ జులై నెలలలో జరిగిననే హెచ్చు పంట నివ్వగలదు. ఆగస్టు నెల ఊడ్పు లన్నియు అర్ధపంట నిచ్చునని కొన్ని, బొత్తుగ యేమాత్రం పంట నివ్వనివి కొన్ని, లేతనాటు నాటినా, చేను గిట్టున యేస్తినా ఒకటే ఫలితమని వ్యవసాయ సామెత గలదు. ఈ పదకొండు లక్షల యకరాలనుండి హెచ్చుపంట పండించవలెనన్న జూన్, జులై నెలలలో పంటనీరు సప్లయిచేసి భూములను సాగుచేయుటకు వసతులను కల్పించుట.

అందులకుగాను ప్రస్తుత కృష్ణ ఆనకట్టను బలవత్తరమైనదానిగ చేయుటకుగాను ప్రభుత్వ ఆలోచనలోగల Kristna road bridge and Regulator ను సత్వరముగ నిర్మించుట.

నందికొండ, పులిచింతల ప్రాజెక్టుల నిర్మాణమును త్వరితగతిని అమలులోనికి తెచ్చి కృష్ణా, గోదావరి నీటిద్వారా రెండు పంటలు పండించి ఆంధ్రదేశమును అఖిలభారత ధాన్యాగారములలో నొకటిగ చేసి కరువు కాటకములను భారతదేశమున లేకుండ చేసుకొనవలెను.

2. రెండవ కారణము:— ప్రథమంలో సాగు పరిమితమైనదగుటచే మురుగునీటి కాల్వలు తీయబడలేదు. ఆనాడు మురుగునీరు కుదురుకునే పల్లపు ప్రదేశములు సహితం నేడు సాగుకు లాయఖు చేయబడి సాగగుచున్నవి. గాన మురుగుకాల్వలు కొత్తవి తీయుట, స్వతస్సిద్ధముగావున్న పాతవి మరమ్మతులు చేయుట అవుసరమై యున్నది. ఇందులను గూర్చి

నీ రైతుల ఆందోళన ప్రభుత్వపు యంత్రమును యింతవరకు కదిలించలేకపోయి నందుకు విచారించుచున్నాను.

ఇప్పటికైనను ఒక Executive Engineer ఆధ్వర్యమున ప్రత్యేక డివిజన్ నూతనముగ నెలకొల్పవలసిన ఆవశ్యకత కలదని మనవిచేయు చున్నాను. ఈ మురుగునీటి వసతి లేని కారణాన రైతులు పండించు పంటలో 1/10 వవంతు నాశనమగుచున్నది. కాన ప్రతి పంటకాల్వకు Paralal గా ఒక మురుగు కాల్వ అవసరం.

కొల్లేరు, ఉప్పుటేరు, బుడమేరు, గుండేరు, భీమనది వద్దగా మురుగు కాల్వ మరమ్మత్తులకు Estimates మాత్రం తయారు కాబడినవి. పని మాత్రం ప్రారంభించబడలేదు. ప్రభుత్వం ప్రత్యేకం ఋణం చేసియైనా యీ మురుగు కాల్వల వసతి కల్పించుట అవసరం. ఇందులకు ఆంధ్రప్రజానీకము ఋణము నీయగలదని మనవిచేయుచున్నాను.

## భూ సం స్క ర ణ లు

ప్రస్తుతం ఆంధ్ర రైతాంగము పదియకరాల లోపువారు నూటికి తొంభైతొమ్మిది; పదకొండుమంది మాత్రమే పదియకరాలు పైవారు.

1. రైతుయొక్క Economical Holding పల్లపునేల భూసారమును బట్టి 20 యకరములకు తక్కువ కాకుండా, తోటనేలలైన తరిగుంట అనగా పది యకరాలు; మెట్టభూములైన నేలపై యకరాలు నిర్ధారణచేసి ఈ భూమి ఒకే ఖండముగా వుండునట్లు యేకీకరణ విధానము నమలులోనికి తెచ్చ టెంతయు వ్యవసాయ అభివృద్ధికి ప్రోత్సాహం చేయగలదు. ఈ విధానము ఒక పంజాబులో మాత్రమే ఉన్నట్లు తెలియుచున్నది. దీనిని ఆచరణలోనికి తీసుకొని వచ్చుటలో చాల కష్టములున్నమాట వాస్తవము. కాని వానిని అధిగమించుటకు తగిన ప్రయత్నాలు చేయవలసి వుంది.

2. రైతు వ్యవసాయము చేయగల గరిష్టపరిమాణమును గూర్చిన శాసనము రానున్నట్లు తెలియుచున్నది. ఆంధ్రదేశమునగల జాయంటు కుటుంబములను చీల్చెందుకు ప్రోత్సహించేవిగా యీ సంస్కరణ లుండరాదు. వ్యష్టికంటె సమిష్టి కుటుంబత్వము అన్నిట లాభకరమగుటు ప్రోత్సహించ తగినట్లుగా యీ సంస్కరణ లుండవలెను. జాయంటు కుటుంబములో బాగా అర్హతగల ప్రతివ్యక్తి సాగుచేయగల భూమి పల్లపుసాగు గరిష్టపరిణామం

50 యకరాలుగ నిర్ణయించి ఆ ప్రాప్తిని జాయంటు కుటుంబపు ఆస్థిని స్థిరపరచవలసి యున్నది. మొదటనే తెలిపిన అంకెకు రెట్టింపుగా నిర్ధారణ కావలెను.

3. పల్లం ఒక యకరంలోపు భూమిని సాగుచేయువారికి సిస్తుమాఫీ చేసి అంతకంటె హెచ్చు భూములకు క్రమానుగత పన్నుల ప్రణాళిక (Progressive taxation) నేర్పరచవలెను.

4. స్వంత వ్యవసాయము చేయని భూస్వాములు (Absantee land lords) లుండరాదు. Essential service People, widows, and minor boys, girls and invalids మాత్రం తమ భూములను కౌలుకు యిచ్చుకొనవచ్చును.

5. సమగ్రమైన కౌలుచట్టం వెంటనే చేయాలి. అయితే Litigationకు యెంత మాత్రం అవకాశ మీయరాదు. Easy disposal వుండాలి.

## GENERAL :

1. ప్రస్తుతం మన రాష్ట్రములో $\frac{1}{3}$ మాత్రమే సాగుభూమి గలదు. మిగతా $\frac{2}{3}$ లో $\frac{1}{2}$ అయినా సాగుకు లాయఖు చేయవచ్చు. అట్లుగా చేసి సహకార వ్యవసాయ క్షేత్రాలుగా నిర్మించి వ్యవసాయ వృత్తిగాగల భూములు లేనివారికి ముఖ్యముగా యివ్వవలెను. సహకార సంస్థలద్వారా సమిష్టి వ్యవసాయ క్షేత్రములను నిర్మించుకొని వ్యవసాయము చేసుకొనుటకు రయితులను ప్రోత్సహించవలెను. ముఖ్యంగా జమీందారీ రద్దుచట్టంవల్ల ప్రభుత్వమునకు సంక్రమించిన పెద్దపెద్ద భూఖండములను సదరు సహకార క్షేత్రములకు వ్యవసాయము వృత్తిగాగలిగి భూమిలేని వ్యవసాయకులకు వినియోగింపవలెను.

2. విద్యుచ్ఛక్తి వ్యవసాయాభివృద్ధికి హెచ్చుసప్లయిచేస్తూ యంత్ర సహాయమునకు రయితులను ప్రోత్సహించాలి.

3. వ్యవసాయానికితోడు వుపపరిశ్రమలను పెంచి జపాను అనుకరణ వల్ల వ్యవసాయం లాభసాటిగా చేయాలి. చిన్న చిన్న పరిశ్రమల వికేంద్రీకరణ పల్లెగ్రామాలలోని నిరుద్యోగ సమస్యను పరిష్కరించునట్లు పథకాలు తయారుకావాలి. పల్లెగ్రామాల సౌకర్యాల నభివృద్ధిపరచి Back to Villages అను మహాత్ముని సందేశమును అమలు పరచునట్లు గ్రామాలనుండి

పట్టణములకు పోయిన ప్రజానీకమును తిరిగి పల్లెలు ఆకర్షించునట్లు చూడాలి.

4. వ్యవసాయం లాభసాటిగ వుంటేనే వుత్పత్తి హెచ్చుకాగలదు. ధాన్యాల ధరలు నిలకడగా వుండుటకున్నూ వుత్పత్తిదారులను Exploit చేయకుండా Central marketing Board నిర్మాణం అవసరం.

5. హిందూదేశమున యింతవరకు భూమిపన్ను ప్రధాన పన్నుగ పరిగణించబడుచున్నది. యికముందు Sales tax ఆ స్థానము నాక్రమించుట సముచితము, న్యాయము. ఆంధ్ర స్టేట్ లోటు బడ్జెట్టు భర్తీ సందర్భమున యిప్పటికే పన్నుల భారముచే క్రుంగుచున్న రైతులపై అదనము పన్నుల భారము పడరాదు.

6. P. W. D., Revenue, Agricultural శాఖలలో Co-ordination హెచ్చుగా వుండాలి. Redtapism పోవాలి. పరిష్కారాలు త్వరితగతిని సాగాలి. యిదివరకు ప్రభుత్వం గుమాస్తాల ప్రభుత్వంగాని ఆఫీసర్ల ప్రభుత్వంకాదని ఒక వాదుగలదు. సంస్కరణకు ఒక నిపుణుల విచారణ సంఘం అవసరం.

7. ప్రతితాలూకా రయితు కాన్ఫరెన్సును సంవత్సరమున కొకతూరి జిల్లా కలెక్టరును పిలిచి దాని కధ్యక్షత వహించి రయితుల కష్టసుఖములను నివారణోపాయములను అన్వేషించి ఆచరణలో పెట్టుచుండవలెను. ఈ సభలకు ప్రతిగ్రామమునుండి రైతులును, ప్రతి డిపార్టుమెంటును గూర్చిన భోగట్టా యివ్వవలసిన వుద్యోగియులు హాజరు అగునట్లు చూడవలెను. యిది ప్రస్తుతం జరుగుచున్న రివెన్యూ జమాబందివలె జరగాలి.

8. వ్యవసాయ కనీస వేతనాలబిల్లు అవసరమై యున్నది.

జమీందారీ రద్దుచట్టముక్రింద రైత్వారీ పట్టా లివ్వించవలసినదిగా జమీందారులు సామాజిక భూములనుసైతం కోరియున్నారు. కొన్ని సందర్భాలలో సెటిల్‌మెంటు ఆఫీసర్లు జమీందార్లకు పట్టాలీయవలసిందిగా తీర్పు చెప్పడంకూడా జరిగింది. ప్రభుత్వం సెటిల్‌మెంటు ఆఫీసర్లయెదుట జమీందార్లకు పట్టాలీయకూడదని వాదించికూడ ప్రయోజనం లేకపోయింది. ప్రభుత్వంవారు సెటిల్‌మెంటు ఆఫీసర్లతీర్పుపైన ట్రిబ్యునల్‌కు అప్పీలు చేయప్రయత్నించారు. కాని ప్రస్తుత జమీందారీ రద్దుచట్టంతో ప్రభుత్వాని

ట్రిబ్యునల్‌కు అప్పీలు చేసే అధికారం లేనట్లు అనుభవంవలన కనుగొనబడింది. అందువలన మద్రాసు ప్రభుత్వంవారు చిట్టచివర శాసనసభ సమావేశంలో ట్రిబ్యునల్‌కు ఎప్పుడైనాసరే అప్పీలుచేసుకొనే అధికారం ప్రభుత్వానికి కలిగేటట్లు ఒక సవరణ జమీందారీ రద్దుచట్టమునకు తీసుకొని వచ్చారు. కాని చర్చకు వ్యవధిలేనందున తాత్కాలికంగా ఆపుచేయబడినది. ఆ ఫలితంగా ఇప్పుడు సెటిల్‌మెంటు ఆఫీసర్ల తీర్పుపైన ట్రిబ్యునల్‌కు అప్పీలు చేసేవారు లేరు. కాబట్టి మద్రాసు ఉమ్మడిరాష్ట్రంగా ఉన్నప్పుడు ప్రవేశపెట్టబడిన జమీందారీ రద్దు సవరణచట్టమును ఆంధ్రఅసెంబ్లీ ప్రథమ సమావేశంలో ప్రవేశపెట్టించి సెటిల్‌మెంటు ఆఫీసర్లతీర్పుపైన ట్రిబ్యునలుకు అప్పీలుచేసుకొనే అధికారాన్ని ప్రభుత్వానికి సంక్రమింప చేయవలెనని కోరుచున్నాను.

ప్రస్తుత పరిస్థితులపై నా యభిప్రాయములు వెల్లడింప అవకాశమును కల్గించినందుకు యెంతయు కృతజ్ఞుడను.

ఈ నా యభిప్రాయముల అమలుపరచి ప్రభుత్వమువారు రాష్ట్రాభివృద్ధికి దోహద మొనర్చెదరని నమ్ముచున్నాను.

ఇట్లు విధేయుడు,

మకాం - బందరు
18—7—54

గొట్టిపాటి బ్రహ్మయ్య.
ఘంటసాల
దివి తాలూకా - కృష్ణా.

# సమీక్షలు

శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు రచయితగా ఆంధ్రలోకానికి చిరపరిచితులు. పురాణ ప్రసిద్ధిగాంచిన ఘంటసాలలో వీరు జన్మించడంలో విశేషముంది. ఆ గ్రామ చరిత్రను సమగ్రంగా చిత్రించారు—ఇప్పుడు—'మన రైతు పెద్ద' అనే గ్రంథాన్ని వ్రాశారు.

ఈ రైతుపెద్ద ఎవరో తెలుసా? శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు—కాంగ్రెసు సేవకులు, గాంధీజీ మనుమలు, పట్టాభి, కృష్ణారావు, నరసింహ త్రయానికి శిష్యుణ్ణని చెప్పుకొన్నవారు. ఆం. రా. కాం. సెక్రటరీగా అఖండ సేవచేసినవారు, జైలును యిల్లు చేసుకొన్నవారు, త్యాగాన్ని జంటగా ధరించినవారు.

బ్రహ్మయ్యగారు ఆంధ్రదేశానికి తెలియనివారుకారు. ఒకసారి వారిని చూస్తే మరచిపోవడంకూడా వుండదు. ఆ విగ్రహం, ఆ శీలి, ఆ అనునయం, ఆ ప్రేమ ఆకర్షిస్తుందందర్నీ. చల్లపల్లి జమీందారుతో పోటీ తెలుగు చరిత్రలో చక్కటి వీరగాథ. ఇలాటివెన్నో వున్నాయి వారి జీవితంలో.

ఇలాటి నాయకుల్ని ఎరుగున్నామనుకోవడంతో సరిపోదు. వారి జీవితంలోగల వివిధవిషయాల్ని దగ్గరపెట్టుకొని, ఉన్నత శిఖరానికి వ్యక్తుల్ని తీసుకొనిపోయే దేశసేవలో వారెలా నటించిందీ తెలుసుకోవడం అవసరం. శ్రీ వెంకట సుబ్బయ్యగారు ఆ అవసరాన్ని గమనించే ఈ గ్రంథం వ్రాశారా అనిపిస్తుంది. బ్రహ్మయ్యగారి జీవితంలోని ఘట్టాలు ఒక్కొక్కరికి ఒక్కటిగా, కొందరకు అన్నీ ఉపయోగించవచ్చు. మరి ఇలాంటి గ్రంథం ఈనాటి పాఠశాలలలో ఎందుకు పెట్టరో తెలియదు.

ఈ గ్రంథానికి 'రైతు పెద్ద' అని నామకరణం చేశారు గ్రంథకర్త. రైతు పెద్ద కంటె బ్రహ్మయ్యగారు 'తెలుగు పెద్ద—కాంగ్రెసు భక్తుడు, గౌరశీలి, త్యాగధనుడు' అనిపిస్తుంది. భారత స్వాతంత్ర్యపు పంట పండించడానికి బాపూజీ చేసిన కృషిలో బ్రహ్మయ్యగారు కూడా ఒక పెద్ద రైతుగ పనిచేశారని చెప్పుకోవచ్చు కూడా.

ఈ గ్రంథాన్నిలా చక్కటి ఘట్టాలతో, వచనాలతో, కథలతో సమకూర్చిన గ్రంథకర్తకు ధన్యవాదాలు. ఇంకా తెలుగు నాయకుల గ్రంథాలు వీరు వ్రాయగలరు. ఇవి కాలానికి కావ్యాలు - ముందుకాలానికి ఉపనిషత్తులు అవుతవి.

—కృష్ణాపత్రిక. 1948 అక్టోబరు 30.

'జగమెరిగిన బ్రాహ్మణుడు' శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు. "రైతు పెద్ద" అంటే సామాన్యంగా శ్రీ బ్రహ్మయ్యగారికే 'ప్రజానామం'గా చెల్లిపోతూ వుంటుంది. గోదావరాంధ్రావనిలో - ముఖ్యంగా కృష్ణాజిల్లాలో శ్రీ బ్రహ్మయ్యగారి హస్తస్పర్శలేని రాజకీయాలులేవు. సాంఘిక, ఆర్థిక-సేవారంగాలలో బ్రహ్మయ్యగారు నడయాడని తావులేదు. సుమారు గత పాదశతాబ్ది కృష్ణాజిల్లా చరిత్ర వ్రాస్తే 'బ్రహ్మయ్య'గారు ఏ భీమ పాత్రనో పోలివుంటారు.

చరిత్ర ప్రసిద్ధిపొందిన తావు (ఘంటసాల)లో జన్మించి, పేరు ప్రతిష్ఠలు గల కుటుంబంలో పుట్టి శ్రీ బ్రహ్మయ్యగారు నిజగ్రామ కుటుంబాల కీర్తి తురాయి గట్టినారంటే అతిశయోక్తి కాదు.

అట్టి 'రైతు పెద్ద' జీవితాన్ని మరో 'రైతు కవి' రచియించడం సమంజసంగా వున్నది. శ్రీ నార్రెపాటివారు స్వతః హాలికులు; అయినా కవితా వ్యవసాయములో కూడా వారి కలం సాక్షిగా నడచి పూలపంటను పండిస్తుంది. ముఖ్యంగా 'జీవిత చరిత్ర'లను వ్రాయడంలో శ్రీ వెంకట సుబ్బయ్యగారు ఒక అపూర్వ పంథాను అనుసరించారు. ఒక వ్యక్తి జీవితాన్ని తేదీలతో తప్పజెప్పడం నిజానికి 'జీవిత కథ' అవుతుంది; కాని చరిత్ర కాదు. కాని శ్రీ వారి 'జీవితం' రచనలు నిజమైన 'చరిత్ర'లే అవుతున్నవి. ఒకనాటి సాంఘిక రాజకీయ సర్వసమస్యలు అందు చర్చితాలై అవి 'చరిత్రలు'గా రూపొందుతూ వుండటమే వీరి కలంలోని విశిష్టత.

ఈ 'రైతు పెద్ద' అట్టి వైలక్షణ్యానికి మరో మచ్చుతునక—

—మాతృభూమి. 7-11-48

"సమర్థుడైన వచన రచయితగా, జీవితచరిత్రల రచయితగా పేరు ప్రఖ్యాతులు గడించుకున్న శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు ఈ గ్రంథాన్ని ఆపాతమధుర శైలిలో, సర్వజన సుగ్రాహ్యమైన వాడుక భాషలో వ్రాశారు. రైతు పెద్దగా, రాజకీయ నాయకుడుగా శ్రీ బ్రహ్మయ్యగారి జీవిత విశేషాలను చిత్రించడంలో ప్రతి శీర్షికా ఆద్యంతాలలోను మహాకవుల గ్రంధాలనుంచి ఆ యా సన్నివేశములకు తగు పద్యములను ఉదహరించి తన పాండితీ ప్రకర్షను చాటుకున్నారు. శ్రీ ముట్నూరు కృష్ణారావుగారిని గురు పాదులుగా ఆరాధించిన శ్రీ వెంకటసుబ్బయ్యగారి రచనాచాతురిని గురించి శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు వ్రాసిన ఒకటిరెండు వాక్యాలను ఇక్కడ ప్రస్తావించడం అనుచితం కాదు. "శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు గురు పాదులైనందుకు వారి రచనా ప్రౌఢిమ ఛాయలు ఇందులో కాన వస్తున్నాయి. ఎత్తుగడలో అదే జోరు. వాక్యాలలో అదే పదును. వివరణలో అదే ప్రాగల్భ్యం."

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లు "ఇంత చక్కటి గ్రంథము వ్రాసి, దేశమునకు ప్రసాదించినందుకు మనమందరము శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారికి కృతజ్ఞులమై వుండాలి."

—ఆంధ్రప్రభ 19.8-12-2

"విశాలహృదయత, సానుభూతులతో వ్రాసినట్లు కనిపిస్తుంది. శైలి, రచనా విధానం, విషయాన్ని మంచి రసవంతంగా ప్రదర్శిస్తున్నవి."

—ఆంధ్రపత్రిక, 30-1-49.